# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

VEEKSHANAM, TELUGU MONTHLY

సంపుటి : 14 సంచిక : 2 హైదరాబాద్ 175 ఫిబ్రవరి 2016 పేజీలు : 68 రు. 20

※ రోహిత్ హంతకులెవరు?
- మూడు వ్యాసాలు

※ ఆంధ్రప్రదేశ్‌లో ప్రైవేట్ యూనివర్సిటీలు

※ విశాఖ భాగస్వామ్య సదస్సు

※ కాంట్రాక్ట్ ఉద్యోగుల క్రమబద్ధీకరణ

※ తెలంగాణలో యూనివర్సిటీల దుస్థితి

※ ప్రైవేట్ రంగంలో రిజర్వేషన్లు

※ నైరోబీలో సామ్రాజ్యవాద పెత్తనం

175

ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

ఫిబ్రవరి 2016
సంపుటి : 14
సంచిక : 2





**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎం. రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – వి. శంకరయ్య;
**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – కె.ఎస్. ప్రకాష్‌రావు; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత; విశాఖపట్నం – పి.వి. రమణ

(ఈ సంచికలోని వరంగల్, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, విజయనగరం, ప. గోదావరి జిల్లాల అసహజ మరణాల వివరాలు అందిస్తున్న వారు ఎస్. వెంకటేష్)



'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా

**వీక్షణం** VEEKSHANAM

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : **చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 20 | రు. 20 |
| సంవత్సరం | రు. 240 | రు. 200 |
| మూడు సంవత్సరాలు | రు. 600 | రు. 540 |
| ఐదు సంవత్సరాలు | రు. 1000 | రు. 900 |
| పది సంవత్సరాలు | రు. 2000 | రు. 1700 |

ఆన్‌లైన్ ద్వారా డబ్బులు పంపేవారు మాత్రమే బ్యాంక్ స్లిప్‌లపై '**VEEKSHANAM**' అని రాసి వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి.
ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

**వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో మూలనిధికి 2016 జనవరి నెలలో వచ్చిన విరాళాలు - శ్రేయోభిలాషి, ఖమ్మం - రు. 10,000; ముత్తన్నగారి సంపద, మెదక్ - రు. 200 మిత్రులందరికీ కృతజ్ఞతలు- సం.**

వీక్షణం పత్రికను చదివి చాలా విషయాలు తెలుసుకుంటున్నాం. ముఖ్యంగా ప్రజాపక్షమైన రాజకీయార్థిక, సామాజిక విషయాలు ఆసక్తికరంగా, విజ్ఞానదాయకంగా ఉంటున్నాయి.

**– మల్లమ్ రాజు**
సుకుమా జిల్లా, ఛత్తీస్‌గడ్

ఈ జనవరి (2016) సంచికలో 'చర్చ' శీర్షిక కింద ఇచ్చిన రెండు వ్యాసాలూ చర్చించడానికి వీలునిచ్చేవిగా లేవు. ఏదైనా చర్చించాలంటే, ఆ వ్యాసకర్తలు చెబుతున్నదేమిటో ముందు పాఠకులకు అర్థం కావాలి. బ్రహ్మచారి రాసిన వ్యాసంలో, రంగనాయకమ్మ చేసిన వక్రీకరణలు ఏమిటో అర్థం కాలేదు. రంగనాయకమ్మ మాటలుగా బ్రహ్మచారి ఉటంకించిన మాటలు అర్థం అయ్యాయి గానీ, అవి ఎలా వక్రీకరణలో చెప్పడానికి ప్రయత్నిస్తూ ఆయన ఉటంకించిన మార్క్స్ మాటల అనువాదం గానీ, బ్రహ్మచారి గారి వివరణ గానీ, ఎన్ని మార్లు చదివినా అర్థం కాలేదు. వై. వి. రమణారావు వ్యాసం అయితే బొత్తిగా అర్థం కాలేదు. గ్రీకో లాటినో అన్న భ్రమ కలిగింది. 'సంఘ్ పరివార్ ఫాసిజం' గురించి సుమిత్ సర్కార్ వ్యాసం ఎంతో జ్ఞానదాయకంగా ఉంది. అనువాదం హాయిగా ఉంది. అనువాదకుని పేరు ఇవ్వకపోవడం అన్యాయం!

**లెనిన్ బాబు,**
జె.ఎన్.యు., న్యూఢిల్లీ

డిసెంబర్ 2015 సంచికలో రైతాంగ అమర వీరులు భూమయ్య, కిష్టాగౌడ్‌ల చరిత్ర నన్ను ఎంతగానో కలచివేసింది. కర్తవ్యాన్ని జ్ఞప్తికి తెచ్చింది. మేం, వారి తర్వాతి తరం అయిన అమరులు మురళిమోహన్, ఆనందరావు, జనార్దన్, సుధాకర్‌ల జీవిత చరిత్రలని, అర్ధవలస, అర్ధ భూస్వామ్య దేశం మార్పుకోసం తన ప్రాణాలని ధారబోసిన చరిత్రనించి ఉత్తేజం పొంది ఇరవై సంవత్సరాలు పనిచేసి వచ్చిన వాళ్లం. ఇప్పటి పువ్వర్తి అమరుల వరకు ప్రతి అమరుని జీవిత చరిత్ర కంఠోపాఠం చేసుకున్నామేగాని, గత అమరవీరుల గురించి మాకు అసలేమీ తెలియదు. వారి చరిత్రని వారితో కలిసి నడిచిన వరవరరావు పయనం మాకు కళ్లకు కట్టినట్లు చూపెట్టిన ఆయన రచనని, అంత అమూల్యమైన చరిత్రని రికార్డు చేసి మమ్మల్ని, మా కర్తవ్యాన్ని జ్ఞాపకం చేస్తున్న వీక్షణం పత్రికకు ధన్యవాదాలు తెల్పుతున్నాను. నాతోటి మిత్రులు, ఇలాంటి విషయాలు చర్చిస్తూ మహాకవి శ్రీశ్రీ తెలంగాణ ఉద్యమం గురించి పెద్దగా ఏమీ రాయలేదేంట్రా?! అని ఇంతకాలం ఎంతో అపోహతో ఉండే వాళ్లం. బయట మాకు దొరికిన శ్రీశ్రీ సాహిత్యం చాల కొద్దిగా చదివి ఆ తప్పుడు అభిప్రాయానికి వచ్చాం. శ్రీశ్రీ పోరాటం, అమరవీరుల కోసం ఆయన ఎంతగా తిరిగాడో తెలంగాణలో వరవరరావు వ్యాసం చదివాక మా అభిప్రాయం ఎంత తప్పో తెలిసింది. ఆ తర్వాత సిపిఐ ఎంఎల్ చారుమజుందార్ ఫోటో మెళ్లో వేసుకొని తిరిగిన శ్రీశ్రీ గురించి వరవరరావు మాటల్లో ఎప్పుడో విన్నట్లు గుర్తు. ఇలాంటి అమరవీరుల చరిత్రని దేశం కోసం తమ విలువైన కాలాన్ని, విజ్ఞానాన్ని ఆఖరుకు ప్రాణాన్ని సైతం దేశ విముక్తి కోసం ధారపోసిన, పోస్తున్న అమరవీరులకు వినమ్రంగా అభినందనలు. కడుపు కక్కుర్తి కోసం బతుకు జీవనంలో పడిపోతున్న మాలాంటి వారి కోసం ఇంకా పరిపూర్తి చేయవలసిన కర్తవ్యాల నిర్వహణ జ్ఞప్తి చేస్తున్న వీక్షణం పది కాలాలపాటు కొనసాగడానికి నా వంతు ప్రయత్నం చేస్తాను.

**– పట్టాభి**
విశాఖపట్నం

ముఖ్యంగా కేపిటల్ పై రాసే వ్యాసాల్లో కేపిటల్, కమ్యూనిజం, మార్క్సిజం, ఫ్యూడలిజం, బూర్జువా, పెట్టీ బుర్జువా, సోషలిజం, డెమోక్రాటిక్ సోషలిజం, సర్‌ప్లస్ వాల్యూ, రివిజనిజమ్, రెవల్యూషన్, లే ఆఫ్ లాంటి ఆంగ్లపదాలు, అలాగే అర్థం కాని ద్రుగ్గోచరము, క్రాంతి, ద్విగునికృతంలాంటి తెలుగు పదాలు ఉంటున్నాయి. వాటికి బదులుగా సమసమాజం, పెట్టుబడి, పెట్టుబడిదారుడు, పెట్టుబడిదారితనం, అదనపు విలువకు లాభమని, కార్మికులు శ్రామికులు అని కాకుండా శ్రామికులని సాధ్యమైనంతవరకు వాడుక బాషలో వ్యాసాలుంటే చదవడం వచ్చిన వారందరికీ అర్థమవుతాయి. మేధావులకు మాత్రమే అర్థమయితే ప్రయోజనమేంటి ? పెట్టుబడిదారుల దోపిడీ ఎలా జరుగుతోందో అర్థమైతే చాలు. అందుకు జనం మాట్లాడుకొనే బాషలో వ్యాసాలుంటే బావుంటుంది.

**– హరిప్రసాద్,**
బళ్లారి

ప్రజల పక్షాన నిలిచి, ప్రజా సమస్యలపై మంచి వ్యాసాలు ప్రచురిస్తున్న వీక్షణం పత్రిక చాలా బాగుంటుంది. ప్రజలను ఆలోచింపజేయు తార్కికమైన వ్యాసాలు, సైద్ధాంతిక చర్చలు బాగుంటున్నాయి. డిసెంబర్ సంచికలో భూమయ్య, కిష్టగౌడ్‌ల ఉరి పై వరవరరావు రాసిన వ్యాసం మంచి సమాచారాన్ని అందించింది. ఒక మంచి పత్రిక గురించి తెలుసుకొని చదువుతూ అనుబంధం ఏర్పరుచుకున్నందుకు చాలా ఆనందంగా ఉంది.

**– జి. కోటయ్య**
పొన్నూరు

గత కొంత కాలంగా వీక్షణం పత్రికను క్రమం తప్పకుండా చదువుతున్నాను. సమకాలీన సమస్యల గురించిన వ్యాసాలు చాలా వరకు అర్థం అవుతున్నాయి. కానీ, అర్థశాస్త్ర సంబంధమైన వ్యాసాలు, అందునా మార్క్సిజంకు సంబంధించిన సిద్ధాంత వ్యాసాలు సరిగా అర్థం కావడం లేదు. జనవరి సంచికలో బ్రహ్మచారి, రమణారావు గారలు వ్రాసిన (అదనపు విలువపై?) వ్యాసాలు ఎంత ప్రయత్నించినా కొరుకుడు పడలేదు. పాషాణపాకంలాగ వున్నాయి ఆ వ్యాసాలు. నాకే అర్థం కాలేదా అని అనుమానం వచ్చి ఒకరిద్దరు కమ్యూనిజం అభిమానులను, మన వీక్షణం పాఠకులనే అడిగినాను. కానీ, తమకు కూడా ఏమీ అర్థం కాలేదని వారు కూడా అన్నారు. కనుక, పాఠకులకు తేలిగ్గా అర్థం అయ్యేలాగా రాయవలసిందిగా మీరు రచయితలకు సూచించండి. అలా కాని పక్షంలో పాఠకుల సంఖ్య క్రమంగా క్షీణించే అవకాశం ఉంది.

**– ఎం. కార్తిక్**
బిఎచ్ఇఎల్

గత నెలలో నేను వీక్షణంకు రాసిన ఉత్తరంలో 'కొంత మంది అభిప్రాయాలనే వేస్తున్నారు' క్రమం తప్పి అయినా మరి కొంత మంది పాఠకుల అభిప్రాయాల్ని ప్రచురించగలరు అని కాదు. క్రమం తప్పకుండా ఒకే వ్యక్తికి పాఠక వీక్షణంలో స్థానమిస్తున్నారు. ఇతర పాఠకులెవరూ లేరా?! వారికి కూడా ఎందుకు స్థానం ఇవ్వరూ అని. కానీ, మీకు మాత్రం పాఠకులు కన్పించింది మేమిద్దరమేనా?! నేనన్నట్లుగానే ఒకే విషయానికి సంబంధించిన రెండు సార్లు యాగాల గురించి వేశారు. అలాగే కవితలకు ఎందుకు చోటు ఇవ్వడంలేదని అడిగిందానికి మీ నుంచి ఏమీ సమాధానంలేదు. ముఖ్యంగా సమాజ మార్పుకోరే భావజాలంతో వస్తున్న పత్రికలు, పాఠకుల సందేహాలకీ–సమాధానాలు చెప్పే శీర్షిక లేకపోతే ఎలా? జన్మదిన ప్రత్యేక సంచిక అని రాశారే గానీ, ఏ ప్రత్యేకతలూ లేవు. ఇకనైనా పాఠకుల వీక్షణం శీర్షికలో ఎక్కువ మంది పాఠకులకు స్థానం కల్పించడం క్రమం తప్పకుండా ప్రచురించేవారికి కాస్తా క్రమం తప్పించి వెయ్యకపోతే, పాఠకులు అన్యథా భావించే అపార్థాలు కలగవచ్చు. పాఠకుల సందేహాలు–సంపాదకుల సమాధానాల శీర్షిక పెడితే జనానికి చైతన్యం అందించిన వారవుతారు.

**– బి.ఎ. నారాయణరావు**
విశాఖపట్నం

*(సవరణ: వీక్షణం జనవరి 2016 సంచికలో పాఠకుల సంచికలో బి.ఎ. నారాయణరావుకి బదులు బి.ఎ. సత్యనారాయణ అని పొరపాటుగా అచ్చయింది. పొరపాటుకు చింతిస్తున్నాం. – సం)*

# హంతక అసహనం-దభోల్కర్ నుంచి రోహిత్ దాకా



సంఘ్ పరివార్ ఫాసిజానికీ, హంతక అసహనానికీ మరొక స్వతంత్ర ఆలోచనాపరుడు బలయ్యాడు. సంఘ్ పరివార్ లో భాగమైన భారతీయ జనతా పార్టీ, అందులోనూ గుజరాత్ నరమేధపు నెత్తురంటిన చేతుల నరేంద్ర మోడీ, కేంద్రంలో అధికారానికి వచ్చిన తర్వాత పెట్రేగి పోతున్న హిందూ మతోన్మాద శక్తుల దాడులలో బలి అయిపోయిన జాబితాలో మరొక పేరుగా రోహిత్ వేముల పేరు చేరింది. కాకపోతే అంతకు ముందరి నరేంద్ర దభోల్కర్, గోవింద పన్సారే, ఎంఎం కల్బుర్గి, మహమ్మద్ అఖ్లాక్‌లను సంఘ్ పరివార్ శక్తులు ప్రత్యక్షంగా హత్య చేయగా, రోహిత్ వేములది ఆత్మహత్యగా కనిపించే వ్యవస్థీకృత హత్య. కేవలం భిన్నాభిప్రాయాలు ఉన్నందువల్ల ఈ దేశంలో హిందూ బ్రాహ్మణీయ హంతక భావజాలానికీ, దాని ఉగ్రరూపమైన సంఘ్ పరివార్ దాడులకూ బలి అయినవారిలో రోహిత్ వేముల మొదటివారూ కాదు, చివరివారూ కాకపోవచ్చు. కాని ఒక అత్యున్నత విద్యాసంస్థలో పరిశోధక విద్యార్థిగా, విశాలమైన సృజనాత్మక ఆలోచనలు, అద్భుతమైన వ్యక్తీకరణ శక్తి ఉన్న మేధావిగా ఆయన మరణం అత్యంత విచారకరమైనది. ఆయన మరణానికి దారితీసిన పరిస్థితులు, మరణానంతర ప్రజాగ్రహం, ఆ ప్రజాగ్రహాన్ని పక్కదారి పట్టించడానికి సంఘ్‌పరివార్ శక్తులు చేస్తున్న తప్పుడు వాదనలు సమాజం తీవ్రంగా పట్టించుకోవలసిన, ఆలోచించవలసిన ఎన్నో మౌలిక అంశాలను లేవనెత్తుతున్నాయి.

ఆత్మహత్యగా కనబడుతున్న రోహిత్‌ది నిజానికి వ్యవస్థ చేసిన హత్య అనడానికి అనేక కారణాలున్నాయి. సమాజంలో అసంఖ్యాకుల పట్ల అమలవుతున్న అసమానతలను, అవమానాలను, వివక్షను హిందూ బ్రాహ్మణీయ భావజాలం నిర్దేశిస్తున్నది. అపౌరుషేయమని చెప్పే రుగ్వేదంలోని పురుషసూక్తం, స్వయంగా భగవంతుడి నోటి నుంచి వెలువడినట్టు చెపుతున్న భగవద్గీత, సమాజ ధర్మశాస్త్రంగా వెలువడిన మనుస్మృతి వర్ణాశ్రమ ధర్మాన్ని, అంతరాలను, వివక్షను స్పష్టంగా నిర్దేశించి అసమానతలకు మత ఆమోదాన్ని ప్రకటించాయి. సమాజంలోని అత్యధిక సంఖ్యాకులను విద్యకూ, సామాజిక జీవితానికీ, సంస్కృతికీ, రాజకీయాలకూ, అధికారానికీ దూరం చేయాలని హిందూ ధర్మపు ప్రధాన గ్రంథాలన్నీ ఘోషించాయి. ఆ గ్రంథాల గురించి తెలియకపోయినా, అవి చదవకపోయినా అవి ప్రబోధించే విలువలు సమాజ సంస్కృతిగా మారినందువల్ల ఆ విలువలను పాటించేవారు విస్తృతంగా ఉన్నారు. అసమానతల, నిచ్చెనమెట్ల వ్యవస్థ సహజమైనదనీ, దాన్ని ఆమోదించి, పునరుత్పత్తి చేయడం కన్న మనుషులు చేయగలదేమీ లేదనీ అనుకునే స్థితి వందల సంవత్సరాలుగా కొనసాగుతున్నది. అసమానతలను, వాటికి మూలమైన మత-కుల వ్యవస్థలను ప్రశ్నించిన గొంతులను నులిమేయడం కూడ వందల సంవత్సరాలుగా జరుగుతున్నది. కాలక్రమంలో మతం వ్యక్తిగత విశ్వాసం స్థాయి నుంచి సామూహిక మతోన్మాద హింస స్థాయికి మారింది. రాజ్యమూ మతమూ కలగలిసిన విష కషాయానికి సామ్రాజ్యవాదం రంగులద్దింది. ఇదీ ఇవాళ భారత సమాజంలో హిందూ బ్రాహ్మణీయ భూస్వామ్య సామ్రాజ్యవాద దళారీ శక్తుల మిలాఖత్తు. ఈ దుర్మార్గ పాలనలో పుట్టుకే ఒక ప్రాణాంతక ప్రమాదం. పుట్టకముందే అత్యధికుల పేర్లు దేశద్రోహుల, మతద్రోహుల, అవమానితుల, బహిష్కృతుల జాబితాలో చేరిపోతున్నాయి. ఇక వారు జీవితాంతం ఆ శిలువ మోస్తూ ఒంటరితనంలో బతకవలసిందే. అలా మత, కుల అసమానతల వ్యవస్థ చేసిన హత్య రోహిత్‌ది.

ఆధునిక సమాజంలో కుల అసమానతలు, కుల వివక్ష ఉండగూడదని, మనుషులందరూ సమానమేనని, తరతరాలుగా వివక్షకు, అవకాశాల నిరాకరణకు గురైన సమూహాలకు రక్షణలు కల్పించాలని ఎన్నో ఉద్యమాలు, ఎందరో ఆలోచనాపరుల చర్చల ఫలితంగా విద్యారంగంలో దళితుల ప్రవేశానికి అవకాశం దొరికినప్పటికీ, అప్పటికే విద్యాసంస్థలను ఆక్రమించుకుని కూచున్న అగ్రవర్ణాలు వాటిని అగ్రహారాలుగా మార్చాయి. విద్యాలయాలలో కూడ సామాజిక అసమానతలను, వివక్షను, కుల, మత విద్వేషాలను పెంచి పోషించే సంఘ్ పరివార్ సంస్థలూ పుట్టుకొచ్చాయి. విద్యాసంస్థల యాజమాన్యాలకూ సంఘ పరివార్ సంస్థలకూ మధ్య ఉన్న మిలాఖత్తు ఫలితమే రోహిత్ మీద, మరి నలుగురు దళిత విద్యార్థుల మీద అమలయిన సాంఘిక బహిష్కార శిక్ష. ఆ రకంగా కూడ రోహిత్‌ది వ్యవస్థ చేసిన హత్యే.

మన సమాజంలో సమసమాజ ఆలోచనలు, ప్రగతిశీల ఉద్యమాలు, దళిత అనుకూల సంఘాలు ఎన్ని ఉన్నప్పటికీ ఇంకా బహిష్కృత దళిత విద్యార్థులు తమ సమస్యలను ధైర్యంగా, సంఘటితంగా ఎదుర్కొనే పరిస్థితి లేకపోవడం, వారు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఒంటరితనాన్ని, వెలివాడ లోని స్థితిని అనుభవించవలసి రావడం ప్రగతిశీల ఉద్యమాలన్నీ తమను తాము ప్రశ్నించుకోవలసిన సవాళ్లను ముందుకు తెస్తున్నాయి. సామాజిక అసమానతలకు వ్యతిరేక చైతన్యం అవసరమైన స్థాయిలో ప్రచారం కాలేదని, కుల దురభిప్రాయాలు, కుల వివక్షా ఆలోచనలు ఇంకా బలంగానే ఉన్నాయని, కుల వివక్ష మీద పోరాటం ఇంకా అవసరమైన స్థాయిలో జరగడం లేదని చేదు నిజాలను రోహిత్ హత్య చూపుతున్నది. ఆ రకంగా రోహిత్ హత్య మన సమాజంలో ప్రగతిశీల ఆలోచనల, ఆచరణల లోపాలనూ, వైఫల్యాలనూ ప్రకటిస్తున్నది. అలా కూడ రోహిత్ ది వ్యవస్థ చేసిన హత్యే.

ఈ నేపథ్యంలో కంటికి కనబడుతున్న ప్రత్యక్ష శత్రువులకు, హంతకులకు శిక్షలు పడాలని, రోహిత్‌కు న్యాయం జరగాలని ఎలుగెత్తడం ఎంత అవసరమో, ఈ హత్య వెనుక ఉన్న వ్యవస్థాగత కారణాలను అన్వేషించి, వాటిని తొలగించే దిశగా ఆలోచనలనూ ఆచరణలనూ పెంచుకోవడం అంత అవసరం. హిందుత్వ భావజాలపు దుర్మార్గానికీ, కుల వివక్షకూ, సంఘ్ పరివార్ శక్తుల దౌర్జన్యాలకూ, విద్యాసంస్థల యాజమాన్యాల నిరంకుశత్వానికీ, ప్రగతిశీల శక్తులలో ఉన్న అలసత్వానికీ వ్యతిరేకంగా చైతన్యాన్ని సమీకరించడం, పోరాడడం ఇవాళ ఎంత తక్షణ అవసరమో రోహిత్ హత్య చెపుతున్నది. గత రెండు సంవత్సరాలుగా పెచ్చరిల్లిన సంఘ్ పరివార్ హంతక అసహనం మీద కేంద్రీకరిస్తూనే, వ్యవస్థాగత కారణాలన్నిటి మీదా పోరాటం ఎక్కు పెట్టడమే ఇవాళ్టి చారిత్రక కర్తవ్యం. వీ

### సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# రాజకీయ అనైతికతకు పర్యాయపదం తెరాస

తెలంగాణ రాష్ట్ర సమితికి 2001 నుంచి 2014 దాకా ఉద్యమ పార్టీగా, ప్రజల ఆకాంక్షలను ఏదో ఒక మేరకు ప్రతిఫలించిన రాజకీయపక్షంగా, ప్రజలతో కలిసి నడిచిన రాజకీయ పక్షంగా కొంత గుర్తింపు వచ్చింది. కాని 2014 జూన్ 2న అధికారం చేపట్టినప్పటినుంచి ఆ పార్టీ తన పాత గుర్తింపును చెరిపివేసుకోవడానికి, తాను అంతకుముందు ఏమి మాట్లాడినా అప్పటి అవసరాల కోసం మాత్రమేనని, అప్పటి మాటల్లో ఏ ఒక్కదాన్నీ తాను నమ్మడం లేదని, పాటించబోవడం లేదని చెప్పడానికి తీవ్రమైన ప్రయత్నాలు చేస్తున్నది. 2014 జూన్ 2 దాకా ఏ శక్తులు తెలంగాణను దోపిడీ చేశాయని, పీడించాయని, అవమానించాయని అధినాయకుడి నుంచి కనిష్ట స్థాయి కార్యకర్త దాకా గగ్గోలు పెట్టారో సరిగ్గా ఆ శక్తులే ఈ పద్దెనిమిది నెలల పాలనలో అధికార పీఠాలెక్కాయి. తమ పాత కాంట్రాక్టులనూ సంపాదనలనూ అక్రమాలనూ ముడుపులనూ యథావిధిగా కొనసాగిస్తున్నాయి. గత విధానాల సమీక్ష, సవరణ చేస్తామని, తెలంగాణ వనరులు తెలంగాణకే దక్కేలా పాలన నడుపుతామని చేసిన వాగ్దానం కొండెక్కి, అవే విధానాలు కొత్త పేర్లతో, కొత్త జెండాలతో, కొత్త నినాదాలతో ఊరేగుతున్నాయి. ఉద్యమ పార్టీగా ఉన్నప్పుడు చెప్పిన మాటలే అధికార పార్టీగా ఉన్నప్పుడు ఎలా చెప్పగలం అనే కుటిలమైన వాదనతో ఇప్పటి ప్రవర్తనను సమర్థించుకునే అతితెలివి వినబడుతున్నది. ఒక రాజకీయ పక్షం ఎప్పటికైనా అధికారానికి రావాలనే ఆశిస్తుంది. అధికారానికి వచ్చిన తర్వాత ఏమి చేయనున్నదో, ఎలా చేయనున్నదో, తన కార్యక్రమం ఇతర రాజకీయ పక్షాల కార్యక్రమం కన్న ఎలా భిన్నమైనదో చెపుతుంది. అధికారానికి రాగానే అవన్నీ వదిలి, ఇతర రాజకీయ పక్షాల లాగనే, అంతకు ముందరి పాలనల లాగనే కొనసాగిస్తామనడం దగుల్బాజీతనం మాత్రమే. 2014కు ముందు తెలంగాణ రాష్ట్ర సాధన ఉద్యమాన్ని విమర్శించినవారు, వ్యతిరేకించినవారు, తెలంగాణ ఉద్యమం మీద, ఉద్యమ కారుల మీద దాడులు చేసినవారు ఇవాళ తెరాస నాయకులుగా ఊరేగుతున్నారు. మరీ ముఖ్యంగా ఎన్నికలకోసం, ఎన్నికల గెలుపు కోసం తెరాస పెట్టుకుంటున్న సంబంధాలు, ఇతర పార్టీల నుంచి నాయకులను బెదిరించి, కొని, ఆకర్షించి చేర్చుకోవడం, ఇతర పార్టీల అభ్యర్థులుగా ప్రకటించినవాళ్లను కొనివేయడం, నిమిషాల మీద పార్టీలు మార్చేవాళ్లు తెరాస నాయకులు కావడం... ఒక్క మాటలో చెప్పాలంటే ఉద్యమకాలంలో ఏ రాజకీయ అవినీతి గురించి తెలంగాణ ఉద్యమకారులందరూ విమర్శలు గుప్పించారో ఆ రాజకీయ అవినీతి, బహుశా అంతకన్న ఎక్కువగా ఇవాళ రాజ్యం చేస్తున్నది. ఒక పాలకవర్గ పార్టీగా తెరాస స్వభావం ఇందుకు భిన్నంగా ఉండబోదని కొందరు ఊహించి ఉండవచ్చు గాని సాధారణ తెలంగాణ ప్రజానీకం మాత్రం కనీసం 2014కు ముందు తెరాసను పాలకవర్గ పార్టీ కన్న ఎక్కువగా తమ పార్టీగా గుర్తించారు. ఆ నమ్మకాన్ని చెరిపివేయాలని తెరాస తానే ఉత్సాహపడుతున్నది. కుటిలమైన, అవినీతికరమైన ఎత్తుగడలతో ఎన్నికల విజయాలు సాధించడం సులభమే కావచ్చు గాని, ఒకసారి ప్రజలలో నమ్మకం కోల్పోతే, తెలంగాణ ఉద్వేగాలతో వారిని మళ్లీ మళ్లీ మాయ చేయడం సాధ్యం కాని స్థితి వస్తుంది. ఎన్నికల గెలుపు కన్న ప్రజల నమ్మకం కీలకమనే అవగాహన ఇతర పాలకవర్గ పార్టీలకు ఎలాగూ లేదు, పద్నాలుగు సంవత్సరాలు ప్రజాజీవితంలో క్రియాశీలంగా ఉండిన పార్టీ కూడ పోగొట్టుకోదలచుకోవడమే విషాదం.

వీ

### సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# మరొకసారి అబద్ధాల వాగ్దానాల చంద్రమాయ

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడుకు ఆడంబరం, అబద్ధం చాల ఇష్టం. ఏ పథకం, కార్యక్రమం, అంకె చెప్పదలచినా చాల భారీగా చెప్పడం, అది సర్వసాధారణంగా అబద్ధంగా, అర్ధసత్యంగా మారిపోవడం ఆయన గత ముఖ్యమంత్రిత్వంలోనూ, ప్రస్తుత ముఖ్యమంత్రిత్వం లోనూ కనబడుతున్నాయి. ఆయన ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు 2001లో మొదటిసారి భారత పారిశ్రామిక సమాఖ్యతో కలిసి 'భాగస్వామ్య సదస్సు' పేరిట ఒక భారీ పెట్టుబడుల ప్రకటనల మేళా జరిపారు. దాని రెండో విడత 2003లో జరిపారు. మొదటి విడత భాగస్వామ్య సదస్సులో రు. 37,000 కోట్ల పెట్టుబడుల ఒప్పందాలు కుదిరాయని, మరొక రు. 75,000 కోట్ల పెట్టుబడులు రానున్నాయని ప్రగల్భాలు పలికారు. రెండో విడత జరిగే నాటికి మొదటి విడత ఆడంబర ప్రకటనల్లో అక్షరాలా 3.3 శాతం, అంటే రు. 3700 కోట్ల పెట్టుబడుల పనులు మాత్రమే ప్రారంభమయ్యాయి. రెండో విడతలో రు. 17,204 కోట్ల పెట్టుబడుల ఒప్పందాలు కుదిరాయని ప్రకటనలు చేశారు. సరిగ్గా పద్నాలుగు నెలల్లో ఆ ప్రభుత్వమే పడిపోయింది గనుక ఆ అంకెలో ఎంత నిజమయిందో పట్టించుకున్నవాళ్లే లేకపోయారు. ఇక ఆ తర్వాత పదకొండు సంవత్సరాలకు ఆయన ముఖ్యమంత్రి అయినది మళ్లీ విభక్త ఆంధ్రప్రదేశ్ కు 2014 మే లోనే. అధికారానికి వచ్చీరాగానే, తాను 2004 ఏప్రిల్ లో మధ్యలో వదిలేసిన పనులను కొనసాగించడమే ఆయన కర్తవ్యంగా ఎంచుకున్నారు గనుక దేశదేశాలు తిరుగుతూ, ఆంధ్రప్రదేశ్ అమ్మకానికి సిద్ధంగా ఉంది రండహో అని చాటింపు వేస్తున్నారు. వందల కోట్లు, వేల కోట్లు పెట్టుబడుల భారీ వాగ్దానాలు చేస్తూ, దానితో ఉద్యోగాలు, అభివృద్ధి పెద్దఎత్తున వచ్చి ఆంధ్రప్రదేశ్ ప్రజల ఒడిలో పడతాయని నమ్మబలుకుతున్నారు. పెట్టుబడిదారుల కోసం వనరుల ప్రలోభాలు, ప్రజల కోసం అబద్ధాల వాగ్దానాల ప్రగల్భాలు మరొకసారి ఆకర్షణీయంగా కొనసాగించడానికి విశాఖపట్నంలో మళ్లీ భాగస్వామ్య సదస్సు నిర్వహించారు. ఈసారి రు. 4,76,878 కోట్ల పెట్టుబడుల వాగ్దానాలు గుమ్మరించారు. ఈ అబద్ధపు అంకెలో ఎంత నిజమవుతుందనే ప్రశ్న ఒక ఎత్తు కాగా, వచ్చే పెట్టుబడులు ఆంధ్రప్రదేశ్ వనరులను ఎంత కొల్లగొడతాయి, ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థకు ఏమి మేలు చేస్తాయి, ఆంధ్రప్రదేశ్ ప్రజలకు, నిరుద్యోగులకు ఏ అభివృద్ధినీ, ఉపాధినీ ఇస్తాయి అనే ప్రశ్నలు మరింత ముఖ్యమైనవి. గతంలో స్వయంగా చంద్రబాబు నాయుడే నిర్వహించిన రెండు భాగస్వామ్య సదస్సులు గాని, దేశవ్యాప్తంగా అనేక రాష్ట్రాలలో జరిగిన భాగస్వామ్య సదస్సులు గాని ఈ దేశ వనరులను దేశదేశాల పెట్టుబడిదారులకు, కార్పొరేట్ శక్తులకు దోచిపెట్టడానికే ప్రయత్నించాయి గాని ప్రజలకు వాటివల్ల ఒరిగిందేమీ లేదు. పెట్టుబడులూ, భారీ అంకెలూ, వాగ్దానాలూ అలా ఉంచి సమస్యల మయంగా ఉన్న ఆంధ్రప్రదేశ్ ప్రజా జీవనాన్ని కొంతైనా మెరుగు పరచడానికి కనీస వాస్తవిక కార్యక్రమాలూ, పథకాలూ, వాటి అమలు వ్యూహాలూ ఏమిటో చెప్పవలసిందిగా ప్రభుత్వాన్ని ప్రశ్నించవలసిన, ప్రజా ఉద్యమాలు నడపవలసిన బాధ్యత ఆంధ్రప్రదేశ్ లోని ప్రజా సంఘాల మీదా, ఆలోచనాపరుల మీదా ఉంది.

వీ

# ఉత్తర కొరియా హైడ్రోజన్ బాంబు విస్ఫోటనం

అత్యంత వినాశకరమైన హైడ్రోజన్ బాంబును 2016 జనవరి 6న పరీక్షించినట్లు ఉత్తర కొరియా ప్రకటించింది. ప్రపంచం నివ్వెర పోయింది. ఐరాస భద్రతా మండలి అత్యవసరంగా సమావేశమైంది. తమ దేశ రక్షణ కోసమే ఈ ఆయుధాన్ని సమకూర్చుకున్నామని, అణ్వాయుధాన్ని ముందుగా ప్రయోగించరాదనే ఒప్పందానికి కట్టుబడి ఉన్నామని ఉత్తర కొరియా చెబుతుండగా, కాదు ప్రశాంత ప్రపంచాన్ని రెచ్చగొట్టిందని, భవిష్యత్తుకు పెను ప్రమాదం తప్పదని జపాన్, ఆస్ట్రేలియా, అమెరికా, దాని మిత్ర దేశాలు ప్రపంచం తలకిందులైనట్టుగా ఊగిపోతున్నాయి. కొరియా అంతు తేల్చాలని, కఠినమైన ఆంక్షలు విధించాలని కోరుతున్నాయి. ఐరాస కూడా కొరియాపై ఆంక్షలు విధించాలని భావిస్తోంది. మరోవైపు భారత్, చైనా, పొరుగుదేశం దక్షిణ కొరియా ఆగ్రహం వ్యక్తం చేశాయి. కాగా ఈ పరీక్షలో ఉత్తర కొరియా విఫలమైందని అంతర్జాతీయ నిపుణులు వాదిస్తున్నారు. 1950వ దశకంలో కొరియాపై అమెరికా ప్రత్యక్ష యుద్ధానికి పాల్పడింది. పర్యవసానంగా ఆ దేశం ఉత్తర, దక్షిణ కొరియాలుగా విడిపోవడం చారిత్రక విషాదం. దక్షిణ కొరియాకు అమెరికా సంపూర్ణమైన రక్షణ, ఆర్థిక అండ ఉండటంతో అదొక ఆర్థికశక్తిగా ఎదిగింది. ఉత్తరకొరియా కమ్యూనిస్టు దేశంగా పరిగణించబడింది. అయితే అదొక కుటుంబ పాలన (కిమ్)లో సాగుతున్న నియంతృత్వం. దాని అంతర్గత పరిణామాలు, అభివృద్ధి గూర్చి బయట ప్రపంచానికి తెలిసింది బహుతక్కువ. ప్రస్తుత నాయకుడు కిమ్ జోంగ్ యున్ తిరుగులేని నాయకులు. అమెరికా, దాని మిత్రుల నుండి వచ్చే ప్రమాదాన్ని ఎదుర్కోవాలంటే అణ్వస్త్రాలు, ఖండాంతర క్షిపణులు తయారు చేసుకోవడమే మార్గమని ఉత్తర కొరియా ఇప్పటికీ భావిస్తున్నట్లు దాని చర్యలు తెలియజేస్తున్నాయి. ఆయుధ రహితమైన ఇరాక్, ఆఫ్ఘనిస్తాన్, లిబియా వగైరా దేశాలపై ఇటీవలి కాలంలో అమెరికా, దాని నాటో మిత్ర దేశాలు దాడిచేసి ఎలా ధ్వంసం చేశాయో ప్రపంచానికి ఎరుకే. అమెరికా దక్షిణ కొరియాను తన సైనిక స్థావరంగా మార్చుకుని వేలాది సైన్యాన్ని దింపింది. జపాన్‌ను సహితం తన సైనిక, అణ్వస్త్ర స్థావరంగా మార్చేసింది. జపాన్ స్థావరంగా అమెరికా సైనిక కవ్వింపులు నిత్యకృత్యంగా ఉంటున్నాయి. ఇదంతా ఉత్తర కొరియాకు అభద్రతా భావాన్ని సృష్టిస్తోంది. చైనా, రష్యా అండ లేకుంటే ఎప్పుడో అమెరికా దురాక్రమణకు ఉత్తర కొరియా గురయ్యేది. ప్రపంచ ఆధిపత్యానికి ఆరాటపడుతున్న అమెరికా పశ్చిమ మధ్య ఆసియాలో, ఫసిఫిక్ ప్రాంతంలో సైనిక జోక్యాన్ని పెంచింది. ఆయా దేశాల అంతరంగిక వ్యవహారాల్లో తలదూర్చుతోంది. ఈ ఆయుధ పోటీలో భాగస్తులలో ఒకరిని ఖండించి మరొకరిని సమర్థించడం కాకుండా, ప్రపంచ శాంతికి విఘాతం కలిగిస్తున్న అమెరికాను, ప్రతిఘటించడం పేరుతో అదే పోటీలో దిగుతున్న దేశాలనూ ఖండించవలసి ఉంది. వీ






❖ **తెలంగాణ సాహిత్యం** – కాశీం – స్నేహ ప్రచురణలు – 248 పేజీలు, 1/8 డెమీ, రు. 140, ప్రతులకు: స్నేహ ప్రచురణలు, ఆర్–9, ఒయు స్టాఫ్ క్వార్టర్స్, ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాద్–7; సెల్: 9290745490; నవోదయ; సహచర; నవచేతన




❖ **తెలంగాణ లాంగ్ మార్చ్** – సూరేపల్లి సుజాత – స్వృహ సాహిత సంస్థ – 152 పేజీలు, 1/8 డెమీ, రు. 130



❖ **కవిత్వంతో ములాఖాత్** – ఎన్. వేణుగోపాల్ – స్వేచ్ఛాసాహితి ప్రచురణలు – 206 పేజీలు, 1/8 డెమీ, రు. 120, ప్రతులకు: వీక్షణం, మైత్రీ రెసిడెన్సీ, 3–6–394, స్ట్రీట్ నం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ – 500029; ఫోన్: 040–66843495; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు



❖ **ఉద్యమాల కాలమిస్తు – ఉద్యమాక్షరాలు** – సూరేపల్లి సుజాత – స్వృహ సాహిత సంస్థ – 175 పేజీలు, 1/8 డెమీ, రు. 150

పై రెండు పుస్తక ప్రతులకు: స్వృహసాహితీ సంస్థ, 1–8–702/33/20ఎ, పద్మాకాలనీ, నల్లకుంట, హైదరాబాద్–44 అన్ని షాపుల్లో




❖ **తన్లాట** – తెలంగాణ కథ 2014 – సంపాదకులు: సంగిశెట్టి శ్రీనివాస్, స్కైబాబ, వెల్దండి శ్రీధర్ – సింగిడి, తెలంగాణ రచయితల సంఘం – 160 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు: సంగిశెట్టి శ్రీనివాస్, ఇ.నం. 13–6–434/బి/38, హిమగిరి ఎవెన్యూ, ఫ్లాట్ నం. 305, మెహదీపట్నం రోడ్, హైదరాబాద్–500008; సెల్: 9849220321



❖ **రైతుల ఆత్మహత్యలన్నీ ప్రభుత్వ హత్యలే** – అఖిల భారత రైతుకూలీ సంఘం (ఎఐకెఎంఎస్) – వాయిస్ ఆఫ్ న్యూ డెమోక్రసీ – 36 పేజీలు, 1/8 డెమీ, రు. 20




❖ **మొలకలు** – కథలు – అల్లం వంశీ – 132 పేజీలు, 1/8 డెమీ, రు. 90, ప్రతులకు: అల్లం కృష్ణవంశీ, ఇ.నం. 7–77/ఎ, సుభాష్‌నగర్, మంథని, కరీంనగర్ జిల్లా – 505184; సెల్: 9849374400; email:kv.allam@gmail.com;అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు




❖ **వైరుధ్యాలూ** (ప్రశ్నలూ–జవాబులూ) – సుధీర్ – వాయిస్ ఆఫ్ న్యూడెమోక్రసీ – 28 పేజీలు, 1/8 డెమీ, రు. 15

పై రెండు పుస్తక ప్రతులకు: వాయిస్ ఆఫ్ డెమోక్రసీ, మార్క్సభవన్, 658, విద్యానగర్, 7వ లైన్, హైదరాబాద్–44; నవ తెలంగాణ బుక్‌హౌస్; నవోదయ; విశాలాంధ్ర




❖ **జనతన రాజ్యం** – దండకారణ్యంలో మావోయిస్టు ఆచరణ – పాణి – విరసం ప్రచురణ – 565 పేజీలు, 1/8 డెమీ, రు. 300, ప్రతులకు: డి.వి. రామక్రిష్ణారావు, ఎంఐజి–14, ఎపిఐఐసి కాలనీ, కార్బైడ్ కంపెనీ ఎదురుగా, మౌలాలి, హైదరాబాద్; అన్ని ప్రముఖ పుస్తక షాపులు




❖ **మీడియా నాడి** – పత్రికలపై పరిశీలనా నేత్రం – నాగసూరి వేణుగోపాల్ – ఎన్ కె పబ్లికేషన్స్ – 241 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: ఎన్‌కె పబ్లికేషన్స్, 24–8–1, సమీరా రెసిడెన్సీ, విజయనగరం – 535001; సెల్: 9440343479




❖ **దండకారణ్య కథలు (2013–15)** – విరసం ప్రచురణ – 136 పేజీలు, 1/8 డెమీ, రు. 70, ప్రతులకు: పి. వరలక్ష్మి, 5–1820, గీతాశ్రమం వీథి, ప్రొద్దుటూరు, కడప జిల్లా – 516 360; అన్ని ప్రముఖ పుస్తక షాపులు



❖ **అవ్వతోడిదేమోఖ** – 2011 సకల జనుల సమ్మె యాత్ర లో కరీంనగర్ జిల్లా పాత్ర – 130 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు: రాస భూమయ్య, గ్రా. యెఖీన్‌పూర్, మం. కోరుట్ల, కరీంనగర్ జిల్లా – 505462, తెలంగాణ; సెల్: 9440244962




❖ **పరిగె చేను** – కథలు – ఎలికట్టె శంకర్‌రావు – నవచేతన పబ్లిషింగ్ హౌస్– 110 పేజీలు, 1/8 డెమీ, రు. 70




❖ **కమ్యూనిస్టు విప్లవకారుల జీవన విధానం** – కా. దేవులపల్లి వెంకటేశ్వరరావు – పోరునేల – 88 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు: అన్ని పెద్ద పుస్తక షాపుల్లో




❖ **ప్రేమ్‌చంద్** – సాహిత్య వ్యాసాలు కథలు – నవచేతన పబ్లిషింగ్ హౌస్– 112 పేజీలు, 1/8 డెమీ, రు. 70

పై రెండు పుస్తక ప్రతులకు: నవచేతన పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, బండ్లగూడ (నాగోల్), జిఎస్ఐ (పోస్ట్), హైదరాబాద్ – 68; ఫోన్:24224454; email:navachethanaph@gmail.com




❖ **మ్యూజిక్ డైస్** – అను ఒక మరణ వాంగ్మూలము – అరుణ్‌సాగర్ – ఇంకొక ఆండ్రోమెడా ప్రచురణ – 36 పేజీలు, 1/4 క్రౌన్, రు. 70, ప్రతులకు: నవచేతన; నవ తెలంగాణ; ప్రజాశక్తి; విశాలాంధ్ర; తోపుదు బండి; సాహితీ మిత్రులు, విజయవాడ; అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో

# కోట్లు ఎగ్గొటొచ్చు, వేలకు మాత్రం ప్రాణాలు పోతాయి!

**భా**రత రాజకీయార్థిక వ్యవస్థ గురించీ, ఆ వ్యవస్థలోని విభిన్న సంస్థల చట్టబద్ధ, పారదర్శక పనితీరు గురించి కొందరు చాల గొప్పగా మాట్లాడుతుంటారు. ఈ దేశంలో పాలన ఎంత ప్రజాస్వామికమైనదో, అభివృద్ధి సాధించడానికి ఎంతగా ప్రయత్నిస్తున్నదో, అభివృద్ధికి దూరమైన వర్గాల కోసం ఎటువంటి సంక్షేమ పథకాలు రచించి అమలు చేస్తున్నదో పాలకవర్గాలూ, పాలకవర్గ ప్రచారసాధనాలూ ఊదరగొడుతుంటాయి. మధ్యతరగతి విద్యావంతులలో అత్యధికులు ఈ భారీ ప్రచారానికి లొంగిపోతుంటారు. పాలకవర్గాలు ప్రచారం చేస్తున్న ఆ పచ్చి అబద్ధాలన్నిటినీ నిజమని నమ్ముతుంటారు. తమవంతుగా తిరిగి ప్రచారం చేస్తుంటారు. నిజానికి ఆ ప్రచారంలో నూటికి తొంబై అబద్ధాలే కాని అవి అబద్ధాలని గుర్తించే శక్తి వినేవాళ్లకు లేదు. అవి అబద్ధాలని చెప్పడమే పనిగా పెట్టుకున్న రాజకీయ, సామాజిక, మేధో, పరిశోధక బృందాలు లేవు, ఉన్నా తగినంతగా పనిచేయడం లేదు.

ఈ అబద్ధాలకు, అక్రమాలకు ఒక ఉదాహరణగా అప్పుల సంగతి చూడవచ్చు. దేశంలో గత ఇరవై ఐదు సంవత్సరాలలో మూడు లక్షలకు పైగా రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారు. సగటున ప్రతి 32 నిమిషాలకు ఒక రైతు ఆత్మహత్య జరుగుతున్నదని ప్రభుత్వ గణాంకాలే చెపుతున్నాయి. వాస్తవ అంకెలు ప్రభుత్వ గణాంకాలకు రెట్టింపు ఉండవచ్చు. ఈ రైతుల ఆత్మహత్యల్లో అత్యధిక భాగం రుణభారాన్ని భరించలేక జరిగినవే. ఆత్మహత్య చేసుకున్న ఒక్కొక్క రైతు కథ చూస్తే వారిని ఆత్మహత్య వైపు నెడుతున్న అప్పు భారం ఒక లక్ష రూపాయల కన్న ఎక్కువ కాదు. ఒకవైపు అలా కొన్ని వేల రూపాయల అప్పు తీర్చలేక ప్రాణాలు తీసుకుంటున్న స్థితి ఉండగా, మరొకవైపు వందల, వేల కోట్ల రూపాయలు అప్పు తీసుకుని ఎగ్గొడుతున్న, మాఫీ చేయించుకుంటున్న ఘరానా పెద్దమనుషులు కూడ మన ఆర్థిక వ్యవస్థలోనే ఉన్నారు.

భారత రాజకీయార్థిక, సామాజిక వ్యవస్థలో అప్పు ఒక సాధారణమైన అంశం. ఆదాయానికీ వ్యయానికీ మధ్య వ్యత్యాసం ఉన్నప్పుడు, ఆ ఖాళీని పూడ్చుకోవడానికి ఎవరైనా అప్పు చేయకతప్పదు. అది సంస్థలకైనా, కుటుంబాలకైనా, వ్యక్తులకైనా సమానంగా వర్తించే నియమమే. అయితే ఆ సమాన నియమం దేశంలోని అసమానతల వల్ల అసమానంగా అమలవుతున్నది. అధికారాన్ని, ప్రాపకాన్ని వాడుకుని అవసరం లేకపోయినా అప్పు చేసేవాళ్లూ, అది ఎగ్గొట్టడానికి అన్ని అవకాశాలూ ఉన్నవాళ్లూ కొద్దిమంది ఒకవైపున్నారు. దిక్కుతోచని స్థితిలో, అనివార్యంగా తక్షణ అవసరాల కోసం అప్పు చేసి ఆ అప్పు తీర్చలేక ఆత్మహత్య తప్ప మరొకదారి లేదని అనుకునేవాళ్లు కోట్లాది మంది మరొకవైపు ఉన్నారు.

మన సమాజంలో అప్పులు ఇచ్చే శక్తి ఉన్నది మిగులు సంపద ఉన్న వ్యక్తులకు, అప్పులు ఇవ్వడమే వ్యాపారంగా మార్చుకున్న వడ్డీ వ్యాపారులకు, బ్యాంకుల వంటి ప్రభుత్వ ద్రవ్య సంస్థలకు, ప్రైవేటు ద్రవ్య సంస్థలకు మాత్రమే. వీరిలో వ్యక్తులు ఇచ్చే అప్పులు సాధారణంగా పరిచిత, కుటుంబ, బంధుమిత్ర సమూహాల పరిధిలోనే ఉంటాయి. ఎక్కువ సందర్భాలలో వాటికి వడ్డీ ఉండదు. వాటి పరిమాణం కూడ ఎక్కువ కాదు. ఇక వడ్డీ వ్యాపారుల రుణాలకు పరిధి ఎక్కువ గాని ఆంక్షలూ ఎక్కువే. వడ్డీ ఎక్కువ. అసలు, వడ్డీ చెల్లింపుల ఆంక్షలు కఠినంగా ఉంటాయి. ప్రభుత్వ ద్రవ్యసంస్థలు, ప్రైవేట్ ద్రవ్యసంస్థలలో పేరుకు చాల ఆంక్షలు ఉంటాయి గాని, అవి పేద, మధ్యతరగతి వారికి వర్తిస్తాయి గాని సంపన్నులకు, రాజకీయ నాయకులకు, పారిశ్రామిక, వ్యాపారవేత్తలకు వర్తించవు. అప్పు ఎంత పెద్దదైతే దాని మీద ఆంక్షలు అంతగా తగ్గిపోతుంటాయి. చిన్న అప్పులకు సవాలక్ష షరతులు పెట్టే సంస్థలు, పెద్ద అప్పులు మాత్రం సులభమైన షరతులతో ఇస్తుంటాయి. ద్రవ్యసంస్థలు పెట్టే షరతులన్నిటినీ పాటించి చిన్న చిన్న అప్పులు తీసుకున్నవాళ్లు నిర్ణీత సమయానికి అసలు, వడ్డీ చెల్లించకపోతే ఆ సంస్థలు చాల పెద్ద రభస చేస్తాయి. కాని అగ్రవర్ణాలు, ధనవంతులు, రాజకీయ అధికారపు ఆశ్రితులు వ్యక్తిగతంగా గాని, తాము నడిపే సంస్థల పేరు మీద గాని భారీగా వందల కోట్ల రూపాయల అప్పులు తీసుకుంటారు. తీసుకుంటున్నప్పుడే అవి చెల్లించకపోయినా ఫరవాలేదనే నమ్మకంతో తీసుకుంటారు. ముఖ్యంగా ప్రభుత్వ ద్రవ్యసంస్థల నుంచి, బ్యాంకుల నుంచి అప్పులు తీసుకుని, అసలు, వడ్డీ చెల్లించడంలో వాళ్లు ఎంత తాత్సారం చేసినా, ఆ సంస్థలు వాళ్లను బతిమిలాడుతుంటాయి, బుజ్జగిస్తుంటాయి గాని కఠినంగా ప్రవర్తించడమనేదే ఉండదు. వడ్డీ మాఫీ చేస్తామనీ, అసలులో కొంత చెల్లించినా ఫరవాలేదనీ, ఆ చెల్లించేది కూడ వాయిదాల్లో చెల్లించినా ఫరవాలేదనీ సంస్థలే అప్పుతీసుకున్న పెద్దల ఇళ్ల ముందర పడిగాపులు పడుతూ బేరాలాడుతుంటాయి. అవి ప్రభుత్వ సంస్థలు కాబట్టి ఏదో ఒకరోజు ప్రభుత్వాలు ఆ అప్పు మాఫీ చేస్తున్నామని కూడ ప్రకటిస్తాయి. లేదా ఆ సంస్థలే మొండి బాకీలు అని పేరు పెట్టి వాటి గురించి మాట్లాడడం మానుకుంటాయి.

**దేశంలో అతి ఎక్కువ అప్పులున్న పది కంపెనీలు**

| కంపెనీ | యజమాని / చైర్మన్ | అప్పు (రు. కోట్లలో) |
|---|---|---|
| రిలయన్స్ గ్రూప్ | అనిల్ అంబానీ | 1,25,000 |
| వేదాంత గ్రూప్ | అనిల్ అగర్వాల్ | 1,03,000 |
| ఎస్సార్ గ్రూప్ | రవి రూయా, శశి రూయా | 1,01,000 |
| అదానీ గ్రూప్ | గౌతమ్ అదానీ | 96,031 |
| జెపి గ్రూప్ | మనోజ్ గౌర్ | 75,163 |
| జెఎస్‌డబ్ల్యు గ్రూప్ | సజ్జన్ జిందాల్ | 58,171 |
| జిఎంఆర్ గ్రూప్ | గ్రంధి మల్లికార్జున రావు | 47,976 |
| లాంకో గ్రూప్ | లగడపాటి మధుసూదన రావు | 47,102 |
| వీడియోకాన్ గ్రూప్ | వేణుగోపాల్ ధూత్ | 45,405 |
| జివికె గ్రూప్ | జి వి కృష్ణారెడ్డి | 33,933 |

అంటే భారత సమాజంలో, ముఖ్యంగా ప్రభుత్వ రంగ బ్యాంకుల్లో అప్పు ఎంత పెద్దదైతే దాన్ని పొందడం, ఎగ్గొట్టడం, మాఫీ చేయించుకోవడం అంత సులభం. తమను తాము పారిశ్రామికవేత్తలమనీ, వ్యాపారవేత్తలమనీ పిలుచుకుంటే, రాజకీయ నాయకులతో భుజాలు కలుపుకుని తిరిగితే అప్పు పొందడం, తిరిగి చెల్లించడానికి సాగదీయడం, చివరికి ఎగ్గొట్టడం సులభం. వ్యవసాయం గిట్టుబాటు కాకనో, ఆదాయం సరిపోకనో, బిడ్డ పెళ్లికో, ఆస్పత్రి అవసరానికో, చదువు అవసరానికో కొన్ని వేల రూపాయల అప్పు తీసుకుంటే వెంటాడి, వేధించి, ఆత్మహత్య వైపు నెట్టే ప్రభుత్వ రంగ ద్రవ్య సంస్థలు, మరొకవైపు వందల కోట్ల రూపాయల బాకీదారులను ఏమీ అనవు.

అంతే కాదు, లక్ష రూపాయల లోపు రుణానికి ఇంటి మీదికి వచ్చి అవమానపరిచే ఈ సంస్థలు వందల కోట్ల రూపాయల రుణాలు తీసుకున్నవారి "గౌరవం కాపాడడానికి", "మర్యాద కాపాడడానికి", "తమతో ఉన్న సంబంధాలను పదిలంగా ఉంచుకోవడానికి" వారి పేర్లు కూడ బైట పెట్టడం సాధ్యం కాదని అంటున్నాయి. ఈ ఎగ్గొట్టిన అప్పులను బ్యాంకులు అప్పులు, బాకీలు అని కూడ ప్రస్తావించవు. "పని చేయని ఆస్తులు / ఖాతాలు" (నాన్ పర్ఫార్మింగ్ అస్సెట్స్ / అకౌంట్స్) అనే ముద్దుపేరుతో పిలుస్తాయి. ఆ ముద్దుపేరు కింద దేశంలో ప్రస్తుతం కేవలం ప్రభుత్వ రంగ బ్యాంకులలో ఎగ్గొట్టిన అప్పుల మొత్తం రు. 3,04,000 కోట్లు.

ఇలా ప్రభుత్వ రంగ బ్యాంకుల నుంచి వందల కోట్ల రూపాయలు అప్పులు తీసుకుని ఎగ్గొట్టి, ఆ బ్యాంకులు దివాళా తీయడానికి, ఇబ్బందుల్లో పడడానికి కారకులైన వాళ్ల పేర్లు బైట పెట్టడం గురించి దేశంలో ఇరవై ఐదు సంవత్సరాలుగా పెద్ద చర్చ జరుగుతున్నది. వాళ్ల పేర్లు బైట పెట్టడానికి వీలులేదని ఆయా బ్యాంకుల యాజమాన్యాలు, రిజర్వ్ బ్యాంకు, ప్రభుత్వాలు వాదిస్తున్నాయి. అప్పు ఎగవేతదారులను రక్షించడానికి ప్రయత్నిస్తున్నాయి. తమకు అందుబాటులో ఉన్న జాబితాలు బైటపెడతామని ముందుకు వచ్చిన బ్యాంకు ఉద్యోగుల సంఘాలు కొన్ని పేర్లు, వారి బకాయిలు ప్రకటించాయి. కాని నిజంగా బ్యాంకులు ఇచ్చిన అప్పులలో, మొండి బాకీలుగా రద్దయిపోయిన అప్పులలో ఈ యూనియన్లు బైటపెట్టినవి అతి చిన్న భాగం మాత్రమే.

ఈ వివాద చరిత్ర డిసెంబర్ 2015లో ఒక కొత్త మలుపు తీసుకున్నది. మన పాలకులు తమను తాము పొగుడుకోవడానికి వాడుకుంటున్న సమాచార హక్కు చట్టం సర్వరోగ నివారిణి అని, ఆ ఆయుధంతో ఈ సమాజాన్ని ప్రక్షాళనం చేయవచ్చునని మధ్యతరగతిలో కొందరు అమాయకంగా నమ్ముతున్నారు. చిన్న చిన్న సమాచారపు ముక్కలను బైటికి లాగడానికి ఈ చట్టం పనికొస్తుందేమో గాని, ఈ వ్యవస్థ మూలాలను కదిలించగల ప్రభుత్వరంగ బ్యాంకుల అప్పులు ఎగ్గొట్టినవారి జాబితా బైట పెట్టడానికి సమాచార హక్కు చట్టం ఉపయోగ పడుతుందా లేదా అనే చర్చను ఈ వివాదం లేవనెత్తింది.

సమాచార హక్కు కార్యకర్తలు కొందరు వివిధ బ్యాంకులలో అప్పు తీసుకున్నవారి జాబితా, తిరిగి చెల్లించిన వివరాలు వంటి సమాచారం కోసం దరఖాస్తులు చేశారు. అది రహస్య సమాచారమని, దాన్ని ఇవ్వడానికి వీలులేదని బ్యాంకులు తెలిపాయి. దరఖాస్తుదారులు ఉన్నత స్థాయికి ఫిర్యాదు చేశారు. బ్యాంకులు ఆ సమాచారం ఇవ్వవలసిందే అని ఉన్నతస్థాయిలోని కేంద్ర ఇన్ఫర్మేషన్ కమిషన్ తీర్పు ఇచ్చింది. అయినా ఫలితం దక్కలేదు. కేంద్ర ఇన్ఫర్మేషన్ కమిషన్ తీర్పును కొట్టి వేయాలని కోరుతూ బ్యాంకులు న్యాయస్థానాలకు వెళ్లాయి. ఈ వివాదం వేరువేరు రాష్ట్రాల హైకోర్టులకు వెళ్లింది.

అక్కడినుంచి పదకొండు కేసులు సుప్రీంకోర్టు విచారణకు వచ్చాయి. వాటిలో ఎనిమిది కేసులు రిజర్వ్ బ్యాంక్ కు, రెండు కేసులు జాతీయ వ్యవసాయ, గ్రామీణాభివృద్ధి బ్యాంకు (నాబార్డ్) కు, ఒక కేసు ఐసిఐసిఐ బ్యాంకుకు సంబంధించినవి. దరఖాస్తుదారులు అడిగిన సమాచారం ఇవ్వడం కుదరదని ఈ బ్యాంకులు వాదించాయి. ఈ సమాచారం "అత్యంత సున్నితమైనద"ని, అది "బైటపడితే దేశ భద్రతకు, సార్వభౌమత్వానికి హాని కలుగుతుంద"ని, "దేశ ఆర్థిక ప్రయోజనాలు దెబ్బతింటాయ"ని వాదించాయి. ఆ సమాచారం తమకూ, తమ కక్షిదారులకూ మధ్య ఆంతరంగిక వాణిజ్య పరమైనదని, దాన్ని బైటపెట్టడం వారి ఆంతరంగిక విషయాలలో జోక్యం చేసుకోవడం అవుతుందని వాదించాయి. దరఖాస్తుదారుల తరఫున వాదించిన న్యాయవాది ప్రశాంత్ భూషణ్ ఈ దేశంలో రాజ్యాంగాన్ని, దానిద్వారా శాసన నిర్మాణ, అధికార, న్యాయ వ్యవస్థలు మూడిటినీ సృష్టించింది ఈ దేశ ప్రజలు అని, అందువల్ల ఏ ప్రజా సంస్థ గురించి అయినా ఏ సమాచారమైనా తెలుసుకునే హక్కు ప్రజల ప్రాథమిక హక్కు అని వాదించారు. సమాచార హక్కు చట్టం కొత్త హక్కు ఏమీ కాదని, ఈ ప్రాథమిక హక్కుకు విస్తరణ మాత్రమేనని, అందువల్ల దానికి రిజర్వ్ బ్యాంక్ కోరినట్టుగా మినహాయింపులు ఇవ్వనక్కరలేదని ఆయన వాదించారు.

ఈ వాదనలన్నీ విన్న తర్వాత 2015 డిసెంబర్ 16న తీర్పు ఇస్తూ సుప్రీంకోర్టు న్యాయమూర్తులు జస్టిస్ ఎం వై ఎక్బాల్, జస్టిస్ సి నాగప్పన్ బ్యాంకుల వాదనను తిరస్కరించారు. అప్పు ఎగ్గొడుతున్నవారి పేర్లు బైటపడితే దేశ ఆర్థిక ప్రయోజనాలు దెబ్బతింటాయన్న వాదన అర్థరహితమని, నిరాధారమని, అసంగతమని కొట్టివేశారు. సమాచార హక్కు చట్టం కింద ఇటువంటి సమాచారం కోసం దరఖాస్తులు వస్తే బ్యాంకులు ఆ సమాచారం ఇవ్వవలసిందేనని తీర్పు చెప్పారు. ఇప్పుడిక ఆయా బ్యాంకులు, వాటి వెనుక ఉన్న ప్రభుత్వం, పాలకులు ఈ తీర్పును ఉల్లంఘించడానికి ఏ అవకాశాలు దొరుకుతాయా అని వెతుకుతున్నారని వార్తలు వస్తున్నాయి. అందువల్ల సమాచార హక్కు చట్టం ప్రకారమైనా ఆయా కంపెనీలు, పెద్దలు తీసుకున్న అప్పుల, ఎగ్గొట్టిన అప్పుల వివరాలు దొరుకుతాయో లేదో నమ్మకంలేదు.

కంపెనీలు చట్టప్రకారం ప్రకటించవలసిన వార్షిక నివేదికలలో తమ రుణాల గురించి చెప్పడం తప్పనిసరి గనుక, క్రెడిట్ స్విస్ అనే అంతర్జాతీయ సలహా సంస్థ ఆ నివేదికల నుంచి వారి రుణాల వివరాలు సేకరించి 2015 అక్టోబర్ లో ఒక నివేదిక ప్రకటించింది. ఆ నివేదిక ప్రకారం ఆయా పారిశ్రామిక, వ్యాపార సంస్థలు అధికారికంగా చెప్పుకున్న అప్పుల జాబితాలో అగ్ర స్థానంలో ఉన్న పది ఖాతాలు ఇవి. వీటిలో ఎన్ని ఎగ్గొడుతారో, ఎన్నిటి మీద మాఫీలు పొందుతారో మరో కథ.

వీ

# రోహిత్ జీవితమూ మరణమూ సమాజానికి పాఠాలు

***హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయ పరిశోధక విద్యార్థి రోహిత్ వేములది ఆత్మహత్యగా కనబడుతున్న హత్య అంటూ దాని పూర్వాపరాలను విశ్లేషిస్తున్నారు ఎన్. వేణుగోపాల్***

హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయంలో సైన్స్, టెక్నాలజీ అండ్ సొసైటీ స్టడీస్ శాఖలో పి ఎచ్ డి చేస్తున్న పరిశోధక విద్యార్థి రోహిత్ చక్రవర్తి వేముల 2016 జనవరి 17 సాయంత్రం హాస్టల్ గదిలో ఉరివేసుకుని చనిపోయాడు. అప్పటికే నెల రోజులుగా ఆయనతో పాటు మరో నలుగురు విద్యార్థుల మీద విశ్వవిద్యాలయ యాజమాన్యం సాంఘిక బహిష్కరణ విధించడంతో, ఆ రోజునే బహిష్కృత విద్యార్థులు నిరాహార దీక్ష ప్రారంభించడంతో, రోహిత్ మరణం నివ్వురవ్వ దావానలమైనట్టుగా విశ్వవిద్యాలయంలోనూ, రాష్ట్రంలోనూ, దేశ వ్యాప్తంగానూ పెద్ద ఎత్తున ఆలోచనకూ ఆందోళనకూ సంచలనానికీ దారి తీసింది. ఒక దళిత విద్యార్థి ఆత్మహత్యగా కనబడుతున్న ఈ వ్యవస్థీకృత హత్య పత్రికలలో, ప్రచార సాధనాలలో, సోషల్ మీడియాలో విస్తృతమైన చర్చకు దారితీసింది. అనేక రాజకీయ పక్షాలు కూడ ఈ ఘటనతో రాజకీయ లబ్ధి పొందడానికి రంగంలోకి దిగాయి.

రోహిత్ బహిష్కరణకు కారణమైన సంఘ పరివార్ శక్తులు, అఖిల భారతీయ విద్యార్థి పరిషత్ రోహిత్ మీద, రోహిత్ గతం మీద, కుటుంబం మీద, కులం మీద బురద చల్లుతూ విషప్రచారం మొదలుపెట్టాయి. మరణానంతర జీవితం రెండు వారాలు తిరగకుండానే రోహిత్ ను దేశవ్యాపిత, అంతర్జాతీయ చిహ్నంగా మార్చింది. ఒకరకంగా రోహిత్ మరణం ఆలోచనాపరుల స్వభావాలకు, అవగాహనలకు లిట్మస్ టెస్ట్ వంటి పరీక్షగా మారింది. మౌలిక విషయాలు మరుగున పడిపోయేంత పెద్ద ఎత్తున జరుగుతున్న ఈ రణగొణధ్వని మధ్య నుంచి రోహిత్ హత్య గురించి లోతుగా ఆలోచించవలసి ఉంది.

ప్రతి 'ఆత్మహత్య'కూ సామాజిక కారణాలూ, వ్యక్తిగత కారణాలూ ఉంటాయి. సుదీర్ఘకాలంగా పేరుకున్న కారణాలూ, అప్పటికప్పుడు తోసుకొచ్చిన ఉధృత ఉద్వేగ కారణాలూ ఉంటాయి. పరిశీలించి చూస్తే ఆత్మహత్యలుగా ప్రచారమయ్యేవన్నీ సమాజం చేసే హత్యలే. ఒక మనిషిని దీర్ఘకాలికంగా, మెల్లమెల్లగా, మౌనంతో, మాటలతో, చేతలతో వేధించిన సమాజమే చివరికి ఆత్మహననానికి పాల్పడేలా చేస్తుంది. సమాజం అన్నప్పుడు కూడ చుట్టూ ఉండే మనుషులు మాత్రమే అని అర్థం కాదు. తరతరాలుగా సామాజిక సంస్కృతిలో భాగమైన హీన, దుర్మార్గ విలువలన్నీ కూడ మనిషిని ఎప్పటికప్పుడు ఆత్మన్యూనతలోకీ, నిస్పృహలోకీ నెడుతుంటాయి. అవి కొందరు వ్యక్తుల ద్వారా వ్యక్తం కావచ్చు, లేదా మొత్తంగా సామాజిక విలువలుగా వ్యక్తం కావచ్చు.

అలా పేరుకుపోయిన దీర్ఘకాలిక నిస్పృహ ఏదో ఒక తక్షణ ప్రేరణ

## నెల ముందు రాసిన లేఖ

యూనివర్సిటీ అధికారులు సస్పెన్షన్ ప్రకటించిన రోజు, ఆత్మహత్యకు నెల ముందు, 2015 డిసెంబర్ 18న వైస్ చాన్సలర్‌ను ఉద్దేశించి రోహిత్ రాసిన లేఖ. ఇది విసి కార్యాలయంలో ఇచ్చి, అందినట్టుగా ఈ లేఖ మీద అధికారుల సంతకం కూడ తీసుకున్నాడు.

వైస్ చాన్సలర్ గారికి,

విషయం: దళిత సమస్యకు పరిష్కారం

అయ్యా, హైదరాబాద్ కేంద్ర విశ్వవిద్యాలయ ప్రాంగణంలో దళితుల ఆత్మగౌరవ ఉద్యమాల పట్ల మీ నిబద్ధ వైఖరికీ, చర్యలకూ మొట్టమొదట నా అభినందనలు తెలుపుతున్నాను. ఒక ఎబివిపి అధ్యక్షుడు దళితుల మీద చేసిన అవమానకర వ్యాఖ్యల గురించి ప్రశ్నలను ఎదుర్కొన్నప్పుడు మీరు ఆ విషయంలో దయతో జోక్యం చేసుకోవడం చరిత్రాత్మకం. ఆదర్శవంతం. మీ జోక్యంతో ఐదుగురు దళిత విద్యార్థులకు క్యాంపస్ స్థలాల నుంచి 'సంఘ బహిష్కారం' విధించారు. మీ ముందు డొనాల్డ్ ట్రంప్ మరుగుజ్జులా కనబడుతున్నాడు. మీ నిబద్ధతను చూసి, అతి సాధారణత్వపు సూచికగా, మీకు రెండు సలహాలు ఇవ్వాలని నాకనిపిస్తున్నది.

1. దళిత విద్యార్థులందరికీ వారిని చేర్చుకునే సమయంలో తలా పది గ్రాముల సోడియం అజైడ్ ఇప్పించండి. వారికి అంబేద్కర్ రచనలు చదవాలని అనిపించినప్పుడు ఈ విషం సేవించమని ఆదేశం ఇవ్వండి.

2. మీ సహచరుడు, ఘనత వహించిన చీఫ్ వార్డెన్ కు చెప్పి దళిత విద్యార్థులందరి గదులలో ప్రతి గదికీ మంచి తాడు ఒకటి సరఫరా చేయించండి.

ఇక, మేం, పరిశోధకులం, పి ఎచ్ డి పరిశోధక విద్యార్థులం ఆ దశను ఇప్పటికే దాటిపోయాం. ఇప్పటికే దళిత ఆత్మగౌరవ ఉద్యమంలో సభ్యులమయ్యాం. మీ దురదృష్టం కొద్దీ మమ్మల్ని వెళ్లగొట్టేందుకు మీదగ్గర సులభ మార్గమేమీ లేనట్టుంది. అందువల్ల, మహా ఘనత వహించిన మిమ్మల్ని నేను కోరేదేమంటే, నా వంటి విద్యార్థులకు యూథనేషియా (స్వయం సంకల్పిత మరణం) సౌకర్యానికి తగిన ఏర్పాట్లు చేయించండి. మీరూ మీ క్యాంపస్ ప్రశాంతంగా ఉండాలని కోరుకుంటున్నాను.

వల్ల పెటిల్లున బైటపడి, బలవత్తరంగా మారి, జీవితానికి అర్థం లేదనిపించేట్టు చేస్తుంది. ఒంటరినైపోయానని అనుకునేలా చేస్తుంది. ఆ బలహీనక్షణంలో మనిషికి ప్రాణాలు తీసుకునే ఆలోచన వస్తుంది. అంటే ప్రతి ఆత్మహత్యలోనూ దీర్ఘకాలిక కారణాల రూపంలో హత్య కోణమూ ఉంటుంది, తక్షణ ఒత్తిడి రూపంలో ఆత్మహత్య కోణమూ ఉంటుంది.

అయితే ఆ దీర్ఘకాలిక కారణాలూ సమస్యలూ అదృశ్యంగా, అస్పష్టంగా, ఇబ్బందికరంగా ఉంటాయి గనుక పరిశోధకులు, చుట్టూ ఉన్న వ్యక్తులు ప్రతి ఆత్మహత్యకూ తక్షణ కారణాలు వెతకడానికి, సృష్టించడానికి, ఊహించడానికి ప్రయత్నించి సంతృప్తి పడతారు. అందువల్లనే మరణించే మనిషి చివరిలేఖ ఏదన్నా వదిలివెళ్లారా, తన చర్యకు సూచనలు ఏవైనా వదిలివెళ్లారా అని వెతుకుతారు. ఇవాళ రోహిత్ మరణానికి కొద్ది ముందు రాసిన ఒక లేఖ ఉంది గాని నిజానికి ఆయన జీవితమంతా ఆయనను ఆ చర్యకు పురికొల్పిన కారణాలను చూపుతుంది. చివరిలేఖలో మాత్రమే కాదు, సరిగ్గా నెల ముందు విశ్వవిద్యాలయ వైస్ చాన్సలర్‌ను ఉద్దేశించి రాసిన లేఖలోనూ, అంతకుముందు ఫేస్‌బుక్ మీద రాసిన అనేక వ్యాఖ్యలలోను ఆయన ఆ సూచనలు వదిలివెళ్లాడు.

ఆ లేఖలను విశ్లేషిస్తే, "కొంతమందికి ఎల్లవేళలా జీవితమే ఒక శాపం" అనే మాటలోనూ, "పుట్టుకే ప్రాణాంతక ప్రమాదం" అనే మాటలోనూ దళితుడిగా అనుభవించిన ప్రత్యక్ష, పరోక్ష అవమానాలు, వేధింపులు, వివక్ష అన్నిటినీ రోహిత్ వ్యక్తీకరించాడు. ఎవరికైనా పుట్టుక యాదృచ్ఛికమే. ఎవరూ ఫలానా స్థానంలో పుట్టాలని కోరుకొని పుట్టరు. కాని, పుట్టుకే సామాజిక స్థానాన్ని నిర్ణయించే అంతరాల సమాజంలో కొందరికి పుట్టకముందే అవకాశాలు సిద్ధంగా ఉంటాయి. మరి కొందరికి పుట్టకముందే ఆంక్షలు, పరిమితులు, నిషేధాలు సిద్ధంగా ఉంటాయి. వారికి పుట్టుకే ప్రాణాంతక యాదృచ్ఛికత అవుతుంది.

హిందూ–బ్రాహ్మణీయ వర్ణాశ్రమ ధర్మం, ఆ తర్వాత ఘనీభవించిన నిచ్చెనమెట్ల కుల వ్యవస్థ ఈ దేశంలో అసంఖ్యాక ప్రజానీకాన్ని ఆ ప్రాణాంతక ప్రమాద స్థితికి నెట్టాయి. శూద్రులకు విద్యార్హత లేదని ప్రకటించాయి. శూద్రులకూ దళితులకూ మహిళలకూ బహిరంగ సామాజిక జీవన స్థలాలలోకి ప్రవేశార్హత లేదన్నాయి. మతం నిర్దేశించిన ఈ విధినిషేధాలకు రాజ్యాంగ యంత్రం, ఆర్థిక వ్యవస్థ, పాలకవర్గ ప్రయోజనాలు తోడయ్యాయి. ఈ విధినిషేధాలు భావజాలంలో, సంస్కృతిలో, సాధారణ లోకజ్ఞానంలో నిండిపోయాయి. ఆ భావాల కొనసాగింపు వల్ల భౌతిక ప్రయోజనాలు లేనివాళ్లు కూడ భావజాలం వల్ల ఆ భావాలను కొనసాగించే స్థితి, 'కింది కులాల' పట్ల చిన్నచూపును, వివక్షను, ద్వేషాన్ని ప్రకటించే స్థితి ఏర్పడి ఉంది. రోహిత్ ప్రస్తావించిన ఏకాకి తనం అదే.

ఆధునిక సమానతా భావనల వల్ల, సమాజ నిర్వహణలో అత్యధిక సంఖ్యాకుల పాత్ర వల్ల, మన సమాజంలో కొనసాగిన అనేక మత సంస్కరణ, కుల వ్యతిరేక, ప్రగతిశీల ఉద్యమాల ప్రభావం వల్ల నామమాత్రంగానైనా అందరూ సమానులే అని అంగీకరించక తప్పని పరిస్థితి వచ్చింది. తరతరాలుగా నిరాదరణకు, అవకాశాల నిరాకరణకు గురి అయిన వర్గాల అభ్యున్నతి సాధించడానికి ప్రత్యేక రక్షణలు కల్పించాలనే ఆలోచనకు బలం వచ్చింది. భారత రాజ్యాంగ రచనలో 'రక్షణాత్మక విచక్షణ', 'సమన్యాయం', 'సవరణాత్మక చర్యలు' వంటి సూత్రాల ప్రాతిపదికపై దళితులకు, ఆదివాసులకు విద్యారంగంలో రిజర్వేషన్ విధానం వచ్చింది. అప్పటిదాకా ఆ వర్గాలకు విద్యార్హత లేదని వాదిస్తున్న, భావిస్తున్న అగ్రవర్ణాలకు ఈ చర్య కంటగింపు అయింది, అవుతున్నది. వారు రిజర్వేషన్ విధానానికి తూట్లు పొడవడానికి, వక్రీకరించడానికి, సక్రమంగా అమలు చేయకుండా ఉండడానికి అనేక రకాలుగా ప్రయత్నాలు సాగిస్తూనే ఉన్నారు. అందువల్లనే రెండు తరాల తర్వాత కూడ దళిత, ఆదివాసి సమూహాలలో నిరక్షరాస్యత ఇంకా పెద్ద ఎత్తునే ఉంది. వారికి అవకాశాల నిరాకరణ ఇంకా కొనసాగుతూనే ఉంది.

రిజర్వేషన్ల స్ఫూర్తిని దెబ్బతీయడం ఒక ఎత్తయితే, రిజర్వేషన్ మీద గాని, సాధారణ స్రవంతిలో గాని విద్యాసంస్థలలో ప్రవేశించిన విద్యార్థులను అవమానించడం, చిన్నచూపు చూడడం, వారి ఆత్మగౌరవాన్ని దెబ్బతీయడం, వారు చదువు వదులుకుని వెళ్లేలా ఒత్తిడి తేవడం కూడ పెద్ద ఎత్తున జరుగుతున్నాయి. విద్యాసంస్థలు బ్రాహ్మణ, అగ్రవర్ణ అగ్రహారాలుగా మారి అసంఖ్యాక దళిత, శూద్రకులాల విద్యార్థుల మీద గతకాలపు సాంఘిక బహిష్కరణను అమలు చేస్తూ వస్తున్నాయి. విద్యార్థులను చేర్చుకునేటప్పుడు మొదలయ్యే అవమానాలు, తరగతి గదుల్లో, హాస్టళ్లలో, క్యాంపస్‌లోని బహిరంగ స్థలాలలో, ప్రొఫెసర్ల హేళనల్లో, చిన్నచూపులో, అవకాశాలు ఇవ్వకపోవడంలో, అర్హతలకు తగిన మార్కులు వేయకపోవడంలో, తగిన గుర్తింపు ఇవ్వకపోవడంలో అనేక రకాలుగా ప్రత్యక్షంగా, పరోక్షంగా వ్యక్తమవుతున్నాయి. వాస్తవ అర్థంలో, అర్థవంతంగా ఉత్పత్తి సాధనాల యాజమాన్యంలోనూ, ఉత్పత్తి సంబంధాలలోనూ, సామాజిక సంబంధాలలోనూ, భావజాలంలోనూ కుల నిర్మూలన జరిగేదాకా ఈ సమస్యకు నిజమైన పరిష్కారం దొరకదు.

దళిత, శూద్ర విద్యార్థుల పట్ల అమలవుతున్న ఈ వివక్షకు అత్యున్నత రూపమే రోహిత్ పట్ల అమలైన వివక్ష, అన్యాయం, అవమానం, సాంఘిక బహిష్కరణ. అందువల్ల రోహిత్ హంతకుల జాబితాలో, ముద్దాయిల జాబితాలో ఉండవలసిన మొట్టమొదటి పేరు ఈ దేశంలో అమలవుతున్న మనుధర్మం. హిందూ బ్రాహ్మణీయ నిచ్చెనమెట్ల కులవ్యవస్థ.

ఈ దీర్ఘకాలిక కారణాలతో పాటు, నాలుగైదు నెలలుగా సాగుతున్న పరిణామాల ఒత్తిళ్లు రోహిత్ ఆత్మహత్యాలోచనకు తక్షణ కారణంగా, కారణాలుగా పనిచేసి ఉంటాయి. ఆ తక్షణ కారణాల వరుసక్రమాన్ని వెతకడానికి మరీ వెనక్కి వెళ్లకపోయినా సస్పెన్షన్‌కూ, సాంఘిక బహిష్కరణకూ దారి తీసిన పరిణామాల దగ్గరనైనా ప్రారంభించాలి.

సమాజంలో మనుధర్మాన్ని యథాతథంగా అమలు చేయాలనీ, ఎవరి వర్ణాశ్రమ ధర్మాన్ని వాళ్లు పాటించేలా చూడాలనీ భావించే సంఘ్ పరివార్ శక్తులు, ఆ భావజాలమే మనసుల్లో నింపుకున్న వ్యక్తులు విశ్వవిద్యాలయ నిర్వహణలో చాల మందే ఉంటారు. సంఘ్ పరివార్ లో భాగమైన ఎబివిపి ఒక విద్యార్థి సంఘంగా చెప్పుకుంటూ విద్యార్థులలో విషబీజాలు నాటడానికి, మతవిద్వేషాన్ని, కుల వివక్షను పెంచి పోషించడానికి ప్రయత్నిస్తున్నది. సంఘ్ పరివార్ శక్తులకు కేంద్రంలో అధికారం వచ్చిన తర్వాత ఈ శక్తులు దేశవ్యాప్తంగా పెట్రేగిపోతున్నాయి. ఎదురులేదని

## రోహిత్ ఆఖరి లేఖ

*గుడ్ మార్నింగ్.*

మీరీ ఉత్తరం చదివేటప్పటికి నేనుండను. కోప్పడకండి. మీలో కొందరు నన్ను నిజంగా ప్రేమించారు, ఆప్యాయంగా చూసుకున్నారు, నాకు తెలుసు. నాకెవరిమీదా ఏ ఫిర్యాదూ లేదు. నాకెప్పుడూ నాతోనే సమస్యలున్నాయి. నా శరీరానికీ ఆత్మకూ దూరం పెరుగుతుండడం నేను గమనించాను. మొండిగా తయారయ్యాను. నేనెప్పుడూ ఒక రచయితను కావాలనుకున్నాను. కార్ల్ సాగన్ లాగా సైన్సు రచయితను కావాలనుకున్నాను. చివరికి, ఈ ఉత్తరం ఒక్కటి మాత్రమే రాయగలుగుతున్నాను.

నేను సైన్సునూ నక్షత్రాలనూ ప్రకృతినీ ప్రేమించాను. మనుషుల్ని కూడ ప్రేమించాను గాని వాళ్లు ప్రకృతి నుంచి ఎప్పుడో దూరమయ్యారని తెలుసుకోలేకపోయాను. మన అనుభూతులు ఇంకెవరో వాడిపారేసినవి. మన ప్రేమ కృత్రిమమైనది. మన నమ్మకాలు రంగుటద్దాలవి. మన సహజత్వం కృత్రిమ కళలోనే నిర్ణయమవుతుంది. గాయపడకుండా నిజంగా ప్రేమించడం అసాధ్యంగా మారిపోయింది.

మనిషి విలువ అతని తక్షణ గుర్తింపుకూ సమీప అవకాశానికీ కుదింపబడింది. ఒక వోటుగా, ఒక అంకెగా, ఒక వస్తువుగా తప్ప మనిషికి మనసుగా గుర్తింపే లేదు. నక్షత్ర ధూళితో నిర్మాణమైన ఉజ్వలమైన జీవిగా గుర్తింపే లేదు. ప్రతి చోటా అంతే. చదువులో. వీధిలో. రాజకీయాలలో. చివరికి చావులోనూ బతుకులోనూ కూడ.

ఇటువంటి ఉత్తరం నేనిదే మొదటిసారి రాస్తున్నాను. మొదటిసారి రాస్తున్న చివరి లేఖ. చెప్పాలనుకున్నది చెప్పలేకపోతే క్షమించండి.

బహుశా ప్రపంచాన్ని అర్థం చేసుకోవడంలో ఎప్పుడూ పొరబడడం నా తప్పేనేమో. ప్రేమనూ బాధనూ జీవితాన్నీ మరణాన్నీ అర్థం చేసుకోవడంలో కూడ. అంత హడావిడేమీ లేదు కాని నేనెప్పుడూ తొందరపడుతూనే ఉన్నా. జీవితాన్ని మొదలుపెట్టేందుకు. కొంతమందికి ఎల్లవేళలా జీవితమే ఒక శాపం. నా పుట్టుకే నాకొక ప్రాణాంతక ప్రమాదం. నా బాల్యపు ఏకాకితనం నుంచి నేనెప్పుడూ తేరుకోలేను. గతానికి చెందిన ఏ ప్రశంసా ఎరగని ఆ చిన్నారి బాలుడి నుంచి.

ఈ క్షణం నాలో ఏ బాధా లేదు. విచారమూలేదు. కేవలం ఖాళీతనం నిండి ఉంది. నాగురించేమీ పట్టని నిర్వికార స్థితి. అదే చాల బాధాకరం. అందుకే ఈ పని చేస్తున్నాను.

అందరూ నన్నో పిరికివాడినని అంటారేమో. స్వార్థపరుణ్ననీ తెలివితక్కువ వాణ్ననీ అంటారేమో. ఏమనుకున్నా సరే, నాకే పట్టింపూ లేదు. మరణానంతర కథల మీద, దయ్యాల మీద, ఆత్మల మీద నాకు నమ్మకం లేదు. నేను నమ్మేదేదైనా ఉంటే అది నేను నక్షత్రాల్లోకి ప్రయాణిస్తాననేదే. ఇతర లోకాల గురించి తెలుసుకుంటాననేదే.

ఈ ఉత్తరం చదువుతున్న వారు నాకేదైనా చేయాలనుకుంటే, నా ఫెలోషిప్ ఏడు నెలల బాకీ ఒక లక్షా డెబ్బై ఐదు వేల రూపాయలు రావాలి. అది నా కుటుంబానికి దక్కేలా చూడండి. నలభై వేలు నేను రాంజీకి ఇవ్వాలి. తనెప్పుడూ అడగ లేదు గాని అది తనకి ఇవ్వండి.

నా అంతిమయాత్ర మౌనంగా ప్రశాంతంగా జరిగేలా చూడండి. నేను అలా కనిపించి ఇలా మాయమైనట్టుగా ప్రవర్తించండి. నాకోసం కన్నీళ్లు కార్చకండి. జీవించడం కన్నా మరణించడంలోనే నా సంతోషం ఉందని అర్థం చేసుకోండి.

"నీడల్లోంచి తారల్లోకి"

ఉమా అన్నా, ఈ పనికి నీ గదిని వాడుకుంటున్నందుకు మన్నించు.

ఎఎస్ఎ కుటుంబానికి, మిమ్మల్ని నిరాశ పరుస్తున్నందుకు క్షమించండి. మీరు నన్నెంతో ప్రేమించారు. ఆల్ ద బెస్ట్ ఫర్ యువర్ ఫ్యూచర్.

కడసారిగా ఒకసారి,

జై భీం

లాంఛనాలు రాయడం మర్చిపోయాను. నా ఈ ఆత్మహత్యకు ఎవరూ కారణంకాదు. ఈ పని చేయమని నన్నెవరూ పురికొల్పలేదు. ఇది నా నిర్ణయం, నేనే బాధ్యుడిని. నేను వెళ్లిపోయాక నా స్నేహితుల్ని గాని, శత్రువుల్ని గాని ఇబ్బంది పెట్టొద్దు.

జనవరి 17న రాసిన ఈ ఉత్తరంలో రాసిన మరొక పదకొండు పంక్తులు కొట్టివేసి "ఇవి నేనే కొట్టేశాను" అని సంతకం కూడ పెట్టాడు. కాని మరణానంతర వివాదంలో ఆ కొట్టివేసిన పంక్తుల్ని తవ్వితీసి ప్రచారంలో పెట్టారు. ఆ పంక్తులు:

"ఎఎస్ఎ, ఎస్ఎఫ్ఐ, ఏ సంస్థ అయినా, అన్ని సంస్థలూ కూడ తమ కోసం తాము ఉనికిలో ఉంటాయి. ఒక వ్యక్తి ప్రయోజనాలూ ఈ సంస్థల ప్రయోజనాలూ ఎక్కువసార్లు సరిపడవు. సరిహద్దుల లోపలే అధికారం సంపాదించడం, ప్రముఖులు కావడం, ముఖ్యమైన వారుగా గుర్తింపు పొందడం, వ్యవస్థను మార్చబోతున్నామని ఆలోచించడం. చాల తరచుగా మనం మన చర్యలను అతిగా అంచనా వేస్తాం. పైకి కనబడే లక్షణాలతో సంతృప్తి పడతాం. అయితే, అద్భుతమైన సాహిత్యాన్నీ, వ్యక్తులనూ పరిచయం చేసినందుకూ, నన్ను తయారు చేసినందుకూ ఆ రెండు సంస్థలకూ నేను రుణపడి ఉన్నాను."

విర్రవీగుతున్నాయి. భిన్నాభిప్రాయాలపట్ల హంతక అసహనాన్ని ప్రదర్శిస్తున్నాయి. సహజంగానే హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయంలో దళిత విద్యార్థులు సంఘటితం కావడం, ప్రగతిశీల విద్యార్థి శక్తులు బలంగా ఉండడం ఎబివిపికి కంటగింపు అయింది. నిజానికి హైదరాబాద్ విశ్వవిద్యాలయ విద్యార్థులలో ఎబివిపికి ఎప్పుడూ కనీస ప్రాబల్యం కూడ లేదు. విద్యార్థి సంఘం ఎన్నికలలో ప్రధాన స్థానాలను 2014 వరకూ స్టూడెంట్స్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియా (ఎస్ఎఫ్ఐ) గెలుచుకునేది. 2014 ఎన్నికలలో నాలుగు ప్రధాన స్థానాలలో మూడు అంబేడ్కర్ స్టూడెంట్స్ అసోసియేషన్ (ఎఎస్ఎ), దళిత్ స్టూడెంట్స్ యూనియన్ (డిఎస్‌యు), తెలంగాణ స్టూడెంట్స్ ఫ్రంట్ (టిఎస్ఎఫ్), నేషనల్ స్టూడెంట్స్ యూనియన్ ఆఫ్ ఇండియా (ఎన్ఎస్‌యుఐ) ల కూటమి యునైటెడ్ డెమొక్రటి ఫ్రంట్‌కు, ఒకటి ఎస్ఎఫ్ఐకి దక్కాయి. కేంద్రంలో అధికారం దక్కి, మద్రాస్, ఢిల్లీ, పుణె, అలహాబాద్ వంటి చోట్ల విద్యాసంస్థలలో తమ చర్యల ద్వారా విద్యార్థులను భయభ్రాంతులను చేయగలిగిన ఎబివిపి హైదరాబాద్ విశ్వవిద్యాలయ క్యాంపస్‌లో కూడ ఆ అరాచకాన్నే ప్రవేశపెట్టడానికి ప్రయత్నాలు ప్రారంభించింది.

విద్యార్థులను ప్రగతిశీల భావాలనుంచి బైటికి లాగడం, కుల, మత విద్వేషాలతో చీలదీయడం ప్రధాన కార్యక్రమంగా పెట్టుకుంది. ఈ క్రమంలో అనివార్యంగా క్యాంపస్ లోని ప్రగతిశీల శక్తులకూ, ఎబివిపి కార్యకర్తలకూ మధ్య ఘర్షణలు మొదలయ్యాయి. రోహిత్ ఆత్మహత్యను ఈ నేపథ్యంలో చూసినప్పుడు హంతకుల జాబితాలో ఎబివిపి, సంఘ్ పరివార్ శక్తులు కూడ చేరతాయి.

విద్యార్థిగా, ఆలోచనాపరుడిగా అత్యంత ప్రతిభను కనబరుస్తూ, జీవితానుభవంతో సున్నితత్వాన్ని సంతరించుకున్న రోహిత్ మొదట ఎస్ఎఫ్ఐలో, ఆ తర్వాత ఎఎస్ఎలో క్రియాశీల కార్యకర్తగా ఉన్నాడు. నాలుగు సంవత్సరాలుగా ఫేస్ బుక్ మీద ప్రపంచంలోని అన్ని విషయాల పట్ల శ్రద్ధాసక్తులు చూపుతున్నాడు. తనవైన అభిప్రాయాలు ప్రకటిస్తున్నాడు. అంబేద్కర్ ఆలోచనా విధానాన్ని అధ్యయనం చేస్తూ, ప్రచారం చేస్తున్న వ్యక్తిగా ఉరిశిక్షకు వ్యతిరేక భావాలు అలవరచుకున్నాడు. జూలై 30న యాకూబ్ మెమన్‌ను ఉరి తీసినప్పుడు మరెందరో ప్రగతిశీల వ్యక్తుల లాగనే ఆ ఉరిశిక్ష పట్ల తన నిరసనను ప్రకటించాడు. "రక్తపిపాస నిండిన జాతీయవాదం మరొక తలను ఉత్తరించింది. గౌరవనీయ రాష్ట్రపతి ఖాతాలో మరొక తల చేరింది. నేరస్తులని తేలిన ఖైదీలకు మరణ శిక్ష ఒక్కటే మనం విధించగల శిక్ష అయితే, మన జాతిని మనం ప్రజాస్వామికమని పిలుచుకోవడం మానెయ్యాలి. భారత దేశమా, నీ చేతులకు నెత్తురంటింది" అని రాశాడు.

ఆ తర్వాత రెండు రోజులకు ఢిల్లీలో కిరోరిమల్ కాలెజి ఫిల్మ్ సొసైటీ 'ముజఫర్ నగర్ బాకీ హై' డాక్యుమెంటరీని ప్రదర్శిస్తుండగా, ఎబివిపి కార్యకర్తలు అడ్డుకుని రభస సృష్టించి, చిత్ర ప్రదర్శన జరగకుండా చేశారు. 60 మంది మృతికి, వేలాది మంది నిర్వాసితులు కావడానికి కారణమైన ముజఫర్ నగర్ కల్లోలాల గురించి వాస్తవ కథనంగా తయారైన ఆ డాక్యుమెంటరీ హిందూ మతోన్మాదపు దుర్మార్గాన్ని చూపుతున్నదని, అది ప్రజలు చూడకుండా చేయాలని సంఘ్ పరివార్ పన్నిన కుట్రలో ఈ దౌర్జన్య చర్య ఒక భాగం. సంఘ్ పరివార్ దౌర్జన్యాన్ని ఖండిస్తూ దేశవ్యాప్తంగా నిరసన ప్రదర్శనలు జరిగాయి. వాటిలో భాగంగా హైదరాబాద్ కేంద్ర విశ్వవిద్యాలయంలో కూడ ఎఎస్ఎ నాయకత్వంలో నిరసన ప్రదర్శన జరిగింది. దానిమీద విశ్వవిద్యాలయ ఎబివిపి అధ్యక్షుడు ఎన్ సుశీల్ కుమార్ "దౌర్జన్యం గురించి ఎఎస్ఎ గూండాలు ఉద్వేగంగా మాట్లాడ్డం హాస్యాస్పదం" అని ఫేస్‌బుక్‌లో వ్యాఖ్య రాశాడు. ఆ అవమానకర, అభ్యంతరకర వ్యాఖ్య గురించి ఆయనను ప్రశ్నించడానికి ఆగస్ట్ 4న ఎఎస్ఎ బృందం ప్రయత్నాలు చేసింది. ఆ ఫోన్‌కాల్స్‌కు ఆయన స్పందించలేదు. ఆ సాయంత్రం గదిలో ప్రయత్నిస్తే ఆయన లేడు. ఆ రాత్రి గదిలో ఉన్నాడని తెలిసి, ఆయనను ప్రశ్నించబోతున్నామని చీఫ్ వార్డెన్‌కు, చీఫ్ సెక్యూరిటీ ఆఫీసర్‌కు తెలిపి, ప్రశ్నించే సమయంలో వారు కూడ ఉండాలని ఎఎస్ఎ ప్రతినిధులు కోరారు. రాత్రి పూట క్యాంపస్ భద్రత బాధ్యతలు చూసే ఇన్‌చార్జ్ సెక్యూరిటీ చీఫ్ ముందే, ఎన్ఆర్ఎస్ అనెక్స్ హాస్టల్ ముందు ఆవరణలో ప్రశ్నించడం జరిగింది. ఎఎస్ఎ నిరసన ప్రదర్శనకు అది తన ప్రతిస్పందన అని సుశీల్ కుమార్ అన్నాడు. "గూండాలు" అని వర్ణించడం అభ్యంతరకరమని, అందుకు క్షమాపణ చెప్పాలని ఎఎస్ఎ ప్రతినిధులు అడిగారు. సుశీల్ కుమార్ ఆ మేరకు లిఖిత పూర్వక క్షమాపణ రాసి ఇచ్చాడు. దాని మీద సెక్యూరిటీ అధికారి కూడ సాక్షి సంతకం చేశాడు. ఆయన మీద భౌతిక దాడి జరగలేదనడానికి సెక్యూరిటీ అధికారే సాక్ష్యం. ఆ క్షమాపణను ఫేస్‌బుక్ మీద కూడ పోస్ట్ చేయాలని ఎఎస్ఎ ప్రతినిధులు అడగగా, సెక్యూరిటీ అధికారితో కలిసి, మెయిన్ గేట్ దగ్గర సెక్యూరిటీ కార్యాలయానికి వెళ్లి అక్కడి కంప్యూటర్ లోనే ఆ క్షమాపణ పోస్ట్ చేశాడు. కాని కొద్ది సేపటికే ఆ అకౌంట్ నే తొలగించాడు. ఆ రాత్రి ఒక ఆస్పత్రిలో చేరి, తన మీద భౌతిక దాడి జరిగిందనే తప్పుడు ఆరోపణతో పోలీసులకు ఫిర్యాదు చేయించాడు. విద్యార్థులలో విద్వేషాలు రెచ్చగొట్టడానికి ఇది అవకాశంగా తీసుకున్న భారతీయ జనతా యువ మోర్చా మర్నాడు యూనివర్సిటీ ప్రధాన ద్వారం దగ్గర ప్రదర్శన జరిపింది. ఎంఎల్‌సి రామచంద్రరావు నాయకత్వంలో యూనివర్సిటీ అధికారులతో మాట్లాడిన బిజెవైఎం ప్రతినిధులు అంబేద్కర్ మీద, దళిత ఉద్యమం మీద, ఎఎస్ఎ మీద తీవ్రమైన, అభ్యంతరకరమైన భాష ప్రయోగించారు. దళిత విద్యార్థుల మీద చర్య తీసుకోకపోతే ఏం చేస్తామో చూడండని బెదిరించారు. తాము కేంద్ర ప్రభుత్వ అధికారంలో ఉన్నామని, దళిత విద్యార్థుల అంతు చూస్తామని హెచ్చరించారు. ఈ సంఘ్ పరివార్ దాడికి వ్యతిరేకంగా ఎస్ఎఫ్ఐ, డిఎస్‌యు, టిఎస్ఎఫ్, బిఎస్ఎఫ్, ఎన్ఎస్‌యుఐ, టివివి, ఒబిసిఎ వంటి విద్యార్థి సంఘాలన్నీ ఎఎస్ఎకు మద్దతుగా నిలబడ్డాయి.

ఒకవైపు యూనివర్సిటీలో ఈ చిచ్చు రగిలిస్తూనే, ఎబివిపి పోలీసుల స్థాయిలోనూ, పై స్థాయిలోనూ పావులు కదపడం మొదలుపెట్టింది. ఎబివిపి అధ్యక్షుడి మీద భౌతిక దాడి జరిగిందనే అబద్ధపు కేసులో వాంగ్మూలాలు సేకరించడానికనే పేరుతో పోలీసులు విద్యార్థి సంఘం అధ్యక్షుడు విన్సెంట్‌ను, ఎఎస్ఎ అధ్యక్షుడు డి. ప్రశాంత్‌ను, డి. అశోక్ కుమార్‌ను అరెస్టు చేశారు. హైదరాబాద్ భారతీయ జనతా పార్టీ ఉపాధ్యక్షుడు నందనం దివాకర్ పేరు మీద కేంద్ర మంత్రి బండారు దత్తాత్రేయకు మూడు పేజీల అబద్ధపు ఆరోపణల లేఖ రాయించారు. ఆ లేఖలో ఎఎస్ఎను దేశద్రోహకర కార్యకలాపాలు చేస్తున్న సంస్థ అని ప్రస్తావిస్తూ యాకూబ్ మెమన్ ఉరిశిక్ష పట్ల నిరసనను కూడ కలిపారు. ఆ లేఖలో పేర్కొన్న తప్పుడు ఆరోపణలను యథాతథంగా ఉటంకిస్తూ బండారు దత్తాత్రేయ కేంద్ర మానవ వనరుల శాఖ మంత్రి స్మృతి ఇరానీకి ఒక లేఖ రాశాడు. హైదరాబాద్ కేంద్ర విశ్వవిద్యాలయం లో దేశద్రోహకర కార్యకలాపాలు జరుగుతున్నాయని, వాటిని అరికట్టేందుకు చర్యలు తీసుకోవాలని కోరాడు. దత్తాత్రేయ లేఖలో ప్రస్తావించిన ఘటనల మీద ఏ చర్య తీసుకున్నారో చెప్పాలని కోరుతూ మానవ వనరుల మంత్రిత్వ శాఖ సెప్టెంబర్ 3న, సెప్టెంబర్ 24న, అక్టోబర్ 6న, అక్టోబర్ 20న, నవంబర్ 19న యూనివర్సిటీ అధికారులకు లేఖలు రాసింది.

ఈ అనవసరపు, అత్యుత్సాహపు స్పందనల ద్వారా సంఘ్ పరివార్ లోని ఇతర విభాగాలైన భారతీయ జనతా యువ మోర్చా, భారతీయ జనతా పార్టీ, కేంద్ర మంత్రులు బండారు దత్తాత్రేయ, స్మృతి ఇరానీ, కేంద్ర మానవ వనరుల మంత్రిత్వ శాఖ రోహిత్ హంతకుల జాబితాలోకి ఎక్కారు.

నిజానికి సుశీల్ కుమార్ మీద భౌతిక దాడి ఆరోపణ రాగానే యూనివర్సిటీ అధికారులు విచారణ కోసం ఒక ప్రాక్టోరియల్ కమిటీని

నియమించారు. ఆ కమిటీ ప్రత్యక్ష సాక్షులు, ఫిర్యాదుదారు కృష్ణ చైతన్య, బాధితుడు సుశీల్ కుమార్, చికిత్స చేసిన డా. అనుపమ, డ్యూటీ సెక్యూరిటీ ఆఫీసర్ దిలీప్ సింగ్ వంటి సంబంధిత వ్యక్తులందరినీ విచారించి, భౌతిక దాడి జరిగిందనడానికి ఆధారాలు లేవని, ఏ ఒక్కరూ భౌతిక దాడి జరిగిందని రుజువులు చూపలేకపోయారని అంటూనే, తన ముగింపులో మాత్రం భౌతిక దాడి జరిగిందని, అందుకు ప్రశాంత్, రోహిత్, శేషు, విజయ్, సుంకన్నలు బాధ్యులని రాసింది. ఆ తప్పుల తడక నివేదిక మీద ఆధారపడి ఆ ఐదుగురిని సస్పెండ్ చేశారు. వెంటనే ఎబివిపి మినహా మిగిలిన విద్యార్థి సంఘాలన్నీ, పరిశీలనలకు, సాక్ష్యాధారాలకు పూర్తి వ్యతిరేకమైన నిర్ధారణలు చేసిన ఆ నివేదికను, శిక్షలను రద్దు చేయాలని ఆందోళన చేశారు. అప్పటి వైస్ చాన్సలర్ ప్రొ. ఆర్ పి శర్మ అందుకు అంగీకరించి, శిక్షలను రద్దు చేసి, మరొక విచారణ జరుపుతామని హామీ ఇచ్చారు.

ఈ లోగా సెప్టెంబర్ 21న కేంద్ర ప్రభుత్వం సంఘ్ పరివార్ భావజాలానికి చెందిన, దళిత వ్యతిరేకత జీర్ణించుకున్న ప్రొ. పొదిలె అప్పారావును వైస్ చాన్సలర్ గా నియమించింది. కొత్త విసి వచ్చాక, మరొక విచారణ కమిటీ నియమిస్తామని పాత విసి చేసిన వాగ్దానం పక్కకు పోయింది. కేంద్ర ప్రభుత్వ మానవ వనరుల మంత్రిత్వ శాఖ నుంచి ఉత్తరాల మీద ఉత్తరాలు వస్తుండగా, యూనివర్సిటీ అత్యున్నత పాలక మండలి ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్ కూచుని, పాత తప్పుల తడక నివేదిక ఆధారంగా ఐదుగురు దళిత విద్యార్థులను డిసెంబర్ 17న మళ్లీ సస్పెండ్ చేసింది. కొత్త ఉత్తర్వులలో వారు విద్యార్థి సంఘ ఎన్నికలలో పాల్గొనగూడదని, హాస్టళ్లలో ప్రవేశించగూడదని, పాలనా భవనంలోకి రాగూడదని, క్యాంపస్ లోని బహిరంగ స్థలాలలో కనిపించగూడదని ఆంక్షలు విధించారు. ఒక్కమాటలో చెప్పాలంటే, ఇది సాంఘిక బహిష్కరణతో సమానం. ఇది కేవలం విద్యార్థుల మధ్య జరిగిన ఘర్షణకు విధించే శిక్ష కాదు.

ఇంత అపసవ్యమైన నిర్ణయాలు, చర్యలు తీసుకోవడం ద్వారా యూనివర్సిటీ అధికారులు, ముఖ్యంగా ప్రాక్టోరియల్ కమిటీ సభ్యులు, కొత్త వైస్ చాన్సలర్, ఎగ్జిక్యూటివ్ కమిటీ సభ్యులు కూడ రోహిత్ హంతకుల జాబితాలోకి తమంతట తామే చేరారు.

కొత్త సస్పెన్షన్ తర్వాత ప్రజాభిప్రాయాన్ని కూడగట్టడానికి, ఈ సాంఘిక బహిష్కార శిక్షను రద్దు చేయించడానికి బహిష్కృత విద్యార్థులు, ఎఎస్ఎ, ఇతర విద్యార్థి సంఘాలు విస్తృతమైన ఆందోళన చేపట్టాయి. ఆ ఆందోళనలో భాగంగా యూనివర్సిటీలోని షాపింగ్ కాంప్లెక్స్ ఆవరణలో 'వెలివాడ' పేరుతో ఒక శిబిరం వేసుకుని బహిష్కృత విద్యార్థులు అక్కడే ఉండడం మొదలుపెట్టారు. ఆ వెలివాడలో జనవరి 17 నుంచి నిరాహారదీక్షలు ప్రారంభించి తమ ఆందోళనను ఉధృతం చేయాలని అనుకున్నారు. ఆ రోజు ఉదయం నిరాహారదీక్షల ప్రారంభ సమయంలో శిబిరంలోనే ఉన్న రోహిత్ మధ్యాహ్నం తర్వాత తనకు పి ఎచ్ డి డాక్టొరల్ కమిటీ రిపోర్ట్ నోట్స్ రాసుకోవలసిన పని ఉందని చెప్పి, ఒక మిత్రుడి గదికి వెళ్లి అక్కడ ఆత్మహత్య చేసుకున్నాడు.

రోహిత్ కు ఏడు నెలలుగా, అంటే ఈ ఘర్షణ ప్రారంభం కావడానికి ముందు నుంచే ఫెలోషిప్ రావడం లేదని ఆత్మహత్య లేఖ ప్రకారం తెలుస్తున్నది. అంటే తాను ఇష్టంగా చేయదలచుకున్న పరిశోధనకు ఆటంకాలు కలగడం, సస్పెన్షన్ కు గురి కావడం, యూనివర్సిటీ 'వెలివాడ'లో కూచోవలసి వచ్చిన అవమానం, నెలలు గడుస్తున్నప్పటికీ తగినంత సంఘీభావం దొరకకపోవడం, సంఘ్ పరివార్ శక్తుల దౌర్జన్యపు ఇష్టారాజ్యం నడుస్తున్నదని అనిపించడం వంటి తక్షణ పరిణామాలతో పాటు ఆర్థిక సమస్యలు కూడ కారణం కావచ్చు.

రోహిత్ మరణానంతరం దేశ వ్యాప్తంగా వెల్లువెత్తిన, వెల్లువెత్తుతున్న నిరసన ఆహ్వానించదగినదే గాని, ఈ సందర్భంలో ప్రగతిశీల శక్తులు ఆత్మవిమర్శ చేసుకోవలసిన అవసరం ఎంతో ఉంది. రోహిత్ హత్యకు ముద్దాయిలుగా కాకపోయినా, ఆ విషాదాన్ని మౌనంగా ఆమోదించిన నేరాన్నైనా ప్రగతిశీల శక్తులు చేశాయనే అనాలి. మరణానంతరం వెల్లువెత్తుతున్న స్పందన అంతకు ముందు నుంచీ ఉండవలసింది. అసలు హిందూ – బ్రాహ్మణీయ కుల వ్యవస్థ దుర్మార్గం పట్ల, సంఘ్ పరివార్ దౌర్జన్యాలపట్ల తాము ఉండవల్సినంత తీవ్రంగా, క్రియాశీలంగా ఉండడం లేదని ప్రగతిశీల శక్తులన్నీ ఆత్మవిమర్శ చేసుకోవలసిన తరుణమిది.

రోహిత్ మరణానంతరం సంఘ్ పరివార్ శక్తులు చేస్తున్న ప్రయత్నాలు, దుష్ప్రచారాలు చూస్తుంటే ఆ భావజాలం ఎంత ప్రమాదకరమైనదో, విషపూరితమైనదో, అమానుషమైనదో రోజురోజుకూ బైటపడుతున్నది. జరగని ఘటనలను జరిగినట్టు చెపుతున్నారు. పచ్చి అబద్ధాలు ప్రచారం చేస్తున్నారు. మృతుడి కులం గురించి రాద్ధాంతం చేస్తున్నారు. ఎప్పుడో వదిలేసిపోయిన తాగుబోతు తండ్రిని మళ్లీ తవ్వి తీసుకువచ్చి అబద్ధాలు చెప్పిస్తున్నారు. కులాంతర వివాహాలలో పిల్లలకు తండ్రి కులాన్నైనా, తల్లి కులాన్నైనా స్వీకరించగల అవకాశాన్ని తొక్కిపట్టి తండ్రి కులమే రావాలని పితృస్వామిక భావాలను ప్రకటిస్తున్నారు. మృతుడి కుటుంబ సభ్యుల ఆంతరంగిక విషయాలను బైటికి లాగుతున్నారు. కనీసమైన దయా దాక్షిణ్యాలు లేకుండా చనిపోయిన వ్యక్తి గురించి దుర్భరమైన నిందలూ దుర్భాషలూ వ్యాపింపజేస్తున్నారు. ఈ అబద్ధ ప్రచారాలకు మీడియాలో, సోషల్ మీడియాలో ప్రత్యేక ఏర్పాట్లు చేసుకున్నారు. ఈ దుష్ప్రచారమంతా సంఘపరివార్ శిక్షణ పొందిన, మానవతా స్పర్శ ఎంతమాత్రమూ లేనివారికి మాత్రమే సాధ్యం.

అపురూప ప్రజ్ఞావంతుడైన రోహిత్ వేముల మరణం విషాదకరమే గాని, అది వృథా కాలేదు. అది మన సమాజపు అవ్యవస్థను ఎత్తిచూపింది. సంఘ్ పరివార్ దుర్మార్గాన్ని, అమానుషత్వాన్ని ఎత్తిచూపింది. మర్యాదస్తులుగా, ప్రగతిశీలురుగా కనబడేవారిలో కూడ నిద్రాణంగా ఉన్న కుల ద్వేషాన్ని ఎత్తిచూపింది. సాధారణంగా ప్రగతిశీలంగా వ్యవహరించే వారు కూడ దళితుల పట్ల ద్వేషాన్ని, వ్యతిరేకతను ప్రకటించడానికి ఈ విషాద ఘటన ఒక అవకాశం ఇచ్చింది. 'మాంసం దగ్గర గాని మనిషి తత్వం బైటపడదు' అని సామెత చెప్పినట్టు రోహిత్ మరణం చాల మందిలో ఉన్న నిజమైన అభిప్రాయ దురభిప్రాయాలేమిటో చూపింది. మనిషికి ఓటుగా, అంకెగా, వస్తువుగా గుర్తింపు ఉండగూడదని, నక్షత్ర ధూళితో నిర్మాణమైన ఉజ్వల జీవిగా గుర్తింపు ఉండాలని కలలుగని, నక్షత్ర ధూళిలో కలిసిపోయిన రోహిత్ జీవితమూ మరణమూ కూడ మన సమాజానికి విలువైన పాఠం నేర్పుతున్నాయి.

*(రచయిత వీక్షణం సంపాదకులు)* వీ

# రోహిత్ మృతి - తెలంగాణ వాదులకో ప్రశ్న

*విషాదకరమైన రోహిత్ మృతి సందర్భంగా కూడా స్పందించని తెలంగాణవాదుల మౌనాన్ని ప్రశ్నిస్తున్నారు*

**గురిజాల రవీందర్‌రావు**

తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటం నుంచి తెలంగాణ రాష్ట్ర సాధనోద్యమం వరకు ప్రత్యక్షంగా, పరోక్షంగా చనిపోయి శవాలైనటువంటి వాళ్ల దగ్గరికి ఆగమేఘాల మీద పరుగెత్తుకొచ్చిన తెలంగాణ వాదులు రోహిత్ మృతదేహం దగ్గరికి వచ్చారా? ఆ తర్వాత జరుగుతున్న ఆందోళనలో భాగమవుతున్నారా? కొన్ని వందల కిలోమీటర్లు, మారుమూల గ్రామాలకు వెళ్లిన వారికి ఈ రోజు నగరం నడిబొడ్డున శవం దగ్గరికి వెళ్లడానికి కాళ్లు ఎందుకు పడిపోయాయి? నోళ్లు ఎందుకు తెరవడం లేదు? ఎందరో ప్రజాస్వామిక వాదులు, వృద్ధులు కూడా వెళుతున్నప్పుడు అంతకన్న తక్కువ వసస్సు కలిగినటువంటి వారు ఈ రోజు మంత్రులై, ఎంపిలు, ఎంఎల్ఎ, ఎంఎల్‌సిలు అయి ప్రజా ప్రతినిధులై ప్రభుత్వ బాధ్యతల్లో కొనసాగుతున్నటువంటి వాళ్లు, నక్సలైట్ సానుభూతి పరులు అని చెప్పుకున్నటువంటి వాళ్లకు పక్షవాతం వచ్చిందా?

సామాన్యమైన ప్రజల నుండి ఉద్యమంలో పాల్గొన్న ముసలి వాళ్ల వరకు మనదారి ఎటు, మనం ఎటువైపు వెల్తున్నాం అని ప్రశ్నిస్తున్నారు. 1970లో ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో పాల్గొని, అంతకు ముందు తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటంలో పాల్గొని ఆ తర్వాత శ్రీశ్రీ షష్టిపూర్తి రోజు విశాఖపట్నం ఆంధ్ర యూనివర్సిటీ విద్యార్థులు ప్రశ్నించినటువంటి రచయితలార, కళాకారులార మీరు ఎటువైపు అని వేసిన ప్రశ్న ఈ రోజు 45 సంవత్సరాల తర్వాత తిరిగి అవే ప్రశ్నలు. 1970లో ఏర్పడిన నక్సల్‌బరి పోరాటం, శ్రీకాకుళం, జగిత్యాల నుంచి ఈ రోజు దండకారణ్యం వరకు వెళ్లిన వాళ్లందరిని ఈ రోజు రోహిత్ వేస్తున్నటువంటి ప్రశ్నలు. ఈ రోజు ముఖ్యంగా పార్లమెంట్‌కు ఎన్నికైన వందలాది మంది దళిత బహుజన మైనారిటీలు కానీయండి, తెలంగాణ రాష్ట్రానికి జరిగిన ఎన్నికలలో ఎంఎల్ఎ, ఎంపి, ఎంఎల్‌సిలు ప్రజా ప్రతినిధులుగా ఎన్నికైన అందర్ని రోహిత్ ఈ రోజు ఈ ప్రశ్నలు అడగుతున్నాడు. ఆ రోజు ఆంధ్రా యూనివర్సిటీ విద్యార్థులు అడిగిన ప్రశ్ననే ఈ రోజు ప్రత్యక్షంగా, పరోక్షంగా అవే ప్రశ్నలను దశాబ్దాల పాటు అంటిపెట్టుకుని జీవితాలన్ని ఎన్నో త్యాగాలతో ముడివేసుకున్న మీరు ఈ రోజు ఎటువైపు అని ప్రశ్నిస్తున్నాడు. ఈ అన్ని ప్రశ్నలకు సమాధానం చెప్పవలసి ఉంది.

ఇన్ని సార్లు జరిగిన పార్లమెంట్ ఎన్నికలలో ఇప్పటి వరకు 99 శాతం ఉన్నటువంటి రాజకీయ పార్టీలన్నీ అగ్రవర్ణ ఆధిపత్య భావజాలంతో ఉన్నటువంటి రాజకీయ పార్టీలేనని, ఈ పార్టీల తరఫున ప్రధానులైనా, ఉప ప్రధానులైనా, రాష్ట్రపతులైనా, ఉప రాష్ట్రపతులైనా, మంత్రులైనా, ఎంపి, ఎంఎల్ఎ, ఎంఎల్‌సిలు అయినా దళిత, బహుజనుల, మహిళలకు, మైనార్టీలకు అంబేద్కర్ చెప్పినట్లు కనీస ప్రజాస్వామిక హక్కులు అమలుకావనే విషయం ఈ రోజు రోహిత్ మరణం ద్వారా మనకు స్పష్టంగా తెలుస్తుంది. బహుజనులంటే మాలలు, మాదిగలే కావల్సినటువంటి అవసరం లేదు. విస్తృత అర్థంలో చెప్పాలంటే అకరుకు బ్రాహ్మణ కులంలో ఉన్నటువంటి వాళ్లైనా వెలమ, రెడ్డి కులంలో ఉన్నటువంటి వారికైనా దళితులు అనే పదం వర్తిస్తుంది. చిన్నచూపు చూడబడే ప్రతివాడు దళితుడే.

ఈ రోజు రోహిత్ మరణం వెనుక అజ్ఞానంతో కూడిన వాదన, అతడు దళితుడు కాదు వడ్డెర కులం అని మాట్లాడుతున్నారు. అందుకే దళితుడు అంటే చిన్నచూపుతో చూడబడే ప్రతివాడు దళితుడే. గ్రామాలలో ఉన్నటువంటి వెలివాడలు ఈ రోజు ప్రపంచంలో గొప్ప పేరున్నటువంటి హెచ్‌సియు లోపల వెలిసిందంటే ఈ స్వాతంత్ర్యం, ఈ ప్రజాస్వామ్యం ఏమిచ్చిందని ప్రశ్నించాలి.

ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఎర్రజెండాలుగా పేర్లు తెచ్చుకున్నటువంటి చాలా మంది ఈ 68 సంవత్సరాల పార్లమెంట్ లోపల ఎంఎల్ఎలు, ఎంఎల్‌సిలుగా ప్రభుత్వరంగ సంస్థల ముఖ్య స్థానాల్లో ఉన్నటువంటి వాళ్లని మీరు ఎటువైపు అని ఈ రోజు ప్రశ్నించక తప్పదు. మీరంతా దశాబ్దాల పాటు త్యాగాలు చేశారు. ఈ రోజు ప్రభుత్వంలో ప్రత్యక్షంగా, పరోక్షంగా చేరి మీ కలాలను, మీ గళాలను పక్షపాతం వచ్చినట్లు పడిపోయి మీ మౌనం ఎటువైపు, ఎవరికి ఉపయోగపడుతున్నది? రాజకీయ పదవుల్లో ఉన్న దళితులు ఎవరు దళితులు కాదు. అగ్రవర్ణాల పార్టీ నాయకుల చెంచాలు అని ఒకరు కామెంట్ చేశారు. ఆఖరికి 15, 16 సంవత్సరాల మీ మౌనం ఎటువైపు, మీ మౌనం ఎవ్వరికి ఉపయోగపడుతుందని చెప్పి సామాన్యమైనటువంటి యువకులు ప్రశ్నిస్తున్నారు.

ఈ రోజు అంబేద్కర్ చెప్పినటువంటి కనీస ప్రజాస్వామ్యం ఈ తెలంగాణ రాష్ట్రంలో అమలు అవుతున్నదా? ఏ విషయంలో ఇది ప్రజాస్వామికంగా పనిచేస్తున్నది? ఎన్‌కౌంటర్లు జరిగినా మౌనంగా ఉంటున్నారు. పోలీసుల జులుం పెరిగినా ప్రభుత్వంతో పాటు మౌనంగా ఉంటున్నారు. అఖరుకు రోహిత్ శవాన్ని కూడా ఊరేగింపుగా వెళ్లనివ్వలేదు. 18 నెలల కాలంలో ప్రజాస్వామిక విలువలు పెరుగుతున్నవా, ఏమైనా మార్పు వచ్చిందా? అవినీతిలో, జులుంలో మార్పు వచ్చిందా? ప్రజాస్వామ్య హక్కులను కాపాడడంలో మార్పు వచ్చిందా? ఈ బంగారు తెలంగాణ వెనుక ఎవరి ప్రయోజనాలు ఉన్నాయి? లెనిన్ చెప్పినట్లు ఏ నినాదం వెనుక ఏ ప్రయోజనం ఉందో గుర్తించే వరకు ప్రజలు మోసపోతూనే ఉంటారు. సామాన్య ప్రజలు

# ఆఖిరి అక్షరాలు ఆలంబనగా...

*అగ్రకుల ఆధిపత్య హిందూ మతోన్మాద శక్తులు దళితులపై జరుపుతున్న ప్రత్యక్ష, పరోక్ష దాడులకు దర్పణం రోహిత్ మరణం అంటున్నారు* **వై.ఎచ్.కె. మోహన్‌రావు**

రోహిత్ ఆత్మహత్యకు ముందుగా రాసిన ఆఖరి అక్షరాలలో వెలిబుచ్చిన ఒకే ఒక్క అంశం ఈ వ్యవస్థను సమూలంగా వర్తమాన భవిష్య సర్వకాలాలలో నిలదీస్తూనే ఉంటుంది. బతికి ఉండడం కంటే చనిపోతున్నందుకు తాను సంతోషంగా ఉన్నానని' తెలియజేయడం వెనుక ఎంత వేదన ఉందో మొత్తం భారత సమాజం క్షుణ్ణంగా, లోతుగా అన్వేషణ చేయాల్సిన అవసరాన్ని నొక్కి చెపుతుంది. వాస్తవానికి తను అవమానానికి గురయ్యానని, తనపై భౌతికదాడి జరిగిందని చెపుతున్న ఎబివిపి నాయకుడు సుశీల్ కుమార్ కదా! అయితే గియితే అఘాయిత్యానికి పాల్పడవలసింది సుసీల్ కుమార్ పట్ల కూడా అలాంటి అల్పాన్ని ఆశించను. మూల్యాంకనం చేస్తే వచ్చే ఒక అంచనా కోసం మాత్రమే పై వ్యాఖ్యను వెల్లడించాను. అయినా ఆ వ్యాఖ్య ఏమాత్రం మానవీయం కాదని నిర్ద్వంధంగా చెపుతాను. కాగా ఎబివిపి, బిజెపి, ఆర్ఎస్ఎస్ శ్రేణులు పెడుతున్న గగ్గోలుకు భిన్నంగా రోహిత్ ఎందుకు ప్రాణం తీసుకున్నాడు. ఇదే శోధించవలసిన జఠిలమైన అంశం.

హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయం పిఎచ్‌డి విద్యార్థి వేముల రోహిత్ బలవన్మరణం భారతీయ కుల సమాజానికి ఒక బలమైన ప్రశ్నను సంధించింది. తరాలుగా మెలిపెడుతున్న సామాజిక వ్యత్యాసాల గాయాన్ని మరోమారు కెలికింది. హిందూ భావజాలంతో గడ్డకట్టిన వివక్షా తీవ్రతను గల్లా పట్టి నిలదీసింది. ఈనాటి 21వ శతాబ్దపు సమాజం నాగరికమా? అనాగరిమా? తేల్చుకోండంటూ కరుడుగట్టిన మత ఛాందసుల చెంపలు వాయించింది. దేశ వ్యాప్తంగా అన్ని వర్గాలలో సంచలనమైన ఆలోచనలకు పురికొల్పింది. మొత్తం అసేతు హిమాచలం వరకూ ఒక్క సారిగా కుదిపేసింది. భూకంపమే సృష్టించింది.

రోహిత్ వ్యాఖ్యానాన్ని విశ్లేషించుకున్నప్పుడు, దళిత వర్గాలపై ఆధునిక అణచివేతను అర్థం చేసుకుంటాం. మానవ సమాజంలో విజృంభించిన ఆటవిక పోకడలు కనిపిస్తాయి. మానవుల మధ్య అంతరాలు, నిచ్చెన మెట్ల ఎగుడు దిగుడు జీవితాలే దర్శనమిస్తాయి. పాదాలు పట్టించుకునే నీచ సంస్కృతి, పాదాలు పట్టే అమాయక ఆచరణ అర్థమవుతుంది. గౌరవంగా జీవించడానికి వీలుకాని ఒక సగటు నిమ్నజాతి మానవుని అవమానమే పైకి తేలుతుంది.

రోహిత్ ఆత్మహత్య 'దళిత' పదానికి చర్చా వేదిక అయింది. రోహిత్ దళితుడనీ, దళితుడు కాడనీ వర్గాలు వర్గాలుగా చీలిన ప్రజా సమూహం వాదనలకు దిగింది. దళితుడు కాడని బిజెపి దాని అనుబంధ శాఖలూ, రోహిత్ దళితుడేనని అతని సానుబూతి వర్గాలు పదే పదే చర్చల్లోకి వెళ్లాయి. ఏమిటి 'దళిత' పద ఉనికి. దాని భూమిక ఏమిటి. దళిత అనే పదానికి భావం అన్వేషిస్తే 'అణచి వేయబడిన' అనే అర్థం గోచరిస్తుంది. బహుశా రోహిత్ వడ్డెర కులానికి చెందినవాడు గానే భావిద్దాం. వడ్డెర కులం అగ్రవర్ణ కులమేమీ కాదే! కనీసం దాని ఉపకులం కూడా కాదు. దాని అనుబంధకులమూ కాదు కదా! విశ్రాంతి వర్ణాల శాఖ అంతకన్నా కాదు. బ్రాహ్మణ వర్ణంలోని వైదిక, నియోగి, నంబియార్, శ్రీ వైష్ణవ మాదిరిగా ఒక విభాగం కాదు. అట్లాగే క్షత్రియ వర్ణంలోని సూర్యవంశం, చంద్రవంశంలా మరో వంశమూ కాదు. రెక్కల కష్టంపై బతుకులు వెళ్లదీసే కులమే వడ్డెర. అతి శూద్ర కులాల్లో ఒక కులం. అతి శూద్రుల పట్ల కూడా మనువాద సమాజం క్రూరంగా వ్యవహరిస్తున్న తీరు వాస్తవం కాదా? అదేమన్నా సమాజంలో గొప్ప గౌరవాన్ని పొందిన కులమా? పొందుతున్న కులమా? నా నిఘంటువు ప్రకారం పాదాలు పట్టుకునే వాళ్లందరూ దళితులే. రోహిత్ యూనివర్సిటీలో ఎస్‌సి విభాగం కింద సీటు పొందలేదని అతని సోదరుడే అంత గట్టిగా చెప్పుతున్నప్పుడు, రోహిత్ ఎస్‌సినా? కాదా? అన్న చర్చ అసలు సంఘటనను జావగార్చేదిగానే మిగిలిపోతుంది. రోహిత్ తల్లి రాధిక మాలకులానికి చెందినట్లు ఆమె స్పష్టం చేస్తున్నారు.

రోహిత్ మరణం యాకూబ్ మెమెన్ ఉరి సంఘటనను బలంగా మోసపోతే మనం అర్థం చేసుకోవచ్చు. ఎర్రజెండాల వెనుకాల ఉన్నటువంటి మీరంత ఎవ్వరిని మోసం చేస్తున్నారని అడగాల్సిన అవసరం వచ్చింది. మీ మౌనం ఈ రోజు ఎవ్వరి ప్రయోజనాల కోసం, ఎటువైపు నిల్చుంటారని ప్రశ్నించాలి. మీ చేతిరాత పడిపోవడం ఎవరి విషయంలో? ఈ రోజు రోహిత్ చనిపోతే టిఆర్ఎస్ ప్రభుత్వం కాని ఎంఎల్ఎ, ఎంఎల్‌సి, మంత్రులుగా ,ప్రజా ప్రతినిధులుగా, ప్రభుత్వ అధినేతలుగా కొనసాగుతున్న మావోయిస్టులం అని చెప్పుకున్న, కమ్యూనిస్టులం అని చెప్పుకున్న వారి మౌనం రోహిత్‌కు ఉపయోగపడుతున్నదా? బహుజనులకు ఉపయోగపడుతున్నదా? పాలక వర్గాలకు ఉపయోగపడుతుందా అని ప్రశ్నించాలి. ఈ ప్రశ్నల వెనుక ఉన్నటువంటి బాధలను అర్థం చేసుకోవాల్సి ఉంది.

కలరు బట్టల నుండి ఖాదీ బట్టలకు మారారు కదా! బట్టల కరుకుదనం లాగానే మీ గుండెలు కరుకుగా మారాయా? పచ్చని తివాచీలపై నడవడం అలవాటైన మీరు, ఆగండి! ఆగండి!! మీరు స్టేజీపైకి వెళ్లి ఉపన్యాసం ఇచ్చే ముందు ఒకమాట వినండి. మీరు కూడా ఆత్మవంచన చేసుకోండి కాని మీ ఉద్వేగ పూరిత ఉపన్యాసాలతో, మాటకారి తనంతో సమాజాన్ని వంచించకండి.

(రచయిత రాష్ట్ర అధ్యక్షులు తెలంగాణ విద్యావంతుల వేదిక) వీ

వినిపించింది. అంబేద్కర్ స్టూడెంట్స్ అసోసియేషన్ తీవ్రవాది యాకూబ్ ఉరిని నిరసించిందని, అదో నేరమంటూ గొడవ పెట్టారు. ఉరి శిక్షను వ్యతిరేకించడం దేశ ద్రోహమేననే వాదన చేశారు. అసలు యాకూబ్ ఉరి శిక్షను పైపైన దర్శించడం వల్లనే ఈ పేచీ అంతా వస్తుంది. మూలాల్లోకి వెళ్లకుండా ఎఎస్ఎ వైఖరిని తప్పు పట్టడం సరికాదు. మనదేశంలో చట్టాలు, శిక్షలు పక్షపాత ధోరణిగా అమలు జరపడమే ఈ విపరీత దుస్థితికి హేతువు అవుతుంది. భారతదేశంలో సంపన్నులు, రాజకీయ పలుకుబడులు కలవారి పట్ల సానుభూతిగా, బలహీనులు, దళితుల పట్ల కఠినంగా, అమానుషంగా వ్యవహరిస్తున్నాయనే గందరగోళమే ఈ గొడవకు దోహదం చేస్తుంది. మతాల భూమికతో కూడా ఈ వివక్ష కొనసాగుతుందని ఇటీవలి కాలంలో కొన్ని సంఘటనలు రుజువుగా నిలుస్తున్నాయి. మహారాష్ట్ర ప్రభుత్వ వైఖరినే తీసుకుంటే ఒక అధునాతన మారణాయుధం ఎకె 52ను ప్రభుత్వ అనుమతులు లేకుండా బాలీవుడ్ చలన చిత్ర ప్రఖ్యాత కథానాయకుడు సంజయ్‌దత్ తలగడగా పెట్టుకున్న నేరానికి న్యాయ స్థానం విధించిన శిక్షను ఆ రాష్ట్ర ప్రభుత్వం సానుభూతితో రద్దు పరిచింది. అంత సమస్థాయి కలిగిన మరో బాలీవుడ్ కథానాయకుడు సల్మాన్‌ఖాన్ డ్రంక్ అండ్ డ్రైవ్ కేసు న్యాయస్థానం ఎదుట నిలువలేక వీగిపోతే అతని కేసును అదే రాష్ట్ర ప్రభుత్వం తిరగదోడి సుప్రీం కోర్టులో స్పెషల్ లీవ్ పిటిషన్ ద్వారా అప్పీలుకు వెల్తుంది. ఈ రెండు సంఘటనలనూ విజ్ఞులైన వారు ఎట్లా అర్థం చేసుకుంటారు? ఒక కేసులో నిందితుడికి న్యాయ స్థానం శిక్ష విధించింది. మరో కేసులో నిందితుడు నిర్దోషని వదిలివేసింది. ఈ రెండు తీర్పులను స్వీకరించేందుకు మహారాష్ట్ర ప్రభుత్వం పరస్పర విరుద్ధంగా ఆలోచిస్తుంది. ఈ పరిణామాలను ప్రజలు ఏ విధంగా చూడాలి. అక్కడి రాష్ట్ర ప్రభుత్వం బిజెపి, శివసేన పార్టీల సంయుక్త ఏలుబడిలో సాగుతుంది. అదే విధంగా ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని మూకుమ్మడిగా జరిగిన మహమ్మదీయ పౌరుడు అఖ్లాఖ్ హత్యనూ ఎట్లా విశ్లేషించాలి. పశువు మాంసం భుజించాడనే అభియోగంతో ఒక అర్థరాత్రివేళ దేవాలయం లౌడ్ స్పీకర్లలో పిలిచి గ్రామాన్నంతా ఒకచోట గుంపుచేసి ఊరి బయట ఉన్న అఖ్లాఖ్ కుటుంబంపై దాడిచేసి అతనిని హతమార్చిన ఉన్మాదపు సంఘటనను విన్న తరువాత కూడా వివక్షకు తావు లేదని, అసహనానికి తావు లేదని ఎట్లా చెప్పగలం. ఈ హత్యా సంఘటనపై బిజెపి మంత్రి వి.కె. సింగ్, ఎంపిలు సాధ్వీ, సాక్షి ఇతరుల ప్రేలాపనలను ఎట్లా అర్థం చేసుకోవాలి.

బిజెపి దాని అనుబంధ సంస్థలన్నీ కూడా తొలి నుండి అగ్నికి ఆజ్యం నానుడికి అనుగుణంగానే పనిచేస్తున్నాయి. 2014 సాధారణ ఎన్నికల్లో అతి సునాయాస విజయంతో అధికారంలోకి వచ్చినప్పటి నుండి ఈ పోకడ మరింత వేగం పుంజుకుంది. వారి వాక్కులలో, ఆచరణలో తెంపరి తనం వెల్లడవుతుంది. తెగబడి పోట్లాడుతున్నారు. పోరాడినంత కాలం దూకుడుగా వ్యవహరించి చప్పున చల్లబడి పోవడం వాటి నైజాంలా కనిపిస్తుంది. రోహిత్ బలవన్మరణ విషయంలో కూడా ఆ పార్టీ శ్రేణులన్నీ అదే పోకడ పోతున్నాయి. రోహిత్ మరణం అనంతరం ఆందోళనల విషయంలో కూడా ఇలానే జరుగుతుంది. జరగాల్సిన నష్టమంతా జరిగిపోయిన తరువాత గాని తేరుకున్నట్లు గమనిస్తాం. మొత్తం కాలి బూడిదైన తరువాత నీళ్లు చల్లే యత్నం చేస్తారు. చేతులే కాదు, అనేక అంగాలు కాలిన తరువాత ఆకులు పట్టుకోవడం జరుగుతుంది. ఢిల్లీ, బీహార్ వంటి రాష్ట్రాల్లో ప్రత్యర్థుల చేతిలో డక్ అవుట్ అయినా, వారి పాలనలో ఉన్న రాష్ట్రాల ఉప ఎన్నికలలో క్షతగాత్రమై నెత్తురోడుతున్నా, భయానక పరిస్థితులు సమీప భవిష్యత్‌లో గోచరిస్తున్నా బిజెపి, దాని అనుబంధ శ్రేణులలో ఏమాత్రం మార్పు తెచ్చుకునే ప్రయత్నం చేయడం లేదు. రాహుల్‌గాంధీ, కేజ్రీవాల్, సురవరం సుధాకరరెడ్డి, ఎ. రాజా, సీతారాం యేచూరి, త్రిపుర ముఖ్యమంత్రి వంటి రాజకీయ దిగ్గజాలాన్నీ దేశ వ్యాప్తంగా హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయం బాటపట్టి బిజెపి దాని బంధు వర్గాలను తూర్పార పట్టిన తరువాత మాత్రమే బిజెపి జాతీయ నాయకులూ, కేంద్ర పాలకులూ జాగృతమైనట్లుంది. కావలసినంత పాపాన్ని మూటగట్టుకుని భుజాన వేసుకున్న కేంద్ర పాలకులు అనంతరం ఆ మూట బరువు మోయలేక ఆ పాపాన్ని కాంగ్రెస్‌కు కూడా పంచాలని విఫల ప్రయత్నం చేశారు. కాంగ్రెస్ పార్టీకి చెందిన రాజ్యసభ సభ్యుడు వి. హనుమంతరావు భుజానికి కూడా ఈ పాప భారాన్ని కొంత మార్చాలని చేసిన యత్నం విచ్ఛిన్నమైన పూర్వపు రంగంలో ఖంగుతిన్న కేంద్ర పాలకులు దిగివచ్చారు.

లక్నో కేంద్ర విశ్వవిద్యాలయంలో అక్కడి విద్యార్థుల అలజడితోనే ప్రధాని మోడీ తేరుకున్నారు. తీవ్ర స్వరంతో మోడీ రోహిత్ వైపు మళ్లారు. ఇప్పటి వరకూ ఈ దుర్ఘటనపై పెదవి విప్పని ప్రధాని మౌనం వీడి సానుభూతి వచనాలు వల్లె వేశారు. ఇక మానవ వనరుల శాఖా మంత్రి స్మృతి ఇరానీ జరిగిన దుర్ఘటనపై న్యాయ విచారణ జరుపుతామని, న్యాయ విచారణ సంఘం ఇచ్చే నివేదిక అంశాల ఆధారంగా రోహిత్ కుటుంబానికి న్యాయం, సహాయం అందిస్తామని స్వయంగా రోహిత్ తల్లి రాధికతో చెప్పారు. ఈ పరిణామాలన్నీ 'అందితే జుట్టూ లేకపోతే కాళ్లు అంటుంటారు'. విద్యార్థుల ఆందోళనను అణచివేసే అన్ని ప్రయత్నాలు చేసిన బిజెపి పాలకులు విఫలమై బెడిసికొడుతూ వ్యతిరేక మలుపులు తీసుకున్నట్లు స్పష్టం అయిన నేపథ్యంలో విద్యార్థుల సస్పెన్షన్‌ను ఎత్తివేసిన విశ్వవిద్యాలయ నిర్వాహకులు రు. 8 లక్షల ఎక్స్‌గ్రేషియా ప్రకటించడం వెనుక కూడా కేంద్ర పాలకుల కనుసైగలే ఉన్నాయి.

ఇప్పటి వరకూ నానా వెతలకు లోనయ్యారు. అనేక విధాలుగా అణచివేతకు గురయ్యారు. పూర్వజన్మ దుష్కృతాలే ఈ ప్రస్తుత జన్మకు కారణాలని భావించారు. ఈ జన్మ ఇంతేనని నమ్మారు. చదువుకు దూరమయ్యారు. సంపదకు సుదూరమయ్యారు. అమాయకత్వంలో మగ్గిపోయారు. ఆ వర్గాల వారంతా ఇప్పుడిప్పుడే అంబేద్కర్ మార్గాన తెలివిలోకి వస్తున్నారు. విద్యను హత్తుకుంటున్నారు. దుష్కృత్యాలు, కర్మ సిద్ధాంతాలు మాయా మోసమని గ్రహిస్తున్నారు. సమాజాన్ని, మనుషుల పోకడలను అర్థం చేసుకుంటున్నారు. జాగృతమవుతున్నారు. తమ పూర్వీకుల జీవితాలను, గతాన్ని, తమ మనుగడను మూల్యాంకణం చేసుకుంటున్నారు. పునర్మూల్యాంకణం చేసుకుంటున్నారు. ఈ క్రమంలో వారు తీవ్ర మనస్తాపానికి లోనవుతున్నారు. అగ్రవర్ణాలు, ఉన్నత వర్గాలు, కులాలు వారి క్షోభను, తప్త హృదయాలను అర్థం చేసుకోవలసిన అవసరం ఉంది. సానుభూతి చూపాల్సిన తరుణం కూడా ఇదే.

*(రచయిత అధ్యక్షుడు, పల్నాడు రచయితల సంఘం)* వీ

# ప్రైవేట్ రంగంలో రిజర్వేషన్లు

***దేశ సంపదపై దేశ ప్రజలందరికీ అధికారం ఇవ్వడమే అంతిమ పరిష్కారమనీ, అది సాధించేలోపు ప్రైవేట్ రంగంలో రిజర్వేషన్లు కల్పించవలసిందేననీ అంటున్నారు* బి. రామకృష్ణ**

**1980**వ దశకం నుండి వేగం పుంజుకుంటూ నేటి వరకు అన్ని రంగాల్లో ప్రైవేటీకరణ విస్తరించింది. నూతన సరళీకృత ఆర్థిక విధానాలు అమలు అవుతున్నప్పటి నుండి మరింత దూకుడుగా దేశీయ, విదేశీయ, బహుళజాతి పెట్టుబడిదారీ శక్తులు భారత సమాజంలోని అన్ని ప్రజారంగ వ్యవస్థల్లోకి చొచ్చుకు వస్తున్నాయి. సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణల నేపథ్యంలో ప్రభుత్వరంగం కుంచించుకుపోతున్నది. విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకు, ప్రత్యేక ఆర్థిక మండళ్లకు అనుమతిస్తున్నారు. అన్నిరంగాల్లో దేశ, విదేశీ పెట్టుబడి శక్తులకు వ్యాపారం చేసుకోవడానికి, లాభాలు దండుకోవడానికి, సంపదను కొందరి చేతుల్లో పోగు పడేలా చేస్తూ అత్యధిక ప్రజానీకాన్ని పేదరికంలోకి నెట్టేస్తున్నారు. విద్య, ఉద్యోగ, ఉపాధి అవకాశాలకు నోచుకోకుండా చేస్తున్నారు. తక్కువ వేతనాలతో ఉద్యోగ భద్రత లేకుండా, కాంట్రాక్టు, అవుట్ సోర్సింగ్ పద్ధతుల్లో ఈ శక్తులు నియామకాలు చేసుకుంటున్నాయి.

ఈ దుర్మార్గమైన పద్ధతి నేడు ప్రభుత్వ రంగంలోకి కూడా పాకింది. కొంతమేరకైనా ప్రభుత్వ విద్య, ఉద్యోగాల్లోకి రిజర్వేషన్ల వల్ల కింది కులాల వారు వచ్చే పరిస్థితి ఉండేది. ప్రభుత్వరంగం కునారిల్లిపోతూ ప్రైవేటు రంగం విస్తృతమవుతున్న సందర్భంలో రిజర్వేషన్లకు అర్థం లేకుండా పోతున్నది.

ఎస్‌సి, ఎస్‌టి, ఇతర వెనుకబడిన కులాలు, తరగతుల వారికి నాణ్యమైన విద్య అందించకుండా ప్రభుత్వ రంగంలోని విద్యను కుదించేస్తూ ప్రైవేటు రంగానికి తరలిస్తున్నారు. ప్రభుత్వ పాఠశాలలు, జూనియర్, డిగ్రీ కళాశాలల్లో సరైన వసతులు కల్పించకుండా బోధనా సిబ్బందిని నియమించక చదువులను భ్రష్టు పట్టిస్తున్నారు. ఈ సంస్థలల్లో అత్యధికంగా చదువుకునేది అట్టడుగువర్గాల పిల్లలే ఈ వర్గాల వారికి గుణాత్మకమైన చదువులు అందించక భవిష్యత్ ఉన్నత చదువుల్లో ప్రొఫెషనల్ కోర్సుల్లో గానీ విశ్వవిద్యాలయ చదువుల్లో గానీ ఉద్యోగ ఉపాధి రంగాల్లో అవకాశాలను అందిపుచ్చుకోవడానికి తగిన సామర్థ్యాలు లేకుండా చేసే కుట్రలు బహిరంగంగానే అమలు చేస్తున్నారు. దీనికి విరుగుడుగా కామన్ స్కూల్ విధానాన్ని ప్రభుత్వ పరంగానే అందరికీ సమాన విద్యను అందించాల్సి ఉంది. అసలు ప్రైవేట్ రంగంలో విద్యను అనుమతించకుండా ప్రభుత్వమే కేజీ నుండి పీజీ ఆ పై పరిశోధనలను గుణాత్మకంగా అందరికీ విద్యను సమకూర్చాల్సిన అవసరాన్ని రిజర్వేషన్లు వ్యతిరేకించే శక్తులు మాట్లడవు. ఈ శక్తులు ఎప్పుడైనా అందరికీ గుణాత్మకమైన, సమానమైన విద్యను అందించే వ్యవస్థ నిర్మాణానికి కృషి చేసింది లేదు.

అగ్రకుల, భూస్వామ్య, బ్రాహ్మణీయ భావజాలం హిందూ మతానికి పేటెంట్ హక్కుదారుగా చెప్పబడుతున్న సంఘ్‌పరివార్ శక్తులు రిజర్వేషన్లను ప్రత్యక్షంగా కొన్నిసార్లు, పరోక్షంగా ఎన్నోసార్లు వ్యతిరేకిస్తున్నాయి. ఈ శక్తులు చారిత్రాత్మకంగా, నేటికి కూడా కులం పేరుమీద జరుగుతున్న అణచివేత, దోపిడీ, పీడనలను దాటవేసి ధర్మం, న్యాయం, నీతి అంటూ మాట్లాడుతుంటాయి. సమాజంలో నిచ్చెన మెట్ల దొంతరలను స్థిరీకరించడం కోసం ప్రయత్నిస్తున్నాయి.

అందరూ చదువుకుంటే కింది స్థాయి పనులు ఎవరు చేయాలని ఒకప్పుడు తిలక్ అన్నట్లుగా ఈ వర్గాలు కూడా సమాజంలో ఎవరికి నిర్ణయించబడిన స్వధర్మాలను(వర్ణాశ్రమ ధర్మాలు) వారు తూ.చ. తప్పకుండ పాటిస్తూ పోవడాన్ని ముందుకు తెస్తున్నారు. అసలు హిందూ ధర్మం అంటేనే నిచ్చెన మెట్ల కులవ్యవస్థ. కులాలు లేకుండా పోతే దాని మనుగడే ప్రశ్నార్థకం. నీవేం చేయాలో, ఏం చేయకూడదో పుట్టకముందే నిర్ణయమవుతుందని చెప్పే నీతి, ధర్మం, మత గ్రంథాల భావజాలాన్ని వంటబట్టించుకున్న శక్తులు తప్పనిసరిగా సామాజిక న్యాయానికి, సమానత్వాలకు, ప్రతి మనిషికి సమాన విలువను వ్యతిరేకిస్తాయి.

శ్రమ ద్వారా ప్రకృతి సంపదలు మానవులకు పాదాక్రాంతం అవుతున్న విషయాన్ని విస్మరించి అతీత శక్తుల ప్రమేయాన్ని ప్రచారం చేస్తూ అసమానతలు సహజమనేదాన్ని ముందుకు తెస్తారు. సంపదను అత్యధిక శ్రామికుల శ్రమ సృష్టిస్తుంటే ఆ సంపదపై కొన్ని వర్గాలు మాత్రమే ఆధిపత్యాన్ని, హక్కును కలిగి ఉంటున్నాయి. ఈ వర్గాల చేతుల్లో రాజ్యం (పోలీసు, సైన్యం, కోర్టులు, ప్రభుత్వ యంత్రాంగం మొదలగునవి.), మతం, కులం ఆయుధాలుగా ఉన్నాయి.

విశ్వవిద్యాలయాల్లో, ఉన్నతస్థాయి విద్యాసంస్థల్లో కులవివక్షత ఎలా ఉంటుందో చెప్పే దృష్టాంతాలు దేశవ్యాప్తంగా ఎన్నో నమోదై ఉన్నాయి. నేటికీ నమోదవుతున్నాయి. దీనిని మొన్నటికిమొన్న 17 జనవరి 2016న యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాద్‌లో రోహిత్ అనే దళిత రీసెర్చ్ స్కాలర్ ఆత్మహత్య చేసుకున్న సంఘటన నిరూపిస్తున్నది. ఈ ఆత్మహత్య వెనుకున్న వివక్షాపూరిత అణచివేత, దానికి వత్తాసుపలికిన కేంద్రమంత్రులు, వారిని నడిపిస్తున్న హిందూమత భావజాలం సజీవ సాక్ష్యంగా నిలిచే ఉన్నాయి.

రీసెర్చ్ స్థాయికి వచ్చిన విద్యార్థులపైనే కులవివక్షా పూరిత అణచివేతలు అమలవుతుంటే గ్రామాలల్లో మరెంత ప్రత్యక్ష, పరోక్ష సాంఘిక వివక్షతలు అమలవుతుంటాయో అర్థం చేసుకోవచ్చు. నాణ్యమైన విద్య, కనీస ఉపాధి అందక ఈ వర్గాలు నేటికీ, అభివృద్ధికి దూరంగా ఉంటున్నాయనేది వాస్తవం. దేశవ్యాప్తంగా పలు ప్రాంతాల్లో

నిమ్న కులాలపై హత్యలు, అత్యాచారాల వంటి అనేక సంఘటనలు చోటుచేసుకుంటున్నాయి. ఉదాహరణకు మహారాష్ట్రలోని కైర్లాంజి, ఆంధ్రప్రదేశ్‌లోని లక్షింపేట ఘటనలు ఎన్నో జరుగుతున్నాయి.

ఆధిపత్యశక్తుల, మెజారిటీ మత, అధికార, సామ్రాజ్యవాద, పెట్టుబడిదారుల శక్తుల భావజాలాలకు ఏమాత్రం భిన్నమైన ఆలోచనలు, చైతన్యాలు, వ్యక్తీకరణలు, సిద్ధాంతాలు ప్రజల మెదళ్లలో మొలకెత్తితే అవి జాతి వ్యతిరేకమైనవిగా, దేశ సమగ్రతకు, అభివృద్ధికి వ్యతిరేకమైనవిగా తీవ్రవాద చర్యలుగా చిత్రీకరించబడి, తీవ్రమైన అణచివేతలకు గురవుతుంటాయి. వాటిపై దేశద్రోహ నేరంగా కేసులు నమోదవుతుంటాయి. వారు పోలీస్‌స్టేషన్లలో, జైళ్లలో నిర్బంధాల పాలవుతుంటారు. అలా రాజ్యం ప్రజలపై అణచివేత సాధనంగా ఉండడం జరుగుతున్నది. ఈ నేపథ్యంలో రిజర్వేషన్ల అవసరం ఎంత బలంగా ఉన్నదో అర్థం చేసుకోవచ్చు.

ఏ దేశంలోనైనా, ప్రపంచంలోని ఏ మూలలోనైనా అక్కడి ప్రజల జీవన ప్రమాణాలు గుణాత్మకంగా రూపొందేందుకు సమానత్వంను, ఆత్మగౌరవాన్ని నిలబెట్టేందుకు ప్రభుత్వాలు కృషి చేయవల్సి ఉంటుంది. అది ఆయా ప్రభుత్వాల తప్పనిసరైన కార్యాచరణగా ఉండాలి. ప్రతి మనిషికి సమాన విలువ, సాధించడమే ఉన్నత లక్ష్యంగా ప్రజాస్వామిక సంస్థలు పనిచేయవల్సి ఉంటుంది. అందుకొరకు ప్రజలందరికీ సమాన అవకాశాలు కల్పించే దిశలో, సంపదలు సామాజికీకరణ చేయబడి, వాటి ఫలితాలు, ఫలాలు ప్రతి ఒక్కరికి అందేలా చేయడమే రాజ్యాల పనిగా ఉండాలి.

అయితే ఆచరణలో రాజ్యం సమాజంలోని కొన్ని ఆధిపత్య శక్తుల, అగ్రకుల, సంపన్న వర్గాల చేతుల్లో శక్తివంతమైన ఆయుధంగా ఉంటూ వస్తున్నది. ఈ ఆధిపత్య వర్గాలు ఆదివాసులు, దళితులు, వెనుకబడిన వర్గాలు, మైనారిటీలపై అధికారం చలాయిస్తూ వారు సృష్టిస్తున్న సంపదలను అనుభవిస్తున్నాయి. దోపిడీ విధానాలతో ప్రజలను ఎప్పటికీ అజ్ఞానంలో, అచేతనులుగా ఉంచడం కోసం అనేక రకాల తప్పుడు, అశాస్త్రీయ భావజాలాలను విస్తరించే యంత్రాంగాలను సృష్టిస్తూ వాటిని పెంచి పోషిస్తున్నారు.

బ్రిటిష్ కాలంలోనే ఉన్నత ఉద్యోగాల్లో, వ్యాపార సంబంధాల్లో, అధికార నిచ్చెన మెట్లలో అగ్రకులాలు తిష్టవేశాయి. ఈ వర్గాలు బ్రిటిష్ పాలకుల కంటే ముందు కూడా వీటిని అనుభవిస్తూ వచ్చారు. బ్రిటిష్ వారు వచ్చాక వారితో మిలాఖతై తమ వర్గ ప్రయోజనాలకు భంగం కలగకుండా బ్రిటిష్ పాలనా వ్యవస్థలో సునాయాసంగా ఇమిడిపోయారు. అలా తమ ఆధిపత్యాన్ని కొనసాగిస్తూ వచ్చారు. నిమ్న కులాల వారు, ఆదివాసులు, అంటరానివారు అభివృద్ధికి ఆత్మ గౌరవానికి నోచుకోలేక అణచివేతలకు గురవుతూ వచ్చారు. సకల సంపదల సృష్టికర్తలైన ఉత్పత్తి కులాలకు చెందిన వీరు సంపదలో భాగం పంచుకోవడానికి దూరం చేయబడుతూ వచ్చారు.

స్వాతంత్ర పోరాట కాలంలో పరాయిపాలనకు వ్యతిరేకంగా మాత్రమే కాకుండా స్థానిక దోపిడి, పీడన శక్తులకు వ్యతిరేకంగా పోరాటాలు జరిగాయి. అగ్రకుల, బ్రాహ్మణీయ భావజాలానికి వ్యతిరేకంగా ఫూలే, అంబేద్కర్, పెరియార్ లతో పాటు మరెందరో పోరాడారు. కుల దోపిడీ వ్యవస్థను ప్రశ్నిస్తూ అట్టడుగు కులాల, అంటరాని కులాల అభివృద్ధికి ఎన్నో ప్రతిపాదనలు చేశారు. ప్రజల్లో అనేక రూపాల్లో విద్య, వైజ్ఞానిక, సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతికంగా విస్తరిస్తూ వస్తున్న చైతన్యం దోపిడీ పూరిత, వివక్ష పూరిత ఆధిపత్య వర్గాల భావజాలాలను, నిరంకుశ విధానాలను ప్రతిఘటిస్తూ, ప్రత్యామ్నాయ పద్ధతులను ప్రతిపాదిస్తూ వస్తున్నది.

ఇందుకు చరిత్రలో ప్రజలెందరో చేసిన పోరాటాలు, త్యాగాలు, సంవాదాలు సాక్షీభూతంగా ఉన్నాయి. అలా సామాజిక అంతరాలను ప్రశ్నిస్తూ సమానత్వం కోసం, ఆత్మగౌరవం కోసం, మెరుగైన జీవితం కోసం ప్రపంచవ్యాప్తంగా త్యాగాలతో కూడిన ఎన్నో పోరాటాలు జరిగాయి. వాటి ఫలితంగా కొన్ని సంస్కరణలు మెరుగైన విధానాలు సాధించుకోబడ్డాయి.

బ్రిటిష్ వారు అధికారంలో ఉన్నప్పటి నుండే సామాజిక ఆర్థిక వివక్షతకు గురైన కులాల అభివృద్ధి కోసం కొన్ని కంటితుడుపు ప్రయత్నాలు జరిగాయి. ఆ ప్రయత్నాలలో విభజించు, పాలించు అనే దుర్నీతి ఉంటే ఉండవచ్చు. దీంట్లో భాగంగానే రిజర్వేషన్లనే భావనలు పురుడు పోసుకున్నాయి. దేశంలో మొట్టమొదటి సారిగా సూత్రబద్ధంగా, ఆచరణాత్మకంగా మహారాష్ట్రలో సాహు మహరాజ్ ఆధీనంలో ఉన్న కొల్హాపూర్ సంస్థానంలో కింది కులాల వారికి నిర్దిష్టమైన కోటా ప్రకారం విద్యా, ఉద్యోగాల్లో అవకాశం కల్పించడం జరిగింది.

సాహు మహరాజ్ తాను ఆచరిస్తూ తన వాదనలను బ్రిటిష్ వారికి సమర్థవంతంగా వివరించగలిగాడు. తరువాత కాలంలో అవి దేశవ్యాప్తంగా నిర్దిష్టరూపాన్ని సంతరించుకోవడానికి డాక్టర్ అంబేద్కర్ చేసిన కృషి చిరస్మరణీయమైనది. రాజ్యాంగ రచనాకాలంలో గాని, స్వాతంత్ర పోరాట సమయంలో గాని అంబేద్కర్ చేసిన సిద్ధాంత పరమైన కృషి చాలా గొప్పది. అంటరానివారికి, ఎస్సీ, ఎస్టీలకు ప్రత్యేక నియోజకవర్గాల కేటాయింపులో గాంధీతో ఘర్షణ పడ్డ చారిత్రక సందర్భం (పూనా ఒడంబడిక) కూడా ఉన్నది.

అసమానుల మధ్య సమానపోటీ సరైందికాదు అనేది రిజర్వేషన్ల వెనుక ఉన్న తాత్విక పునాది. ఇప్పటికే దేశంలో రిజర్వేషన్లపై అనేక చర్చలు, వాదోపవాదాలు జరిగి ఉన్నాయి. దేశవ్యాప్తంగానూ పలు రాష్ట్రాల్లోనూ అనేక కమీషన్లు అధ్యయనం చేసి ఉన్నాయి. కోర్టు తీర్పులు ఎన్నో వచ్చి ఉన్నాయి. వెనుకబాటుతనానికి ప్రాతిపదికగా కులంను పరిగణనలోకి తీసుకొని రిజర్వేషన్లు ఈ దేశంలో కొనసాగుతున్నాయి. 1950ల తరువాతనే ఈ విధానం అమల్లోకి వచ్చింది.

రిజర్వేషన్లు కేవలం ప్రభుత్వ విద్యా, ఉద్యోగ రంగాల్లో కొంతమేరకు రాజకీయ రంగంలో ఆచరించబడుతున్నాయి. సమానత్వాన్ని సాధించడానికి ఒకానొక మార్గంగా మాత్రమే రిజర్వేషన్లు ఉన్నాయి. కానీ వీటివల్ల దేశంలో ఏదో విప్లవాత్మక మార్పు జరుగుతుందని. సమానత్వం సాధించబడుతుందని అనుకుంటే పొరపాటే. విద్య, ఉద్యోగ, ఉపాధి, ఆత్మగౌరవానికి, రాజకీయ అధికారానికి, సమాన సంపదలకు దూరం చేయబడిన వర్గాలను ఇవన్నీ ఉన్న వారితో లేదా కొంతైనా మెరుగ్గా ఉన్నవారితో సమానంగా పోటీ పడమనడం దుర్మార్గం.

దీన్ని నివారించడానికే రిజర్వేషన్లనే భావన ముందుకు వచ్చింది. ఇవి లేకుంటే కనీసంగానైనా అట్టడుగు వర్గాల వారు వివిధ స్థానాల్లోకి, పదవుల్లోకి, విద్యా ఉద్యోగాల్లోకి వచ్చే వారు కాదు. ఇక్కడ సమర్థత,

మెరిట్ అనే వాదనలు ముందుకు వచ్చి రిజర్వేషన్లను వ్యతిరేకించడం జరుగుతుంది. వీటికి సంబంధించిన ప్రాతిపదికలపై గతంలో ఎన్నో చర్చలు జరిగి వాటిని కొట్టిపారేయడం జరిగింది. అయినా నేటికీ అవే వాదనలు ముందుకు వస్తున్నాయి.

కులం ప్రాతిపదికగా కాకుండా ఆర్థిక ప్రాతిపదికగా లేదా చదువుకోవడంలో సాయం చేయమనే ప్రతిపాదనలు ముందుకు వస్తాయి. ఇవన్నీ కూడా ఒక విషయాన్ని విస్మరించి మాట్లాడుతుంటాయి. ఈ దేశంలో కులం వాస్తవం, కులవివక్ష వాస్తవం, కులం ఆధారంగా మనుషుల గుర్తింపు, గౌరవం, అవకాశాలు, సాంఘిక వివక్షతలు, అవమానాలు జరుగుతున్నాయనే దాన్ని కనుమరుగు చేసే ప్రయత్నం జరుగుతుంది. దేశంలో కులం ఒక అణచివేత సాధనంగా ఉన్నంతకాలం రిజర్వేషన్ల అవసరం ఉంటూనే ఉంటుంది.

కుల నిర్మూలన జరిగి సామాజిక సంపదను అందరూ సమానంగా అనుభవిస్తూ, సమాన విలువను, గౌరవాన్ని పొందే దశకు ఈ వ్యవస్థ చేరుకున్న నాడు రిజర్వేషన్ల అవసరమే ఉండదు. ఈ సమానత్వం కోసం మాట్లాడకుండా అందుకొరకు ప్రయత్నాలు చేయకుండా కేవలం రిజర్వేషన్ల వల్ల సమర్థత దెబ్బతింటుందన్న వాదనకు ఏ మాత్రం పస ఉండదు.

అసలు మెరిట్ అంటే మార్కులనేగా అర్థం. మార్కులు ఎక్కువగా వస్తే వాటి సమర్థత ఎక్కువగా ఉన్నట్లనేగా అర్థం. ఎస్‌సి, ఎస్‌టి, ఓబీసీలకు విద్యారంగంలో ప్రవేశాల్లో కొంతమేరకు వెసులుబాటు ఉంటుంది. కానీ కోర్సుల్లో చేరాక ఆయా సంస్థలు నిర్దేశించిన స్కోరును సాధిస్తేనే ఆ చదువుల్లో ఉత్తీర్ణులైనట్లు ప్రకటిస్తారు. ఈ స్కోరు విషయంలో ఎవరికీ ఎలాంటి మినహాయింపులు ఉండవు.

ఆయా కోర్సుల్లో ఉత్తీర్ణులయ్యారంటేనే వారు తర్వాత ఉద్యోగాలకు గానీ, ఉన్నత చదువులకు గానీ కావల్సిన సామర్థ్యాలను సాధించారనే కదా అర్థం. అయినప్పుడు సామర్థ్యం దెబ్బతింటుందనే వాదనకు అర్థం ఏముంది?.

రిజర్వేషన్లకు వ్యతిరేకంగా భూస్వామ్య, అగ్రకుల, బ్రాహ్మణీయ భావజాలాలున్న శక్తులు ఆందోళనలు చేశాయి. ఆ ఆందోళనల్లో ఉత్పత్తి కులాల వృత్తులను కించపరుస్తూ రిజర్వేషన్ల వల్ల నష్టం జరిగి కింది స్థాయి పనులు చేయవలసి వస్తుందని, వాటి వ్యక్తీకరణలుగా బూట్ పాలిష్, రోడ్లు ఊడ్వడం, లెట్రిన్ కడగడం వంటి వాటిని ఆందోళన రూపాలుగా ఎంచుకున్నారు.

ఈ నిరసన రూపాల ద్వారా కొన్ని కులాల పట్ల, కుల వృత్తుల పట్ల వారికున్న అసహ్యం, అపహాస్యం కనిపిస్తుంది. శ్రమ పట్ల గౌరవం, ఆ శ్రమవల్లనే సంపద పెంపొందుతుంది అనే దాన్ని విస్మరిస్తున్నారు. శ్రమకు దూరమై శ్రామికులపై ఆధిపత్యం చెలాయించే వారుగా, దళారులుగా పరాన్నభుక్కులుగా మారి అదే తెలివని, మెరిట్ అని సామర్థ్యం అని గొప్పగా చెప్పుకొస్తున్నారు. ఏ శారీరక శ్రమ అయినా, మేధో శ్రమ అయినా సమాజంలో ప్రజల మధ్య సహృద్భావం, స్నేహం, గౌరవం, సమాన విలువలను సాధించేందుకు ఉపయోగపడాలి. అదే అసలైన మెరిట్, సామర్థ్యం అవుతుంది.

ప్రతిభ అనేది ఏ ఒక్కడి సొత్తు కాదు, అది సామాజికమైనది. పుట్టుకతో ఇంచుమించుగా అందరూ సమాన కౌశలాలను కలిగి ఉంటారు. అవి వారు పెరిగిన పరిస్థితులు, వారికి అందిన గుణాత్మకమైన విద్య, శిక్షణ, నైపుణ్యాలు సామాజిక స్థితిగతుల వల్ల ప్రభావితం అవుతాయి. అణచివేతలను, అవమానాలను, పేదరికాలను వివక్షతలను ఎదుర్కొంటూ తమ జ్ఞానాన్ని మేథస్సును వికసింపచేసుకునే పరిస్థితులకు దూరం చేయబడుతున్న తీరును దాటవేస్తూ ప్రతిభ గురించి మాట్లాడటం అనేది అన్యాయమైన వాదనే అవుతుంది. ఒకవేళ భూస్వామ్య, అగ్రకుల, బ్రాహ్మణీయ భావజాల, పెట్టుబడిదారీ వర్గాల వారు అనేదే ప్రతిభ అని అనుకుంటే గతంలోగానీ, నేడు గానీ రాజకీయాల్లో, బ్యూరోక్రసీలో, శాస్త్ర సాంకేతిక రంగాల్లో మొత్తంగా అన్ని రంగాల్లో గణనీయమైన సంఖ్యలో ఉండి నిర్ణయాత్మక స్థానాల్లో ఉంటూ కూడా ఈ దేశంలో విపరీతమైన పేదరికం, నిరుద్యోగం, సామాజిక వివక్షతలు, అనేకానేక దురాచారాలు, నిరక్షరాస్యత ఎందుకు కొనసాగుతున్నాయి. సంపద కొద్దిమంది చేతుల్లోనే ఎందుకు కేంద్రీకృతం అవుతుంది. అలాంటి ప్రతిభ, ప్రతిభ ఎలా అవుతుంది.

గత 30, 40 ఏళ్లుగా అనేక అవాంతరాలతో గుడ్డిలో మెల్లగానైనా అమలవుతున్న రిజర్వేషన్ల వల్ల కొద్దో, గొప్పో రాజకీయ రంగంలో గానీ, ప్రభుత్వ, విద్య, ఉద్యోగ రంగాల్లో గానీ అట్టడుగు కులాలకు స్థానం దక్కింది. ఎన్నో వ్యతిరేకతలు కొనసాగుతున్నప్పటికీ కొంతమేరకు ఆయా కులాల్లో కొద్దిమందైనా ఎదగడం జరుగుతున్నది. రిజర్వేషన్లే లేకుంటే ఈ కులాలకు చెందిన వారు ఈ మాత్రమైనా ఉన్నత చదువులకు వచ్చే వారే కాదు. రిజర్వేషన్లు అమల్లోకి వచ్చిన 20 ఏళ్ల నుండే ప్రభుత్వ విద్య, ఉద్యోగ రంగాలు కుంచించబడడం మొదలైంది. అంటే ప్రభుత్వ రంగంలో క్రమేపీ విద్య, ఉద్యోగ అవకాశాలు తగ్గుతూ ప్రైవేట్ రంగం పెరుగుతూ వస్తున్నది.

నేడు పాఠశాల విద్యలో సగానికి, ఆ పై చదువుల్లో సగానికంటే ఎక్కువగా ప్రైవేట్ సంస్థల ఆధీనంలో కొనసాగుతున్నవి. ప్రభుత్వ ఆధీనంలో నడిచే చదువులు నామమాత్రమయ్యే పరిస్థితుల్లోకి నెట్టివేయబడ్డాం. ఎన్నో ప్రభుత్వ రంగ సంస్థలు మూసివేయబడ్డాయి. అందులో ఉన్న ఉద్యోగులు, కార్మికులు రోడ్డున పడ్డారు. దేశంలో మొట్టమొదటి సారిగా ప్రభుత్వ రంగ సంస్థలను మూసివేయదానికి, అమ్మేయదానికి ఉద్దేశించిన ప్రత్యేక మంత్రిత్వ శాఖను అరుణ్‌శౌరీ నేతృత్వంలో బిజెపి కేంద్రంలో ప్రభుత్వం నడుపుతున్నప్పుడు ఏర్పాటు చేసింది.

1980ల నుండే ఈ ప్రక్రియ మొదలై పి.వి.నరసింహరావు ప్రధానమంత్రిగా, మన్మోహన్ సింగ్ ఆర్థిక శాఖ మంత్రిగా ఉన్న కాలంలో బహిరంగంగానే నూతన సరళీకృత, ఆర్థిక విధానాల పేరుమీద జాతీయ, అంతర్జాతీయ, సామ్రాజ్యవాద పెట్టుబడిదారులకు విచ్చలవిడిగా ప్రవేశాలు కల్పించడం మొదలైంది. అంతకుముందు కూడా ఇందిరాగాంధీ కాలం నుండే ఇంకా చెప్పాలంటే స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుంచే ఈ ప్రక్రియ ఉందనే విషయాన్ని తరిమెల నాగిరెడ్డి రాసిన తాకట్టులో భారతదేశం అనే పుస్తకంలో రుజువులతో సహా నిరూపించబడినది.

ప్రైవేట్ రంగం వేగవంతమవుతూ అన్ని రంగాల్లోకి విస్తరిస్తున్న నేపథ్యంలో ఎస్‌సి, ఎస్‌టి, బిసి వర్గాలకు విద్య, ఉద్యోగాలకు సంబంధించి ప్రత్యేక రాయితీలు కనుమరుగైపోవడం జరుగుతున్నది. ప్రభుత్వ సంఘటిత రంగం క్రమేపీ కుదించబడుతున్నది. ఫలితంగా రాజ్యాంగ

బద్ధమైన రిజర్వేషన్లకు అర్థం లేకుండా పోయే పరిస్థితి వస్తున్నది. అందుకే ప్రైవేట్ రంగంలో సైతం రిజర్వేషన్ల అవసరం ముందుకు వస్తున్నది.

రాజ్యాంగ రచనాకాలంలో భవిష్యత్‌లో ప్రైవేట్ రంగం పుంజుకుంటుందనే ఆలోచనలే ఉండి ఉంటేగనుక వాటిలో సైతం రిజర్వేషన్లను పాటించమని చెప్పేవారేమో. ప్రైవేట్ రంగం అనగానే అదేదో కొందరి వ్యక్తుల లేక సమూహాల సొంత ఆస్తిగా, వ్యక్తిగత ఆస్తిగా గుర్తించడంలోనే తప్పుడు అవగాహన ఉన్నది. వందల, వేల, లక్షల కోట్ల ఆస్తులు ఒక్కరి వ్యవహారంగా ఉంటుందంటే నమ్మాలా? ఇంత సంపద పోగవడంలో ఎంతో మంది శ్రమ ఇమిడి ఉంటుందో అర్థం చేసుకోవడం కష్టమైతే కాదు. ఎంతోమంది శ్రమను పెట్టుబడిగా మార్చి ప్రైవేట్ సంస్థలను స్థాపించి ఆ సంపదకు అధిపతులమని, సొంతదారులమని చెప్పుకునే అవకాశమిస్తున్న తాత్వికతనే ప్రశ్నించాల్సి ఉంది. ఆ విధానాలకు ఊతమిస్తున్న వ్యవస్థలోని వెసులుబాటును సరిచేయవలసి ఉన్నది.

ప్రైవేట్ సంస్థల స్థాపనలో వాటికి మౌలిక వసతులను ఏర్పాటు చేసుకోవడంలో ఎన్నో వెసులుబాట్లు, రాయితీలు, పన్ను మినహాయింపులు, సబ్సిడీలు ప్రభుత్వ పరంగా ఇవ్వడం జరుగుతుంది. వాటికి కావలసిన పెట్టుబడి పెద్దమొత్తంలో బ్యాంకుల నుండి రుణాల రూపంలో అందుతుంది. ఈ సొమ్ము వారి సొంతమెలా అవుతుంది. అలాంటప్పుడు ఆ సంస్థల్లో ప్రభుత్వ రంగ సంస్థల్లో లాగానే రిజర్వేషన్లు ఒక ప్రజాస్వామిక హక్కుగానే ఉంటాయి.

రిజర్వేషన్లు అమలైన నేపథ్యంలో కూడా గత 50 ఏళ్లలో ఉన్నత ఉద్యోగాల్లో, విద్యా సంస్థల్లో నేటికీ ఎస్సీ, ఎస్టీలకు కేటాయించిన కోటా భర్తీ కాకపోవడం చూడొచ్చు. అవి కాలక్రమంలో డీరిజర్వ్ అయ్యి ఇతరులకు కేటాయించబడుతున్నాయి. రిజర్వేషన్లు అమలవుతున్నప్పుడే పరిస్థితి ఇలా ఉంటే అవి లేకపోతే ఎలా ఉంటుందో ఊహించుకోవచ్చు. నిజానికి ఉద్యోగ, ఉపాధి అవకాశాలు ప్రభుత్వ రంగాల్లో చూస్తే చాలా తక్కువ వాటాను కలిగి ఉన్నాయి. అది 10 శాతానికి మించదు. ప్రైవేట్ రంగంలో ఉద్యోగాలు ఒక శాతానికి కూడా మించదు. మిగతా 90శాతం ఉద్యోగ, ఉపాధి అవకాశాల్లో కూడా రిజర్వేషన్లు కల్పించాలనే డిమాండ్ సరైనదిగా ఉంటుంది.

భూపంపిణీ, వ్యవసాయం, పరిశ్రమలు, వివిధ వ్యాపారాలు, మరితర అన్ని క్షేత్రాల్లోకి రిజర్వేషన్లను విస్తరించాల్సి ఉన్నది. ఈ దేశంలో ప్రజలు కులపరంగా, మతపరంగా విభజించబడి కొనసాగుతున్న నేపథ్యంలో అవి రద్దు అయ్యేంతవరకు వారి వారి జనాభా నిష్పత్తి ప్రకారం నిర్దిష్టమైన కోటాను నిర్ణయించి అమలు చేయాల్సి ఉంది. ఈ విధానాన్ని ఏళ్లకుఏళ్లుగా కొనసాగించడం వల్ల కులాలు, మతాలు మరింతగా వృద్ధి చెందుతాయనే వాదనలు కూడా ఉన్నాయి.

సమానత్వాన్ని సాధించడానికి రిజర్వేషన్లు సాధనం కాదని, ఇతరత్రా అవకాశాలు చక్కటి విద్య, వసతులు కల్పించాలనే వాదనలు ఉన్నాయి. వారంటున్న ఆ వసతుల కోసమైనా రిజర్వేషన్లు ప్రాతిపదికగా నిలుస్తాయి. విద్య, ఉద్యోగ రంగాన్ని ప్రభుత్వ రంగ సంస్థలను ప్రైవేటీకరిస్తూ పోతున్న సందర్భంలో ఈ వర్గాల వారికి అవకాశాలు ఎలా మెరుగవుతాయి. రిజర్వేషన్లు వద్దని వాదించేవారు చేయవలసింది సంపదను సమంగా పంచేలా కృషిచేయాలి. కుల నిర్మూలన కోసం అంబేద్కర్ సూచించిన కులాంతర వివాహాలను ఆచరించాలి. అందుకోసం పెద్దఎత్తున ఉద్యమించాలి.

ఎస్సీ, ఎస్టీలు మెరిటోరియస్‌గా తయారుకావడానికి తగిన పరిస్థితులను కల్పించడంలో భాగంగా స్కాలర్‌షిప్‌లు, ప్రభుత్వ పాఠశాలల్లో భాగస్వాములవ్వడం, కంపెనీలచే పాఠశాలలను నడపడం తగిన వృత్తి పరమైన శిక్షణలను, నైపుణ్యాలను అందివ్వడం చేస్తామనే వాదనను కార్పొరేట్ శక్తులు ముందుకు తెస్తున్నాయి. కానీ ప్రైవేట్ రంగంలో రిజర్వేషన్లను వ్యతిరేకిస్తున్నాయి. అలా కార్పొరేట్ శక్తులు ఎంతమంది ప్రజలకు అందిస్తారు. దేశంలో ఉన్న కోట్లాదిమంది ప్రజలకు అందించగలుగుతారా? అలా అందిస్తే వారి కార్పొరేట్ లాభాలు, సిరిసంపదలు ఏమైపోతాయి. వారు సంపదలను అంత సులభంగా వదులుకోగలుగుతారా?

ఇక్కడ స్పష్టంగా కార్పొరేట్ శక్తులు కూడా ఒప్పుకున్నదేమంటే అనుకూలమైన పరిస్థితుల్లో ఎవరైనా ఆయా రంగాల్లో రాణించగలుగుతారు. ఈ మధ్య కాలంలో కార్పొరేట్, సోషల్ రెస్పాన్సిబులిటీ అనే కొత్త భావన ముందుకు వస్తున్నది. ఇది ఎంత మోసపూరితమో కొద్దిగా లోతుల్లోకి వెళితే తెలుస్తున్నది. కార్పొరేట్ శక్తులు ఉదారంగా దాతృత్వంతో, దయతో, జాలితో ఈ బాధ్యతను నిర్వహిస్తున్నట్లు లేదా నిర్వహించాలన్నట్లు భావిస్తున్నారు.

అసలు ప్రశ్న ఏమిటంటే ఈ శక్తులకు అందుతున్న లేదా వారి వద్ద పోగవుతున్న విపరీత సంపదలు, పెట్టుబడులు ఎవరి శ్రమ ఫలితాలు? ఈ సంస్థల ఉత్పత్తులకు వినియోగదారులెవరు? ఆ సంపద సృష్టికర్తల్లో సమాజంలోని అట్టడుగు వర్గాల ప్రజలే కదా భాగస్వాములు. మరి వీరికి ఆ సంపదలో గానీ, ఆ సంస్థల్లోని ఉద్యోగ అవకాశాల్లోగానీ వాటా ఉండడం సరైందికాకుండా పోతుందా? ప్రైవేట్ సంస్థల్లో రిజర్వేషన్లే కాదు, నిజానికి వాటి మొత్తం సంపదలో వాటానే డిమాండ్ చేయాల్సి ఉంటుంది.

సంపద సృష్టికర్తలు ఆ సంపదకు హక్కుదారులు అవుతారు. కానీ వీరిపై అజమాయిషీ చేస్తూ దళారులుగా ఉండి కుబేరులవుతుండడం న్యాయంగా కనిపిస్తున్న రిజర్వేషన్ వ్యతిరేకులకు సంపద సృష్టికర్తలు హక్కుదారులుగా ఉండాలనేది తప్పుగా కనిపిస్తున్నది. దీన్ని తిరగరాయవలసిన చారిత్రక కర్తవ్యం అందరి ముందున్నది. ప్రైవేటైజేషన్‌నే రద్దు చేయించాలి అలా కాని పక్షంలో కనీసం వాటిలో రిజర్వేషన్లనైనా అమలు చేయించుకోవాలి.

రిజర్వేషన్లేవి శతాబ్దాలుగా అన్యాయాలకు గురైన వర్గాల సంతతికి నష్టపరిహారం కావు. అసమానత్వాలను సరిదిద్దడానికి జీరో బల్బుల్లాగా పనికివచ్చేవి మాత్రమే. అసలు పరిష్కారం దేశ సంపదపై అందరికీ సమాన హక్కు ఉండడమే. అందరికీ సమాన విలువను స్థాపించడమే, సాధించుకోవడమే.

ఆ హక్కులు సాధించుకోవడంలో భాగంగానే అవి పొందబడేవరకు అన్ని రంగాలతో పాటు ప్రైవేట్ రంగంలో కూడా రిజర్వేషన్లను హక్కుగానే డిమాండ్ చేయాలి, సాధించుకోవాలి.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# తెలంగాణలో విశ్వవిద్యాలయాల దుస్థితి

***సమాజ గతిని మార్చే ప్రభుత్వ విశ్వవిద్యాలయాలకు వనరులను కేటాయించకుండా, బోధనా సిబ్బందిని నియమించకుండా తెలంగాణ రాష్ట్రంలో ప్రభుత్వ విద్యను నీరుగారుస్తున్న తీరును వివరిస్తున్నారు* పరాంకుశం ముఖేష్**

*"ఒక ప్రాంతపు సమగ్ర ఆర్థిక, సామాజికాభివృద్ధి చాలావరకు ఆ ప్రాంతం విద్యారంగంలో సాధించిన ప్రగతిపై ఆధారపడి ఉంటుంది. అలాగే అభివృద్ధి చెందిన ఆర్థిక వ్యవస్థ తిరిగి విద్యాభివృద్ధిని మరింత వేగవంతం చేస్తుంది"*

*– ప్రొఫెసర్ జయశంకర్*

అభివృద్ధి చెందిన దేశాలు సరళీకరణ నూతన ఆర్థిక విధానాలను పేదదేశాలపై బలవంతంగా రుద్దేందుకు ప్రయత్నిస్తుంటే ఆ విధానాలు నేడు క్రమంగా ఒక్కో రంగాన్ని ముంచేస్తూ మూడో ప్రపంచదేశాల్లోని ప్రతీ రంగాన్ని మింగేస్తున్నాయి. ఆ ప్రక్రియలో భాగంగానే ప్రపంచవ్యాప్తంగా ప్రభుత్వరంగంలో ఉన్నత విద్యకు క్రమంగా నిధుల కేటాయింపు తగ్గించి మార్కెట్ శక్తులకు అనుకూలంగా నడిచే ప్రైవేట్ విశ్వవిద్యాలయాలకు తలుపులు బార్లా తెరిచేలా చర్యలు తీసుకోవాలని మూడో ప్రపంచదేశాలపై ఎప్పడినుండో ఒత్తిడిఉంది. అంతర్జాతీయ ద్రవ్య నిధి లాంటి సంస్థలు ఆ బాధ్యతలను తమ భుజాన వేసుకుని అందుకోసం చేయాల్సిన పనులన్నీ చకచకా చేసేస్తూనే ఉన్నాయి. భారతదేశ పరిస్థితి కూడా అందుకు భిన్నంగా ఏం లేదు. అంతర్జాతీయ సంస్థకు తలొగ్గి కేంద్రప్రభుత్వం దేశంలోకి విదేశీ ప్రైవేట్ విశ్వవిద్యాలయాలకు అనుమతినిస్తూ గాట్ పై సంతకం పెట్టడానికి తయారవుతుంది. మరోవైపు ప్రభుత్వ విశ్వవిద్యాలయాలను పూర్తిగా ధ్వంసం చేసే కుట్రలు కూడా దేశవ్యాప్తంగా అంతర్గతంగా సాగుతూనే ఉన్నాయి. ఉన్నతవిద్యను పూర్తిగా ప్రైవేట్‌శక్తులకు అప్పగించేందుకు జరుగుతున్న కుట్ర నేపథ్యంలో తెలంగాణలోని విశ్వవిద్యాలయాల పరిస్థితిని అంచనా వేయాల్సిఉంది. ఎందుకంటే తెలంగాణ నేపథ్యం, ఇక్కడి ప్రజల సామాజిక చైతన్యం వేరు. తెలంగాణ ఉద్యమంలో ఇక్కడి విశ్వవిద్యాలయాలు నిర్వహించిన పాత్రను చరిత్ర ఎన్నటికీ మరిచిపోదు. విద్యార్థుల ఉద్యమాలు, త్యాగాల ఫలితంగానే తెలంగాణ రాష్ట్రం సాకరమైందని తన ఎన్నిక మ్యానిఫెస్టోలో ప్రకటించుకున్న తెలంగాణ రాష్ట్ర సమితి (తెరాస) ఇవ్వాళ అధికారంలో ఉంది. అధికారం చేపట్టి సంవత్సరంన్నర గడిచిపోయిన సందర్భంలో తెలంగాణలోని విశ్వవిద్యాలయాల పట్ల ఇక్కడి ప్రభుత్వం తీసుకుంటున్న చర్యలను నిశితంగా పరిశీలించాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం కోసం జరిగిన ఉద్యమ కాలంలో ఉద్యమ నాయకుడిగా చెలామణి అయిన కెసిఆర్ రాష్ట్ర పాలకుడిగా ఉన్నాడు. ప్రత్యేక రాష్ట్రం సిద్ధిస్తే సీమాంధ్ర పాలకుల నిర్లక్ష్యం మూలంగా వివక్షకు గురికాబడ్డ ఇక్కడి విశ్వవిద్యాలయాలను ప్రపంచస్థాయికి తీసుకెళతానని పదే పదే మాట్లాడిన వ్యక్తే ఇవ్వాళ అధికారంలో కీలక పదవిలో ఉన్న సందర్భంగా చర్చించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. 'ఒక్కసారి మాట ఇస్తే తల నరుక్కుంటాను తప్ప వెనక్కి తగ్గను' అని గొప్పగా చెప్పుకునే వ్యక్తే అధికారంలో ఉన్నాడు కాబట్టి తెలంగాణలో విశ్వవిద్యాలయాలు ఎదుర్కొంటున్న సమస్యలను గురించి చర్చించాల్సి ఉంది. తెరాస తన ఎన్నికల మ్యానిఫెస్టోలోని 11వ పేజీలో నూతన యూనివర్సిటీల నిర్మాణం చేపడతామని హామీ ఇచ్చింది. కానీ అధికారంలోకి వచ్చాక కొత్త యూనివర్సిటీల స్థాపన పక్కకు పోయి ఉన్న యూనివర్సిటీలను మూసివేయించే పరిస్థితి ప్రస్తుతం రాష్ట్రంలో నెలకొంది. నవ తెలంగాణ పునర్నిర్మాణంలో అందరూ నడుం బిగించాలి అని ప్రభుత్వం ప్రకటించుకున్న ప్రస్తుత కాలంలోనే రాష్ట్రంలోని మేధావుల కేంద్రాలైన విశ్వవిద్యాలయాలను నిర్లక్ష్యానికి గురిచేస్తూ 'పునర్నిర్మాణం, బంగారు తెలంగాణ' ఎలా సాధ్యమో పరిశీలించాల్సి ఉంది.

**బడ్జెట్‌లో చాలీచాలని కేటాయింపు**

స్వరాష్ట్రంలో ప్రాంతీయ విశ్వవిద్యాలయాలు ఎదుర్కొంటున్న ప్రధాన సమస్య అరకొర బడ్జెట్ కేటాయింపులు. రాష్ట్రంలోని ఏ యూనివర్సిటీకి తగినన్ని నిధుల కేటాయింపు చేయకపోవడం వల్ల అవి తీవ్ర సమస్యలను ఎదుర్కొంటున్నాయి. విశ్వవిద్యాలయాలకు తగిన గ్రాంట్లు ఇచ్చి, వాటిని పూర్తి స్థాయిలో అభివృద్ధి చేయడం జరుగుతుందని (పన్నెండో పేజీ, తెరాస మ్యానిఫెస్టో) ప్రకటించిన తెరాస ఇవ్వాళ అధికారంలోకి వచ్చాక సీమాంధ్ర ప్రభుత్వాల కంటే కూడా ఇంకా తక్కువ నిధులు కేటాయించింది. ఒకవైపు రాష్ట్రం రెండుగా విడిపోవడం వల్ల ఆర్థికంగా ఇబ్బందులు ఎదుర్కోవాల్సి వస్తుందని ప్రకటించిన ఆంధ్ర ప్రభుత్వం మాత్రం అక్కడి యూనివర్సిటీలకు గతం కంటే 100 రెట్లు నిధులు అదనంగా కేటాయిస్తే స్వరాష్ట్ర పాలకులు మాత్రం అరకొరగా కేటాయించడం ఆశ్చర్యకరం. ఘనత వహించిన తెరాస ప్రభుత్వం గత రెండు బడ్జెట్ లలో ఇక్కడి యూనివర్సిటీలకు కేటాయించిన నిధులు నామమాత్రమే.

ఉదాహరణకు ఉస్మానియా యూనివర్సిటీ 2014–15 సంవత్సరానికి గాను రు. 503.02 కోట్లు అవసరముంటుందని, దాంట్లో అంతర్గత సర్దుబాటు కింద రు. 85.14 కోట్లు చేసుకోగా మిగిలిన రు. 417.88 కోట్లు ప్రభుత్వం అందించాలని యూనివర్సిటీ అధికారులు కోరారు. కానీ ప్రభుత్వం మాత్రం రు. 170.14 కోట్లు ఇచ్చి చేతులు దులిపేసుకుంది. అధ్యాపకులకు, బోధనేతర సిబ్బంది జీతభత్యాలకే రు. 222.62 కోట్లు కావాల్సి ఉండగా ప్రభుత్వం మాత్రం జీతాలకు సరిపడ నిధులు కూడా ఇవ్వకుండా పాలన కొనసాగిస్తోంది. యూనివర్సిటీ పట్ల గత పాలకుల నిర్లక్ష్యం మూలంగా ఎన్నో ఏండ్లు యూనివర్సిటీకి సేవ చేసి పదవీ విరమణ పొందిన ఉద్యోగులకు పెన్షన్ కూడా ఇవ్వలేక అనేక ఇబ్బందులు ఎదుర్కోవాల్సి వచ్చింది. స్వరాష్ట్రం సిద్ధించాక ఎన్నో రోజులు ఆందోళన చేస్తే తప్ప వారికి ఇవ్వాల్సిన 10 నెలల పెన్షన్ ప్రభుత్వం విడుదల చేయలేదు.

ఇప్పుడిప్పుడే అధికారంలోకి వచ్చాం సర్దుబాటు కావడానికి సమయం పడుతుంది అంటూ కల్లబొల్లికబుర్లు చెప్పిన రాష్ట్ర పాలకులు తీరా 2015-16 ఆర్థిక సంవత్సరంలో కూడా ఇక్కడి ప్రాంతీయ విశ్వవిద్యాలయాలకు మొండిచెయ్యే చూపెట్టారు. మార్చి 14, 2015 నాటి ది హిందూ దినపత్రిక ప్రచురించిన కథనం ప్రకారం ఈ ఫైనాన్షియల్ ఇయర్ లో ఓయు కి వాస్తవానికి రు. 750 కోట్లు అవసరంకాగా ప్రభుత్వం కేవలం రు. 238 కోట్లు మాత్రమే కేటాయించింది. రాష్ట్రానికే తలమానికంగావున్న ఉస్మానియా విశ్వవిద్యాలయల పరిస్థితి ఇలా ఉంటే మిగతా యూనివర్సిటీల పరిస్థితి ఎలా ఉంటుందో అర్థం చేసుకోవచ్చు. కాకతీయ విశ్వవిద్యాలయానికి రు. 104 కోట్లు అవసరం ఉండగా రు. 67.03 కోట్లు కేటాయించింది. ఇక నూతనంగా ఏర్పడిన శాతవాహన యూనివర్సిటీకి రు. 21.60 కోట్లు, మహాత్మగాంధీ విశ్వవిద్యాలయానికి రు. 15కోట్లు, పాలమూరు యూనివర్సిటీకి రు. 8.10 కోట్లు, తెలంగాణ విశ్వవిద్యాలయానికి రు. 28.29కోట్ల నిధులు మాత్రమే కేటాయించింది. అరకొర నిధులతో, ఖాళీ పోస్టులతో యూనివర్సిటీ విద్యార్థుల చదువులు ఎలా సాగుతాయో అర్థం చేసుకోవచ్చు. ఒకవైపు యాదాద్రికి వంద కోట్లు కేటాయిస్తామంటున్న ప్రభుత్వం వేలాదిమంది బడుగుల, బలహీన విద్యార్థులు చదువుతున్న విశ్వవిద్యాలయాలకు మాత్రం పది, పరకా కేటాయించడాన్ని బట్టి చూస్తే ఉన్నతవిద్య పట్ల ప్రభుత్వ చిత్తశుద్ధి ఏపాటిదో అర్థమౌతుంది.

యూనివర్సిటీలకు కేటాయించాల్సిన నిధులు, ప్రత్యేక గ్రాంటు మాట అటుంచితే, ఉద్యమకాలంలో విద్యార్థులకు చెల్లించాల్సిన మెస్ బకాయిలు ఏడు కోట్ల రూపాయలు కూడా ప్రభుత్వం ఇప్పటి వరకు విడుదల చేయలేదు. ఈ మెస్ బకాయిల గురించి గత మార్చి అసెంబ్లీ సమావేశాల్లో మజ్లిస్ ఎంఎల్ఏ అక్బరుద్దీన్ అడిగిన ప్రశ్నకు ముఖ్యమంత్రి బదులిస్తూ ఎంఎల్‌సి ఎన్నికల కోడ్ మూలంగా నిధులు విడుదల చేయలేక పోతున్నామని, ఎన్నికలు ముగిసిన వెంటనే విడుదల చేస్తామని హామీ ఇచ్చారు. ఇప్పటి వరకు ఆ హామీ అమలులోకి రాలేదు. ఓ వైపు ప్రభుత్వం బకాయిలు చెల్లించకపోతే మెస్ లు నడపలేమంటూ ఓయు అధికారులు జూన్ మాసంలో మెస్‌లను మూసివేశారు. ఆ తరుణంలో ఓయులోని పరిశోధక విద్యార్థులు అంబేద్కర్ (నర్మద) హాస్టల్ ముందు అసెంబ్లీ సాక్షిగా ముఖ్యమంత్రి ఇచ్చిన హామీని నిలబెట్టుకోవాలని జూన్ మాసంలో 19 రోజులు సామూహిక రిలే నిరాహార దీక్షను కొనసాగించారు. విద్యార్థుల ఆందోళనలు, సచివాలయం ముట్టడి వంటి కార్యక్రమాలకు పిలుపునిస్తే చివరకు వరంగల్ ఉప ఎన్నిక నేపథ్యంలో ఓయు మెస్ బకాయిలు వెంటనే విడుదల చేస్తున్నామంటూ ప్రభుత్వం హడావిడిగా ప్రకటించింది. ఇప్పటి వరకు వాటికి సంబంధించి ఎటువంటి జిఓ ను గాని, సర్క్యూలర్ గాని విడుదల చేయలేదు. ఈ అన్ని ఘటనలను చూస్తుంటే విశ్వవిద్యాలయాల పట్ల ప్రభుత్వానికి ఎటువంటి ప్రేమ ఉందో అర్థం చేసుకోవచ్చు. తెలంగాణ కోసం అలుపెరుగకుండా నిరంతరం పోరాడిన విద్యార్థులు, స్వరాష్ట్రంలో తిండికోసం నిరాహార దీక్షకు కూర్చున్నారంటే ఈ ప్రభుత్వం ఏ వర్గాలకు కొమ్ముకాస్తుందో ప్రత్యేకంగా చెప్పాల్సిన అవసరం లేదు.

**విశ్వవిద్యాలయాల్లో కానరాని నియామకాలు**

బడ్జెట్ కేటాయింపుల తర్వాత తెలంగాణలోని విశ్వవిద్యాలయాలు ఎదుర్కొంటున్న సమస్య నియామకాలకు సంబంధించింది. ప్రస్తుతం తెలంగాణలో మూడు కేంద్రీయ విశ్వవిద్యాలయాలు, పదహారు ప్రాంతీయ విశ్వ విద్యాలయాలున్నాయి. సెంట్రల్ యూనివర్సిటీలను మినహాయించ గా, తెలంగాణలోని ప్రాంతీయ విశ్వవిద్యాలయాలకు వేటికీ పూర్తిస్థాయి ఉపకులపతులు లేరు. అవన్నీ తాత్కాలిక ఉపకులపతుల (ప్రభుత్వ కార్యదర్శితో) తోనే పరిపాలన కొనసాగిస్తున్నాయి. యూనివర్సిటీ పరిపాలనా వ్యవస్థకు మూలస్తంభం లాంటి వైస్ ఛాన్సర్ నియామకాల పట్లనే ప్రభుత్వ వైఖరి ఇలా ఉంది. యూనివర్సిటీ ఉపకులపతుల విషయమై చివరకు కోర్టు జోక్యంతో కదలిన ప్రభుత్వం వాటి నియామకానికి నోటిఫికేషన్ విడుదలచేసి కాలయాపన చేస్తుంది. ఇవ్వాళ యూనివర్సిటీకి సంబంధించి ఏ చిన్న దస్త్రం పైన సంతకం కావాలన్నా రిజిస్ట్రార్‌లు ఇంఛార్జ్ వైస్ ఛాన్సలర్ లైన ఐఏఎస్‌ల చుట్టూ ప్రదక్షిణాలు చేయాల్సిన పరిస్థితులు ప్రస్తుతం రాష్ట్రంలో నెలకొన్నాయి. దీంతో విశ్వవిద్యాలయాల పరిపాలనా వ్యవస్థ మొత్తం అస్తవ్యస్తంగా తయారైంది. ఇక ప్రొఫెసర్లు, అసిస్టెంట్ ప్రొఫెసర్ల నియామకానికి సంబంధించి ఊసే లేదు. రాష్ట్రంలోని పురాతన విశ్వవిద్యాలయమైన ఓయు, కేయు వంటి వాటిల్లో గత ఇరవై, ముప్పై సంవత్సరాల క్రితం నియమాకమైన ప్రొఫెసర్లందరూ పదవీ విరమణ దశకు చేరుకున్నారు.

రాష్ట్రంలోని అతి పెద్ద యూనివర్సిటీ అయిన ఓయు లోనే సగానికి పైగా ఇప్పటికే పదవీ విరమణ పొందారు. ఇలా విశ్వవిద్యాలయాల్లో అధ్యాపకుల పోస్టులు ఖాళీలుగానే ఉన్నాయి. అలాంటి సందర్భంలో అధ్యాపకుల నియమాకాలు చేపట్టాల్సిన ప్రభుత్వం వాటి గురించి పల్లెత్తు మాట కూడా మాట్లాడట్లేదు. నూతన విశ్వవిద్యాలయాలైన శాతవాహన, తెలంగాణ, మహాత్మగాంధీ, పాలమూరు వంటి విశ్వవిద్యాలయాల్లో పరిస్థితి మరీ దారుణంగా ఉంది.

ఆ కొత్త యూనివర్సిటీలు కేవలం 20 మంది కంటే తక్కువ అధ్యాపకులతో యూనివర్సిటీ చదువులు కొనసాగుతున్నాయి. కొన్ని విభాగాల్లో ఒక్కరంటే ఒక్కరు కూడా ఫుల్ టైమ్ అధ్యాపకులు లేరంటే యూనివర్సిటీ పరిస్థితి ఎంత దారుణంగా ఉందో అర్థం చేసుకోవచ్చు. దాదాపుగా రాష్ట్రంలోని అన్ని యూనివర్సిటీలు అత్యధికంగా కాంట్రాక్ట్ అధ్యాపకుల, పార్ట్ టైమ్ ఉద్యోగులతోనే కాలం వెళ్లదీస్తున్నాయి. దీంతో విశ్వవిద్యాలయాల అకడమిక్ స్టాండర్డ్స్‌తో పాటు, పరిశోధనా ప్రమాణాలు కూడా కుంటుపడుతున్నాయి.

**సౌకర్యాల లేమి**

తెలంగాణలో పాత విశ్వవిద్యాలయమైన ఓయు, కేయుల్లోనే విద్యార్థులకు తగినన్ని సౌకర్యాలు లేవు. సరిపడా వసతి గృహాలు లేక ప్రతీ విద్యా సంవత్సరం నూతనంగా ప్రవేశాలు పొందే విద్యార్థులు సీనియర్ల రూముల్లో తలదాచుకోవాల్సిన పరిస్థితి ఉంది. ఇక కొత్తగా ఏర్పడిన శాతవాహన, తెలంగాణ, మహాత్మగాంధీ, పాలమూరు వంటి విశ్వవిద్యాలయాలకైతే కనీసం డిగ్రీ కళాశాల స్థాయిలో కూడా సౌకర్యాలు లేవు. వాటిలో ఏ ఒక్కదానికీ కూడా అవసరమైన స్థాయిలో భవనాల నిర్మాణం జరగకపోవడంతో అద్దె భవనాల్లోనే కాలం వెళ్లదీస్తున్నాయి.

ఓయు అడ్మిషన్ డైరెక్టర్ ఇచ్చిన సమాచారం ప్రకారం, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ప్రవేశం పొందుతున్న విద్యార్థుల్లో సుమారు 92 శాతానికి పైగా వెనుకబడిన తరగతుల, షెడ్యూల్ కులాల, తెగల, మైనార్టీవర్గాలకు చెందిన విద్యార్థులే ఉన్నారు. ఓయు రాజనీతి శాస్త్ర ఆచార్యులు ప్రొఫెసర్ రవీందర్ అభిప్రాయం ప్రకారం, ప్రాంతీయ విశ్వవిద్యాలయాల్లో ఎక్కువగా పైన పేర్కొన్న వర్గాల వారే చేరడం కూడా విశ్వవిద్యాయాల పట్ల ప్రభుత్వ దమననీతికి ఒక కారణం. ప్రభుత్వంలో

# ఆంధ్రప్రదేశ్‌లో ప్రైవేట్ యూనివర్సిటీలు

***ఎన్నికల్లో ప్రజలకిచ్చిన ఉచిత విద్య హామీని విస్మరించిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం విద్యను విదేశీ వర్సిటీలకు అప్పగించి, మార్కెట్‌లో సరుకుగా మార్చి సామాన్య ప్రజలకు అందని పండులా చేసిందని అంటున్నారు షేక్ కరిముల్లా***

రాష్ట్రంలో విద్యార్థులకు కెజి నుంచి పిజి వరకు ఉచితంగా విద్యా బోధన అందిస్తామని చెప్పిన ఎన్నికల హామీని పక్కనపెట్టి, ఉన్నత విద్యను ప్రైవేట్ పరం చేయడానికి చంద్రబాబు ప్రభుత్వం చర్యలను వేగవంతం చేసింది. ఇందులో భాగంగా ప్రైవేట్ వర్సిటీల ఏర్పాటుకు రంగం సిద్ధం చేస్తూ, బిల్లును సైతం ఆమోదించింది. రాష్ట్ర ప్రభుత్వం ఆగమేఘాల మీద ప్రైవేట్ వర్సిటీల ఏర్పాటుకు కసరత్తును మొదలు పెట్టింది. ఈ సందర్భంగా ప్రైవేట్ విశ్వవిద్యాలయాల ఏర్పాటు ఎవరి ప్రయోజనాల కోసం? అనేది మౌలిక ప్రశ్న.

విద్య సామాజికం. దానికి ఒక సామాజిక ప్రయోజనం ఉంటుంది. అది ఒక వ్యవస్థ. మానవజాతి ఇప్పటిదాకా సంపాదించిన జ్ఞానాన్ని, చరిత్ర, సంస్కృతి, సాంప్రదాయాలు, సాహిత్యం, సమస్త కళలు ఒక తరం నుండి మరొక తరానికి అందించే వ్యవస్థ. విద్య ఒక జాతి భవిష్యత్తును తీర్చిదిద్దే అత్యున్నత వ్యవస్థ. ఆ దేశ అభివృద్ధి, ప్రణాళికలు, ఆ దేశం తనకు ఎలాంటి మనుషులు కావాలని కోరుకుంటుందో, ఎలాంటి విజ్ఞానం కావాలని కోరుకుంటుందో విద్యను చూస్తే తెలిసిపోతుంది. అందుకే డా.డి.ఎస్. కొఠారి (1964-66) కమిషన్ 'రేపటితరం నేటి తరగతి గదిలో రూపుదిద్దుకుంటుంది'. అని వ్యాఖ్యానించింది. ప్రభుత్వమే విద్యా రంగాన్ని నడపాలని గట్టిగా చెప్పింది.

1991 నుంచి ప్రపంచీకరణ, ఆర్థిక సరళీకరణ, ప్రైవేటీకరణ, సంస్కరణల పుణ్యమా అని అన్ని రంగాలతో పాటు, విద్యా రంగం కూడా ప్రైవేటీకరణకు గురై అనేక సంక్షోభాలకు లోనవుతూ వస్తోంది. నేడు అది మరింత వికృత రూపం దాల్చడానికి రంగం సిద్ధమైంది.

విశ్వవిద్యాలయాల్లో జరిగే పరిశోధన, జ్ఞానం లోక కళ్యాణానికే కాని, వ్యాపారం కోసం కాదు. పారిశ్రామిక వేత్తలు పరిశోధకుల చుట్టూ తిరగాలే కాని, పరిశోధకులే పారిశ్రామిక వేత్తల చుట్టూ తిరిగే పరిస్థితి ప్రైవేట్ విశ్వవిద్యాలయాల వల్ల దాపురిస్తుంది. ప్రైవేట్ వర్సిటీలు వస్తే చదువు సంతలో అంగడి సరుకుగా మారిపోతుంది. బహుళజాతి కంపెనీలకు అవసరమయ్యే చదువు మాత్రమే ఉత్పత్తి అవుతుంది. ప్రైవేట్ విశ్వవిద్యాలయాలు పెట్టుబడిదారుల ఆధీనంలో నడుస్తాయి. వారు తమకు అవసరమైన చదువును మాత్రమే ప్రవేశపెడతారు. అప్పుడు 'విద్య వివేకాన్ని కలిగించును' అని చెప్పిన 'పోతన' మాట మారిపోయి, 'విద్య సరుకును సృష్టించును'గా ఉంటుంది. ఎప్పుడైతే విద్య అర్థం మారిపోతుందో చదివే విద్యార్థులు కూడా మారిపోతారు. అంటే పేద, బడుగు బలహీన వర్గాల విద్యార్థులు ఈ ప్రైవేట్ విశ్వవిద్యాలయాల్లో చదవడానికి అనర్హులవుతారు. డబ్బు ఉండి చదువు 'కొనే' బాబులకు మాత్రమే చదువు అందుబాటులో ఉంటుంది. ఇలాంటి కుట్రకు బీజం 1990 దశకంలోనే పడింది. ప్రైవేట్ విద్యా సంస్థల బిల్లు పార్లమెంట్‌లో అప్పుడే ప్రవేశపెట్టారు. ఆసియాలోనే చైనా తరువాత భారతదేశం అతిపెద్ద విద్యా మార్కెట్‌ను కలిగి ఉంది. కాబట్టి బడా దేశాల, స్వదేశీ బడా బాబుల కన్ను భారత్‌పై పడింది. ప్రైవేట్ విద్య ప్రవేశించింది.

---

ఉన్న వారంతా అగ్రవర్ణాలే కావడం, వారికి సామాజికంగా అణగదొక్క బడ్డ కులాలు ఉన్నతస్థాయికి రావడం ఇష్టం లేకపోవడం వంటి కారణాలు కూడా ఇక్కడి విశ్వవిద్యాలయాల దుస్థితికి ఒక ప్రధాన కారణంగా చెప్పుకోవచ్చు. ప్రభుత్వంలోని పెద్దలు చేసే ఈ కుట్రలను పసిగట్టి విద్యార్థులు ఇప్పుడిప్పుడే మరో దఫా ఉద్యమానికి శ్రీకారం చుడుతున్నారు. అవి తీవ్రస్థాయికి చేరకముందే పాలకులు మేల్కొంటే మంచిది.

భారత ప్రభుత్వం ఇప్పటికే దేశంలో 100 శాతం విదేశీ ప్రత్యక్ష పెట్టుబడుల (ఎఫ్‌డిఐ)తో నడిచే విద్యా సంస్థల ఏర్పాటుకు కూడా ఆమోదం తెలిపింది. దీంతో ఉన్నత విద్యారంగంలో లాభదాయకమైన సంస్థలను నెలకొల్పుకునేందుకూ, ప్రైవేట్, విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకు భారీ ఎత్తున అవకాశాలు కల్పించేందుకూ బడా వ్యాపార సంస్థలు సిద్ధపడుతున్నాయి. విద్యారంగంలో చోటుచేసుకున్న ఈ మార్పుల నేపథ్యంలో ఇప్పటికే ప్రపంచ వాణిజ్య సంస్థ (డబ్లుటిఓ) అజెండాలో విద్యారంగాన్ని కూడా చేర్చాలనే చర్చలు జరిగాయి. గాట్స్ ఆధారంగా ఉన్నత విద్యా వ్యవస్థ తలుపులు తెరిస్తే ప్రయివేటీకరణ, వ్యాపారీకరణ, ప్రపంచీకరణ, ఉన్నత విద్యపై నియంత్రణ తొలగింపు పెద్దఎత్తున చోటుచేసుకుంటాయి. ఇప్పటికే మనదేశంలో విద్య వ్యాపారీకరణ వేగవంతమయింది. విద్యా వ్యాపారుల లాభార్జనకు అవకాశాలు పెరిగాయి. ఉన్నత విద్యలో పెరుగుతున్న డిమాండ్‌ను ప్రయివేట్ సంస్థలు అందుకునేందుకు వీలుగా కేంద్ర ప్రభుత్వం నియంత్రణలను గాలికొదిలేస్తోంది. ఈ నేపథ్యంలో ప్రభుత్వ యూనివర్సిటీలను బలోపేతం చేసుకోకపోతే పేద ప్రజలు, ముఖ్యంగా సామాజిక వివక్ష నెదుర్కొంటున్న బలహీనవర్గ ప్రజలు విద్యకు దూరమయ్యే ప్రమాదముంది.

విద్యార్థులు, మేధావులు, ప్రజాస్వామిక వాదులు మేల్కొని తెలంగాణలోని యూనివర్సిటీల పట్ల ప్రభుత్వం వ్యవహరిస్తున్న నిర్లక్ష్య ధోరణిని ప్రశ్నించకపోతే పెనుప్రమాదాన్ని ఎదుర్కోవాల్సి వస్తుంది. ఎన్నో ప్రజాస్వామ్య ఉద్యమాలకు, ఆలోచనలకు, ఆకాంక్షలకు వేదికగా నిలుస్తున్న యూనివర్సిటీ కేంద్రాలు నామరూపం లేకుండా పోయే ప్రమాదం ఉంది. అందుకే ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చేలా ఆందోళనలు నిర్వహిస్తే తప్ప పరిష్కారం లేదు. ప్రభుత్వం కూడా వెంటనే స్పందించి తెలంగాణలోని అన్ని ప్రాంతీయ విశ్వవిద్యాలయాలలో నెలకొన్న సమస్యలను పరిష్కరించేందుకు పూనుకోకుంటే మరో ఉద్యమాన్ని ఎదుర్కోక తప్పదు.

*(రచయిత రాజనీతి శాస్త్ర పరిశోధకులు,ఉస్మానియా విశ్వవిద్యాయం)* వీ

ఈ బిల్లు ప్రకారం ప్రైవేట్ వర్సిటీల నియంత్రణ, నిర్వాహణ, పర్యవేక్షణ పూర్తిగా ఆ విద్యా సంస్థలదే. సిలబస్ రూపకల్పన, పరీక్షల నిర్వహణ, ఫీజుల రూపకల్పన, కోర్సుల ప్రవేశం వంటి విధాన పరమైన విషయాలలో వాటికి పూర్తి హక్కులు ఉంటాయి. దీనికి చక్కటి ఉదాహరణ ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న కె.ఎల్. యూనివర్సిటీ, గుంటూరు జిల్లా తెనాలి సమీపంలోని విజ్ఞాన్ యూనివర్సిటీలను తీసుకుంటే ఇవే ప్రత్యేకంగా పరీక్షలు నిర్వహించుకుంటాయి. ఫీజుల వసూళ్లలోనూ వీటిదే అంతిమ నిర్ణయం. వీటిపై ప్రభుత్వ నియంత్రణ, అజమాయిషీ ఉండదు. లక్షలాది రూపాయలు పీజులు కట్టి, పేద విద్యార్థులు ఎవరూ వాటిల్లో చేరే అవకాశమేలేదు. దీనివలన ప్రధానంగా బడుగు బలహీన వర్గాల విద్యార్థులు తీవ్రంగా నష్టపోతారు.

ఈ ప్రైవేట్ వర్సిటీల ప్రవేశంతో జరగబోయే పరిణామాలు, విద్య అవకాశాలపై స్వదేశీ విశ్వవిద్యాలయాలపై తీవ్రమైన ప్రభావం పడుతుందనడంలో సందేహం లేదు. స్వల్ప, దీర్ఘకాలికంగా ఉత్పన్నమయ్యే నష్టాలు స్థూలంగా 1) మన స్వదేశీ విశ్వవిద్యాలయాల స్వయంప్రతిపత్తి దెబ్బతిని కనుమరుగయ్యే అవకాశం ఉంది. తద్వారా లక్షలాది మంది పేద విద్యార్థులు ఉన్నత విద్యకు దూరమవుతారు. 2) విద్య అసమానతలు మరింత పెరిగిపోతాయి. 3) ఫీజులకు, డొనేషన్లకు నియంత్రణ ఉండదు. 4) రిజర్వేషన్ల సౌకర్యం అదృశ్యమవుతుంది. 5) విద్య ఒక పరిశ్రమగా మారిపోతుంది. అప్పుడు విద్యా విలువల స్థానంలో వ్యాపార విలువలు వచ్చి చేరుతాయి. 6) మార్కెట్ ఆధారిత కోర్సులను ఈ యూనివర్సిటీలు అందిస్తాయి. మౌలిక రంగాల విభాగాలలో పరిశోధనలను విస్మరిస్తాయి. 7) సాంప్రదాయక కోర్సులు, సామాజిక శాస్త్రాల మనుగడ కనుమరుగై సోషల్ ఇంజనీర్లు తయారు కారు. ఈ పరిణామం దేశానికి పెద్ద నష్టం తెచ్చిపెడుతుందనడంలో సందేహం లేదు. చివరకు మానవీయ విలువలు లేని, ఆలోచించలేని 'రోబో'లను ఈ యూనివర్సిటీలు తయారు చేస్తాయి. ఇప్పటికే ఛత్తీస్‌గఢ్ రాష్ట్రం తాలూకు చేదు అనుభవం మనకు ఉన్నది. ఈ రాష్ట్రంలో విద్యార్థిలోకం వ్యతిరేకించిన నేపథ్యంలో దేశ అత్యున్నత న్యాయస్థానమైన సుప్రీంకోర్టు 112 ప్రైవేట్ యూనివర్సిటీలను రద్దు చేసింది. ఈ అనుభవంలో నుంచి గుణపాఠాలు నేర్వని రాష్ట్ర ప్రభుత్వం విచ్చలవిడిగా ప్రైవేట్ యూనివర్సిటీల స్థాపనకు అనుమతి ఇవ్వడానికి ముసాయిదా బిల్లు సిద్ధం చేసి ఆమోదించిందంటే ఎవరి ప్రయోజనాల కోసం? అనేది బహిరంగ రహస్యమే. ఇదంతా ప్రైవేట్ కార్పొరేట్ విద్యా సంస్థల కోసమేనన్న వాదన బలంగా ప్రజలలో వినిపిస్తుంది. కొందరు కార్పొరేట్ విద్యా సంస్థల అధిపతులు ప్రభుత్వంలో భాగస్వాములుగా ఉన్నారు. పలు విద్యా సంస్థలకు చెందిన వ్యక్తులు ప్రభుత్వానికి బాగా దగ్గరగా ఉన్నారు. ఎన్నికలలో వీరంతా టిడిపికి అన్ని విధాలుగా సహకరించారనే విమర్శలు లేకపోలేదు. వీరి ఒత్తిడి వల్లే ప్రభుత్వం ప్రైవేట్ వర్సిటీల ఏర్పాటు దిశగా చకచక అడుగులేస్తున్నట్లు తెలుస్తుంది. ఈ చర్యతో రాష్ట్రంలో ఉన్నత విద్య కూడా కార్పొరేట్ విద్యా సంస్థల చేతుల్లోకి వెళ్లిపోతుందనే ఆందోళన క్రమంగా పెరుగుతుంది.

ఇప్పటికే ఇంటర్మీడియట్ విద్య కార్పొరేట్ విద్యా సంస్థలైన శ్రీ చైతన్య, నారాయణ, తదితరుల ఆధీనంలోకి పూర్తిగా వెళ్లిపోయింది. ఈ సంస్థలు విద్యా హక్కు చట్టం – 2009కి కూడా అతీతంగా తమ ఇష్టా రాజ్యంగా వ్యవహరిస్తూ ఇంటర్ విద్యను అంగడి సరుకుగా మార్చి వేశాయి. ఈ ప్రైవేట్ జూనియర్ కళాశాలలు ఇంటర్ విద్యను శాసిస్తుండడంతో ప్రభుత్వ జూనియర్ కళాశాలలు క్రమంగా కనుమరుగయ్యే దుస్థితి నెలకొంది. ఫలితంగా ఇంటర్ విద్యను 'కొన'లేని బడుగు జీవుల బిడ్డలు ఇక్కడే విద్యకు దూరమవుతున్నారు. ఈ స్థితి సమాజంలో తీవ్ర అస్థిరతకు, వివక్షతకు దారితీస్తుంది. ఈ పరిస్థితుల్లో రాష్ట్రంలో ప్రైవేట్ వర్సిటీలు ఏర్పాటైతే ఉన్నత విద్య కూడా కార్పొరేట్ పరమై, సామాన్యులకు 'అందని ద్రాక్ష'గా మిగిలిపోతుందని విద్యా వేత్తలు హెచ్చరిస్తున్నారు.

రాష్ట్రంలో ఇప్పటికే 20 ప్రభుత్వ యూనివర్సిటీలు ఉన్నాయి. ఇటీవల కొత్తగా ఏర్పడిన కృష్ణా, నన్నయ్య, యోగి వేమన, తదితర వర్సిటీలు చాలా వరకు ఇంకా బాలరిష్టాలతో సతమతమవుతున్నాయి. మౌలిక సదుపాయాలు లేకపోవడం, భోదన సిబ్బంది కొరతతో ఇబ్బందులు ఎదుర్కొంటున్నాయి. కొన్ని వర్సిటీలకైతే ఇంత వరకూ పూర్తి స్థాయి క్యాంపస్‌లు కూడా సమకూరలేదు. భూములు లేనందున మచిలీపట్నం లోని కృష్ణా వర్సిటీ ఇంకా ఆంధ్ర జాతీయ కళాశాలలోనే కొనసాగుతుంది. ఈ వర్సిటీలను పట్టించుకోని ప్రభుత్వం ప్రైవేట్ వర్సిటీల కోసం తపించడం శోచనీయం.

మరోవైపు కొత్తగా 11 కేంద్ర విద్యా సంస్థలు రాష్ట్రంలో ఏర్పాటు కానున్నాయి. మనకున్న వర్సిటీల్లోని సమస్యలను పరిష్కరించి, గాడిలో పెట్టడానికి చర్యలు తీసుకుంటే వాటితో పాటు కొత్తగా వచ్చే విద్యా సంస్థలతో రాష్ట్రంలో ఉన్నత విద్యను పటిష్టం చేయవచ్చు. ఈ దిశగా ప్రభుత్వం అడుగులు వేయాలి. స్వాతంత్ర్యానంతరం ఏర్పడిన రాధాకృష్ణన్ విశ్వవిద్యాలయ కమిషన్ (1948–49) కొఠారి కమిషన్‌లు విశ్వవిద్యాలయాల విద్యపై అధ్యయనం చేసి కేంద్ర ప్రభుత్వానికి సమర్పించిన నివేదికలు సామాజిక శాస్త్రాల ప్రాధాన్యతను దృష్టిలో పెట్టుకుని విద్యా విధాన రూపకల్పన జరగాలని పేర్కొన్నాయి. విలువలు, దేశాభివృద్ధి, మానవీయ సామాజిక వ్యక్తిత్వాలపై ఆసక్తి కలిగించే విద్యా విధానానికి రూపకల్పన జరగాలని రాధాకృష్ణ కమిషన్ సూచించింది. విద్యను ఉపాధికి అనుసంధానించబడే శాస్త్ర సాంకేతికాభివృద్ధి, జాతీయ అవసరాలు, ఆధునాతన సాంకేతికత వంటి అంశాలతో విద్యా విధాన రూపకలప్పన జరగాలని కొఠారి కమిషన్ సూచించింది.

దేశ ఆర్థికాభివృద్ధికి ఈ కమిషన్లు సూచించిన సిఫార్సులను వెంటనే అమలు చేయాలి. ప్రజలందరికీ విద్య అందుబాటులోకి రావాలంటే 'నాలెడ్జ్ కమిటీ' తన నివేదికలో పేర్కొన్నట్లు దేశ ప్రజల అవసరాలకు అనుగుణంగా విశ్వవిద్యాలయాలు, కళాశాలలు, వ్యవసాయ, పారిశ్రామిక రంగాలు అనుసంధానింపచేసే సాంకేతిక విద్యాలయాలను స్థాపించాలి. ఈ విద్యాభివృద్ధికి స్థూల జాతీయోత్పత్తిలో (జిడిపి) కనీసం 6 శాతం కేటాయించాలి. ప్రస్తుతం జిడిపిలో 3.5 శాతం మాత్రమే విద్యకు ఖర్చు చేస్తున్నారు. కేంద్ర బడ్జెట్‌లో 30 శాతం నిధులు కేటాయించాలి. రాష్ట్ర బడ్జెట్‌లో కూడా తగినంత కేటాయింపులుండాలి. ప్రైవేట్ విద్యను సంపూర్ణంగా రద్దు చేయాలి.

రాజ్యాంగ లక్ష్యాలకనుగుణంగా కుల, మత, ప్రాంతీయ వ్యత్యాసాలు బీద, ధనిక తారతమ్యాలు లేకుండా దేశంలోని పిల్లలందరికీ కామన్‌గా ప్రజాతంత్ర విద్యా వ్యవస్థను ఏర్పరచాలి. లేకుంటే మన విద్యా రంగం మరింత సంక్షోభానికి గురై, మార్కెట్‌లో అమ్ముడుపోయే సరుకుగా తయారైతే ఈ జాతి, దేశ భవిష్యత్తు ఏమైపోతాయో ఒక్కసారి ఆలోచించండి! మేధావులారా! ఉపాధ్యాయులారా! విద్యార్థులారా! ఈ దేశం మనది. ఈ దేశం ఉన్నతికై మంచి మానవీయ విలువలతో కూడిన ప్రజాతంత్ర విద్యా విధాన సాధనకై భగత్‌సింగ్ చూపిన వెలుగులో ఉద్యమించండి. సమ సమాజాన్ని నిర్మించండి. వంద పువ్వులు వికసించనియ్యండి వెయ్యి ఆలోచనా ధోరణులు వ్యాప్తి కానియ్యండి.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# క్రమబద్ధీకరణ సాధ్యమయ్యేనా?

***కాంట్రాక్టు ఉద్యోగుల క్రమబద్ధీకరణ సమస్యలో, ప్రత్యేకంగా విద్యారంగ ఉద్యోగుల సమస్యలో ఇమిడి ఉన్న అంశాలను వివరిస్తున్నారు సతీష్ బైరెడ్డి***

ప్రపంచ బ్యాంకుకు ప్రియమైన పాలకుడైన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు రెండవసారి అధికారంలోకి వచ్చాడు. బహుళజాతి కంపెనీచేత రాష్ట్ర సి.ఇ.ఒ.గా పిలిపించుకుంటున్న రోజుల్లో ఆనాటి ఉమ్మడి రాష్ట్ర ప్రజల ఆకాంక్షలను నెరవేర్చకుండా, సామ్రాజ్యవాద ఎజెండాను మోస్తున్న ప్రపంచబ్యాంకు విధానాలకు మొత్తం రాష్ట్రాన్నే ప్రయోగశాలగా మార్చి నిర్బంధంగా అమలుజరిపాడు. ఆనాడు మొత్తం పాలనను, ఆర్థికాభివృద్ధి విధానాలను ప్రపంచబ్యాంకే నిర్దేశించింది అంటే అతిశయోక్తి ఎంతమాత్రం కాదు. ఎజెండా ఫర్ ఎకనామిక్ రిఫార్మ్స్ పేరుతో మొత్తంగా రాష్ట్రంలో చేపట్టవలసిన సంస్కరణల చిట్టాను బలంగా ముందుకు తీసుకొచ్చింది ప్రపంచ బ్యాంకు. ఈ ఆర్థిక సంస్కరణల ఎజెండాలో భాగంగా రాష్ట్ర ప్రభుత్వంలోని వివిధ శాఖల్లో ఉద్యోగుల సంఖ్య అవసరమైన దానికంటే ఎక్కువగా ఉందని ఈ సంఖ్యను భారీగా కుదించడమేకాకుండా కొన్ని శాఖలను రద్దుపర్చాలని కూడా సూచించింది. సరిగ్గా ఇదే ప్రతిపాదనలను గంగోపాధ్యాయ కమిటీ కూడా ప్రభుత్వం ముందు పెట్టింది. సంక్షేమశాఖలోని ఉద్యోగులమీద ఎక్కువ ఖర్చుచేయాల్సిన అవసరంలేదని, అదనపు ఉద్యోగులను ఇతర శాఖల్లోకి బదిలీచేయాలని సూచించారు.

చంద్రబాబు నాయుడు అధికారంలో ఉన్న కాలంలోనే ఉద్యోగ నియామక ప్రక్రియ మొత్తం నిలిపివేయబడింది. కొన్ని పరిశ్రమల్లో స్వచ్ఛంద పదవీవిరమణ విధానాన్ని ప్రోత్సహించారు. పోలీసు, ఉపాధ్యాయ నియామకాలు తప్ప ఇతర ఉద్యోగాల భర్తీని చేపట్టకపోగా ప్రపంచ బ్యాంకు సూచనలతో కాంట్రాక్టు ఉద్యోగాల పద్ధతిని, ఔట్ సోర్సింగ్ ఉద్యోగాల విధానాన్ని ప్రవేశపెట్టారు. ఉద్యోగ భద్రత లేకుండా, అరకొర జీతాలతో ఉండే ఈ విధానాన్ని పూర్తి స్థాయిలో అమలుపర్చారు. ప్రాథమిక పాఠశాల స్థాయి నుండి విశ్వవిద్యాలయ స్థాయి వరకు ఒప్పంద ఉపాధ్యాయ, అధ్యాపక నియామక పద్ధతి అమలయింది. మిగతా శాఖల్లో ఉన్న ఖాళీలను భర్తీచేయకపోగా ఇతర శాఖల నుండి బదిలీచేయడమో, డిప్యుటేషన్ వేయడమో, కొన్ని శాఖలను కలిపివేసి ఉద్యోగుల అవసరాలను తగ్గించడమో చేశారు. చాలా శాఖల్లోని పని నిర్వహణను అనేక ప్రైవేట్ సంస్థలకు ఔట్ సోర్సింగ్ విధానంలో అప్పగించి శాశ్వత ఉద్యోగుల అవసరంలేదనేలా తెలుగుదేశం ప్రభుత్వం వ్యవహరించింది.

అసలు మొత్తంగా శాశ్వత ఉద్యోగ నియామకాలు అవసరం లేదని, ఉద్యోగ భద్రత ఉండకూడదని, సంక్షేమ కార్యక్రమాలు అమలు చేయకూడదని అంతా ప్రైవేట్ రంగంలోనే ఉపాధి, ఉద్యోగాలు వెతుక్కోవాలనే ప్రపంచ బ్యాంకు ఎజెండాను పకడ్బందీగా అమలు జరిపారు. 1990ల నుండి బలంగా తీసుకువచ్చిన నూతన ఆర్థిక విధానాల వెలుగులోనే ఇవి అమలు జరపడం వల్ల వాటిని ముందుకు తెచ్చిన కాంగ్రెస్ పార్టీకి సూత్రబద్ధంగా ఈ విధానాల విషయంలో ఏకీభావం ఉండడంతో ఆనాటి ప్రభుత్వాన్ని వ్యతిరేకించకుండా ప్రతిపక్షంలో ఉన్నామన్న కారణంగా కొన్ని ప్రకటనలతో సరిపెట్టుకున్నది. ఈ కాంట్రాక్టు ఉద్యోగ విధానాన్ని వ్యతిరేకిస్తూ ప్రజాభిప్రాయాన్ని కూడగట్టి ఉద్యమించే పనిచేయలేదు. వామపక్ష పార్టీలు, అనేక ప్రజా సంఘాలు, ఉద్యోగ సంఘాలు ఈ విధానాన్ని మొదటినుండి తీవ్రంగానే వ్యతిరేకిస్తూ వస్తున్నాయి. ఈ కాంట్రాక్టు ఉద్యోగ పద్ధతి ఒక్క శాఖ అని కాదు, రాష్ట్రంలో అన్ని శాఖల్లోను దీన్ని 2000 సంవత్సరం నుండి విస్తృతంగా అమలు చేస్తున్నారు. ప్రధానంగా విద్యుత్, వైద్య, విద్యా రంగాలతో పాటు గ్రామీణాభివృద్ధి శాఖల్లో ఈ ఒప్పంద ఉద్యోగులు అధిక సంఖ్యలో పనిచేస్తున్నారు. 4వ తరగతి ఉద్యోగుల నుండి మొదలుకుంటే గ్రూప్-1 క్యాడర్, గెజిటెడ్ హోదా కల్గినటువంటి ఉద్యోగాలు ఈ కాంట్రాక్టు పద్ధతిలో ఉన్నాయి.

ఉద్యోగ నియామకాలు పూర్తిగా నిలిపివేయడంతో దిక్కుతోచని స్థితిలో నిరుద్యోగులంతా అనివార్యంగా ఒప్పంద ప్రాతిపదికన ఉద్యోగాల్లో చేరడానికి మొగ్గుచూపారు. అన్ని శాఖల్లో కాంట్రాక్టు, ఔట్ సోర్సింగ్ ప్రాతిపదికన నియమితులైనవారి సంఖ్య ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లోనే రెండు లక్షల వరకు చేరుకున్నది. ఇటువంటి ఒప్పంద ఉద్యోగ పద్ధతివల్ల తెలంగాణ ప్రాంతం తీవ్రంగా నష్టపోయింది. అంతంత మాత్రంగానే ఉన్న వ్యవసాయ రంగానికి తోడు ఉపాధి ఉద్యోగ అవకాశాలు లభించక అప్పటికే ఉద్యోగాలను కోల్పోయిన తెలంగాణ ప్రజల ప్రయోజనాలకు ఈ విధానం వల్ల తీవ్ర విఘాతం కల్గింది.

ఈ దశలోనే తెలంగాణ ప్రాంతంలో ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్ష ఉద్యమ రూపం దాల్చి తీవ్రత పెరిగిన నేపథ్యంలో ప్రపంచబ్యాంకు ప్రేరేపిత భద్రత లేని ఉద్యోగ విధానంపై తీవ్రమైన చర్చనే చెలరేగింది. నియామకాల్లో జరిగిన అన్యాయం, తీవ్రమైన నష్టం రీత్యా తెలంగాణ ప్రాంత లక్షలాది నిరుద్యోగుల్లో ఈ విధానంపై తీవ్ర వ్యతిరేకత పెరిగింది. దీనికితోడు ఇవాల్టి అధికార పార్టీతోపాటు అనేక తెలంగాణ ఉద్యమ, ఉద్యోగ సంఘాలు ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన నాటి నుండి తెలంగాణ ఏర్పడేదాక 36వ జిఓ, 610 జిఓను ఉటంకిస్తూ రెండున్నర లక్షల ఉద్యోగాలు తెలంగాణకు దక్కకుండా పోయినవని విస్తృతంగా ప్రచారం చేయడంతో తెలంగాణ నిరుద్యోగుల్లో ఆ ఉద్యోగాలు తిరిగివస్తాయనే ఆశల్ని రేకెత్తించింది. ఉద్యమంలోకి విస్తృత ప్రజారాసుల్ని మమేకంచేసే క్రమంలో తెలంగాణ రాష్ట్ర సమితి రాష్ట్రం సిద్ధించగానే లక్షలాదిగా ఉద్యోగాలు కల్పిస్తామని, కాంట్రాక్టు ఉద్యోగులందరిని క్రమబద్ధీకరిస్తామని

ఉద్యమ, ఎన్నికల సందర్భంలో పదేపదే హామీ ఇస్తూ వచ్చింది. రాష్ట్రం ఆవిర్భవించి తెలంగాణ రాష్ట్ర సమితి అధికారంలోకి వచ్చిన క్రమంలో తెలంగాణ రాష్ట్ర నిరుద్యోగుల్లో, కాంట్రాక్టు ఉద్యోగుల్లో ఆశలు అమాంతం పెరిగిపోయినవి.

గత 18 నెలల కాలం నుండి తెలంగాణ పబ్లిక్ సర్వీస్ కమీషన్ ఏర్పడి అరకొర నోటిఫికేషన్‌లు వచ్చినప్పటికిని స్వంత రాష్ట్రంలో ఒక్క నియామక పత్రంకూడా అందివ్వలేకపోయింది. అధికారంలోకి వచ్చిన తొలినాళ్లలో లక్షాఏడువేల ప్రభుత్వ ఖాళీలున్నాయని ప్రభుత్వమే ప్రకటించింది. ఈ కాలంలోనే అన్నివర్గాల నుండి పెరిగిన ఒత్తిడి రీత్యా కొన్ని ఉద్యోగ ప్రకటనలను తెలంగాణ పబ్లిక్ సర్వీస్ కమీషన్ ద్వారా వెలువరించి నప్పటికి అవి మొత్తం 15 వేలు దాటలేదు. దీంతో నిరుద్యోగుల్లో తీవ్రమైన అసహనం, అసంతృప్తి నెలకొన్నది. అనేక వేదికల ద్వారా రాష్ట్ర ముఖ్యమంత్రి ఒప్పంద ఉద్యోగుల్ని క్రమబద్ధీకరిస్తాం అని చెప్పడం, హైకోర్టు తీర్పుతో గ్రేటర్ హైద్రాబాద్ మున్సిపల్ కార్పొరేషన్ ఎన్నికలు అనివార్యంగా జరపాల్సిరావడంతో తొలి సంవత్సర ఆరంభంలో సుదీర్ఘ క్యాబినేట్ భేటి అనంతరం ఎన్నికలను దృష్టిలోఉంచుకొని ఈ అంశంపై అధికారిక ప్రకటన వెలువడింది. ఒప్పంద ఉద్యోగుల క్రమబద్ధీకరణ అంశమే ప్రధాన చర్చనీయాంశమైంది. మున్సిపల్ కార్మికులు, పాఠశాలల్లో పనిచేసే స్వీపర్ ఉద్యోగులు, ఆశ ఉద్యోగులు సుదీర్ఘకాలం సమ్మెచేసినా స్పందించని ప్రభుత్వం క్రమబద్ధీకరణ అంశాన్ని తెరపైకి తేవడంతో ఆశలతోపాటు అనుమానాల్ని రేకెత్తిస్తుంది.

ఈ ఒప్పంద ఉద్యోగుల్లో గెజిటెడ్, నాన్ గెజిటెడ్, సాంకేతిక, సాంక్షన్ పోస్టులు లేనటువంటి ఉద్యోగాలున్నాయి. ఆయా ఉద్యోగాలన్నింటికి అప్పటికే స్థిరపడిపోయిన ఒక చారిత్రక, చట్టబద్ధ నియామక పద్ధతు లున్నాయి. వీటన్నింటినీ తోసిరాజని, రాజ్యాంగ చట్టబద్ధ చిక్కుముళ్లను ప్రక్కనపెట్టి వీరందరిని ఆయా ఉద్యోగాల్లో క్రమబద్ధీకరించే అవకాశాలున్నాయా? రాజకీయ ప్రయోజనాలకోసం ఎన్నికల సందర్భాల్లో చట్టపరమైన పరిమితుల్ని, అడ్డంకులను ఆలోచించకుండా ఏ హామీలు అయిన ఇవ్వడం రాజకీయ పార్టీలకు అలవాటుగా మారిపోయింది. ఆ హామీలను నెరవేర్చలేని క్రమంలో న్యాయస్థానాలను కూడా నిందించడం పరిపాటయింది.

కాంట్రాక్టు ఉద్యోగాల పద్ధతిని రద్దుపరిచే విధానాన్ని సమాజమంతా కోరుకుంటుంది. అయితే ఈ రద్దుపర్చడమనేది ఆయా కాంట్రాక్టు ఉద్యోగుల్ని క్రమబద్ధీకరించడమా? లేదా, ఆయా ఉద్యోగాల భర్తీకై అప్పటికే అమలులో ఉన్న రాజ్యాంగబద్ధ ఎంపిక సంస్థ ద్వారా భర్తీచేస్తూ రద్దుపర్చడమా? తాత్కాలికంగా ఉద్యోగాల్లో తీసుకొని క్రమంగా క్రమబద్ధీకరించే పద్ధతి కొన్ని శాఖల్లో కొనసాగిందనేది ఒక వాస్తవం. కానీ ప్రస్తుతం ఉన్న అన్ని ఉద్యోగాలకు ఆ పద్ధతి వర్తించకపోవచ్చు. రాష్ట్రం సిద్ధించడంతో ఉపాధి, ఉద్యోగ అంశాల్లో పెరిగిపోయినటువంటి ఆశ దృష్ట్యా ఉద్యోగ నోటిఫికేషన్ల కోసం ఎంతో ఆశగా ఎదురుచూస్తున్న లక్షలాది నిరుద్యోగుల్లో ఎన్నో భయాందోళనలు ఈ క్రమబద్ధీకరణ ప్రకటనతో నెలకొన్నాయి. ఒకరకంగా ప్రభుత్వాలే ప్రజల మధ్య వైరుధ్యాలను ఈ అంశంలో సృష్టిస్తున్నాయా? అనే అనుమానాలు తలెత్తుతున్నాయి. అనేక ఏళ్లుగా చాలీచాలని జీతాలతో ఉద్యోగ భద్రత కూడా లేకుండా శ్రమదోపిడికి గురౌతూ వయస్సు పైబడుతున్నవారు, కుటుంబాలను పోషించలేనివారు వేలసంఖ్యల్లో కాంట్రాక్టు ఉద్యోగులలో ఉన్నారు. వారి ఉద్యోగాలను క్రమబద్ధీకరించాలనే వారి డిమాండ్ చాలా సహజమైనది, మానవీయమైనది, సమర్థనీయమైనది కూడా. కానీ న్యాయబద్ధమైనదేనా? అనే ప్రశ్నకూడా తలెత్తుతున్నది. అనేక ఏళ్లుగా ఏదోఒక ఉపాధితో నెట్టుకొస్తున్నవాళ్లది ఒక స్థితి అయితే, ఏ ఉద్యోగం లేకుండా వయస్సుమీరిన వాళ్లది మరీ దయనీయస్థితి. ఇవాళ తెలంగాణ ప్రభుత్వం తీసుకున్న ఈ నిర్ణయం కొన్ని వర్గాలకు మోదాన్ని, మరికొన్ని వర్గాలకు ఖేదాన్ని కల్గించిందనేది వాస్తవం.

నాల్గవ, మూడవ తరగతి ఉద్యోగాల క్రమబద్ధీకరణకు తెలంగాణ సమాజంలో దాదాపు పూర్తి ఆమోదం ఉన్నప్పటికినీ ఆపై స్థాయి ఉద్యోగాలకు సంబంధించి తీవ్రమైన అసంతృప్తి, అసహనం చోటుచేసుకుంటున్నది. ఆ ఉద్యోగాలకు బహిరంగంగా, రాజ్యాంగబద్దంగా ఏర్పడి స్వయంప్రతిపత్తి కల్గిన ఎంపిక సంస్థల ద్వారా ఉద్యోగ నియామక ప్రక్రియను చేపట్టే విధానం స్థిరపడిపోయింది. ఈ పక్రియను మొత్తం ప్రక్కనపెట్టి తాత్కాలిక ప్రాతిపదికన వచ్చిన వారందరినీ శాశ్వతీకరిస్తే మాకు అవకాశాలు రాకుండా పోవడమే కాకుండా మా హక్కుల్ని ఉల్లంఘించినట్లవుతుందని, వారినిమాత్రమే క్రమబద్ధీకరిస్తే పాక్షిక న్యాయమని, అందరికి అవకాశాలను సమాన హక్కుల ప్రాతిపదికన ఇచ్చినట్లయితే విస్తృత న్యాయం జరుగుతుందని అనేక కోర్టు తీర్పులను ఉటంకిస్తూ నిరుద్యోగులు వాదిస్తున్నారు.

**అసలు సమస్య విద్యారంగ ఉద్యోగాలే**

కాంట్రాక్టు ఉద్యోగాల శకం ప్రారంభమైన దశలో స్పష్టమైన మార్గనిర్దేశకాలు లేకపోవడంతో ఆ నియామక ప్రక్రియ మొత్తం లోపభూయిష్టంగా మారిపోయింది. రెగ్యులర్ నియామక పద్ధతిని గమనించినంతగా, న్యాయ పరమైన అంశాలపై దృష్టి పెట్టినంతగా ఈ తాత్కాలిక ఉద్యోగాల నియామకాల ప్రక్రియపై శ్రద్ధ నిఘా ఉండవనేది వాస్తవం. ఈ పరిస్థితే ఈ ఉద్యోగ ఎంపిక పద్ధతిలో తీవ్రమైన ఆశ్రిత పక్షపాతం, బంధుప్రీతి, అవినీతి కలగలిసి భ్రష్టుపట్టించాయి. విద్యుత్, వైద్య శాఖల్లోని కాంట్రాక్టు ఉద్యోగ నియామకాలపై దుమారం చెలరేగినప్పటికినీ విద్యాశాఖలోని ఉద్యోగాలపై ఉన్న ప్రత్యేక దృష్టి, అవగాహనతో కూడిన విద్యావంతులవల్ల ఈ శాఖకు సంబంధించిన ఉద్యోగాలపైననే ఎక్కువ చర్చ, క్రమబద్ధీకరణపై వ్యతిరేకత కన్పిస్తున్నది. 2000 సం॥లో 143వ జిఒ ద్వారా ప్రభుత్వ జూనియర్ కళాశాలల్లో కాంట్రాక్టు లెక్చరర్లను ఎంపికచేసుకొనే ప్రక్రియ మొదలయింది. ముగ్గురు సభ్యులతో కూడిన ఎంపిక కమిటిచేత నియమించబడ్డారు.

2007 సం॥ వరకు ఎటువంటి రూల్ ఆఫ్ రిజర్వేషన్, రోస్టర్ పాయింట్, మెరిట్‌లాంటివి చూడకుండానే నియామకాలు జరిగినవని 2007 జూలై 2న మాత్రమే 61వ జిఒ ద్వారా రిజర్వేషన్లు పాటించాలనే నియమం మొదలయిందని నిరుద్యోగులు అభిప్రాయపడుతున్నారు. డిగ్రీ కళాశాలల్లో లెక్చరర్స్‌గా పనిచేయడానికి కావల్సిన అర్హతలైనా పి.హెచ్.డిలు, రాష్ట్ర / జాతీయ అర్హతా పరీక్ష (ఎన్ఇటి / ఎస్ఎల్ఇటి) లేకుండానే విషయ పరిజ్ఞాన, బోధనా నైపుణ్య పరీక్ష లేకుండా ఉద్యోగాల సంఖ్యను, నియామక పద్ధతిని విధిగా తెల్పకుండా ఏ నిబంధనలను పాటించకుండా ఎంపిక చేసినటువంటి సందర్భాలే అనేకం ఉన్నాయి. అనేక కళాశాలల్లో సాంక్షన్ పోస్టులు కూడా లేవు. ఈ ఉద్యోగులకు

# కార్పొరేట్ల శ్రేయస్సుకే విశాఖ భాగస్వామ్య సదస్సు

*అభివృద్ధి పేరుతో లక్షలాది తీర ప్రాంత ప్రజలను నిర్వాసితులను చేస్తూ, వనరులను ధ్వంసం చేస్తూ, కార్పొరేట్ సంస్థలకు దేశ సంపదలను కట్టబెట్టడానికే ప్రభుత్వం భాగస్వామ్య సదస్సును నిర్వహించిందంటున్నారు* **పి.వి. రమణ**

విశాఖపట్నంలో అంతర్జాతీయ పెట్టుబడిదారుల భాగస్వామ్య సదస్సు 3 రోజుల పాటు జనవరి 10 నుండి 12 వరకు జరిగింది. 'సన్‌రైజ్ స్టేట్ ఆఫ్ ఎ.పి ఇన్వెస్టర్స్ మీట్' పేరిట భారత పరిశ్రమ సమాఖ్య (సి.ఐ.ఐ), రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల ఆధ్వర్యంలో ఈ సదస్సు జరిగింది. ఈ సదస్సులో 41 దేశాల నుండి 350 మంది, వివిధ రాష్ట్రాల నుండి సుమారు 1200 మంది ప్రతినిధులు పాల్గొన్నారు. గొప్ప ప్రచార ఆర్భాటంతో జరిగిన ఈ సమావేశాలల్లో 3 రోజుల్లో 331 ఒప్పందాలు, రు. 4,76,878 కోట్ల పెట్టుబడుల హామీ, 10,27,121 మందికి ఉపాధి, ఉద్యోగాల హామీ ప్రకటించారు.

సదస్సులో రంగాల వారీగా ఒప్పందాలు చూస్తే పరిశ్రమలు 115, పెట్టుబడులు రు. 2,01,277 కోట్లు' ఇంధనం 24, పెట్టుబడులు రు. 1,45,842 కోట్లు' మౌలిక సదుపాయాలు 8, పెట్టుబడులు రు. 43,900 కోట్లు' గృహనిర్మాణం 4, పెట్టుబడులు రు. 41,500 కోట్లు, సి.ఆర్.డి.ఎ. 4, పెట్టుబడులు రు. 13,000 కోట్లు' మైనింగ్ 25, పెట్టుబడులు రు. 6,455 కోట్లు' ఆహార శుద్ధి 65, పెట్టుబడులు రు. 5,102 కోట్లు' పర్యాటకం 26, పెట్టుబడులు రు. 4,659 కోట్లు' ఐ.టి. 64, పెట్టుబడులు రు. 3,368 కోట్లు' రిటైల్ 4, పెట్టుబడులు రు. 1,480 కోట్లు' పురపాలన 1, పెట్టుబడులు రు. 500 కోట్లు' పశుసంవర్ధకం 6, పెట్టుబడులు రు. 195 కోట్లు' నైపుణ్యాభివృద్ధి 15గా నమోదయ్యాయి.

ఈ సమావేశంలో కేంద్ర మంత్రులు అరుణ్‌జైట్లీ, నిర్మలా సీతారామన్, వెంకయ్య నాయుడు, అనంత కుమార్, అశోక్ గజపతి రాజు, పియూష్ గోయల్, ప్రకాశ్ జవదేకర్, అనంతకుమార్, జయంతీ సిన్హా, సుజనా చౌదరి తో పాటు రాష్ట్ర ఉప ముఖ్యమంత్రి, 15 మంది రాష్ట్ర మంత్రులు, గవర్నర్ నరసింహన్, మాలే, బంగ్లాదేశ్, నేపాల్ లాంటి దేశాలకు చెందిన 14 మంది మంత్రులు, కాన్సలేట్ జనరల్స్, రాయబారులు, అమెరికా, చైనా నుండి దాదాపు 40 మంది, రిలయన్స్ అధినేత అనిల్ అంబానీ, గోద్రేజ్ చైర్మన్ ఆది గోద్రేజ్, జి.ఎం.ఆర్ అధినేత గ్రంధి మల్లికార్జునరావు, భారత్ ఫోర్జ్ సిఎండి బాబా కళ్యాణి, ఫోర్బ్స్ డైరెక్టర్ నౌషద్ ఫోర్బ్స్, ఫ్యూచర్ గ్రూప్ సిఇఒ కిషోర్ జియాని, ఆదిత్య బిర్లా సిఇఒ విశాల్ కుమార్, ఐటిసి ఇడి నకుల్ ఆనంద్, ఇండిగో అధ్యక్షులు ఆదిత్య ఘోష్, వాల్‌మార్ట్ ప్రెసిడెంట్ క్రిషివేరాలతో పాటు సిఐఐ డిజి చంద్రజిత్ బెనర్జీ, రాష్ట్ర అధ్యక్షులు సుమిత్ సురేష్ రాయుడులు పాల్గొన్నారు.

ప్రతినిధులందరికీ విలాసవంతమైన స్టార్ హోటళ్లు, ఖరీదైన కార్లు, విందు భోజనాలు ఏర్పాటు చేశారు. దీనికి దాదాపు రు. 20 కోట్లు ఖర్చయిందని ఒక అంచనా. విశాఖ నగరం మొత్తం పోలీసు బలగాలు మోహరించాయి. సివిల్, ఆక్టోపస్, గ్రేహౌండ్స్ పోలీసులు దాదాపు 2000 మందిని బందోబస్తుకు వినియోగించారు. వారితో పాటు నేవీ, మెరైన్, కోస్ట్‌గార్డ్ బలగాలు భద్రతా విధులలో పాల్గొన్నారు. నగరంలోని 47 ప్రధాన కూడళ్లలో సిసి కెమెరాలు ఏర్పాటు చేసి నిఘాను కట్టుదిట్టం చేశారు. సదస్సు కోసం వివిధ ట్రావెల్ ఏజెన్సీలకు చెందిన 2 వేల కార్లను తరలించారు. ప్రతినిధులకు ఏర్పాటు చేసిన ఒక్కో భోజనం ఖరీదు 3 వేల రూపాయలని అంచనా.

కార్పొరేట్ శక్తులను ఆకర్షించడంలో చంద్రబాబు అంత మొనగాడు లేడని కేంద్ర మంత్రులూ, అలాగే ఎటువంటి ఆటంకాలు లేకుండా

---

తాత్కాలిక ఎంపిక విధానంలో తదుపరి సంవత్సరం రెన్యువల్ చేయాలనే నిబంధనే లేనప్పుడు ఏకాఏకిన క్రమబద్ధీకరించడం ఎలా సాధ్యమన్న ప్రశ్నను నిరుద్యోగులు లేవనెత్తుతున్నారు.

రాజ్యాంగంలోని 14,16 (1) అధికరణ ప్రకారం అర్హులైనవారందరి సమాన అవకాశాలు కల్పించాలని అధికరణం 335, 16(3) ప్రకారం ఉద్యోగ నియామకాల్లో రిజర్వేషన్స్ పాటించాలనే నియమ నిబంధనలను ఈ క్రమబద్ధీకరణ నిర్ణయం ఉల్లంఘిస్తున్నదని అనేక కోర్టు తీర్పులను ఉదాహరణలుగా పేర్కొంటున్నారు. స్టేట్ ఆఫ్ కర్ణాటక వర్సెస్ ఉమాదేవి, ఇతరులు (2000), యుపిఎస్‌సి వర్సెస్ గిరీష్ జయంతిలాల్ వాఘేలా (2006), స్టేట్ ఆఫ్ ఒరిస్సా వర్సెస్ మమతా మహంతి (2011), రేను, ఇతరులు వర్సెస్ జిల్లా సెషన్స్ జడ్జి, టి.ఎన్.హజారి 2011, సురేష్ కుమార్ వర్సెస్ స్టేట్ ఆఫ్ హర్యానా (2013) కేసులో సుప్రీంకోర్టు స్పష్టమైన తీర్పునిచ్చిందని చెబుతున్నారు. 2012 లో కర్ణాటక హైకోర్టు అసిస్టెంట్, జూనియర్ ఇంజనీర్స్ కాంట్రాక్టు పద్ధతిన నియామకమైన వారిని రెగ్యులరైజ్ చేసే ప్రభుత్వ నిర్ణయాన్ని కొట్టివేస్తూ చట్టం ముందు అందరూ సమానమే అనే ప్రాతిపదికన అర్హులైన అందరికీ అవకాశం కల్పించి ఉద్యోగ నియామకాలు చేపట్టాలని ఆదేశించింది. ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వం పాఠశాలల్లో పనిచేస్తున్న లక్షకు పైగా పారాటీచర్స్‌ను క్రమబద్ధీకరిస్తూ తీసుకున్న నిర్ణయాన్ని చట్టవిరుద్ధమని అలహాబాద్ హైకోర్టు తీర్పుచెప్పింది. ఇదిలా ఉంటే పదోన్నతి పొందే అవకాశాలు కోల్పోతామని కిందిస్థాయి ఉద్యోగులు కూడా దీన్ని వ్యతిరేకిస్తున్నారు. ఒక వైపు నిరుద్యోగులు, మరోవైపు ఏళ్లతరబడి పనిచేస్తున్న కాంట్రాక్టు ఉద్యోగులు వీరిమధ్య ఎటువంటి వైషమ్యాలను రేకెత్తించకుండా అందరికీ ఆమోదయోగ్యమైన పరిష్కారం సాధ్యం కాకపోయినా మెజారిటీ ప్రజలకి, విస్తృత న్యాయం దిశగా ప్రభుత్వం చర్యలు చేపట్టాలి.

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)* వీ

భూములు, వనరులు తాము కోరుకున్న చోట, కోరుకున్న పద్ధతుల్లో, కోరుకున్నంత అప్పజెప్పుతున్న నాయకుడు దొరికాడని కార్పొరేట్ సంస్థల యాజమాన్యాలు ఏకకంఠంతో ఒకరిని మించి మరొకరు పోటీ పడి మరీ పొగడ్తలు గుప్పించారు.

సదస్సులో చంద్రబాబు నాయుడు మాట్లాడుతూ 'భారతదేశం ఓ స్లీపింగ్ జెయింట్. 120 కోట్ల జనాభాతో అతి పెద్ద మార్కెట్ భారత్ సొంతం. సువిశాలమైన సముద్ర తీరమే రాష్ట్రానికి పెద్ద వనరు. దీన్నే పెట్టుబడిగా పెట్టి ముందుకు వెళుతున్నాం. ఈ ఏడాది సముద్ర తీర ప్రాంతం, పోర్టు అభివృద్ధి పైనే ఎక్కువ దృష్టి సారిస్తున్నాం. పెట్టుబడులతో వచ్చేవారికి ఎటువంటి ఇబ్బందులు ఉండబోవు. ఎపి లో కావలసినంత భూమి, 24 గంటల విద్యుత్ సరఫరా, పుష్కలంగా నీరు, అపారమైన ఖనిజ సంపద, వ్యాపారానికి అనుకూలమైన వాతావరణం, 21 రోజుల్లో అనుమతులు ఇచ్చేలా సింగిల్ డెస్క్ విధానం అమలు జరుగుతుందని' హామీ ఇచ్చారు. కేంద్ర ఆర్థిక మంత్రి అరుణ్ జైట్లీ మాట్లాడుతూ 'భారత దేశ అభివృద్ధి ఇంజన్ ఆంధ్రప్రదేశ్. పెట్టుబడుల గమ్యస్థానంగా ఆంధ్రప్రదేశ్‌కు రెండు గొప్ప సంపదలు ఉన్నాయి. ఒకటి తెలుగువారిలో ఉన్న అత్యున్నత స్థాయి వ్యాపార దక్షత, తెలుగువారు రిస్క్ తీసుకోవడానికి వెనుకాడరు. రెండోది నాయకత్వం. చంద్రబాబు లాంటి వ్యక్తిని అరుదుగా చూస్తాం. విభజిత ఆంధ్రప్రదేశ్‌ను అభివృద్ధి చేయగల దార్శనికుడు ఎవరా అని ఆలోచిస్తున్న ప్రజలకు చంద్రబాబు కనిపించాడు. అందుకే ఆయనను అధిక మెజారిటీతో గెలిపించారు'. అంటూ పొగడ్తలు గుప్పించారు.

కేంద్ర పట్టణాభివృద్ధి శాఖ మంత్రి వెంకయ్యనాయుడు మాట్లాడుతూ 'ముఖ్యమంత్రి చంద్రబాబు దూరదృష్టిగల నాయకుడని, కేంద్రం ఏ కొత్త పథకం పెట్టినా ఒకరోజు ముందుగానే అందులో తమ రాష్ట్రాన్ని చేర్చాలని అడుగుతారని, అది అతని వేగవంతమైన పని తీరుకు నిదర్శనమని అన్నారు. ఆంధ్రప్రదేశ్‌లో వనరులకు కొరవలేదని, కావలసినంత రహదారులు, రైల్వేలైన్‌లు, సముద్రతీరం ఉన్నాయి. ఆపరేషనల్ ఎయిర్‌పోర్టు, ఎక్కడికక్కడ కనెక్టివిటీ, కష్టపడి పనిచేసే నిపుణులు పెద్ద సంఖ్యలోనే ఉన్నారు. ఏపిలోనూ, కేంద్రంలోనూ స్థిరమైన ప్రభుత్వాలు న్నాయి.

కేంద్ర ఆర్థిక సహాయ మంత్రి జయంత్ సిన్హా మాట్లాడుతూ చంద్రబాబు తన సామర్థ్యంతో ఏపిని మరో కాలిఫోర్నియాగా తీర్చిదిద్దగలరని, రేపు భారతదేశంలో జరిగే అభివృద్ధి ఏపిలో నేడే జరుగుతుందని, సామాజిక దృక్పథాన్ని విడవకుండా మార్కెట్ సంస్కరణలను అమలుచేయడం ప్రధాని మోదీ, చంద్రబాబు ఘనత అని, ఏపిలో అమలు చేస్తున్న సంక్షేమ పథకాలను అమలు చేయాలని తన స్వంత రాష్ట్రమయిన జార్ఖండ్ ముఖ్యమంత్రిని కోరానని చెప్పారు.

కేంద్ర ఎరువుల, రసాయనాల శాఖా మంత్రి అనంతకుమార్, 'సన్‌రైజ్ స్టేట్‌తో పాటు, సి.ఐ.ఐ. సదస్సుకు కూడా చంద్రబాబు అయస్కాంతంలో పనిచేసారు. ఆయన కృషి వల్లనే ఇవన్నీ సాధ్యమయ్యాయి. నదుల అనుసంధానంతో నీటికోసం అపరభగీరధుడిలా ప్రయత్నం చేస్తున్నారు. అమరావతి నిర్మాణానికి నడుం కట్టి విశ్వకర్మ అయిపోయారు' అని పొగడ్తలు గుప్పించారు. విశాఖపట్నంలో 600 కోట్ల రూపాయల పెట్టుబడితో ఫార్మా హబ్‌ను నిర్మిస్తామన్నారు. హిందూస్థాన్ పెట్రోలియం రిఫైనరీని 30 వేల కోట్ల రూపాయల పెట్టుబడితో విస్తరిస్తామన్నారు. విశాఖ–కాకినాడ పెట్రో కెమికల్ కాంప్లెక్స్ ఏర్పాటు చేస్తామని దీనికి దాదాపు 40–50 వేలకోట్ల రూపాయల పెట్టుబడులు వస్తాయని చెప్పారు.

రిలయన్స్ అధినేత అనిల్ అంబాని 'ఏ రాష్ట్రమైనా పారిశ్రామికంగా ముందుకు వెళ్లాలంటే వనరులు, నైపుణ్యాలు, మంచి పరిపాలన, ముందుచూపు, పెట్టుబడిదారులకు రక్షణ, సమర్థ రాజకీయ నాయకత్వం అవసరమని, ప్రధాని మోదీలాగే చంద్రబాబు గొప్ప నాయకుడని' పొగిడారు.

ఆసియా డెవలప్‌మెంట్ బ్యాంక్ (ఎడిబి) కంట్రీ డైరెక్టర్ థెరిసా కో తీరప్రాంతమే ఆంధ్రాకు అదృష్టరేఖ అని అన్నారు. వైజాగ్–చెన్నై ఇండస్ట్రియల్ కారిడార్‌లతో ఆంధ్రప్రదేశ్ రూపురేఖలు మారిపోతాయి. సుమారు 6 వేల కోట్ల రూపాయల పెట్టుబడులతో ఈ కారిడార్ నిర్మాణమవుతుందని అన్నారు. ఈ కారిడార్‌లో ఫుడ్ ప్రాసెసింగ్, టెక్స్‌టైల్స్, కెమికల్స్, పెట్రో కెమికల్స్, ఫార్మా, మెటలర్జీ, ఎలక్ట్రానిక్, ఆటో రంగాలకు చెందిన పరిశ్రమలు పెద్ద ఎత్తున వస్తాయని, ఈ కారిడార్‌కు ఎడిబి దాదాపు 4500 కోట్ల రూపాయల వరకు రుణాన్ని అందజేస్తుందని ప్రకటించారు.

భాగస్వామ్య సదస్సులో వచ్చిన హామీల ప్రకారం చైనా కంపెనీ గోల్డెన్ కాంకర్డ్ హోల్డింగ్స్, పారిశ్రామిక వేత్త సుభాష్‌చంద్ర ఆధ్వర్యంలో 86 వేల కోట్ల రూపాయల పెట్టుబడితో 2 ఒప్పందాలు జరిగాయి. 2 వేల ఎకరాల భూమిలో సోలార్ పరికరాల తయారీ ప్లాంటు ఏర్పాటు చేస్తారు. 73 వేల కోట్ల రూపాయల పెట్టుబడితో స్మార్ట్ ఇండస్ట్రియల్ టౌన్‌షిప్ ఏర్పాటు చేస్తారు. దీనిలో 200 పరిశ్రమల ఏర్పాటుకు వసతి ఉంటుంది. చైనాకు చెందిన ట్రిన్ సోలార్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్ ఆధ్వర్యంలో విశాఖ జిల్లా, అచ్యుతాపురం సెజ్‌లో 3 వేల కోట్ల రూపాయల పెట్టుబడులతో 90 ఎకరాల భూమిలో సోలార్ పరికరాల తయారీ పరిశ్రమ ఏర్పాటు జరుగుతుంది. మలేషియాకు చెందిన ఐసోమేరిక్ కంపెనీ 3 వేల కోట్ల రూపాయల పెట్టుబడితో నేచురల్ గ్యాస్‌ను వాయు రూపంలోకి మార్చే ప్లాంటును కృష్ణపట్నం పోర్టులో నిర్మిస్తారు.

ఆస్ట్రేలియాకు చెందిన క్వీన్స్ లాండ్ కోల్ కార్పొరేషన్ కృష్ణాజిల్లాలో 3680 కోట్ల రూపాయల పెట్టుబడితో థర్మల్ పవర్ ప్లాంట్ ఏర్పాటు చేస్తారు. చైనా కు చెందిన షాని గ్రూపు కృష్ణా జిల్లాలోని 32 వేల కోట్ల రూపాయల పెట్టుబడితో భారీ విద్యుత్‌ప్లాంట్‌ను ఏర్పాటు చేస్తారు. రిలయన్స్ ఏ.డి.జి. సంస్థ 5,000 కోట్ల రూపాయల పెట్టుబడితో విశాఖపట్నం, రాంబిల్లి వద్ద ప్రపంచ స్థాయి ప్రమాణాలతో నౌకా నిర్మాణ కేంద్రాన్ని నిర్మించబోతున్నారని అధినేత అనిల్ అంబాని చెప్పారు. భారత నౌకాదళం వచ్చే 15 సంవత్సరాలలో అధునాతన జలాంతర్గాములు, విమాన వాహక నౌక (ఎయిర్ క్రాఫ్ట్ కారియర్స్) ను సమకూర్చుకోవడానికి 3 లక్షల కోట్ల రూపాయలు వెచ్చించబోతున్నారని, ఈ అవకాశాన్ని అందిపుచ్చుకొని నౌకా నిర్మాణ రంగంలో రిలయన్స్ తన విభాగాన్ని గణనీయంగా విస్తరించాలని నిర్ణయించినట్లుగా చెప్పారు.

ఈస్ట్ వెస్ట్ షిప్‌యార్డ్ ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ ఎం. విమల్ 'విశాఖ నుండి తుని వరకూ ఉన్న తీరాన్ని అభివృద్ధి చేసేందుకు 15 వేల కోట్ల రూపాయల పెట్టుబడి పెడతామని, నేవీకి సంబంధించిన షిప్,

సబ్‌మెరైన్స్, ఎయిర్ క్రాఫ్ట్ కారియర్లను రూపొందిస్తామని, భవిష్యత్‌లో విశాఖ నుండి శ్రీకాకుళం వరకు ఉన్న తీరాన్ని కూడా అభివృద్ధి చేసేందుకు ప్రతిపాదనలు కూడా ఉన్నాయని' చెప్పారు.

అదాని గ్రూప్ డైరెక్టర్ గుడేనా జె. రావు 'ప్రత్యేకంగా ఎటువంటి ఒప్పందాలు చేసుకోకపోయినా, రాష్ట్ర ప్రభుత్వానికి సంబంధించిన 3 మైనర్ పోర్టులను అభివృద్ధి చేస్తామని, మొత్తం రాష్ట్రంలో 100 మిలియన్ టన్నుల సామర్థ్యం గల పోర్టులను నిర్మిస్తామని, దీని కోసం 10 వేల కోట్ల రూపాయల పెట్టుబడులు పెట్టడానికి ఆలోచిస్తున్నామని' అన్నారు.

ఈ సదస్సు సందర్భంగా చంద్రబాబు 'రిటైల్ ట్రేడ్ పాలసీ – 2016' పేరుతో ప్రత్యేక విధానాన్ని ప్రకటించారు. 2020 నాటికి 5 వేల కోట్ల రూపాయల పెట్టుబడులతో రిటైల్ సంస్థలను ఏర్పాటు చేస్తామన్నారు. కనీసం 100 కోట్ల రూపాయల పెట్టుబడి లేదా 2 వేల ఉద్యోగాలు కల్పించే ప్రాజెక్టులను మెగా రిటైల్ సంస్థలుగా పరిగణిస్తామని, రిటైల్ వ్యాపారాన్ని కూడా పరిశ్రమగా గుర్తిస్తున్నామని అన్నారు. ఉదయం 6 గంటల నుండి రాత్రి 11 గంటల వరకూ రిటైల్ స్టోర్స్ తెరచి ఉంచేందుకు అనుమతి ఇస్తున్నాం. మొత్తం ఉద్యోగులలో 25 శాతం మించకుండా సిబ్బందిని గంటల ప్రాతిపదికన నియమించుకోవచ్చు. రిటైల్ ట్రేడ్ పాలసీ ప్రకారం స్టోర్స్‌లో ఉండే సరుకు నిల్వపై ఎలాంటి పరిమితులు, ఆంక్షలు ఉండవు. వాటికి సంబంధించిన పంపిణీ కేంద్రాలు, గిడ్డంగులు, 24 గంటలు తెరచి ఉంచవచ్చు. సమ్మెను నివారించేందుకు పారిశ్రామిక వివాదాల చట్టం కింద ప్రజోపయోగ సంస్థలుగా ప్రకటిస్తున్నామని అన్నారు. ఈ రిటైల్ ట్రేడ్ పాలసీని ఆహ్వానిస్తూ 1500 కోట్ల రూపాయల పెట్టుబడులతో వాల్‌మార్ట్, ఫ్యూచర్ గ్రూప్, స్పెన్సర్, అరవింద్ లైఫ్ స్టైల్ లాంటి కంపెనీలు ముందుకొచ్చాయని చంద్రబాబు ప్రకటించారు. నవ్యాంధ్రలో 15 క్యాష్ అండ్ క్యారీ స్టోర్స్‌ను ఏర్పాటు చేస్తామని వాల్‌మార్ట్ ఇండియా సి.ఇ.ఓ. క్రిష్ అయ్యర్ ప్రకటించారు.

సదస్సులో ఆంధ్రప్రదేశ్ పెవిలియన్ పేరుతో భారీ ప్రచార వేదిక నిర్మించారు. ఇందులో 13 స్టాల్స్‌లో జిల్లా వారీగా భౌగోళిక ప్రాధాన్యతలు, పరిశ్రమ ఏర్పాటుకు ఉన్న అవకాశాలు, వనరుల లబ్ధి, తదితర అంశాలను పట్టికలో ప్రదర్శించారు. 6 పోర్టులు, 6 విమానాశ్రయాలు, 46 వేల కిలోమీటర్ల రహదారి వ్యవస్థ, 7040 కిలోమీటర్ల రైల్వే వ్యవస్థ, 888 కిలోమీటర్ల జాతీయ జల రవాణా వ్యవస్థ, 24 గంటల విద్యుత్ సదుపాయాలు ఉన్నాయని వివరించారు. చిత్తూరు జిల్లాలో 1,58,947 ఎకరాలు, అనంతపురంలో 1,30,262 కడపలో 93,311 ప్రకాశంలో 72,664 తూర్పుగోదావరిలో 62,057 విశాఖపట్నంలో 49,098 గుంటూరులో 49,178 నెల్లూరులో 47,145 విజయనగరంలో 36,007 కర్నూలులో 35,506 కృష్ణలో 16,968 శ్రీకాకుళంలో 3,609 పశ్చిమ గోదావరిలో 897 ఎకరాలు పరిశ్రమల కేటాయింపునకు సిద్ధంగా ఉన్నాయని, ఈ భూములతో పాటు ఆయా జిల్లాలలో ఇప్పటికే ఏ.పి.ఐ.ఐ.సి. ఏర్పాటుచేసిన పారిశ్రామిక పార్కుల్లో 39,927 ఎకరాల భూమి కూడా కేటాయింపుకు మొత్తంగా 8 లక్షల ఎకరాల భూమి 99 సంవత్సరాలపాటు లీజుకు సిద్ధంగా ఉందని ప్రకటించారు.

ఈ ప్రచారపు హోరులో జరిగిన ఒప్పందాలలో అమలయ్యేవి చాలా తక్కువ అని గత చరిత్ర చెబుతుంది. అమలయ్యే వాటిలో కూడా ఉపాధి కల్పనకు, ఉద్యోగాల కల్పనకు, రాష్ట్రానికి అదనపు వనరులకు వీలు కల్పించేవి చాలా తక్కువ అనికూడా అనేక రుజువులున్నాయి. ఈ సదస్సులో జరిగిన ఒప్పందాలలో అధికశాతం పాత ఒప్పందాలేనని, వాటినీ, కొత్తగా వచ్చిన ఒప్పందాలను కలిపి పెద్ద మొత్తాలలో ప్రకటిస్తున్నారు. విస్తరణకోసం కొన్ని కంపెనీలు గతంలో ప్రకటించిన పెట్టుబడులనే మళ్లీ కొత్తవిగా ప్రకటిస్తున్నాయి. జరిగిన ఒప్పందాలలో 10 శాతం సాకారమైనా గొప్పే అని ఒక ఐ.ఎ.ఎస్ అధికారి అన్నట్లుగా పత్రికల్లో వచ్చింది. 'భూముల కోసం దరఖాస్తు చేసిన కంపెనీలు భారీ పెట్టుబడుల హామీలు ఇచ్చాయి. కనీసం అలాంటి సంస్థలైనా వారు పెట్టుబడి పెట్టబోతున్న మొత్తంలో కనీసం కొంత శాతాన్ని డిపాజిట్ చేయమని అడిగి ఉంటే వీటిలో చాలా మట్టుకు అక్కడే ఆగిపోతాయి' అని ఒక పారిశ్రామిక వేత్త అన్నారు. ఎక్కువ మంది కేవలం భూముల కోసమే పెట్టుబడులు పెడుతున్నట్లుగా ప్రకటిస్తున్నారని అనేక మంది వ్యాఖ్యానించారు.

గతంలో వైబ్రాంట్ గుజరాత్ పేరిట జరిగిన సదస్సులో 20 లక్షల కోట్ల రూపాయల ఒప్పందాలు జరిగాయి. కానీ దానిలో 10 శాతం కన్నా తక్కువే పెట్టుబడులు వచ్చాయి. పశ్చిమ బెంగాల్‌లో గ్లోబల్ సమ్మిట్ పేరిట జరిగిన సదస్సులో 2.5 లక్షల కోట్ల రూపాయల ఒప్పందాలు జరిగాయి. అడ్వాంటేజ్ కర్ణాటక పేరుతో జరిగిన సదస్సులో కూడా లక్షల కోట్ల రూపాయల ఒప్పందాలు జరిగాయి. కాని అక్కడ కేవలం 7 శాతం పెట్టుబడులు మాత్రమే వచ్చాయని తేలింది. 2004 వరకూ చంద్రబాబు నాయుడు గత హయాంలో 3 సార్లు విజయవంతంగా జరిగినట్లు చెప్పబడిన సదస్సులలో జరిగిన ఒప్పందాలలో కూడా కేవలం 6.5 శాతం మాత్రమే పెట్టుబడులు వచ్చాయి. 2012లో కిరణ్‌కుమార్ రెడ్డి హయాంలో 243 ఒప్పందాలు, 6.47 లక్షల పెట్టుబడుల హామీలతో జరిగింది. కానీ వాస్తవానికి చాలా తక్కువ శాతం మాత్రమే పెట్టుబడులు వచ్చాయి.

పెట్టుబడులను ఆకర్షించడానికి రాష్ట్రంలో చాలదన్నట్లు, అంతర్జాతీయ వేదికపై కూడా చంద్రబాబు ప్రచారం చేయబోతున్నారు. దీని కోసం దావోస్‌లో జరగబోతున్న వరల్డ్ ఎకనమిక్ ఫోరమ్ సదస్సుకు ప్రత్యేక అతిథిగా హాజరవుతూ ఆంధ్రప్రదేశ్‌ను అమ్మడానికి విదేశీ కార్పొరేట్ సంస్థ యాజమాన్యాలతో కూడా ఒప్పందాలు చేసుకోబోతున్నారు.

మొత్తంగా ఆంధ్రప్రదేశ్‌లో లక్షల ఎకరాల పంట భూములను, దీర్ఘమైన తీర ప్రాంతాన్ని, ఖనిజ వనరులను, విస్తారమైన అటవీ ప్రాంతాన్ని భారీ ఎత్తున కార్పొరేట్ సంస్థలకు ధారపోయడానికే ఈ భాగస్వామ్య సదస్సు లక్ష్యమని స్పష్టంగా అర్థమౌతుంది. సముద్ర తీర ప్రాంతమంతా భారీ విధ్వంసానికి గురికాబోతుంది. ప్రధానంగా తీరప్రాంతంలో ఉన్న 7.5 లక్షల మత్స్యకారుల జీవితాలు ప్రమాదంలోకి నెట్టబడతాయి. ఖనిజ దోపిడీతో ఆదివాసీల జీవితాలు, పంట భూముల విధ్వంసంతో రైతు జీవితాలు నాశనమౌతాయి. ప్రజల జీవితాలను, సంక్షేమాన్ని కాపాడతామని హామీలిచ్చి గద్దెనెక్కిన ప్రభుత్వం కార్పొరేట్ సంస్థల మిలాఖత్‌తో మొత్తం రాష్ట్ర ప్రజల జీవితాలను బలిచేయబోతున్న ఈ పెను ప్రమాదాన్ని ఎదిరించవలసిన అవసరాన్ని అందరూ గుర్తించాలి.

*(రచయిత కార్మికోద్యమ నాయకులు)* వీ

# స్టాన్డప్ ఇండియా! స్టార్టప్ ఇండియా!

*స్టార్టప్ కంపెనీల స్థాపనతో యువత జ్ఞానాన్ని పెట్టుబడిదారుల పరం చేయడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తోందని అంటున్నారు* **బి.ఎస్. రాజు**

చదువుకున్న యువతీ యువకులారా! ఉద్యోగాలకై ఎదురు చూడకండి. మీరే ఉద్యోగ ప్రధాతలు కండి. చతికిలబడి కూర్చోకండి. లేచి నిలబడండి. అవకాశమే ముద్దు, ఆకాశమే హద్దు. మీ బుద్ధి కుశలతతో, పెట్టేయండి ఓ స్టార్టప్ సంస్థ. మీరు సంపాదిస్తూ, పది మందికి ఉద్యోగాలు కల్పించండి. కొంగొత్త వ్యాపార ఆవిష్కరణలకు, కొత్త కొత్త టెక్నాలజీలకు తెరలేపండి. మీకు సకల సౌకర్యాలు కలుగచేస్తాం. మీకు వెన్నుదన్నుగా మేముంటాం. ఇది– మొన్న జనవరి 16న న్యూఢిల్లీలో కేంద్ర ప్రభుత్వం నిర్వహించిన 'స్టార్టప్ ఇండియా' సదస్సులో దేశ ప్రధాని నరేంద్ర మోడీ ప్రభుత్వ స్టార్టప్ పాలసీని ప్రకటిస్తూ దేశ యువతకు ఇచ్చిన పిలుపు సారాంశం. ఈ సదస్సులో స్టార్టప్ కంపెనీలకు మోడీ కురిపించిన వరాల జల్లు చిట్టా, కింద చూడండి:

- 10,000 కోట్ల రూపాయల స్టార్టప్స్ ప్రత్యేక నిధి
- మూడేళ్ల పాటు స్టార్టప్‌సంస్థ లాభాలపై ఆదాయ పన్ను మినహాయింపు
- స్టార్టప్ సంస్థ పేటెంట్ల నమోదు–రుసుంపై 80 శాతం రాయితీ
- తొమ్మిది పర్యావరణ, కార్మిక చట్టాల్లో సెల్ఫ్–సర్టిఫికేషన్ సౌలభ్యం
- మూడేళ్ల వరకు ఈ చట్టాలకు సంబంధించిన ఏ తనిఖీలు ఉండవు
- 90 రోజుల్లో సంస్థ మూసివేతకు అవకాశం
- కేంద్ర బడ్జెట్లో ఏటా 500 కోట్ల రూపాయల కేటాయింపు
- స్టార్టప్‌ల బ్యాంక్ రుణాలకు 'ఎన్‌సిజిటిసి' ద్వారా హామీ
- ప్రభుత్వ కాంట్రాక్టుల్లో ప్రాధాన్యం
- స్టార్టప్స్ కోసం త్వరలో ప్రత్యేక యాప్, వెబ్ పోర్టల్
- వెంచర్ క్యాపిటల్ దీర్ఘకాలిక లాభాలపై పన్ను రద్దు
- స్టార్టప్స్ కోసం కొత్తగా ఏడు పరిశోధనా పార్కులు
- బయోటెక్ స్టార్టప్స్‌కు ప్రత్యేక ప్రోత్సాహం
- విద్యార్థుల వినూత్న ఆవిష్కరణలకు ఇంక్యుబేటర్ అవార్డులు
- స్టార్టప్ కంపెనీల రిజిస్ట్రేషన్ కై పట్టే కాలాన్ని ఒక్క రోజుకు కుదించడం

ఇవి కాక సరికొత్త వ్యాపార ఆవిష్కరణలకు తెరతీసే స్టార్టప్ కంపెనీలను ప్రోత్సహించేందుకు వచ్చే కేంద్ర బడ్జెట్లో మరిన్ని ప్రోత్సాహకాలు, వ్యాపార స్నేహ హిత సంస్కరణలు ప్రకటిస్తామని కేంద్ర ఆర్థిక మంత్రి అరుణ్ జైట్లీ ఈ సదస్సులో ప్రకటించాడు. వ్యాపార కార్యక్రమాల నిర్వహణకు సంబంధించి ప్రభుత్వ పాత్రను పరిమితం చేసి, వ్యాపారుల లబ్ధికి దోహదంచేసే దిశగా ప్రభుత్వం శరవేగంగా అడుగులు వేస్తోందని ఆయన అన్నాడు. అయితే చావు కబురు చల్లగా చెప్పినట్టు, కేంద్ర విత్త మంత్రి జైట్లీ, వసూలు కాని పాత బకాయిల ఊబిలో కూరుకు పోయిన దేశీయ బ్యాంకుల దుస్థితిని ఈ సందర్భంగా, మాటలో మాటగా తడిమేడు. ఇందు మూలంగా సత్వరమే నిధులు కేటాయించడం సాధ్యం కాదనీ, స్టార్టప్స్‌కు, పారిశ్రామిక రంగ ప్రోత్సాహకాలకై బ్యాంకులకు కొత్తగా నిధులు సమకూరుస్తామని; ప్రభుత్వ రంగంలో ఉద్యోగ కల్పనకు చాలా పరిమితులున్నాయని, అందుచేత మోడీ గారు ప్రకటించిన 'స్టాన్డప్ ఇండియా' పథకం ద్వారా వచ్చే రెండేళ్లల్లో దేశంలో మూడు లక్షల ఎస్.సి, ఎస్.టి, మహిళా ఔత్సాహిక పారిశ్రామిక వేత్తలను తయారు చేస్తామని మాట్లాడేడు.

ఇదే సదస్సులో మాట్లాడిన జపాన్ సాఫ్ట్ బ్యాంక్ కంపెనీ అధ్యక్షుడు 21వ శతాబ్దం భారత్‌దే అని కొనియాడాడు. చైనా గత పదేళ్లలో సాధించిన ప్రగతిని ఇండియా ఐదేళ్లలోనే సాధిస్తుందని చెబుతూ, తను ఇండియాలో 1000 కోట్ల డాలర్లు (రమా రమి రు. 70,000 కోట్లు) పెట్టుబడి లక్ష్యాన్ని నెరవేరుస్తానని హామీ ఇచ్చాడు. ఈయన ఇప్పుడు భారతదేశాన్ని తన రెండవ నివాసంగా, తన పెట్టుబడులకు వేగంగా మంచి ఫలసాయాన్ని ఇచ్చే, పచ్చని సిరులు పండించే క్షేత్రంగా, బంగారు గుడ్లు పెట్టే బాతుగా గుర్తించాడు. ఇటు మోడీని అటు చంద్రబాబును కావడి కుండల్లా మోస్తున్నాడు. ఈ కావడి కుండలు తనకు లాభాల కొండలు సమకూరుస్తాయని అతనికి బాగా తెలుసు.

అయితే, స్టార్టప్ కంపెనీలపై ప్రభుత్వం ఎందుకింత అత్యుత్సాహాన్ని ప్రదర్శిస్తోంది? ఆలోచించాల్సిన విషయమే! దేశంలో చదువుకున్న యువతకు ఉద్యోగాలు కావాలి. వీళ్లు కోట్లలో ఉన్నారు. ప్రభుత్వాలు అతితక్కువ పాలన (మినిమం గవర్నెన్స్) నెపంతో అన్ని రంగాలను కార్పొరేట్లకు అప్పచెప్పి చేతులు కడిగేసుకుంటున్నాయ్. పెట్టుబడులను ఆకర్షించడమే ప్రధాన కార్యక్రమంగా పెట్టుకుని, అయ్యా! బాబులూ! మా దేశంలో పెట్టుబడులు పెట్టండి మహాప్రభో అంటూ దేశ ప్రధాని, రాష్ట్రాల ముఖ్య మంత్రులు దేశాలు బట్టి అడుక్కుంటున్నారు. పెట్టుబడుల అధిపతులను ఆహ్వానించి మీకిదిస్తాం, అదిస్తాం, భూములు రాసిస్తాం, సర్వసౌకర్యాలు కలగచేస్తాం, ఇక లైసెన్సుల కాలం చెల్లిపోయిందని, ఏ అడ్డంకులు లేకుండా వ్యాపారాలు చేసుకోవచ్చునీ, ఇబ్బడి ముబ్బడిగా లాభాలు ఆర్జించుకోవచ్చునీ, సంపాదనను సులువుగా తరలించుకు పోవచ్చునీ హామీలను గుప్పించడమే గాక, ఎడా పెడా ఒప్పందాల కట్టలను (ఎంఒయు) ప్రజలపైకి గుప్పిస్తున్నారు. ఇవిగో బిలియన్ రూకల ఒప్పందాలు, అవిగో రాబోయే కోట్ల కొలదీ ఉద్యోగాలు, చూసుకోండి, చేసుకోండని ఊదర గొడుతున్నారు. వైబ్రంట్ గుజరాత్, సన్షైన్ రాజస్థాన్, బంగారు తెలంగాణ, వైభవాంధ్ర–ఇలా దేశం నలుమూలలా పెట్టుబడుల వర్షం కురిసి ఉద్యోగాల పంటలు పండుతాయని ఊదర గొడుతున్నారు.

అయితే కట్ చేసి చూస్తే అగుపించే చిత్రం వేరేగా ఉంటుంది. ఇప్పుడు ప్రపంచంలో ఏ పెట్టుబడిదారుడు ఎక్కువ మనుషులతో ఉత్పత్తుల తయారీ అనే పద్ధతిని గాని, టెక్నాలజీని గాని ఉపయోగించడు. అత్యంత ఆధునిక ఆటోమేటెడ్ టెక్నాలజీనే ఉపయోగిస్తాడు. తక్కువ మనుషులతో, అదీ తాత్కాలిక లేక కాంట్రాక్ట్ పద్ధతిలో ఉద్యోగులను కాని, ఉత్పత్తి పనివారిని కాని అవసరమైతే ఉంచుకుని, అవసరం లేకపోతే తీసేసే

# భాగస్వామ్య సదస్సు లక్ష్యమేమిటి?

***పెట్టుబడి దారులను రాష్ట్రానికి ఆహ్వానించే ప్రయత్నం ప్రజా సమస్యలను పరిష్కరించేలా ఉండాలంటున్నారు* చిమ్మె జాన్ బర్నబాస్**

**2016** జనవరి 10-12న విశాఖపట్టణం సముద్ర తీరాన 'హార్బర్ పార్క్' రిసార్ట్స్‌లో జరిగిన భారత పరిశ్రమల సమాఖ్య (సిఐఐ) 22వ భాగస్వామ్య సదస్సు దాదాపు రు. 4.67 లక్షల కోట్ల విలువైన పరిశ్రమలను రానున్న మూడు ఏళ్ల కాలంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో పెట్టనున్నట్లు ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ప్రకటించారు. ఈ మూడు రోజులలో నలుగురు కేంద్ర మంత్రులను ఆహ్వానించి, హంగామా చేసి ఏదో విధంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని తాను అభివృద్ధి పథంలో నడిపిస్తున్నట్లు చూపే ప్రయత్నం చేశాడు. ఈ మూడు రోజులలో 328 ఒప్పందాలు జరిగాయి. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వానికీ, వివిధ పరిశ్రమల అధినేతలకూ పరస్పరం 'అవగాహన – ఒప్పందం' జరిగింది.

భారత్‌తో సహా 44 దేశాల నుంచి 1400 మందికి పైగా ప్రతినిధులు పాల్గొన్న ఈ సదస్సులో మొత్తం 325 ఒప్పందాలు జరగడమే కాకుండా, మరికొంత మంది మౌఖికంగా తమ అంగీకారాన్ని తెలియజేశారని, దానిని ప్రకటించిన రు. 4.67 లక్షల కోట్ల పెట్టుబడులలో చేర్చలేదని చంద్రబాబు నాయుడు ప్రకటించారు. తయారీ రంగానికి చెందిన సుభాష్‌చంద్ర సారథ్యంలోని ఎస్సెల్ గ్రూపు, అనిల్ అంబానీకి చెందిన అనిల్ ధీరుభాయ్ అంబానీ గ్రూపు, అమరరాజా గ్రూపు (గల్ల రామచంద్రనాయుడు కంపెనీ), ఫాక్స్‌కాన్ వంటి కంపెనీలు ఒప్పందాలు చేసుకున్నాయి. ఫార్మాస్యుటికల్ రంగంలో వినీస్ లాబొరెటరీస్, అరవిందో, డాక్టర్ రెడ్డీస్ వంటి కంపెనీలు ఉన్నాయి. విద్యుత్ రంగంలో ట్రైనా సోలార్, సుజ్లాన్ వంటివీ, రీటైల్ రంగంలో వాల్‌మార్ట్, ఫ్యూచర్ గ్రూపు, అరవింద్ రీటైల్, స్పెన్సర్స్ వంటి పెద్ద కంపెనీలు ఒప్పందాలు చేసుకున్నట్లు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించింది.

మైనింగ్‌కు సంబంధించి ఎన్ఎస్ఎల్ మైనింగ్, సంఘీ సిమెంట్స్, మై హోమ్ గ్రూప్స్ కూడా ముందుకొచ్చాయి. నగరాలకు సంబంధించి, చైనా కంపెనీలతో ఒప్పందం జరిగిందని ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం తెలియజేసింది. వచ్చే 30 సంవత్సరాలలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం దేశంలోనే కాక ప్రపంచంలోనే అగ్రగామిగా నిలుస్తుందని, రాష్ట్ర ప్రభుత్వం ప్రజలను నమ్మింపజూస్తున్నది. పైన తెలియజేసిన పరిశ్రమలన్నీ కార్యాచరణకు నోచుకుంటే దాదాపు 10 లక్షల మందికి ఉపాధి అవకాశాలు ఏర్పాటు కావచ్చుననేది ప్రచారంలో ఉంది.

భారీ పరిశ్రమలు, ఇంధన, ఆహార, గనులు, గృహ నిర్మాణ, తయారీ

---

వెసులుబాటుతోనే ఫ్యాక్టరీలు గాని, వ్యాపారాలుగాని పెడతాడు. సరుకుల, సర్వీసుల ఉత్పత్తులు ప్రపంచీకరణ చెందిన నేపథ్యంలో ఈ ఆట నడుస్తూ ఉంటుంది. మరటువంటప్పుడు సరుకుల తయారీ రంగంలో ఉద్యోగాల సంఖ్య నామమాత్రమే కదా? అదీ ఇటువంటి అధునాతన టెక్నాలజీకి కావలసిన మనుషులు ప్రత్యేక నైపుణ్యాలు కలవారై ఉండాలి. అంచేత వేల కోట్ల పెట్టుబడికి వచ్చే ఉద్యోగాలు వందల్లోనే ఉంటాయ్. అవి లక్షల్లో ఉండవు, కోట్లలో అసలుకే ఉండవు. అలాగే వ్యాపారాలు త్వరిత గతిన ఆన్లైన్ దందాగా మారుతున్న తరుణంలో ఇంటింటికి సరుకులను వీపులపై మోసుకొచ్చే ఆధునిక ద్విచక్ర హమాలీలు చదువుకునే కాలేజీ కుర్రాళ్లేనని గ్రహించాలి.

పాలకుల, పెట్టుబడిదార్ల ప్రేమ ఫలమే స్టార్టప్ సంతానం. పెద్ద కంపెనీలు ఇదివరలో పెద్ద పరిశ్రమలు స్థాపించి తమకు సహాయక అనుబంధ పరిశ్రమలుగా చిన్న తరహా పరిశ్రమలను ప్రోత్సహించేవి. ఈ ప్రోత్సాహం నిజానికి పెద్ద పరిశ్రమల లబ్ధికే ఐనప్పటికీ అది ఒక దశ. మెల్లగా అది కనుమరుగై పోయింది. ఇప్పుడు సహాయక పరిశ్రమ అంటేనే నిర్వచనం మారిపోయింది. దాని స్థితి గతులూ మారిపోయాయి. ఇప్పుడు పెద్ద కంపెనీలు అసలు ఉత్పత్తుల, సర్వీసుల వ్యవస్థలే పెట్టకుండా స్టార్టప్‌లను పెట్టించి, కబ్జాల మార్గంలో తమలో సునాయాసంగా కలిపేసుకోవచ్చు. ఇలా చేయడం ద్వారా ఎన్ని బాధలు తప్పుతాయో కదా! యూనియన్‌ల తల నొప్పులుండవు. ఆదాయపు పన్ను పోటులు, పాట్లు ఉండవు. స్టార్టప్ బిడ్డ ఎదిగితే పెట్టుబడిదారుడు చక్కగా చంక నెక్కించుకుని, ముద్దు పెట్టుకుని, ఇది నా బిడ్డ, నా బిడ్డని సొంతం చేసుకుంటాడు. ఎదగక ఉడిగిపోతే స్టార్టప్ బిడ్డే పోతాడు, లేక సర్కారీ బ్యాంకుల నిరర్థక ఆస్తుల ఖాతాలో జమైపోతాడు. బడా పెట్టుబడి దారుడి చేతికి మట్టంటదు. చమురొాదలదు. భలే సౌకర్యం కదా! అందుకే మరి కార్పొరేట్ల ముద్దుబిడ్డ మోడీ గారు బహు ముద్దుగా స్టార్టప్ కంపెనీల పై వరాల జల్లు కురిపిస్తున్నారు.

అంచేత చదువుకున్న అమ్మాయిలూ! అబ్బాయిలూ! బుద్ధిగా మీరు మోడీ గారి స్టార్టప్ అడుగు జాడల్లో నడిచి తరించండి. మీ జ్ఞాన విజ్ఞానాలను వికసింప చేసి దొడ్డిదారిన కార్పొరేట్ కంపెనీలకు అంటగట్టండి. ప్రభుత్వాన్నో, పెట్టుబడి దారుణ్ణో ఉద్యోగం ఉద్యోగమంటూ వేధించకండి, దేబరించకండి. మీరే స్టార్టప్ స్కేటర్స్ పై కాళ్లు పెట్టి విజయ పథం వైపు పయనించండి. అవకాశమే ముద్దు. వదులుకోకండి. ఆకాశమే హద్దు దూసుకు పోండి.

ఓ చిన్న మాట, సీక్రెట్‌గా నైనా మీ చెవిలో చెప్పాలి. 'డాట్కాం బబుల్' ల్లా స్టార్టప్ బబుల్ కూడా పేలిపోతుందని కొంతమంది డౌటుగాళ్లు అప్పుడే గుసగుసలు పెడుతున్నారు. ఇప్పటికే కొన్ని స్టార్టప్‌లు చేతులెత్తేసినయ్ అని, రోడ్డెక్కినయ్ అని ఎవరైనా అంటే ఆ సోదిని మీరు చెవిన పెట్టకండి. డౌటుగాళ్లు, పని పాటా లేని ఎర్రజెండా వాళ్లు అలానే అంటారు. వాళ్ల మాటలు విని చెడిపోకండి. చంద్రబాబులా శ్రమించండి. కెసిఆర్‌లా కలలు కనండి. మోదీలా దూసుకు పోండి.

*(రచయిత శ్రామిక నేస్తం సంపాదకులు)* వీ

తదితర రంగాలలో పెట్టుబడులు ప్రాథమిక ఒప్పందాలు యథాతథంగా అమలులోనికి వచ్చినట్టయితే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో గుణాత్మక అభివృద్ధి సాధ్యపడుతుందని రాష్ట్ర ప్రభుత్వం భావిస్తున్నది. దేశ సౌర విద్యుత్ కేంద్రంగా ఆంధ్రప్రదేశ్ ఆవిర్భావం, విశాఖపట్టణ సముద్ర తీరంలో జలాంతర్గామి నిర్మాణ కేంద్రం, వివిధ రంగాలలోనికి పెట్టుబడుల వరద రాబోతున్నదని రాష్ట్ర ప్రభుత్వం ధీమాగా ఉన్నది. రాష్ట్ర ప్రభుత్వం తనవంతు బాధ్యతలను మరువకుండా, లక్ష్యసాధన కోసం ప్రణాళికాబద్ధంగా శ్రమించాల్సిన అవసరం ఉన్నది.

'అమరావతి' (భవిష్య రాజధాని)ని విజ్ఞాన కేంద్రంగా మారుస్తామంటున్న రాష్ట్ర ప్రభుత్వం, నాలుగు లేదా ఐదు ప్రపంచ స్థాయి విశ్వవిద్యాలయాలను నెలకొల్పి, విద్యా కేంద్రంగా మార్చాలని భావిస్తున్నది. ఎంతైనా ప్రపంచ స్థాయి 'విద్య' ఇక్కడ లభించడం, అది కూడా ప్రభుత్వ పూర్తి భాగస్వామ్యం ఉంటుందని చెప్పడం కొంత అతిశయోక్తిగా ఉంది.

రాజధాని నిర్మాణం, రెవెన్యూ లోటు భర్తీ, పన్ను రాయితీలు, నూతన ప్రభుత్వ సంస్థల ఏర్పాటులో తమ వంతు సహకారం పూర్తిగా ఉంటుందని కేంద్ర ఆర్థిక శాఖా మంత్రి అరుణ్‌జైట్లీ హామీని ఈ భాగస్వామ్య సదస్సులో పొందడం, ఈ రాష్ట్ర ప్రభుత్వానికి శుభ సూచకమే అయినప్పటికీ, కోస్తా సముద్రతీరం వెంబడి (976 కి.మీ) అవగాహనా ఒప్పందాలు ఎంత వరకు అమలుకు నోచుకుంటాయనేది వేచి చూడవలసి ఉంది.

వైజాగ్ – చెన్నై (799 కిలోమీటర్ల) కారిడార్ పరిధిలోని జిల్లాలలో పారిశ్రామిక ఉత్పత్తులు, ఉత్పాదకత సామర్థ్యం, రానున్న రెండు దశాబ్దాల కాలంలో 7 రెట్లు కానున్నదని రాష్ట్ర ప్రభుత్వ అంచనా. నిజంగా ప్రభుత్వ యంత్రాంగం ఈ ప్రయత్నంలో సఫలీకృతం అయినట్లయితే 'సూర్యోదయాంధ్రప్రదేశ్' సాధించినట్లే. దేశంలో వాణిజ్య అనుకూలతల జాబితాలో అగ్రస్థానంలో ఉన్న రాష్ట్రం గుజరాత్ అయితే ఆంధ్రప్రదేశ్‌ది రెండవ స్థానం. అవగాహనా ఒప్పందాలను, కార్యాచరణలోనికి పెట్టడం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఎదుట ఉన్న సవాలు.

విశాఖపట్టణంలో 'స్టార్టప్ విలేజ్' ద్వారా ప్రగతికి ద్వారాలు తెరిచామని చెపుతున్న రాష్ట్రం, పదమూడు జిల్లాల తలరాత మార్చే పారిశ్రామిక వ్యూహాన్ని పగడ్బందీగా అమలు పరచడమే సంక్లిష్టమైన బాధ్యత. తాను మాట్లాడితే సింగపూర్, జపాన్, తైవాన్, చైనా తరహా అభివృద్ధి నమూనాలకు ధీటుగా రానిస్తామంటున్న ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు, దానికి తగ్గట్లుగా మొత్తం ప్రభుత్వ యంత్రాంగాన్ని అవినీతి రహితంగా, పట్టుదలతో, స్ఫూర్తితో నడిపించాల్సి ఉంది. అన్ని రంగాలలో ప్రజా పరిపాలనా వ్యవస్థను అవినీతి రహితంగా, బాధ్యతాయుతంగా చేసినప్పుడే ఏ ప్రణాళికయినా సాధ్యపడుతుంది.

ఏమీ లేదనుకుంటున్న ఆంధ్రప్రదేశ్‌పై పారిశ్రామిక వేత్తలు ఎందుకు ఆసక్తి ప్రదర్శిస్తున్నారు? దేశ వ్యాప్తంగా ఇంచుమించుగా అన్ని రాష్ట్రాలూ ప్రస్తుతం పెట్టుబడులను ఆకర్షించేందుకు ఒకదానితో మరొకటి పోటీ పడుతున్నాయి. తమ వంతుగా పెద్ద ఎత్తున సదస్సులూ నిర్వహిస్తున్నాయి. తమిళనాడు, కర్ణాటక, మహారాష్ట్ర, పశ్చిమ బెంగాల్ తదితర రాష్ట్రాలలో ఇటీవల ఇలాంటి సదస్సులే జరిగాయి. పెట్టుబడులు పెట్టే పారిశ్రామిక వేత్తలకు ఒక ప్రాంతంపై ప్రత్యేక ప్రేమాభిమానాలు అంటూ ఏమీ ఉండవు, స్వలాభాపేక్షనే పరమావధిగా ఉంటుంది. ఎక్కడ తమకు ఎక్కువ లాభాలు వస్తాయో, దానినే తమకు అనుకూలమైన ప్రాంతంగా మార్చుకుని, ఒకటికి నాలుగుసార్లు పరిశీలించి, పరిశోధించి, అధ్యయనం చేసి, పరిశ్రమల స్థాపనకు నిర్ణయం తీసుకుంటారు. అలాంటి వారిని ఆంధ్రప్రదేశ్‌లో ఆకర్షించే అంశం ఏమంటే, రాష్ట్ర విభజనే వారికి ఎక్కువ అవకాశాలను ఏర్పరచిందని చెప్పవచ్చు. రాష్ట్రం విడిపోయిన తరువాత 13 జిల్లాలలో ఉన్న వనరులు, వసతులు, ఖనిజాలు తదితర అంశాలపై పరిశీలన ప్రారంభమైంది. అపారమైన ఖనిజ సంపద సుమారు 976 కిలోమీటర్ల పొడవైన సముద్ర తీర ప్రాంతం, దానికి సమాంతరంగా ఉన్న 5వ నంబర్ జాతీయ రహదారి మధ్యలో ఉండడం, పారిశ్రామిక వేత్తలకు కలిసి వచ్చే అంశాలు. అంతే కాకుండా మానవ వనరులు, వ్యవసాయోత్పత్తులు, మత్స్య సంపద, చమురు – సహజ వాయువు నిక్షేపాలు, అద్భుతమైన యాత్రా స్థలాలు అదనపు ఆకర్షణలుగా నిలుస్తాయి. ప్రధానంగా మౌలిక సదుపాయాలు లేకపోవడం వల్ల రాజధాని నగరం మొదలు విద్య, పరిశోధనా సంస్థలు, ఆస్పత్రులు వంటివన్నీ ఏర్పాటు కావలసి ఉండడం చేత వాటి నిర్మాణాలకు కావలసిన ముడి ఉత్పత్తులలో భాగస్వామ్యం కావడానికి అవకాశం ఏర్పడింది.

కేంద్ర ప్రభుత్వం ప్రతిపాదించిన వైజాగ్ – చెన్నై పారిశ్రామిక కారిడార్, చెన్నై – బెంగుళూర్ కారిడార్‌లతో ఆంధ్రప్రదేశ్‌కు మేలు జరగడమా లేదా అనేది భవిష్యత్తులో తేలనుంది. ఆంధ్రప్రదేశ్‌లో పరిశ్రమలకు కేటాయించేందుకు భూమి లేదనీ, అక్కడక్కడా ప్రైవేట్ వ్యక్తుల చేతుల్లోని వ్యవసాయ, 'రియల్ ఎస్టేట్' భూమి అనేది సర్వత్రా వినిపిస్తోంది. కానీ జిల్లాల వారీగా లెక్కలు తీసి, పరిశ్రమలకు కేటాయించేందుకు అనువుగా దాదాపు 7 లక్షల ఎకరాల భూములు సిద్ధంగా ఉన్నాయని ప్రభుత్వం వెల్లడించింది. పరిశ్రమలకు ఇదొక ప్రధాన ఆకర్షణ. ప్రధాని నరేంద్రమోడీ ప్రభుత్వం చెపుతున్న (తూర్పు వైపు చూపు) ఇదే కాబోలు.

ఏడో దశకం (70లలో) 2000 వరకు భారత విదేశీ వాణిజ్యం చాలా వరకు ఐరోపా, గల్ఫ్ దేశాలతో ముడిపడి ఉండేది. అక్కడి నుంచి ముడి చమురు, ఇంజనీరింగ్ సామాగ్రి, యంత్రాలు అధికంగా దిగుమతి అయ్యేవి. ఫలితంగా పశ్చిమ తీరంలోని మహారాష్ట్ర, గుజరాత్‌లకు వ్యాపార పరంగా, పారిశ్రామికంగా ఎదిగే అవకాశం లభించింది. ఇటీవల ఈ పరిస్థితి మారిపోయింది. నేడు భారత్ ముడి చమురు కంటే కూడా ఎలక్ట్రానిక్ పరికరాలనే ఎక్కువగా దిగుమతి చేసుకుంటుంది. ఎలక్ట్రానిక్ పరికరాలన్నీ చైనా, తైవాన్, దక్షిణ కొరియా, తదితర తూర్పు ఆసియా దేశాల నుంచే రావాలి. భారత్‌కూ, జపాన్‌కూ కార్ల పరికరాలు, ఎలక్ట్రానిక్ పరికరాల రూపంలో బలమైన వ్యాపార సంబంధం ఉన్నది. ఇది భవిష్యత్తులో మరింత బలపడే అవకాశం ఉంది. ఈ దేశాలకు తూర్పు తీరం దగ్గరగా ఉండడం వల్ల, విదేశీ వాణిజ్యానికి కేంద్ర బిందువుగా 'విశాఖపట్టణాన్ని' మార్చాలనే ఆలోచన రాష్ట్ర ప్రభుత్వానికి ఉంది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం, పెట్టుబడిదారులను రాష్ట్రానికి ఆహ్వానించడం ప్రభుత్వ భూమిని పరిశ్రమలకు అప్పజెప్పడానికి సుముఖత ప్రదర్శించడం – ఇక్కడి సామాన్య ప్రజల జీవన ప్రమాణాలను పెంచే విధంగా ఉండాలి తప్ప వారి జీవితాలను నాశనం చేసే విధంగా ఉండరాదు. సామాన్య ప్రజల 'జీవించే హక్కు'ను కాపాడాలి. పెట్టుబడిదారుల ప్రతిపాదనలలో కనీసం నాలుగవ వంతు సాధించినా కొంత వరకు సాఫల్యమే. ఏ పరిశ్రమ వచ్చినా అది రాష్ట్రం ఎదుర్కొంటున్న మౌలిక సదుపాయాల సమస్యలను తీర్చేదిగా విద్య, వైద్యం వంటి వసతుల కొరతను పరిష్కరించేదిగా ఉండాలి. ప్రస్తుతం ప్రపంచ వ్యాప్తంగా వివిధ దేశాలలో ఆర్థిక సంక్షోభం – సంక్లిష్టత తాండవిస్తోంది. రెండవ అతిపెద్ద ఆర్థిక వ్యవస్థ అయిన చైనా కూడా ఆర్థికంగా కష్టాలలో ఉంది. సమీప భవిష్యత్తును సరియైన విధంగా అంచనావేసి, అందరికంటే మెరుగైన అవకాశాలను అందిపుచ్చుకోవాలని ఆశిద్దాం.

*(రచయిత ఒపిడిఆర్ రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

# నైరోబీలో సామ్రాజ్యవాద పెత్తనం

***సామ్రాజ్యవాద దేశాలకు అనుకూలంగా, వర్ధమాన దేశాల రైతాంగాన్ని మరింత సంక్షోభంలోకి నెట్టివేసేదే నైరోబీ ఒప్పందం అంటున్నారు* ఎ. నర్సింహారెడ్డి**

కెన్యా రాజధాని నైరోబిలో డిసెంబర్ 15 నుంచి 19 వరకు జరిగిన ప్రపంచ వాణిజ్య మంత్రుల స్థాయి చర్చలు పేద దేశాల రైతుల భవిష్యత్తును తీవ్ర ప్రమాదంలోకి నెట్టాయి. పంటలకు గిట్టుబాటు ధరలు చెల్లించి రైతులవద్ద నుంచి ధాన్యం కొనుగోలు చేయగల వర్ధమాన రాజ్యాల హక్కును కాలరాసే ప్రయత్నాలు ఈ సమావేశాల్లో జోరుగా సాగాయి. సంపన్న దేశాలు, బడా వ్యవసాయ కంపెనీల వ్యాపార ప్రయోజనాలకు అనుగుణంగా ముందే తయారుచేసి తీసుకువచ్చిన ముసాయిదా తీర్మానాలను అగ్రరాజ్యాలు డబ్ల్యుటిఓ సదస్సులో ప్రవేశపెట్టారు. అభివృద్ధి చెందుతున్న దేశాల అవసరాలను ఏమాత్రం పరిగణనలోకి తీసుకోకుండా, పాశ్చాత్య దేశాలు ఏకపక్షంగా వ్యవహరించిన సమావేశమిది. దీంతో స్వేచ్ఛా వాణిజ్యమంటే సంపన్న దేశాల ప్రయోజనాలను పరిరక్షించడమేనన్న నగ్న సత్యం రుజువైంది. ఇంకా చెప్పాలంటే స్వేచ్ఛా వాణిజ్యమంటే ముసుగు తగిలించుకొన్న సామ్రాజ్యవాదమనేది వెల్లడైంది.

వర్ధమాన దేశాలు స్వయంసమృద్ధి సాధించడానికి ఏర్పాటు చేసుకున్న నిర్మాణాలను కూలదోయడానికి అగ్రరాజ్యాల చేతుల్లో ప్రపంచ వాణిజ్య సంస్థ (డబ్ల్యూటివో) ఒక ప్రధాన ఆయుధంగా మారింది. స్వేచ్ఛా వాణిజ్యమంటే సామ్రాజ్యవాద దేశాలు అసమాన వాణిజ్య ఒప్పందాల ద్వారా తమ దోపిడీ ప్రయోజనాలను నెరవేర్చుకోవడానికి వర్ధమాన దేశాల ప్రయోజనాలను బలిపెట్టడమేనని పలు ఒప్పందాలు రుజువు చేస్తున్నాయి. ఉదాహరణకు సాంకేతిక పరిజ్ఞానంపై బహుళజాతి కంపెనీల గుత్తాధిపత్యాన్ని మరింతగా పెంపొందించే 'ట్రిప్స్' ఒప్పందాన్ని ప్రపంచ వాణిజ్య సంస్థ అమలులోకి తెచ్చింది. మరోవైపు సామ్రాజ్యవాద దేశాలు బహుళ పక్షీయ వాణిజ్య ఒప్పందాలకు బదులుగా ప్రాంతీయ వాణిజ్య ఒప్పందాలవైపు మొగ్గుచూపుతున్నాయి. ఉదాహరణకు అభివృద్ధి చెందిన దేశాలకు ట్రాన్స్ పసిఫిక్ పార్టనర్‌షిప్ (టిపిపి) వంటి ప్రాంతీయ వాణిజ్య ఒప్పందం కుదుర్చుకున్నాయి. అందువల్లనే బహుళ పక్ష వేదికలపై బృహత్తర ఒప్పందాల స్థానంలో ప్రత్యేక విషయాల గురించి మాత్రమే ఒప్పందాలు జరిగేలా సామ్రాజ్యవాదం కృషి చేస్తుంది. వర్ధమాన దేశాల అభివృద్ధి ఆకాంక్షలకు స్థానం కల్పించడానికి వాగ్దానం చేసిన దోహా డెవలప్‌మెంట్ ఎజెండా (డిడిఎ)ను అమెరికా విస్మరించడం ఈ వ్యూహంలో వచ్చిన మార్పుగా గుర్తించాలి.

ప్రపంచ వాణిజ్య సంస్థ (డబ్ల్యుటిఓ) దోహా రౌండ్ సంప్రదింపులు గత 14 సంవత్సరాలుగా జరుగుతున్నా ఒక కొలిక్కిరాలేదు. దీనికి ప్రధాన కారణం అమెరికా ఇతర సంపన్న దేశాలు అనుసరిస్తున్న మొండి వైఖరే. డబ్ల్యుటిఓ దోహా రౌండ్ సంప్రదింపులను ఏదో ఒక విధంగా అడ్డుకోవాలన్న ప్రయత్నాలను నైరోబి చర్చల్లో అమెరికా, ఇయు దేశాలు ఉధృతం చేశాయి. నిజానికి 2001లోనే మొదలైన చర్చలు అనేకసార్లు, అనేక చోట్ల జరిగినప్పటికీ అవి ఒక కొలిక్కిరాలేదు. దీనికి అమెరికా, ఐరోపా యూనియన్ తదితర సంపన్నదేశాలు తమలోతాము సుంకాల విషయంలో ఒక అంగీకారానికి రాకపోవడం ఒక కారణమైతే, వర్ధమాన దేశాలపై విధించే షరతులు ఎంతో విషమంగా ఉండడం మరో కారణం. ఈసారి నైరోబి చర్చల సమయానికి సంపన్నదేశాలు అన్నీ కలిసి వర్ధమాన దేశాలపై దోపిడీని ఎలా తీవ్రతరం చేయాలా అన్న విషయంలో ఏకాభిప్రాయంతో రంగప్రవేశం చేశాయి.

డబ్ల్యూటివో లోని 162 సభ్యదేశాల మధ్య వ్యవసాయ సంబంధ అంశాల్లో తొలిసారి కీలకమైన ఒప్పందం కుదిరిందని, అది అసాధారణమైనదని సంస్థ చీఫ్ రాబర్టో అజ్వేడో చాలా గొప్పగా ప్రకటించారు. నిజమే, వర్ధమాన దేశాల మెడలు వంచేందుకు సంపన్నదేశాలు పదిహేనేళ్లుగా చేస్తున్న ఒత్తిడి ఈ ఒప్పందంతో ఫలించినట్లయింది. పేద, వర్ధమాన దేశాలను నిట్టనిలువునా ముంచేస్తూ చేసుకొన్న ఈ ఒప్పందం అగ్రరాజ్యాల దృష్టిలో గొప్పదే. దశాబ్దంన్నర కిందట ఖతార్ రాజధాని దోహాలో వర్ధమాన దేశాలకు అనుకూలంగా తలపెట్టిన సంకల్పాన్ని (దోహా డెవలప్‌మెంటు రౌండ్-డిడిఆర్) ఈ ఒప్పందంతో సమాధి చేసినట్లయింది. ఈ ఒప్పందం ద్వారా వర్ధమాన, నిరుపేద దేశాల్లో వ్యవసాయాన్ని, రైతాంగాన్ని, ఆహార భద్రత కార్యక్రమాన్ని అటకెక్కించాయి. దోహా చర్చల్లో చురుగ్గా వ్యవహరించిన భారత్ ఈసారి పూర్తిగా విఫలమైంది. ఈ సదస్సులో భారత్ అగ్రదేశాలకు పూర్తిగా లొంగిపోయి వ్యవహరించిందనీ, సాధించగలిగే అంశాలను కూడా వదులుకొని వచ్చిందనీ మోడీ సర్కారుపై సామాజిక కార్యకర్తలు, ప్రతిపక్షాలు సహజంగానే విమర్శలు గుప్పించాయి.

వ్యవసాయ, వ్యవసాయేతర, సేవారంగాలకు సంబంధించి డబ్లుటిఒ లో 2001 దోహా రౌండ్ నుంచి సంప్రదింపులు జరుగుతున్నాయి. సంపన్న దేశాలు తమ వ్యవసాయ రంగానికి విపరీతమైన సబ్సిడీలు ఇస్తూ కారు చౌకగా వ్యవసాయ ఉత్పత్తులను ప్రపంచ మార్కెట్‌కు తరలిస్తున్నాయి. ఆ దేశాలలో వ్యవసాయంపై ఆధారపడి జీవించేవారు జనాభాలో 1-2 శాతం కంటే ఎక్కువ ఉండరు. కాని వర్ధమాన దేశాల పరిస్థితి అలా కాదు. 60-70 శాతం జనాభాకు వ్యవసాయమే జీవనాధారం. ఈ స్థితిలో సంపన్న దేశాల నుండి వచ్చిపడే చౌక ఉత్పత్తుల ధాటికి వారు దివాళా తీస్తున్నారు. వర్ధమాన దేశాల వ్యవసాయం సంక్షోభంలో కూరుకుపోయింది. అయినా సంపన్న దేశాలు మాత్రం తమ ఉత్పత్తులపై ఏదోలాగా లాభాలు పొందడానికి తీవ్రంగా ప్రయత్నించాయి.

ప్రపంచ వాణిజ్య సంస్థ (డబ్ల్యుటిఓ) చుట్టూ చోటు చేసుకున్న పరిణామాలను గమనిస్తే, ప్రపంచ వాణిజ్య సరళీకరణే ధ్యేయంగా 2001లో మొదలైన దోహా చర్చల్లో కొన్ని ముఖ్యమైన అంశాలపై మొదటి నుంచి అభివృద్ధి చెందుతున్న దేశాలకు ఎన్నో భయసందేహాలు ఉన్నాయి. వాటిని నివృత్తి చేయకుండానే తాజా చర్చలను అర్ధాంతరంగా ముగించడానికి అమెరికా, ఇయు, జపాన్, కెనడా, ఆస్ట్రేలియా లాంటి ధనిక దేశాలు తీవ్రంగా ప్రయత్నించాయి. తమ 'విభజించు–పాలించు' వ్యూహంతో అభివృద్ధి చెందుతున్న దేశాల మధ్య విభేదాలను సృష్టించి, వాటిని బలహీనపరచి, తాము అనుకున్నది సాధించుకున్నాయి. స్వేచ్ఛా వాణిజ్యాన్ని ఎదుర్కోలేని పేద దేశాలకు ఎటువంటి రక్షణ కల్పించకుండా, వాటిని ప్రమాదకర పరిస్థితుల్లోకి నెట్టడానికి అవి సిద్ధపడ్డాయి. అభివృద్ధి చెందుతున్న దేశాల్లోని వ్యవసాయ సబ్సిడీలు, ఆహార భద్రత, ధాన్య సేకరణ, నిల్వ విధానాలను డబ్ల్యుటిఓ పరిధి కిందకు తీసుకురావడానికి ప్రయత్నించాయి. ఇండియాలో రైతులకిస్తున్న కనీస మద్దతు ధరలపై, ఉత్పాదక సబ్సిడీలపై పరిమితులు విధించాలని అమెరికా, ఇయు తరపున డబ్ల్యుటిఓ డైరెక్టర్ బహిరంగంగానే ప్రకటించారు. అంతేకాక సమావేశాల్లో ధనిక దేశాల డిమాండును అంగీకరించకపోతే ఆ రోజే చర్చలకు 'అవసాన దినం' అవుతుందని హెచ్చరించారు.

ఈ సదస్సుకు ముందు భారత్, చైనా, దక్షిణాఫ్రికా, వెనిజులా తదితర దేశాలు తమ రైతులను, వ్యవసాయరంగాన్ని.. సంపన్నదేశాల దిగుమతుల నుంచి కాపాడుకోవడానికి ఉద్దేశించిన ప్రత్యేక రక్షణ వ్యవస్థలపై వాదనలు సిద్ధం చేసుకున్నామని గొప్పలు చెప్పారు. దేశ ప్రజల ఆహార భద్రతకు ఢోకాలేకుండా ఆహార ధాన్యాల నిల్వలకు సంబంధించిన వివాదాన్ని శాశ్వతంగా పరిష్కరించుకోవాలని ప్రధాని మోదీ 2014 అక్టోబరులో ఆఫ్రికా దేశాల నాయకులతో జరిగిన భేటీలో ఉద్ఘాటించారు. అయితే ఈ కీలక అంశాలపై ఎటువంటి హామీలను నైరోబీ సదస్సులో పొందలేకపోయారు. దోహా చర్చల్లో పరిష్కారం కాకుండా ఉన్న సమస్యలను పెద్ద దేశాలు కుట్రపూరితంగా వ్యవహరించి పేదదేశాల ప్రయోజనాలను బలిపెట్టే వేదికగా నైరోబీని తీర్చిదిద్దాయి. డబ్ల్యుటిఓ సభ్యదేశాలన్నీ తమ తమ రైతులకు ఇస్తున్న ఎగుమతి సబ్సిడీలను గణనీయంగా తగ్గించాలని ఈ ఒప్పందం నిర్దేశిస్తోంది. నైరోబీ ప్రకటన వర్ధమాన దేశాల ఆందోళనలను పట్టించుకోకుండా దోహా డెవలప్‌మెంట్ ఎజెండాను ఖతం చేసి నూతన ముసాయిదాను వీటిలోని కొన్ని ప్రధాన దేశాలతో ఒప్పించి వర్ధమాన దేశాలపై దానిని రుద్దింది. అమెరికాకు ఉపయోగపడిన బ్రెజిల్‌తోపాటు అంతకుముందు ప్రగల్భాలు పలికిన భారత్ ఉండడం విషాదకరం. నూతన ముసాయిదాలో రెండవ సమాచార సాంకేతిక (2 ఐటి) ఒప్పందం చేర్చారు. ఈ ఒప్పందం వలన ఐటి ఉత్పత్తులపై సుంకాలు తొలగిపోయి వర్ధమాన దేశాల మార్కెట్లను ధనిక దేశాలు తమ ఉత్పత్తులతో ముంచెత్తుతాయి. 1996లో భారతదేశం మొదటి ఐటి ఒప్పందంపై సంతకం చేసింది. ఫలితంగా 200 పైగా ఐటి ఉత్పత్తులపై సుంకాలు తగ్గించడంతో దేశంలోని హార్డ్‌వేర్ పరిశ్రమ దివాళా తీసింది. ధనిక దేశాలు ముందుకు తెచ్చిన మరో అంశం వాతావరణ సరకుల ఒప్పందం దీనివల్ల వాతావరణ ఉత్పత్తులపై సుంకాలు తొలగిపోయి ధనిక దేశాలు బాగా లాభపడుతాయి.

భారతదేశ ప్రజల ప్రయోజనాలతో బాటు వర్ధమాన దేశాల ప్రయోజనాలను భారత్ కాపాడుతుందని భావించిన ఆఫ్రికన్ దేశాల నేతలకు ఆశ్చర్యం కల్గించింది. నైరోబీలో కీలకమైన అంశాలపై చర్చించేందుకు ఆఫ్రికా దేశాలు ఏర్పాటు చేసిన సమావేశంలో మన వాణిజ్య మంత్రి నిర్మలా సీతారామన్ పాల్గొనలేదు. ఇదే సమయంలో అమెరికా, ఇయులు వర్ధమాన దేశమైన బ్రెజిల్ సహకారంతో దోహా ఎజెండాలోని కీలకమైన అంశాలను అటకెక్కించేశాయి. వర్ధమానదేశాలకు ఎంతో కీలకమైన అంశాలను నైరోబీ చర్చల ముందు నుంచీ వ్యతిరేకిస్తూ వచ్చిన అమెరికా, వీటితో పాటుగా దోహా చర్చల కొనసాగింపు విషయంలోనూ స్పష్టత రాకుండా పావులు కదిపింది. వర్ధమాన దేశాలు కోరుకుంటున్న ప్రత్యేక రక్షణ వ్యవస్థల ఒప్పందం కుదరకుండా సంపన్న దేశాలు మరో విజయం సాధించాయి. సంపన్నదేశాల నుండి దిగుమతులను తగ్గించడానికీ, దిగుమతి చేసుకుంటున్న వాటిపై సుంకాలు పెంచడానికీ వీలుకల్పించే రక్షణను కూడా వర్ధమానదేశాలు సాధించలేకపోయాయి. సంపన్న దేశాల ఒత్తిళ్లకు ఇంతగా లొంగిన వర్ధమాన దేశాలు 'దోహా డెవలప్‌మెంట్ ఎజెండా' (డిడిఏ కింద సాధించుకున్న ప్రయోజనాలు భవిష్యత్తులో కొనసాగుతాయన్న హామీని కూడ పొందలేకపోయాయి. జి 33 దేశాలకు చెందిన చిన్న, సన్నకారు రైతులను రక్షించేందుకుగాను ప్రత్యేక పరిరక్షణ యంత్రాంగాలు (స్పెషల్ సేఫ్‌గార్డ్ మెకానిజమ్స్–ఎస్ఎస్ఎం) ఏర్పాటు చేయాలన్నది దోహా చర్చల్లో ప్రధానమైన అంశం. కానీ దీని మీద నైరోబీలో ఎలాంటి నిర్ణయం తీసుకోలేదు. ధనిక దేశాలు దీనిపై నిర్ణయాన్ని వాయిదా వేశాయి. నిజానికి ధనిక దేశాల్లోకి దిగుమతులు పెరగకుండా సుంకాలు విధించే ప్రత్యేక వ్యవసాయ పరిరక్షణ చర్యల (ఎస్ఎస్‌జి)ను అవి ఇప్పటికే అమలు చేస్తున్నాయి. కానీ, వర్ధమాన దేశాల రైతులకు మాత్రం అటువంటి రక్షణలు లేకుండా చేశాయి. నైరోబీ ప్రకటనతో ఇప్పటికే గిట్టుబాటు ధరలు లేక ఆత్మహత్యలకు పాల్పడుతున్న మన దేశ రైతాంగానికి మరింత పెద్ద ఉరితాడుగా మారబోతున్నది. నిజానికి డబ్ల్యుటిఓ చర్చల్లో ఏ నిర్ణయమైనా ఏకాభిప్రాయం ద్వారా జరగాల్సిందే. భారత్ కాదు అంటే అసలు ఒప్పందం కుదిరే అవకాశం లేదు. కానీ నైరోబీలో అమెరికా చెప్పినట్లు ఒప్పందంపై సంతకం చేసింది. విచిత్రమేమిటంటే భారతదేశానికి తిరిగి వచ్చిన తరువాత వాణిజ్యమంత్రి నిర్మలా సీతారామన్ ఒప్పందం పట్ల అసంతృప్తి వ్యక్తం చేయడం ప్రజలను మోసగించడానికేనన్నది స్పష్టం.

నైరోబీ చర్చల్లో అభివృద్ధి చెందే భారత్ వంటి దేశాల వ్యవసాయ రంగానికి తోడ్పడేలా ఎటువంటి చర్యలు చేపట్టకపోగా, దోహా సమావేశంలో ఆమోదింపబడిన కొన్నయినా న్యాయపరమైన అంశాలను అసలు ప్రస్తావించకుండానే, రైతులకిచ్చే సబ్సిడీలను, ఆహార భద్రతకు మూలమైన ప్రభుత్వ ధాన్య సేకరణను తిరస్కరిస్తూ, బహుళజాతి వ్యవసాయ కంపెనీల ఆధిపత్యాన్ని వర్ధమాన దేశాల మార్కెట్‌లో పెంచుకోవడానికి ఈ కింది అంశాలను కొత్తగా ఎజెండాలో చేర్చి ఆమోదం పొందగలిగాయి. నైరోబీ సమావేశంలో కొత్తగా చేర్చబడిన అంశాలు: 1) అభివృద్ధి చెందుతున్న దేశాల్లో విదేశీ పెట్టుబడుల పరిశ్రమల రక్షణకు ఆయా దేశాల్లోని కార్మిక చట్టాలను తిరిగి రూపొందించడం. 2) ధనిక దేశాల ఇ–కామర్సు సంస్థల విక్రయాలపై ఆంక్షలు, సుంకాలు తొలగించడం. 3) సూపర్ మార్కెట్ గొలుసు సంస్థల

వాణిజ్యంపై సుంకాలను తగ్గించడం, లాభాలను, రాయల్టీలను పశ్చిమ దేశాలకు తరలించడంపై ఆంక్షలు ఎత్తివేయడం. 4) కర్బన ఉద్గారాలను తగ్గించే (మిథేన్ వాయువు వగైరా పర్యావరణ) చర్యలను వ్యవసాయంలో చేపట్టటం. పై అంశాలను నైరోబీ మంత్రుల స్థాయి సమావేశంలో ధనిక దేశాలు తమకు అనుకూలంగా ఆమోదింప చేసుకోగలిగాయి. ఈ నిబంధనల అమలుపై ఏకగ్రీవాన్ని సాధించడానికి 2017 డిసెంబర్ వరకు కాల నిర్దేశాన్నిచ్చింది.

నైరోబీ సదస్సు ఇప్పుడు సాధించిందంటున్న అసాధారణమైన ఒప్పందం నిజానికి వర్ధమాన, నిరుపేద దేశాలకు శరాఘాతం వంటివి. డబ్ల్యూటీఓ సభ్య దేశాలన్నీ తమ తమ దేశాల్లో రైతులకిస్తున్న ఎగుమతి సబ్సిడీలను గణనీయంగా తగ్గించాలని ఆ ఒప్పందం నిర్దేశిస్తున్నది. సంపన్న దేశాలు ఈ సబ్సిడీల కోతను తక్షణం ప్రారంభించాల్సి ఉండగా వర్ధమాన దేశాలు 2018 నుంచి ఆ పని మొదలుపెట్టాల్సి ఉంటుంది. దిగుమతులు వచ్చిపడుతున్నప్పుడుగానీ, ధరలు పడిపోయినప్పుడుగానీ ప్రత్యేక రక్షణ చర్యల కింద దిగుమతులపై ఉండే సుంకాలను తాత్కాలికంగా పెంచుకోవడానికి వర్ధమాన దేశాలకు వెసులుబాటు నిచ్చారు. అలాగే ప్రజా పంపిణీ వ్యవస్థ కోసం ఆహార ధాన్యాల సేకరణ విషయమై కూడా అనంతర కాలంలో చర్చించడానికి అంగీకారం కుదిరింది. నిజానికి ఇవన్నీ కొత్తగా నైరోబీ సదస్సులో సాధించినవేమీ కాదు. రెండేళ్ల క్రితం బాలిలో జరిగిన డబ్ల్యుటిఓ సదస్సులోనే ఇందుకు సంబంధించిన అవగాహన కుదిరింది. ఇప్పుడు మంత్రుల స్థాయి సమావేశం దాన్ని పునరుద్ఘాటించడం మినహా కొత్తగా చేసిందేమీ లేదు.

ప్రపంచవాణిజ్య సంస్థ ఏర్పడిన 1995 నాటి నుంచి సంపన్న దేశాలు వ్యవసాయ సబ్సిడీలను తగ్గించుకోవాలని వర్ధమాన దేశాలు కోరుతుంటే, అలాగే తగ్గించుకుంటాము కాని మీరు మా వ్యవసాయేతర (పారిశ్రామిక) ఉత్పత్తుల దిగుమతులపై సుంకాలను తగ్గించుకోవాలని డిమాండు చేస్తున్నాయి. డబ్ల్యుటిఓ వ్యవసాయ సబ్సిడీలను గ్రీన్‌బాక్స్, బ్లూ బాక్స్, ఏంబర్ బాక్స్ అని విభజిస్తుంది. మొదటి రెండు రకాలు వ్యవసాయ రంగానికి పరోక్షంగా అందించే సబ్సిడీలు. ఏంబర్ బాక్స్ సబ్సిడీలు అంటే నేరుగా ఇచ్చేవి. రైతులకు గిట్టుబాటు ధర చెల్లింపు లాంటివి ఈ కోవలోకి వస్తాయి. వీటివల్ల వ్యవసాయ వాణిజ్యం వక్రీకరణకు గురవుతుంది కాబట్టి వాటిని బాగా తగ్గించుకోవాలని అమెరికా, ఇయు దేశాలు పట్టుబడుతున్నాయి. సంపన్న దేశాలు రైతులకు 'ఏంబర్ బాక్స్' కిందకు వచ్చే సబ్సిడీలకు బదులుగా 'గ్రీన్, బ్లూ బాక్స్' కిందకు వచ్చే రాయితీలను అధికం చేశాయి. కాని వర్ధమాన దేశాల పరిస్థితి అది కాదు. అవి అలా జాగ్రత్త పడలేదు. రెంటికిచెడ్డ రేవడిలా వాటి పరిస్థితి మారింది. వర్ధమాన దేశాలు గగ్గోలు పెట్టడంతో కొన్ని వ్యవసాయ సరుకులకు ప్రత్యేక రక్షణలు కల్పించడం, కొన్ని సరుకులను ప్రత్యేకమైన వాటిగా గుర్తించడానికి డబ్ల్యుటిఓ అంగీకరించింది. కాని ఈ ప్రత్యేక గుర్తింపు కాని, ప్రత్యేక సరుకుల హోదాగాని సుంకాల విషయంలో మాత్రమే వర్తిస్తుంది. పత్తి పండించే దేశాలకిచ్చిన కొన్ని వెసులుబాట్లు, అత్యంత వెనుకబడిన దేశాలకు ఐటీ సేవలు అందించడం వంటి చాలా చిన్న చిన్న హామీల వల్ల ఒనగూరేదేముంటుంది.

వర్ధమాన దేశాలు తమ వ్యవసాయ సరుకుల రక్షణకోసం దిగుమతులపై సుంకాలకు పరిమితమై పరిమాణాత్మక ఆంక్షలను వదులుకోవడానికి బాలి సదస్సులో అంగీకరించి తప్పుచేశాయి. మొత్తం 715 ఉత్పత్తులు సుంకాల విధింపు జాబితాలో ఉన్నాయి. భారతదేశం తన వ్యవసాయ సరుకులపై దిగుమతి సుంకాలను 36 శాతం తగ్గించుకోవలసి వచ్చింది. భారతదేశంతో సహా అన్ని వర్ధమాన దేశాలలోను దిగుమతి సుంకాలు చాలా పరిమితంగా ఉన్నాయి. చౌక దిగుమతులను అడ్డుకొని దేశీయ ఉత్పత్తులను కాపాడుకోవాలంటే పరిమాణాత్మక ఆంక్షలు తప్పనిసరిగా ఉండాలి. కాని వీటికి బదులు సుంకాల ద్వారా రక్షణకు వర్ధమాన దేశాలు అంగీకరించాయి. సుంకాలతో దేశీయ ఉత్పత్తులను రక్షించుకోవడం అసాధ్యం. అయినా వాటిని సైతం ఎంత వీలయితే అంతకు పరిమితం చేయడానికి సంపన్న దేశాలు తీవ్రంగా ప్రయత్నిస్తున్నాయి.

డబ్ల్యుటిఓ వ్యవసాయ ఒప్పందం ప్రకారం ఒక దేశం, వ్యవసాయ రంగానికి సమకూర్చే మొత్తం సహాయం (సబ్సిడీలు కలిపి) ఆ దేశ స్థూల వ్యవసాయ ఉత్పత్తిలో 10 శాతం మించకూడదు. దాన్నే సమిష్టి సహాయం అంటారు. ఆశ్చర్యకరంగా ఈ పరిమితిని కేవలం అభివృద్ధి చెందుతున్న దేశాలకు, అందులోనూ 1994కు ముందు సబ్సిడీలను ఇవ్వని వాటికే ప్రధానంగా వర్తింపజేస్తున్నారు. అంటే అప్పటికీ సబ్సిడీలు ఇస్తుండకపోతే, తరువాత ఇవ్వాలనుకున్నా ఈ పరిమితికి లోబడి ఇవ్వాలి. అప్పటికే సబ్సిడీలు ఇస్తున్న దేశాలకు ఈ పరిమితి వర్తించదు. ఇది ఎంత పక్షపాతం? 1994 ముందు ధనిక దేశాలు ఇస్తున్న సమిష్టి సహాయం 1,900కోట్ల డాలర్లు, అభివృద్ధి చెందుతున్న 71 దేశాల్లో ఇండియా సహా 61 దేశాలు ఒక్క రూపాయి కూడా వ్యవసాయ రంగానికి ఆనాడు సబ్సిడీ ఇచ్చేవి కాదు. ధనిక దేశాలు వ్యవసాయానికిచ్చే సబ్సిడీలు ఇప్పటికీ అధికంగానే ఉన్నాయి. నానాటికీ అవి పెరుగుతున్నాయి. 1996లో ధనిక దేశాలు ఇచ్చిన వ్యవసాయ సబ్సిడీలు 35,000 కోట్ల డాలర్లు. అది 2011కు 40,600 కోట్ల డాలర్లయింది. ఒక్క ఇయునే 2013లో 8,412 కోట్ల యూరోలను వ్యవసాయ సబ్సిడీగా ఇచ్చింది. అంతేకాక అమెరికా 2014 లో ప్రవేశపెట్టిన వ్యవసాయ బిల్లులో రానున్న పది సంవత్సరాలకు వ్యవసాయ సబ్సిడీ 95,600 కోట్ల డాలర్లు ఉంటుందని అంచనా వేసింది.

దోహా అంశాల నుంచి అమెరికా దూరం పాటించటంతో భారత్ లాంటి అభివృద్ధి చెందుతున్న దేశాలకు అసంతృప్తి తప్పలేదు. వచ్చే ఏడాది నుంచి డబ్ల్యుటిఓ సభ్య దేశాలు నిర్ణయాల అమలు ప్రారంభిస్తాయి. అసంపూర్తిగా మిగిలిన అంశాలపై ఆయా దేశాలు స్వేచ్ఛగా వ్యవహరిస్తాయి. అలాగే కొత్త అంశాలపై దృష్టి సారిస్తాయి. నైరోబి సమావేశాల్లో తీసుకున్న ప్రపంచ వాణిజ్య సంస్థ నిర్ణయాలు మన దేశ వ్యవసాయంపై తీవ్ర ప్రభావం చూపనున్నాయి. అభివృద్ధి చెందిన దేశాలు తమ వ్యవసాయ ఉత్పత్తులను పెద్దఎత్తున భారత్‌లో కుమ్మరించే అవకాశం ఉంది. అందువల్ల అభివృద్ధి చెందిన దేశాల ఉత్పత్తుల నాణ్యతకు దీటుగా సేద్య విధానాలను మార్పు చేసుకోవాలి. ఉత్పత్తి ఖర్చులను తగ్గించుకోవాలి. ఈ విషయంలో ఏమాత్రం అజాగ్రత్తగా వ్యవహరించినా రైతన్నపై కోలుకోలేని దెబ్బపడుతుంది.

1991 ఆర్థిక సంస్కరణల అమలు కారణంగా దిగుమతులపై ఆంక్షలు సడలించడంతో అత్యంత చవకగా మలేసియా నుంచి మన దేశంలోకి పామాయిలు దిగుమతి అవుతోంది. స్థానిక విపణిలో మన వేరుశెనగ నూనె ఆ ధరలకు పోటీగా నిలవలేకపోతోంది. ఇవాళ వేరుశెనగ,

# పశ్చిమాసియాలో సౌదీ-ఇరాన్ ముసలం

***సౌదీ అరేబియాలో షియా మత నాయకుడిని ఉరి తీయడం వెనుక కారణాలనూ, పర్యవసనాలనూ వివరిస్తున్నారు***

**సంతోష్**

**నూ**తన సంవత్సరం ప్రారంభమైన మర్నాడే సౌదీ అరేబియాలో షియా మత పెద్ద షేక్ నిమ్ర్ బాఖిర్ అల్ నిమ్ర్‌ను ఉరితీయడంతో మధ్యప్రాచ్యంలో తీవ్ర పరిణామాలు చోటు చేసుకున్నాయి. అనేక దేశాల్లో నిరసనలకు, ఉద్రిక్తతలకు దారి తీసింది. ఈ ఘటనకు ప్రతిచర్యగా ఇరాన్ రాజధాని టెహ్రాన్‌లో సౌదీ రాయబార కార్యాలయంపై దాడి జరిగింది. దానికి ప్రతిచర్యగా ఇరాన్‌తో దౌత్య సంబంధాలను సౌదీ తెగతెంపులు చేసుకొని, ఆ దేశ రాయబారిని 48 గంటలలోగా తమ దేశాన్ని వీడివెళ్లాలని ఆదేశించింది. ఆ దేశంతో వైమానిక సర్వీసులను, వాణిజ్యాన్ని కూడ రద్దు చేసుకుంది. బహ్రెయిన్, సూడాన్‌లు సైతం సౌదీ మార్గాన్నే అనుసరించగా, యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్ ఇరాన్‌తో తనకున్న దౌత్య సంబంధాల స్థాయిని తగ్గించుకుంటున్నట్టు ప్రకటించింది. కువైట్ కూడా ఇరాన్‌లోని తన రాయబారిని వెనక్కి పిలిపించింది.

గత 5 సంవత్సరాలుగా ఇస్లామిక్ అగ్రరాజ్యాలైన ఇరాన్, సౌదీ అరేబియా మధ్య సంబంధాలు క్షీణిస్తూ వచ్చాయి, ఇప్పుడవి మరింత దిగజారాయని ఈ పరిణామాలతో స్పష్టమవుతోంది. సున్నీ, షియా తెగల మధ్య భేద భావాలు పెరగడంతో ఈ విష వాతావరణం మొదలైంది. మధ్యప్రాచ్యం ఇస్లామిక్ విప్లవం నాటి నుంచే చీలిపోయింది. 2003లో ఇరాక్‌పై అమెరికా యుద్ధం తరువాత ఈ వైషమ్యాగ్ని మరింతగా ఆజ్యం పోసుకొంది. సౌదీలో షియా ముస్లింల సంఖ్య మొత్తం జనాభాలో 15 శాతం అంటే దాదాపు 30 లక్షలు. చమురు సంపన్న తూర్పు దక్షిణ రాష్ట్రంలో వారు అధికంగా కేంద్రీకృతమై ఉన్నారు. ఆ రాష్ట్రాలలో మొత్తం జనాభా 40 లక్షలైతే షియాల సంఖ్య 20 లక్షల దాకా ఉంది. షియాల ఆధిక్యంలో ఇరాన్, సున్నీల ఆధిక్యంలో సౌదీ అరేబియా ఉన్నాయి. ఇరాక్‌లో మాత్రం ఆధిక్యంలో సున్నీలు ఉన్నా, సద్దామ్ హత్య తరువాత అమెరికా తొత్తు ప్రభుత్వం షియాల పట్టులో ఉంది.

**సలాఫిజం నుంచి మొదలైన షియా ద్వేషం**

సౌదీ అరేబియాలో అధికార గణం పాటించే ఇజం 'సలా ఫిజం'. దీనికి ఇస్లామ్‌లోని రెండు మౌలిక పాఠాలు మూలం. ఒకటి ఖురాన్ కాగా, రెండోది హదీస్. ప్రొఫెట్ మహమ్మద్ పాటించిన సాంప్రదాయాలే హదీస్. ఈ రెండు మౌలిక పాఠాలకు భిన్నమైన అన్ని ఆనవాయితీలు, ఆచరణలను కుఫ్ర్ ( అవిశ్వాసం)గా సలాఫిస్టులు భావిస్తారు. ఈ సలాఫిస్ట్

---

పొద్దుతిరుగుడు పండించే  రైతు తీవ్ర సంక్షోభంలో కూరుకుపోవడం వెనక కీలక కారణం ఇదే. మరోవంక ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం సాయంతో తక్కువ ఖర్చుపెట్టి భారీ మోతాదులో ఉత్పత్తి చేసిన పౌల్ట్రీ ఉత్పత్తులను అమెరికా వచ్చే ఏడాది నుంచి భారత్‌లో అమ్మకానికి పెట్టబోతోంది. దేశీయ పౌల్ట్రీ రంగంపై ప్రతికూల ప్రభావం కనబరిచే పరిణామమిది. దీంతో ఏటా దేశీయ పౌల్ట్రీ రంగానికి సుమారు రూ. 2,000కోట్లకు పైగా నష్టం చేకూర్చే ప్రమాదం పొంచి ఉంది. ప్రపంచీకరణ కారణంగా భారత వ్యవసాయ మార్కెట్లు బడా కంపెనీల గుత్తాధిపత్యం బారినపడి కుదేలు కాకుండా అన్ని జాగ్రత్తలు తీసుకోవాలి. అప్పుడే ఆహార భద్రతను, వ్యవసాయ రంగాభివృద్ధిని, బడుగు రైతులను కాపాడుకోవడం సాధ్యపడుతుంది.

ఈ నేపథ్యంలో వ్యవసాయ పరిశోధన, విస్తరణ, వ్యవసాయ విద్యా వ్యవస్థలను బలోపేతం చేయాల్సి ఉంది. డబ్ల్యుటిఓ నిబంధనలకు అనుగుణంగా అభివృద్ధి చెందిన దేశాల తరహాలో ప్రత్యక్ష రాయితీల (మద్దతు ధర) కంటే, పరోక్ష రాయితీల (గ్రీన్ బాక్స్, బ్లూ బాక్స్)పై అంటే సాగునీరు, భూసార పరీక్షలు, మార్కెట్ సమాచారం, కొత్త మార్కెట్ల అన్వేషణ, గోడౌన్లు, శీతల గిడ్డంగులు, మేలురకం విత్తనాలు, వ్యవసాయ పరిశోధనలు, బ్యాంకు రుణాలు, పంటల బీమా, ఆధునిక వ్యవసాయ పద్ధతుల ప్రోత్సాహం వంటివాటితో పాటు మెరుగైన శిక్షణ ఇచ్చి రైతులను ఆదుకోవాలి. వాటితోపాటు కేవలం భారత్‌లో మాత్రం సాధ్యమయ్యే పంటలను ఉత్పత్తి చేసి ఇతర దేశాలకు ఎగుమతి చేయడంపై దృష్టి పెట్టాలి. భారత ఆహార భద్రతకు కీలకమైన పప్పు ధాన్యాలపై ప్రత్యేక శ్రద్ధపెట్టాలి.

నైరోబీ ఒప్పందాన్ని పరిశీలిస్తే వర్ధమాన, పేదదేశాల రైతులు నష్టాల్లో కూరుకుపోవడం, ప్రజలు అర్ధాకలితో పస్తులుండడమే సంపన్న దేశాలు కోరుకుంటున్నాయని ఒప్పందంతో మరోమారు తేలిపోయింది. అమెరికా తనకు కావల్సింది తాను తీసుకుంది. వర్ధమాన దేశాలకు ఒక్క మెతుకు కూడ 'మిగల్చలేదు'. 'వర్ధమాన దేశాలు ఉత్తచేతుల్తో తిరిగి వెళ్తుండగా, అమెరికా బడా కార్పొరేషన్లు మాత్రం వాటికి కావల్సినవి దక్కడంతో సంతోషంతో వెళ్తున్నాయి' అని నైరోబీ సమావేశానికి హాజరైన సామాజిక కార్యకర్తలు వ్యాఖ్యానించడం గమనార్హం. ఈ నేపథ్యంలో పేదరికాన్ని పెంచే, ధనిక దేశాలకు ఊడిగం చేసే డబ్ల్యుటిఓలో సభ్యత్వం కలిగివుండడం వర్ధమాన, పేద దేశాలకు అవసరమా అనే ప్రశ్న ఉదయించక మానదు. ఎందుకంటే నైరోబీ ఒప్పందం మన వ్యవసాయ రంగం ఉసురు తీసింది. రైతాంగాన్ని ఆత్మహత్యలకు నెట్టింది.

*(రచయిత ఉపాధ్యాయ నాయకులు, రాజనీతి శాస్త్ర విద్యార్థి)* వీ

సిద్ధాంతమే షియాలను ముస్లిమ్‌లు కారన్న వాదానికీ, సౌదీ శత్రుత్వానికీ కారణం. 18వ శతాబ్దపు అరేబియా ద్వీప కల్పంలో సంస్కర్త షేక్ మొహమ్మద్ ఇబ్న్ వాహబ్ సలాఫిజం విశ్వాసాలకు తిరిగి ప్రాణం పోశారు. తరువాత ఆ విశ్వాసానికి ఇబ్న్ ప్రతిపాదించిన కఠిన హక్కును చాటుకున్నారు. సలాఫిస్టుల ఆలోచనలను పుణికి పుచ్చుకొన్న ఇబ్న్ అబ్దుల్ వాహబ్ షియాలను 'మత ద్రోహులు', అవినీతి పరులు, హింసావాదులైన పాపులు'గా నిందించారు. ఆ విధంగా షియాల పట్ల ద్వేషభావాలు సౌదీ వ్యవస్థలో భాగమైపోయాయి. 1979లో ఇరాన్ విప్లవం సందర్భంగా సౌదీ తూర్పు రాష్ట్రంలోని షియాలు తమను సమానత్వంతో చూడాలంటూ ఆందోళనలు ప్రారంభించారు. 1990 మొదట్లో ఆ రాజ్యంలోని కొందరు సున్నీ పండితులు 'సాహ్‌వా (వేకువ) పేరుతో ప్రారంభించిన సంస్కరణోద్యమంతో మమేకమయ్యారు. 1994 నుంచి ఈ ఉద్యమంపై పాలకులు విరచుకుపడడంతో రాచ కుటుంబం షియాల నేతలను సంప్రదించి వారి నాయకులను ఖైదు నుంచి విడుదల చేస్తామని, వివక్ష విధానాలకు స్వస్తి పలుకుతామని హామీ ఇచ్చారు. ఉద్యమ విరమణ తరువాత ఆచరణలో ప్రతిపక్షాన్ని చీల్చడానికే ఆ హామీ ఇచ్చారని తేలింది. సంస్కరణల ఊసే లేకుండా పోయింది.

**సౌది అరేబియా దూకుడుకు కారణాలు...**

సౌదీ అరేబియా ఇటీవల కాలంలో అనుసరిస్తున్న ధోరణుల వెనక వేరే కారణాలున్నాయి. షియా తెగకు చెందిన సిరియా అధినేత బషర్ అల్ అసద్‌ను పదవీ భ్రష్టుణ్ణి చేయడానికి అమెరికాను ముందుపెట్టి ప్రారంభించిన యుద్ధం ఇప్పటికి అయిదేళ్లు దాటుతున్నా దారీతెన్నూ లేకుండా పోయింది. ఆ యుద్ధం వల్ల పుట్టుకొచ్చిన ఐఎస్ ఉగ్రవాద సంస్థను నియంత్రించడమెలాగో తెలియక అయోమయంలో పడిన అమెరికా... చివరకు అసద్‌తోనే చెలిమికి సంసిద్ధం కావడం, ఇరాన్‌తో అణు ఒప్పందాన్ని కుదుర్చుకోవడం సౌదీకి రుచించలేదు. దానికితోడు అసద్‌కు బాసటగా రష్యా రంగ ప్రవేశం చేయడంతో పరిస్థితి మొత్తం మారిపోయింది. యెమెన్‌లో తాను ఈజిప్టు, బహ్రెయిన్, కువైట్, సూడాన్ తదితర దేశాలను తోడు తెచ్చుకుని, అమెరికా మద్దతుతో మొదలెట్టిన యుద్ధం సైతం అనుకున్న ఫలితాన్ని సాధించకుండానే కాల్పుల విరమణకు దారితీయడం సౌదీ అరేబియాకు పుండుమీద కారం జల్లినట్టయింది.

సౌదీ ఒకవైపు ఆర్థిక సంక్షోభం, మరోవైపు ప్రజా వ్యతిరేకత మూట కట్టుకున్నది. పశ్చిమాసియాలో ఇరాన్ పోటుతో సౌదీ ఏకఛత్రాధిపత్యానికి బీటలు వారుతున్నది. ప్రత్యర్థి దేశం ఇరాన్ అణ్వాయుధ సంపత్తిని సమకూర్చుకుంటున్న వేళ... ఇస్లాంలో తెగల ఘర్షణ రెచ్చగొట్టే వ్యూహంతో సౌదీ అరేబియా మారణ క్రీడకు తెర తీసిందంటే కేవలం ఆరోపణ కాదు. నిజానికి తన సంక్షోభాన్ని పశ్చిమాసియాపై రుద్ది, తన సమస్యను ప్రపంచ సమస్యగా మార్చాలని విశ్వప్రయత్నం చేస్తోంది. పశ్చిమాసియాలో అస్థిరత, అస్తవ్యస్త పరిస్థితుల్లో తమ ప్రయోజనాలను కాపాడుకునేందుకు సున్నీలు, షియాల మధ్య రెచ్చగొట్టే చర్యలతో పావులు కదుపుతోంది. ఓ వైపు ఇస్లామిక్ స్టేట్ మూకలు ఇస్లాంలోని షియాలు, ఇతర మైనారిటీ వర్గాలను వెంటాడి, వేటాడి పీడిస్తున్నాయి. పశ్చిమాసియా రగిలిపోతుందని తెలిసినా... షియా వర్గాల్లో పేరు ప్రఖ్యాతులున్న షేక్ నిమ్ర్ ఉల్ నిమ్ర్‌ను బహిరంగంగా ఉరి తీసింది. 2011 నుంచి తూర్పు సౌదీలో మానవహక్కుల గురించి పోరాడిన షియా యోధుడిగా నిమ్ర్‌కు పేరుంది. అతడికి క్షమాభిక్ష పెట్టాలని పదే పదే ఇరాన్ కోరింది. అయినా 46 మంది తిరుగుబాటుదారులతో పాటు ఆయనకు మరణ దండన విధించింది. మరణ శిక్ష అమలైన 47 మందిలో 43 మంది సున్నీ జిహాదీలు, మిగిలిన నలుగురూ షియాలు కావడం, అందులో షేక్ నిమ్ర్ అల్ నిమ్ర్ అనే మతాచార్యుడు ఉండడంతో వ్యవహారం ప్రమాదకరమైన మలుపు తిరిగింది. దేశవ్యాప్తంగా 12 వేరువేరు జైళ్లలో ఈ హత్యలు జరిగాయి. ఎనిమిది జైళ్లలో నిందితుల తలలను నరికారు. మిగిలిన నాలుగు జైళ్లలో వారి దేహాలను తుపాకుల తూటాలతో తుత్తునియలు చేశారు. రాజకుటుంబ నిరపేక్ష అధికారాన్ని ప్రశ్నిస్తే పర్యవసానం ఎంత భయంకరంగా ఉంటుందో తెలియజేయడానికి తలలులేని మొండాలను శిలువలపై బిగించి బహిరంగంగా వేళ్లాడదీశారు. ఈ ఘటనతో దేశంలో అంతర్గత తిరుగుబాట్లను కఠినంగా అణచి వేస్తామనే హెచ్చరికతో పాటు, ఈ ప్రాంతంలో సున్నీలందరినీ ఏకం చేసేందుకు సౌదీ ఈ మారణ క్రీడను ప్రారంభించింది.

మరణ శిక్షలు అమలు చేసిన రోజే యెమెన్‌లో కాల్పుల విరమణను ఉల్లంఘిస్తూ ఆ దేశంలో సౌదీ అరేబియా వైమానిక దాడులకు పాల్పడడం యాదృచ్ఛికమేమీ కాదు. యెమెన్‌లో అక్కడి ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడుతున్న హౌతీ మిలిటెంట్లు షియా తెగవారే. షియా మత గురువును ఉరితీయడం ద్వారా, యెమెన్‌లో దాడుల్ని పునఃప్రారంభించడం ద్వారా ఇరాన్‌లోనూ, ఇతర దేశాల్లోనూ ఉన్న షియాలను రెచ్చగొట్టడం... ఆ సాకుతో ఇరాన్‌తో ఉన్న సంబంధాలను తెంచుకోవడం సౌదీ ధ్యేయం. నిజానికి షియా మత గురువును ఉరితీయడం అన్యాయం, అమానవీయం. ఈ హత్యకు 'దైవ ప్రతీకారం' ఉంటుందని ఇరాన్ సౌదీని హెచ్చరించింది. రానున్న కాలం ఎటు మలుపు తిరుగుతుందో, ఇంకెంత హింస రగులుతుందో వేచి చూడాలి.

2011లో అరబ్ దేశాల్లో 'జాస్మిన్ విప్లవం' ఉవ్వెత్తున ఎగసినప్పుడు షియా తెగ ఎదుర్కొంటున్న అణచివేతకు నిరసనగా జరిగిన శాంతియుత ఉద్యమానికి నిమ్ర్ నేతృత్వం వహించాడు. సౌదీలోని తూర్పు, దక్షిణ ప్రాంతాల్లో అధిక సంఖ్యలో ఉన్న తమ తెగకు కనీస హక్కులు లేకపోవడాన్ని నిలదీశాడు. ప్రజాస్వామిక సంస్కరణల కోసం, సున్నీ రాచరికపు పాలన అణచివేతకు వ్యతిరేకంగా ప్రజలు చేసిన ప్రదర్శనలకు నాయకత్వం వహించాడు. తూర్పు సౌదీ అరేబియాలోని కతీఫ్, అల్ ఇహ్సాలను సౌదీ నుంచి విడదీసి షియా ఆధిక్య దేశమైన బహ్రెయిన్‌లో కలపాలని షేక్ నిమ్ర్ డిమాండ్ చేసి ప్రభుత్వ ఆగ్రహానికి గురయ్యారు. 2012లో సౌదీ రాచ కుటుంబంపై నిమ్ర్ బహిరంగంగా తీవ్రస్థాయిలో ధ్వజమెత్తారు. అప్పటి నుంచి సౌదీ ఆయనను షియా టెర్రరిస్టుగా పరిగణించసాగింది.

2012లో పోలీసులు నిమ్ర్‌ను అరెస్టు చేయడానికి వచ్చి ఆయనపై కాల్పులు జరిపారు. కారులో రక్తపు మడుగులో ఉన్న ఆయన ఫొటోలకు విపరీతమైన ప్రచారం వచ్చింది. అప్పుడే ఆయన జనం దృష్టిలో ఆరాధ్యుడు అయిపోయారు. సౌదీలో మైనారిటీ షియాలపై సాగుతున్న

దమనకాండను దునుమాడుతూ, పాలకుల కంట్లో నలుసులాగా మారిన షియా మత పెద్ద నిమ్ర్ అల్ నిమ్ర్ రాజద్రోహానికి, విదేశీయులతో చేతులు కలిపి కుట్రలకూ పాల్పడుతున్నాడనే ఆరోపణలు సౌదీ రాజరికం చేసింది. నాలుగేళ్ల క్రితమే జైల్లో పెట్టింది. 2014 అక్టోబర్‌లో ఆయనకు మరణ శిక్ష విధించింది. అప్పుడే ఇరాన్‌తో సహా అనేక దేశాలు మరణ శిక్ష అమలు చేయవద్దంటూ విజ్ఞప్తులు చేశాయి. ఆయనతోపాటు మరణశిక్ష అమలైనవారిలో సున్నీలు కూడా ఉన్నారు గానీ వారంతా అల్-కాయిదా నాయకుడు బిన్ లాడెన్ పిలుపు మేరకు 2003-2006 మధ్య సౌదీలో వివిధ ఉగ్రవాద సంఘటనల్లో పాల్గొన్నవారు.

**ప్రాంతీయ ఆధిపత్య పోరు...**

1980లో ఇరాన్ ఇస్లామిక్ రిపబ్లిక్‌కు, ఇరాకీ బాత్ ప్రభుత్వానికి మధ్య సంఘర్షణ చెలరేగింది. ఆ యుద్ధంలో దాదాపు పదిలక్షల మంది మరణించారు. దీంట్లో సౌదీ హస్తం ఉందని ఇరానియన్లు ఇప్పటికీ నిందిస్తారు. అప్పటి నుంచి ఇరాన్-సౌదీ అరేబియాల మధ్య పరోక్ష సమరం కొనసాగుతోంది. 1980లలో లెబనాన్‌లో, 2003 నుంచి ఇప్పటి వరకు ఇరాక్, సిరియా, యెమెన్‌లలో ఈ ప్రచ్ఛన్న యుద్ధం కొనసాగుతోంది. 2011లో ట్యునీసియా, ఈజిప్ట్, లిబియా, సిరియా, జోర్డాన్, సౌదీ, యెమెన్, బహ్రెయిన్ దేశాలలో సైనిక, రాజరిక నియంతృత్వాలను మార్చి ప్రజాస్వామ్యాన్ని ప్రతిష్ఠించడానికి అరబ్ వసంతం పేరిట ప్రజలు ఉద్యమించారు. అరబ్ వసంతాన్ని పాలకులు అణచివేయడంతో ప్రజల్లో గూడుకట్టిన అసంతృప్తి జిహాదీ సంస్థ ఇస్లామిక్ స్టేట్ (ఐఎస్) బలపడడానికి దోహదం చేసింది. ఐఎస్ ఏకకాలంలో షియాల మీద, సౌదీ రాజరికం మీద విరుచుకుపడుతోంది. సౌదీ పాలకులను కూలదోసి తానే సున్నీ వర్గానికి ఏకైక అధినేతగా ఎదగాలని కలగంటోంది. దీనికి ప్రతిగా జిహాదీ ఉగ్రవాదులపై పోరాటానికి అమెరికా ప్రోత్సాహంతో సౌదీ అరేబియా ఇటీవల 34 ఇస్లామిక్ దేశాల కూటమిని ఏర్పరించింది. అందులో ఇరాన్, ఇరాక్, సిరియాలకు స్థానం కల్పించలేదు.

ప్రాంతీయాధిపత్యం కోసం ఇరాన్-సౌదీ అరేబియాల మధ్య సుదీర్ఘకాలంగా సాగుతున్న ప్రచ్ఛన్న యుద్ధం ఇప్పుడు ప్రత్యక్ష యుద్ధంగా మారిపోయింది. అరబ్ ప్రపంచంలోని సున్నీ నియంతలు, సామ్రాటులు సౌదీ అరేబియా పంచన ఉంటే, ఇరాక్, సిరియాతోపాటుగా హిజ్బుల్లా వంటి తిరుగుబాటు శక్తులు ఇరాన్ పక్షాన ఉన్నాయి. సున్నీ-షియా ఘర్షణలు పతాకస్థాయికి చేరే ప్రమాదం పొంచిఉన్న తరుణంలో, ఒక ఉద్రిక్త వాతావరణాన్ని సృష్టించడం ద్వారా సౌదీ ప్రపంచానికి ప్రమాదకరంగా పరిణమించింది. అమెరికన్ సామ్రాజ్యవాదం సౌదీ అరేబియాకు ఇస్తున్న మద్దతువల్లే మధ్య యుగాల్లోకూడా ఊహించని నేరాలకు, ఘోరాలకు సౌదీ పాలకులు పాల్పడుతున్నారు. సౌదీ అరేబియాలోని క్రూర రాచరికం భూస్వామ్య వ్యవస్థ అవశేషమే కాక అది మధ్యప్రాచ్యంలో అమెరికన్ సామ్రాజ్యవాద జోక్యాల ప్రథమ ఉత్పాదనంగా ఉన్నది. ఈ ఉత్పాదన మూలాలు 1930, 40వ దశకాలలో స్టాండర్డ్ ఆయిల్, టెక్సాకో కంపెనీలు పొందిన రాయితీల నుంచి నేటి అమెరికా మిలిటరీ-ఇండస్ట్రియల్ కాంప్లెక్స్ తయారు చేస్తున్న ఆధునాతన ఆయుధాల కీలక వినిమయదారు హోదాలో ఉన్నాయి. సౌదీ పాలకులు చేస్తున్న అరాచకాలలో అమెరికా రక్షణశాఖ, సిఐఏలకు ప్రత్యక్ష పాత్ర ఉన్నది. అలా అమెరికన్ సామ్రాజ్యవాదం సౌదీ అరేబియా రూపంలో మధ్యప్రాచ్య ప్రాంతాన్ని కబళించడానికి పావులు కదుపుతుంది. ఇరాన్-సౌదీల మధ్య రాజుకుంటున్న నిప్పు పశ్చిమాసియాకు మాత్రమే పరిమితం కాబోదు. ఆ సంక్షోభం ప్రభావం మిగతా ప్రపంచంపైన తప్పక పడుతుంది. సౌదీ దుందుడుకు ధోరణులు అరబ్ దేశాల్లో సామరస్యంగా, ప్రశాంతంగా జీవిస్తున్న షియా, సున్నీ తెగల మధ్య వైరాన్ని పెంచుతున్నాయి. పశ్చిమాసియాను రణక్షేత్రంగా మారుస్తోంది. ఇన్నాళ్లుగా సౌదీ ఏం చేసినా చూసీచూడనట్టు వ్యవహరిస్తున్న అమెరికా ఇప్పటికైనా తన వైఖరి మార్చుకోవాలి. సౌదీని కట్టడి చేయాలి.

**సౌదీ దూకుడుకు తక్షణ కారణాలు...**

సిరియాలో అస్సద్ ప్రభుత్వాన్ని కూలదోయకుండా ఆ దేశంలో అంతర్యుద్ధాన్ని ఆపరాదని సౌదీ రాజకుటుంబం స్థిర నిశ్చయంతో ఉంది. సిరియాకు సన్నిహిత దేశం ఇరాన్‌తో ఘర్షణకు దిగి సిరియా సమస్యకు పరిష్కారం లభించకుండా చూడాలనేదే సౌదీ లక్ష్యం. అలాగే, ఇరాన్ వెన్నుదన్నుగా ఉన్న షియాలైన హౌతీ తిరుగుబాటుదారులకు వ్యతిరేకమైన పరిస్థితులు ఏర్పడే వరకూ యెమెన్ శాంతి చర్చలు ఆరంభం కానివ్వకూడదన్నది దాని లక్ష్యం. ఇరాన్‌పై అమెరికా ఆంక్షల పర్యవసానంగా పలు సంవత్సరాల నుంచి ప్రపంచ మార్కెట్‌లో ఇరాన్ చమురు లేకుండా పోయింది. కనుక చమురు వాణిజ్యంలో సౌదీదే ఆధిపత్యం ఉండేది. ఇప్పుడది పూర్తిగా తారుమారు అయ్యే పరిస్థితులు నెలకొన్నాయి. ఇరాన్‌పై ఆంక్షలు తొలగిపోయి అమెరికా-ఇరాన్‌ల మధ్య ఇటీవలనే మొగ్గతొడిగిన సుహృద్భావాన్ని తుంచివేసి, పశ్చిమాసియాను ఒక యుద్ధక్షేత్రంగా మార్చివేయడానికి సౌదీ కుతూహలంగా ఉంది. ఇరాన్‌ను మళ్లీ ఏకాకిని చేస్తే తప్ప, అమెరికా, ఇరాన్‌ల మధ్య కుదిరిన అవగాహనను దెబ్బ తీస్తే తప్ప, తమ దేశంలో ప్రజల్లో పెరిగిన అసంతృప్తి నుంచి బయట పడడం సాధ్యం కాదని అది భావిస్తున్నది. మరోవైపు తనలాగా వహాబీ భావజాలాన్ని కలిగివుండి, శత్రువులను శిరచ్ఛేదం చేస్తున్న ఐసిస్, అల్ నుస్రా ఫ్రంటులు భస్మాసుర హస్తంగా మారుతాయని సౌదీ రాచరికం భయపడుతున్నది.

**ముగింపు**

ఇరాన్, ఇరాక్, లెబనాన్, సిరియా తదితర షియా దేశాల్లో ఎన్నికల ప్రజాస్వామ్యం వేళ్లూనుకొంటుండగా, సౌదీ నాయకత్వంలోని సున్నీ దేశాల్లో ఇప్పటికీ రాచరికాలు, సైనిక నియంతృత్వాలే రాజ్యం చేస్తున్నాయి. ఈ దేశాల్లో అరబ్ వసంతం రగిల్చిన ప్రజాస్వామ్య ఆకాంక్షలను మత తెగల వైమనస్యాల ముసుగులో నలిపేయాలని చూడడమే ప్రస్తుత సౌదీ దూకుడుకు మూలకారణం. మరోవైపు షియాలను వ్యతిరేకించడంలో ఐఎస్ కన్నా తానే ఘనురాలినని చాటుకోవడానికి సౌదీ అనుసరిస్తున్న వ్యూహం బెడిసికొట్టి చివరకు అక్కడి రాచరిక ప్రభుత్వానికే ఎసరు తెచ్చిపెట్టినా ఆశ్చర్య పడవలసిందేమీలేదు. సున్నీ-షియా వైషమ్యాలు జిహాదీల రాజకీయ ఉత్థానానికి తోడ్పడవచ్చునేమో కానీ, సౌదీకి మాత్రం రాజకీయంగా కొరివితో తలగోక్కోవడం తప్ప మరొకటి కాదు.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# 'నెరవేరని వాగ్దానాల అంతులేని కథ'

***బి.డి. శర్మ రచనను సమీక్షిస్తూ, ఆదివాసీ ప్రజలకు కనీస వసతులు కల్పించకుండా ప్రభుత్వాలు దోపిడీ చేస్తుంటే ఒక అధికారిగా ఆయన ఆదివాసీ ప్రజల కోసం చేసిన కృషిని వివరిస్తున్నారు రాజేంద్రబాబు అర్విణి***

డిసెంబర్ 6, 2015 భారతదేశ ఆదివాసీ చరిత్రలో ఓ దుర్దినం. గిరిజనుల జీవితాల్లో వెలుగు నింపడానికి చిత్తశుద్ధితో కృషిచేసిన ఓ దీపం ఆరిపోయిన రోజది. ఆదివాసీల ఒక గొప్ప ఆత్మీయ మిత్రుణ్ణి దేశం కోల్పోయిన రోజది. తన 84 ఏళ్ల జీవితంలో సింహ భాగాన్ని గిరిజనులకు దక్కాల్సిన న్యాయం గురించి పోరాడడంలోనే గడిపిన డా. బ్రహ్మదేవ్ శర్మ అనారోగ్యంతో అంతిమశ్వాస విడిచిన రోజది. తాను చనిపోయిన తరువాత వృద్ధి పొందడానికి, తన తర్వాత ఇంకా జీవించి ఉన్న వాళ్లకు స్ఫూర్తి నివ్వడానికి వీలయినదాన్ని ఏమయినా విడిచిపెట్టి వెళ్లాడా, తన తరువాత ఇతరులు తాజా మార్గాలలో నూతన శక్తితో పయనించడానికి అనువయినదాన్ని దేనినయినా మిగిల్చి వెళ్లాడా అనేదాన్నిబట్టి ఒకవ్యక్తి గొప్పదనాన్ని అంచనావేస్తాము అంటాడు ప్రఖ్యాత ఇంగ్లిష్ రచయిత హెచ్.జి. వెల్స్. ఈకోణంలో పరిశీలించినప్పుడు శర్మలో ఒక మహోన్నతమయిన వ్యక్తి కనిపిస్తాడు. ఆయన గణితశాస్త్రంలో డాక్టరేట్ పట్టా పుచ్చుకున్నాడు. తదుపరి ఐఏఎస్ పాసయ్యాడు. పిహెచ్‌డిలు చేసి ప్రొఫెసర్లయిన వాళ్లు కోకొల్లలు. ఐఏఎస్ చదివి కలెక్టర్లయి చీఫ్ సెక్రెటరీదాకా పదవులకెగబాకినవాళ్లు మనకు లెక్కలేనంత మంది కనిపిస్తారు. కాని, తన సర్వీసు ప్రారంభంలో ఒక గిరిజన జిల్లాకు కలెక్టర్‌గా వచ్చి తాను ప్రాతినిధ్యం వహిస్తున్న ప్రభుత్వం, తన చుట్టూవున్న ఈ వ్యవస్థ ఆదివాసీలను చాలా సహజ న్యాయాలకు దూరం చేస్తుందని గుర్తించి, ఉద్యోగాలలో కొనసాగినంత కాలం చేయగలిగినంత చేసి, ఇక లాభం లేదనుకొని ప్రజా ఉద్యమాలు మాత్రమే శరణ్యమని సమాజానికి ఒక గొప్ప సందేశం అందించి జనజాతరలో మమేకమయిన వాళ్లు చాలా అరుదుగా కనిపిస్తారు. అలా అరుదయిన వ్యక్తుల్లో అరుదయినవాడు శర్మ.

డా. బిడి శర్మ ప్రజా బాహుళ్యానికి భౌతికంగా దూరమయిన ఈ విషాదకర సన్నివేశంలో గిరిజన ప్రజానీకం సంక్షేమం కోసం ఆయన చేసిన కృషిని ఒకసారి మననం చేసుకోవాలి. స్వాతంత్ర్యం తరువాత భారతదేశంలో ఆదివాసీల స్థితిగతులను ఆర్థిక, రాజకీయ, పరిపాలనా సంబంధమయిన విషయాలతో మేళవించి ఆయన రాసిన 'అన్ బ్రోకెన్ హిస్టరీ ఆఫ్ బ్రోకెన్ ప్రామిసెస్' (నెరవేరని వాగ్దానాల అంతులేని కథ) అన్న పుస్తకాన్ని పాఠకులకు పరిచయం చేయడంద్వారా ఆయనకు నివాళులు అర్పిస్తున్నాను. ఆయన రచించిన చాలా పుస్తకాలలో ఇది ఒకటి. గిరిజన సమస్యలపై కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు ఆయన సమర్పించిన నివేదికలు ఒక్కొక్కటీ ఒక్కొక్క పరిశోధక గ్రంథమే! ఆదివాసీల విషయంలో కొన్ని విధాన పరమయిన నిర్ణయాలు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఆ నివేదికల ఆధారంగా తీసుకొన్నవే. గణితశాస్త్రంలో ఆయన రాసిన పుస్తకాలు ఉత్తర భారతంలోని కొన్ని రాష్ట్రాలలో పాఠ్యపుస్తకాలుగా ఉపయోగంలో ఉన్నాయి.

షెడ్యుల్డ్ తరగతులకు సంబంధించిన సమస్యలను శోధించి పరిష్కార మార్గాలు సూచించడానికి ఏర్పాటు చేయబడ్డ భురియా కమిషన్ సమర్పించిన రిపోర్ట్ తయారవడానికి ఏకైక బాధ్యుడు శర్మగారేనన్నది బహిరంగ రహస్యమే! షెడ్యుల్డ్ ప్రాంతాల చట్టం పరిధిని పంచాయతీ స్థాయికి విస్తరిస్తూ పిఇఎస్ఎ తయారవడానికి, గ్రామ సభలు ఏర్పడడానికి శర్మ గారి కృషే కారణం అన్నది దాచేస్తే దాగని సత్యం. షెడ్యుల్డ్ తరగతుల వారికి ప్రత్యేకంగా ఉప-ప్రణాళిక ఉండాలని భావించి, దానికోసం ప్రయత్నించిందీ శర్మ గారే. శర్మ గారి రచనలలో ఒక విలక్షణమైన ప్రత్యేకత ఉంది. ఆయన రచనలు సూటిగా, నిక్కచ్చిగా ఉంటాయి. ఏ విషయాన్నయినా శోధించి, పరిశోధించి గానీ రాయడు. తాను చెపుతున్న విషయాన్ని గురించిన ఆధారాలన్నీ సవివరంగా పేర్కొంటాడు. ఈ విషయాలన్నీ సూక్ష్మ స్థాయిలో పరిశీలించి సాధికారికంగా తన నివేదికలలో రిపోర్ట్‌లలో పేర్కొని ప్రభుత్వంలో ఉండే పెద్దలు మరో మాట మాట్లాడే అవకాశం ఇవ్వకుండా వాటిని చట్ట రూపంలోకి మార్చే ప్రయత్నం చేశారు. శర్మ గారు చాలా సీరియస్ రచయిత. ఆదివాసీ సమస్యల పట్ల ఆసక్తి లేని పాఠకులకు, ఈ సమాజంలో మనతో పాటు జీవిస్తూ చాలా సంక్లిష్టమయిన జీవనాన్ని గడుపుతూ, విదేశీ స్వదేశీ ధనస్వాముల కోసం తమ జీవనాధారాలయిన ప్రకృతి వనరులను ప్రభుత్వం లాగేసుకుంటుంటే ఏమీ చెయ్యలేక సతమతమవుతున్న గిరిజనుల సమస్యల పట్ల అవగాహన పెంచుకోవాలన్న శ్రద్ధ లేని పాఠకులకు బి.డి. శర్మ గారి రచనలు చాలా అనాసక్తంగా ఉంటాయి.

ఆయన డిప్యూటీ కమిషనర్‌గా బస్తర్ జిల్లాలో పనిచేశాడు. అది అప్పుడు అవిభక్త మధ్యప్రదేశ్ రాష్ట్రంలో ఉండేది. అత్యధికంగా గిరిజనులు నివాసముండే జిల్లా అది. ఆదివాసీలు చదువు నేర్చుకొంటేనే వారు ఎదుర్కొంటున్న సమస్యలను గురించి వారు సరిగ్గా అవగాహన చేసుకుంటారని విశ్వసించిన శర్మ స్కూళ్ల మీద ఎక్కువ శ్రద్ధ చూపించాడు. ఎన్నో స్కూళ్లు కలతిరిగాడు. చాలా మంది ఉపాధ్యాయులు జబల్పూర్ లాంటి పట్టణాలలో ఉంటూ నెలకు ఒకటి రెండు సార్లు మాత్రమే వారు పనిచేస్తున్న పాఠశాలలకు వచ్చిపోతున్నట్టు గమనించి వారు పనిచేస్తున్న ఊరిలోనే నివాసం ఉండేందుకు ఏం చేయాలి అని ఆలోచించాడు. అందుకు అనుగుణంగా, ఆ టీచర్ల భార్యలకు ఆ స్కూళ్లలోనే సగం జీతం వచ్చేటట్టు కాంట్రాక్టు పద్ధతిలో నియామకాలు

చేపట్టాలని ప్రభుత్వానికి ప్రతిపాదనలు పంపాడు. ఆ టీచర్ల భార్యలకు కనీస అర్హతలు ఉంటాయా అన్న సందేహానికి విరుగుడుగా విద్యార్హతలు లేకపోయినా ఫర్వాలేదు, ఎందుచేతనంటే ప్రతి తల్లి ఒక ఉపాధ్యాయురాలే, ప్రతి స్త్రీ ఒక టీచరే. వారికి జీవితం, ప్రకృతి, సమాజం ఎన్నో పాఠాలు నేర్పుతుంది అని సమాధానం చెప్తాడు శర్మ గారు. ఆ ప్రతిపాదనను ప్రభుత్వం ఆమోదించలేదన్న విషయం వేరే సంగతి.

ఏ ప్రభుత్వ ఉద్యోగి అయినా సర్వీసులో ఏదైనా తప్పు చేస్తే అతనికి శిక్ష వేస్తున్నట్టుగా గిరిజన ప్రాంతాలకో, బాగా వెనుకబడిన ప్రదేశాలకో బదిలీ చెయ్యడాన్ని తీవ్రమయిన తప్పిదంగా భావించాడు డా. బి.డి. శర్మ. గిరిజన ప్రాంతాలలో పరిపాలనా యంత్రాంగాన్ని గుణాత్మకంగా అభివృద్ధి చెయ్యాలని రాజ్యాంగంలో రాసి ఉంది. రాజ్యాంగం ఉనికిలోకి వచ్చి అరవై ఏళ్లు దాటినా అలాంటి ప్రయత్నమేమీ జరగకపోగా, పనిష్మెంట్ ట్రాన్స్‌ఫర్ పేరు మీద ఉద్యోగులను బదిలీ చేస్తూ ఆదివాసీ ప్రాంతాలను ఇంకా అన్యాయానికి గురిచేస్తున్నారని, పరిపాలనను గుణాత్మకంగా దిగజారుస్తున్నారని పైన పేర్కొన్న పుస్తకంలో అభిప్రాయపడ్డారు శర్మ గారు. రాజ్యాంగ స్ఫూర్తి ప్రభుత్వ కార్యకలాపాలలో ప్రతిఫలిస్తే మన దేశ ప్రజలకు ఇంత ఆరాటం, ఇంత పోరాటం ఎందుకు! గిరిజనుల గురించి రాజ్యాంగం అయిదవ షెడ్యుల్‌లో రాసుకున్నారు. పీసా చట్టం ఉంది. సబ్‌ప్లాన్ ఏర్పాటు ఉంది. ఏదీ అమలులో ఉండదు. ఉన్నా అన్నీ లొసుగులే ఉంటాయి. ఇలా ఎన్నో ఉదాహరణలతో విసిగిపోయి డా. బి.డి. శర్మ గారు ప్రజా ఉద్యమాలే పరిష్కారం అన్న నిర్ణయానికి వచ్చారు.

మార్చ్ నెల 3, 1970 నాడు బస్తర్‌లోని జగదల్పూర్ గ్రామంలో బహిరంగంగా చింతచెట్టుకు వేలాడదీసి ఉరి తీయబడ్డ భూంకాల్ పోరాట యోధులకు అంకితం చేయబడ్డ ఈ పుస్తకం భారతదేశ రాజ్య వ్యవస్థ ఆదివాసీలకు, గిరిజనులకు ఎన్ని రకాలుగా వాగ్దాన భంగం చేసిందో ఎంతో వేదనతో ఆవిష్కరిస్తుంది. (పుస్తక ప్రారంభంలో భూంకాల్ యోధులు ఉరి తీయబడ్డ దినం 3 మార్చ్, 1910 అని పేర్కొన్నారు. ఇదే పుస్తకంలో మరొక సందర్భంలో 3 మే, 1910 నాడు ఉరి తీయబడ్డారని రాశారు. బహుశా 3 మే సరి అయిన తేదీ అయి ఉండవచ్చు) ఉపేంద్ర బాక్సి అన్న ఒక న్యాయశాస్త్ర నిపుణుడు ఈ పుస్తకాన్ని తెలుసుకోవడం, బోధించడం, పరిశోధించడం అన్న మూడు ముఖ్యమయిన అంశాలు గల విద్యా వ్యాసంగంలో భాగం చెయ్యాలని కూడా సూచించాడు.

గిరిజనుల అభివృద్ధికి, సంక్షేమానికి అవసరమయిన "పంచశీల" సూత్రాలు భారత రాజ్యాంగంలో పొందుపరిచారు. వాటిని అడుగడుగునా అపహాస్యం చేస్తూ వాటికి విరుద్ధంగా భారత ప్రభుత్వం ఎలా వ్యవహరిస్తుందో ఈ పుస్తకంలో శర్మ గారు పలు దృష్టాంతాలతో వివరించారు. "ఆదివాసుల సాంప్రదాయబద్ధమయిన సంస్కృతి, కళలు, అలవాట్లను ప్రోత్సహించాలి. వారిపై ఎలాంటి నిబంధనలను బయటి ప్రపంచం నుండి బలవంతంగా రుద్ద కూడదు" అన్నది పంచశీల సూత్రాలలో మొదటిది. ఆది కాలం నుండి ఆదివాసులు వారి ఆచారాలు, అలవాట్లు, సాంప్రదాయాలను అనుసరిస్తూ వారికి సంబంధించిన అన్ని వ్యవహారాలను సక్రమంగా నిర్వహించుకొంటూ వస్తున్నారు. కాని, తరతరాలుగా ఆదివాసీలు తమ స్వయం పరిపాలనా స్పృహతో "సామూహికంగా" పాటిస్తూవస్తున్న అలవాట్లను, సాంప్రదాయాలను ఖాతరు చెయ్యకుండా ప్రభుత్వం చట్టాలు చేసి అమలు పరిచే ప్రయత్నం చేస్తుంది.

ఆదివాసీ గ్రామాలలో వారి ఆచారాన్ని బట్టి తెగ పెద్దలతో కూడిన గ్రామ సభ ద్వారా వివాదాలు పరిష్కారమవుతాయి. అందుకని, గిరిజన తెగలు ఉన్న ప్రాంతాలలోని పోలీస్ స్టేషన్లలో కేసులు చాలా అరుదుగా నమోదు అవుతుంటాయి. ఉదాహరణకు బస్తర్ ప్రాంతంలోని పోలీస్ స్టేషన్‌లలో సగటున రెండు సంవత్సరాలకు ఒక కేసు నమోదు అవుతుంది. ఈ పరిస్థితిని పోలీసు చట్టం ఒప్పుకోదు. కాబట్టి, గ్రామ సభలలో వివాదాలు పరిష్కరించడం చట్టవ్యతిరేకం అని నేరం మోపి వివాదాలను పరిష్కరించిన పెద్దలపై నాన్ బెయిలబుల్ వారంట్ జారీ చేస్తారు. ఆ కేసుల నుండి తప్పిస్తామని భారీగా డబ్బులు వసూలు చెయ్యడం కూడా పోలీసులకు అలవాటే. హిందూ మతం ఆచరించేవారికి "గంగాజలం" ఎలాంటిదో "మహువా" అనే పానీయం గిరిజనులకు అలాంటిది. శిశువు పుట్టినప్పుడు, మనిషి చనిపోయినప్పుడు తప్పనిసరిగా నోట్లో ఒకటి రెండు చుక్కలు మహువా పానీయం పోయడం ఆదివాసీల సాంప్రదాయం. కాని, ఎక్సైజ్ చట్టం ప్రకారం "మహువా" తయారు చెయ్యడం నేరం. "మహువా" తయారు చెయ్యడంలో ప్రమేయం ఉన్నవాళ్లు గాని, దానిని సేవించిన వాళ్లు గాని నేరస్తులే అవుతారు. అడవిలోకి వెళ్లేటప్పుడు గొడ్డలో, ఓ లావాటి కర్రనో చేతిలో ఉంచుకోవడం, విల్లంబులు ధరించడం ఆదివాసీల జీవితావసరం. కానీ, భారత ప్రభుత్వం తయారు చేసిన చట్టం ప్రకారం ఇవి మారణాయుధాలు. వీటిని ధరించి అడవిలోకి ప్రవేశించడం నేరం. అలా ప్రవేశించినవారిపై కేసు నమోదవుతుంది. ఇదీ భారత ప్రభుత్వానికి ఆదివాసీలపై ఉండే ప్రేమ! ఇదీ భారత ప్రభుత్వం ఆదివాసీల అలవాట్లను, సాంప్రదాయాలను పరిరక్షించి ప్రోత్సహించే తీరు!

ఆదివాసీలు చాలా పేదవారనీ, సమాజానికి అట్టడుగున ఉన్న వర్గమని ఒక అభిప్రాయం బహుళ ప్రచారంలో ఉంది. దేశంలోని శిష్టవర్గానికి, ప్రభుత్వానికి ఉన్న ఈ అభిప్రాయాన్ని (నిజానికి ఈ అభిప్రాయాన్ని రాజ్య వ్యవస్థ కుట్రపూరితంగా ప్రజల మెదళ్లలో నాటింది) బి.డి. శర్మ గారు తీవ్రంగా ఖండిస్తారు. ఆదివాసులు చాలా ఆత్మాభిమానం గలవారు. ఇతరులు సానుభూతితో తమకేదో సహాయం చెయ్యాలనీ, చేస్తారనీ వారు ఆశ పడరు. దేశంలోని మేధావి వర్గం తమను పేదవారని, అజ్ఞానులని భావించడాన్ని గర్హనీయమయిన అవమానంగా భావిస్తారు. తమకు న్యాయంగా దక్కాల్సింది తమకు చెందాలని మాత్రమే వారు ఆశిస్తారు. "వాస్తవానికి వారు పేదవారు కాదు. వారసత్వ సంపద కోల్పోయిన వాళ్లు" అని శర్మ గారు ఆదివాసీల పట్ల తన అభిప్రాయాన్ని నిష్కర్షగా వెలిబుచ్చారు.

అమెరికా తన మూలవాసులయిన రెడ్ ఇండియన్‌లను హననం చేసి వారి శవాల మీదుగా స్వైరవిహారం చేస్తూ అగ్ర రాజ్యంగా అవతారం ఎత్తిందన్న విషయం బహిరంగ సత్యం! వారి పొలాలను, వారి అడవులను, వారి నదులను లాక్కొని, చివరికి లొంగక పోతే వారిని ధ్వంసం చేసి, వారి కాళ్ల కింది భూమిని కూడా ఆక్రమించుకున్న చరిత్ర అమెరికాది.

# వలస బతుకుల వెతలు

***ప్రపంచీకరణ విధానాల అమలుతో గ్రామాల్లో చేతి వృత్తులు ధ్వంసమై ప్రజలు జీవనాధారం లేక వలస వెళుతున్నారని, వెళ్లిన చోట కూడా కనీస సౌకర్యాలు లేక మెదక్ జిల్లాలోని మూడు మండలాల కూలీలు ఎదుర్కొంటున్న సమస్యలను వివరిస్తున్నారు*** **కవిని ఆలూరి**

**భా**రతదేశం అసమానతల నిలయం. భారతదేశ ఆర్థిక వ్యవస్థ వివిధ వైరుధ్యాల కలబోత. ప్రపంచీకరణ తరువాత అనేక రకాల సంక్షోభాలు భారతదేశ ఆర్థిక వ్యవస్థను బలంగా కుంగదీస్తూ, దిగజారుస్తూ, కుదిపేస్తున్నాయి. ఈ పరిస్థితులలో పేద, మధ్యతరగతి, సన్నకారు రైతులు, కూలీలు, శ్రామికులు ఒకరేమిటి? అన్ని రంగాల ప్రజలకు బతుకు దెరువు కోసం వలస వెళ్లడం అనివార్యమైపోయింది. అది మన దేశంలోనే ఒక ప్రాంతం నుండి మరొక ప్రాంతానికి కావచ్చు. ఒక జిల్లా నుండి మరొక జిల్లాకు కావచ్చు. ఒక రాష్ట్రం నుండి మరొక రాష్ట్రానికి కావచ్చు, ఇతర దేశాలకు కావచ్చు. ఏమైనప్పటికీ తప్పనిసరై పోయిందనేది కాదనలేని సత్యం.

ఈ నేపథ్యంలో బతుకుదెరువు కోసం వలసలకు వెళ్తున్న శ్రామిక ప్రజల గురించి మరొక మారు చర్చించవల్సిన అవసరం ఎంతైనా ఉన్నది. తెలంగాణ రాష్ట్రంలో వెనుకబడిన జిల్లాలలో మెదక్ జిల్లా ఒకటి. మెదక్ జిల్లా ప్రజలు అనేక సంవత్సరాలుగా బతుకు దెరువు కోసం వలసలకు వెళ్తూనే ఉన్నారు. మెదక్ జిల్లాలోని కర్ణాటక, మహారాష్ట్ర సరిహద్దుగా గల నారాయణ్‌ఖేడ్, మనూర్, కంగ్టి మండలాల ప్రజల స్థితిగతులు కొంత వైవిధ్యభరితంగా ఉంటాయి. చెరుకు కొట్టడం తప్ప మరింకేమీ చేయలేని వేలాది మంది గిరిజన, లంబాడా తండాల ప్రజలు ఈ ప్రాంతంలోనే నివసిస్తూ ఉంటారు. వీరి సంస్కృతి, జీవనశైలి భిన్నంగా ఉంటుంది. ఈ ప్రాంత ప్రజల గురించి, వారి స్థితిగతుల గురించి అనేక సాహిత్య వ్యాసాలు గతంలో వచ్చినప్పటికీ, ఎన్నడూ లేనటువంటి విపత్కర పరిస్థితులను ఈ ఏడు ఇక్కడి ప్రజలు ఎదుర్కొంటున్నారు. ఏటా మార్చ్, ఏప్రిల్‌లో అడుగంటిపోయే సింగూరు ప్రాజెక్టు నుండి ప్రవహించే మంజీరా నదీ జలాలు ఈ ఏడు వర్షాభావం కారణంగా డిసెంబర్‌లోనే అడుగంటిపోయాయి. గతంలో మేధావులు, విజ్ఞులు రాబోయే ఇటువంటి విపత్కర పరిస్థితుల గురించి పాలకులను పదే పదే హెచ్చరించారు. అయినా ఈనాటి, ఆనాటి పాలకులు పెడచెవిన పెట్టడం గమనార్హం.

**కరువు తీవ్రతే వలసలకు కారణం**

అభివృద్ధికి ఆమడ దూరంలో విసిరేసినట్లుగా ఉండే నారాయణ్‌ఖేడ్, మనూర్, కంగ్టి మండలాలు రాష్ట్రంలోనే వెనుకబడిన ప్రాంతాల్లో ప్రధానమైనవి. దాదాపుగా ఆరోగ్యం, పరిశుభ్రత, అక్షరాస్యత, వ్యవసాయం లాంటి అన్ని రంగాలలోను ఈ మండలాలు అత్యధికంగా వెనుకబడి ఉన్నాయి. 2001 సెన్సెక్స్ ప్రకారం మెదక్ జిల్లాలోనే అక్షరాస్యత శాతం పురుషుల్లో 26.3 శాతం ఉంటే స్త్రీలో 13.8 శాతంగా ఉంది. మనూరు, కంగ్టి మండలాలలో అయితే మహిళల్లో అక్షరాస్యత 3.7 శాతంగా ఉంది. ప్రస్తుతం ఈ మండలాలలో పురుషులలో అక్షరాస్యత 14శాతంగా ఉంటే, మహిళల్లో 10 శాతంగా ఉన్నదని కొన్ని గణాంకాలు చెబుతున్నాయి.

---

"చనిపోయిన (రెడ్) ఇండియన్స్ మంచి గుణవంతులయిన రెడ్ ఇండియన్‌లు. పది మంది (రెడ్) ఇండియన్స్‌లో తొమ్మిది మంది చనిపోయి మంచి రెడ్ ఇండియన్‌లు అవుతారు. మిగిలిపోయిన ఆ ఒక్కణ్ణి గురించి మనం ఆలోచించాల్సిన అవసరం లేదు" అని ఓ సందర్భంలో ఆనాటి అమెరికా అధ్యక్షుడు రుజ్వెల్ట్ 1886 లో అన్నాడు. "అప్పనంగా ఇస్తున్నదేదో తీసుకొని అడవులను ఖాళీ చేసే గిరిజనులే మంచి గిరిజనులు" –ఇది ఈనాడు భారత ప్రభుత్వం చెపుతున్న మాట. ప్రభుత్వ పెద్దల ఈ మాటలను ప్రస్తావిస్తూ రచయిత ఆనాటి రూజ్వెల్ట్ ప్రసంగాన్ని గుర్తుచేసుకొంటాడు. ఈ పరిస్థితిని పైకి చెప్పకుండా ఆచరణలో పెట్టే ప్రయత్నం చేస్తుంది భారత ప్రభుత్వం.

డా. బి.డి. శర్మ గారు బహుగ్రంథ రచయిత. హిందీలో ఆయన రాసిన ఎన్నో పుస్తకాలు వివిధ ప్రాంతీయ భాషలలోకి తర్జుమా అయ్యాయి. ఆ పుస్తకాలను దేశంలోని పలు ప్రాంతాలలో నివసిస్తున్న గిరిజనులు తమ విలువైన భాండాగారంగా దాచుకొంటారు. అనేక ప్రజా ఉద్యమాలతో మమేకమయిన బి.డి. శర్మ మావోయిస్టుల ఏరివేతనే ప్రధాన లక్ష్యంగా ఏర్పాటయి, కొనసాగుతున్న సాల్వాజుడుం, గ్రీన్ హంట్ కార్యకలాపాలను తీవ్రంగా వ్యతిరేకించారు.

చివరగా, "రాజ్యాంగ స్ఫూర్తిని గౌరవించండి, ఆదివాసీల ప్రజాస్వామ్య తత్వానికి సలాములు చెప్పండి, సర్వజన సమ్మతి ప్రకారం తీసుకొనే సామూహిక నిర్ణయాలకు శిరసావహించండి" అన్న సందేశాన్ని సర్వ జనావళికి అందిస్తాడు రచయిత.

ఒకప్పుడు అరణ్యానికి మహారాజు, ఇప్పుడు ఎక్కడికి పోవాలో తెలియక దిక్కుతోచని స్థితిలో ఇరుక్కుపోయిన గిరిజనుడు. ఆ అడవి మారాజు కోసం ఆలోచించి, మదనపడి, జీవితాంతం శ్రమ పడిన శర్మ గారి కోరిక నెరవేరాలి. ప్రకృతితో మమేకమయి జీవించే జీవన శైలి, స్వయం పరిపాలనా స్వేచ్ఛ ఆదివాసీలకు తిరిగి లభించాలని ఆయన కోరిక.

*(రచయిత రిటైర్డ్ లెక్చరర్)* వీ

జిల్లా హెడ్ క్వార్టర్స్ నుండి దాదాపుగా 90 కిలోమీటర్ల దూరంలో నారాయణ్‌ఖేడ్ ఉంది. ఈ ప్రాంతంలో కరువు ఈనాటిది కాదు. సామాన్య ప్రజలే కాకుండా సన్నకారు రైతులు, మధ్యతరగతి కుటుంబాలు సైతం కరువు కోరల్లో చిక్కుకొని విలవిలలాడవలసిందే. ఈ ప్రాంతంలో గట్టు నేలల్ని, లోయల్ని చూస్తే దక్కన్ పీఠ భూమి అసలు స్వరూపం మనకు అర్థమవుతుంది. ఇక్కడ అడవులు లేవు, ఇక్కడి నేలను గట్టు నేలలంటారు. కనుచూపు మేరలో ఎక్కడా నీటి గుంటలు గాని, చెరువులు గాని కనపడవు. గట్టు నేలల్లో నీటి శాతం తక్కువగా ఉంటుంది. ఈ భూములకు నీటిని ఇంకించుకునే సామర్థ్యం ఉండదు. చెట్లు తక్కువగా ఉండడం వలన వర్షం కురిసినప్పుడు భూసారం కొట్టుకొనిపోయి రాళ్లు, రప్పలు మిగులుతాయి. వర్షపు నీరు పల్లపు ప్రాంతాలకు చేరిపోతుంది. ఈ నేలల్లో నీళ్లు నిలవకపోవడం వలన నానాటికి భూగర్భ జల మట్టం తగ్గిపోతున్నది. రైతు ధైర్యం చేసి 400-500 లోతు బోర్లు వేయించినా నీళ్లు అందే పరిస్థితి లేదు. భూగర్భ జలాలతో పంటలు పండించడానికి అవకాశం చాలా తక్కువ ఉండడంవలన వర్షాధారంగా పండే పంటలపైనే ఇక్కడి ప్రజలు జీవనాన్ని సాగిస్తున్నారు. జొన్న, మినుము, పెసర, కంది, శెనగ ఎక్కువగా పండిస్తారు, కొద్దిగా బొబ్బెర్లు, అనుము, బఠాణీలు పండిస్తారు. జూన్ నుండి సెప్టెంబర్‌లోగా ఈ పంటలు చేతికి వస్తాయి. మిగిలిన కాలమంతా ఈ భూములు ఎడారులను తలపిస్తుంటాయి. జిల్లాలో 96 కిలోమీటర్ల మేర మంజీరా నది ప్రవహిస్తుంది. అందులో నారాయణ్‌ఖేడ్ మండలంలోని కొన్ని గ్రామాలు కూడా ఉన్నాయి. మంజీర నదీ పరీవాహక ప్రాంతాల్లోని భూములు నల్లరేగడి భూములు. స్థోమత కలిగిన రైతులు ఈ నదీ జలాలను ఉపయోగించుకొని వరితో పాటు చెరకు, అరటి తోటల్లాంటి వాణిజ్య పంటలు పండిస్తారు. అయితే ఈ రైతు పండించిన పంటకు గిట్టుబాటు ధర లేదు. ఈ ప్రాంత ప్రజల ఆర్థిక పరిస్థితి కొంత మెరుగ్గానే ఉన్నా, మిగిలిన ప్రాంతాల్లోని ప్రజల జీవనం చాలా దయనీయంగా ఉంటుంది. సకాలంలో వర్షాలు కురవక, పంటలు చేతికి రాక, ఉన్న ఊర్లల్లో కూలీపని దొరక్క ప్రజలు వలసలు పోవడం తప్పనిసరి అవుతున్నది. ఈ మండలాలకు కర్ణాటక, మహారాష్ట్ర సరిహద్దుగా ఉండడంవలన భాషా సమస్య ప్రధానమైనదిగా ఉన్నది. ప్రజలు తమ అవసరాల కోసం కర్ణాటకలోని సరిహద్దు పట్టణమైన బీదర్‌కు ఎక్కువగా వెళ్తుంటారు. అత్యధికులు కన్నడ, హిందీ మాట్లాడతారు. ఒకప్పుడు తెలుగు ఏమాత్రం మాట్లాడలేకపోయారు. ఈ మధ్య కాలంలో తెలుగు మాట్లాడడం కొంతమేర నేర్చుకున్నారు. అతి తక్కువ అక్షరాస్యత కలిగి ఉండడానికి ప్రధాన కారణాలలో భాషా సమస్య కూడా ఒకటి.

ప్రభుత్వం కల్పించిన పనికి ఆహార పథకం ఉన్నా తక్కువ పని దినాలు, అతి తక్కువ కూలీ రేట్లు ఉండడం. అధిక వడ్డీతో అప్పు, ప్రత్యామ్నాయ ఉపాధి లేకపోవడం, దళారీ వ్యవస్థ పటిష్టంగా ఉండడం, గిట్టుబాటు ధరలు రైతులకు అందక పోవడం లాంటి అనేక కారణాలు కూడా వలసలను ప్రభావితం చేస్తున్నాయి. ఇంతే కాకుండా తండా ప్రజలు నీటి ఎద్దడి వలన పశుగ్రాసం కోసం తమ పశువులను వలస ప్రాంతాలకు తమతో పాటు తీసుకొని వెళ్తారు. వీరు పశువులను అమితంగా ప్రేమిస్తారు. తమ బిడ్డలాగా చూసుకుంటారు.

**వలసలు వెళ్లినవారి స్థితి గతులు**

వలసలకు వెళ్లిన ప్రజలు ఆయా ప్రాంతాల్లో చాలా రకాల సమస్యల్ని ఎదుర్కొంటున్నారు. ఒకప్పుడు వలసలకు చేసే ప్రయాణం చాలా భయంకరంగా ఉండేది. రాత్రుళ్లు, పగళ్లు అనే భేదం లేకుండా మగవారితో పాటు పిల్లలు, మహిళలు, ఎడ్లబండి వెంటే నడుస్తూ మైళ్లకు మైళ్లు వలస ప్రాంతాలకు వెళ్లేవారు. ఈ మధ్య కాలంలో చెరుకు ఫ్యాక్టరీ యజమానులు ఒక్కొక్క ఫ్యాక్టరీకి వెయ్యి లారీలను ఏర్పాటు చేసుకొని తండా ప్రజలను ఫ్యాక్టరీ పరిసర ప్రాంతాలకు తీసుకొని వెళ్తున్నారు. ఐదు, పది కిలోమీటర్ల దూరంలో ఉండే ఫ్యాక్టరీకయితే నడుచుకుంటూ వెళ్తున్నారు. ఈ మండలాలలోని ప్రజలు ఎక్కువ శాతం సంగారెడ్డి, జహీరాబాద్, కామారెడ్డి, హలీఖేడ్, మన్నేలీ, బీదర్ పరిసర ప్రాంతాలకు వెళ్తుంటారు.

తండాలో వలసపోయే ముందు రోజు తండా వాసులందరు కలిసి పండగ చేసుకొని ఆ రాత్రి గతంలో వలస సమయంలో ఎదుర్కొన్న కష్టాలను తలుచుకుంటూ విలపిస్తుంటారు. వృద్ధులను చూస్తే చాలా దయనీయంగా అనిపిస్తుంది. ఫ్యాక్టరీ యజమానులు రైతుల దగ్గర నుండి చెరుకు చేను గుత్త పద్ధతిలో తీసుకొని వలస కూలీలతో చెరుకు కొట్టించడం ప్రారంభిస్తారు. చెరుకు కొట్టడానికి తండావాసులను చేల్లో పనికి కుదుర్చినాయనను మేటి అనీ, ముకద్దం అనీ అంటారు. పనిలో మనిషిని కుదుర్చినందుకు మనిషికి రెండు వేలకు పైగా డబ్బు ముదుతుంది. ప్రతి సంవత్సరం జూన్‌లోనే తండాలకు వచ్చి మేటి డబ్బు అడ్వాన్సుగా ఇచ్చి కూలీలను ఖాయం చేసుకుంటాడు. మొత్తం పనిని తొందరగా ముగించాలని  ఉదయం 6 గంటలకు చెరుకు కొట్టడం మొదలు పెడితే సాయంత్రం 6 గంటల వరకు చెరుకును కొడుతూనే ఉంటారు. ఒక్కొక్కసారి రాత్రి 3 గంటల దాకా లారీల్లో చెరుకును నింపి, వాళ్లు నివసించే ప్రదేశాలకు వెళ్లి నీళ్లు తెచ్చుకొని వంట చేసుకొని మరలా ఆరింటికల్లా పనిలోకి వెళ్తుంటారు. మహిళలు అత్యధిక శ్రమకు గురవుతుంటారు.

వలస వెళ్లిన ప్రదేశాలు ఫ్యాక్టరీలకు దగ్గరగా ఉంటాయి. నిర్మానుష్యంగా ఉండే ఆ ప్రదేశాల్లో చెట్లు పీకి, స్థలాన్ని చదును చేసుకొని వెంట తెచ్చుకున్న సొప్పతో కట్టెలతో గుడిసె వేసుకుంటారు. గుడిసెకు పైకప్పుగా (నరికిన చెరుకుగడ పైభాగాన్ని వాడె అంటారు) వాడెను వేస్తారు. అత్యంత అభద్రతా భావంతో ఉంటారు. పాముల్లాంటి విష జంతువుల బారినపడి చనిపోయేవారు అనేకులు. ఆక్సిడెంట్లు, అగ్ని ప్రమాదాలకు లెక్కే ఉండదు. సురక్షిత మంచినీరు దొరకదు. మహిళలకు ఎటువంటి సాధారణ వసతులు, రక్షణ ఇక్కడ ఉండవు. మహిళల పరిస్థితి అతి దారుణంగా ఉంటుంది. నీళ్లు, వంట చెరుకు సమకూర్చుకోవడం, పిల్లలను సంరక్షించుకోవడం, చెరుకు కొట్టడం, బండ్లకెత్తడం లాంటి పనులన్నీ వీళ్లే చేస్తారు. వీరికి రోజు కూలీ రు. 200 మాత్రమే. అనారోగ్యానికి గురి అయినప్పుడు ఎటువంటి ఆరోగ్య కేంద్రాలు అందుబాటులో ఉండవు. సరయిన రవాణా సౌకర్యాలు లేక, తగిన సమయంలో చికిత్స అందక చనిపోయేవారు లేకపోలేదు. ఫ్యాక్టరీ పరిసర వాతావరణం అంతా పొగతో నిండిపోయి నల్లని బూడిద పడుతూ ఉంటుంది. మూడు నెలల పాటు ఈ రకమైన వాతావరణంలో ఉండడం

మూలాన అనేక శ్వాసకోశ వ్యాధులకు, చర్మ వ్యాధులకు గురవుతుంటారు. గర్భిణీలు, పసిపిల్లలు అనేక సమస్యలకు గురవుతుంటారు. మహిళలు జ్వరం, నడుము నొప్పి, కండరాల నొప్పులు, రక్తహీనతలతో బాధపడుతూ ఉంటారు. రోజూ పిల్లలను గోనె సంచులతో కట్టిన ఉయ్యాలల్లో చెట్లకు లేక ఎడ్లబండ్లకు కట్టి ఉంచుతారు. వారికి ఎటువంటి రక్షణా ఉండదు. వలసలకు వెళ్లినవాళ్లు వెళ్లిపోగా గ్రామాల్లో ముసలివాళ్లు, చిన్నపిల్లలు మిగిలిపోతారు. ఒంటరితనం, తీవ్రమైన నీటి ఎద్దడి, మైళ్లకు మైళ్లు వెళ్లినా చుక్క నీరు దొరకని పరిస్థితి. అనారోగ్యం, తెలిసిన చిట్కా వైద్యాలే వారికి ఆధారమౌతాయి. దూరాలు వెళ్లలేక, ఆర్థికంగా లేక రక రకాల సమస్యలను వీరు ఎదుర్కొంటూ ఉంటారు. ఒక పూట తిని మరొక పూట పస్తులు ఉండడం వీరి జీవన శైలిలో భాగమైపోయింది. ప్రభుత్వ కరువు పనుల కింద ఉపాధి హామీ పథకాలు ప్రవేశపెట్టినా రోజుకు కూలి రు. 30 మాత్రమే చేయగలుగుతున్నారు. డబ్బు బదులు బియ్యం ఇచ్చి ఉంటే బాగుండునని పలువురు మద్వాడ తండా మహిళలు అభిప్రాయపడ్డారు.

**ప్రభుత్వాలు మారినా, మారని బతుకులు**

ఈ మండలాలలో మొత్తం 182 తండాలు ఉన్నాయి. కంగ్టి మండలంలో మొత్తం జనాభాలో 30 శాతం గిరిజనులు, లంబాడీలే ఉన్నారు. ప్రభుత్వాలు ఈ మండలాల ఆర్థిక ఎదుగుదల కోసం డ్వాక్రా మహిళా సంఘాలను ఏర్పరిచారు. 2009 లో వీటిని జాతీయ గ్రూపుగా చేయడం మూలాన దాదాపు అన్ని తండాలలో డ్వాక్రా గ్రూపులు ఉన్నాయి. ప్రస్తుతం పొదుపు పథకాలలో భాగంగా ఈ మండలాలలో ఐదు కోఆపరేటివ్ సొసైటీ మహిళా బ్యాంకులను స్త్రీ నిధి పేర ఏర్పరచారు. గతంలో ఉన్న థ్రిఫ్ట్ గ్రూపులే ఇప్పటి స్త్రీనిధి బ్యాంకు. సభ్యులెవరైనా మైక్రో క్రెడిట్ ప్లాన్ (సూక్ష్మ ఋణ ప్రణాళిక) ఫాం నింపి మిగతా సభ్యులతో సంతకం చేయిస్తే ఈ బ్యాంకులు రుణాలను మంజూరు చేస్తాయి. అయితే అప్పు తీసుకోవడం ఒక ఎత్తైతే, అప్పు తీర్చడం మరొక ఎత్తు. రుణాలు మంజూరు అయినా, వాటిని తీర్చే మార్గాలేవి?

సామాజిక అంతరాల్లో రూపం తప్ప సారంలో ఎటువంటి మార్పు లేదు. ఇప్పటికీ కొంత తేడాలతో వెనుకటి పద్ధతులే నడుస్తున్నాయి. ఇక రాజకీయంగా మహిళా రిజర్వేషన్ల కింద సర్పంచ్, జెడ్.పి.టి.సి. ఎం.పి.టి.సి., ఎస్.ఇ.సిలుగా కొన్ని సీట్లను కేటాయించినా, వారి భర్తలో లేక వారి కుమారులో ఆ పదవులను కొనసాగిస్తున్నారే తప్ప, వీరు పేరుకు మాత్రమే ఉన్నారు. రాజకీయ నిర్ణయాత్మక విషయాలలో మహిళలు ఒక్కరు కూడా లేరు.

బాల్య వివాహాల విషయానికొస్తే ఒకప్పుడు 13, 14 ఏళ్లకే వివాహం చేస్తే, ప్రస్తుతం 15, 16 ఏళ్ల వయస్సులో వివాహాలు చేస్తున్నారు. వరకట్న సమస్య పెరిగిందే గాని తగ్గలేదు. స్త్రీ పురుషుల మధ్య అసమాన వేతనాలు అలాగే ఉన్నాయి. రోజు కూలీ స్త్రీలకు రు. 150 ఇస్తే, పురుషులకు రు. 250 ఇస్తున్నారు.

మహిళల ఆరోగ్య సమస్యలు తీవ్రతరమనే చెప్పాలి. పోషకాహార లోపం వారిని పట్టి పీడిస్తున్నది. మూడు మండలాల్లో ఒక్క నారాయణఖేడ్‌లో మాత్రం ప్రభుత్వ ఆసుపత్రి ఉన్నది. ప్రైవేట్ ఆస్పత్రులు నారాయణ్‌ఖేడ్‌లో 15 దాకా ఉన్నాయి. ప్రైవేట్ ఆస్పత్రుల వాళ్లు తమ ఆర్థిక ప్రయోజనాల కోసం అవసరం ఉన్నా లేకపోయినా కాన్పుకు వచ్చిన మహిళలకు సిజేరియన్ చేస్తున్నారు. కరువుతో అల్లాడుతున్న వీళ్లకు ఇది మరింత భారం అవుతున్నది. ఒకప్పుడు ఇళ్లల్లో పురుడు పోసుకున్నా తల్లీ బిడ్డలు ఆరోగ్యంగా ఉండేవాళ్లు. సిజేరియన్ల మూలకంగా కాన్పు అయిన మహిళలు కూలీ పనులు కూడా చేసుకోలేని పరిస్థితులకు నెట్టబడు తున్నారు. నాగరికతలో అభివృద్ధిలో భాగంగా వేషధారణలో సాంప్రదాయ వస్త్రాలు కాకుండా సిల్కు చీరలు కడుతున్నారే తప్ప, వారి జీవన ప్రమాణాలు ఇంకా దిగజారిపోయాయే కాని మెరుగుపడలేదు.

వలస శ్రామికుల జీవన ప్రమాణాల్ని మెరుగుపరచడానికి గత, ప్రస్తుత ప్రభుత్వాలు ప్రయోగాత్మకంగా అనేక కార్యక్రమాలను చేపట్టాయి. వలసల్లో ఉండే పిల్లల కోసం సంచార ఉపాధ్యాయుల ఏర్పాటు, గృహాలలో అంగన్‌వాడీ కేంద్రాలు, ఒకేషనల్ బ్రిడ్జి కోర్సు నిర్వహణ, గ్రామీణ ఉపాధి పథకాలు, డి.ఎఫ్.ఐ.డి. నిధులు, ఎ.సి.ఆర్.ఎల్.సి.లు శ్రామిక మహిళల పిల్లల సంరక్షణా కేంద్రాల ఏర్పాటు 1994 లో ఏర్పరచిన జాతీయ బాలల సంరక్షణా కేంద్రం ఇటువంటిదే. సామాజిక వసతి గృహాలు, ఎల్.జె.పి., డి.పి.ఇ.సి.లు, మధ్యాహ్న భోజన పథకాలు, స్వయం సహాయక బృందాలు (ఎస్.హెచ్.జి.), మాతా శిశు సంరక్షణ, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, ప్రభుత్వ పాఠశాలలు, ఇవన్నీ ఒక ఎత్తైతే జాతీయ కార్మిక శాఖ సిఫార్సుపై ఆధారపడి గుర్తింపు పొందిన రంగాల కార్మికుల బిల్లులను పార్లమెంట్‌లో 2002 లో ప్రవేశ పెట్టడం జరిగింది. ఈ బిల్లులలో వలస కార్మికులకు ప్రయోజనం చేకూర్చే ఇన్సూరెన్స్, గుర్తింపు కార్డు జారీ లాంటి అనేక సిఫార్సులు ఉన్నాయి. ఇది చాలా శక్తివంతమైన బిల్లు అని చెప్పుకోవటం జరిగింది. మోప్సీ–2003 గా పేర్కొన్న ఈ బిల్లులో ప్రతిపాదించిన అంశాలకయ్యే ఆర్థిక భారాన్ని భరించడానికి తగిన మార్గాలను కాని, ఆదాయాన్ని సూచించకుండానే ఈ బిల్లులను రాష్ట్రాలపై కేంద్ర ప్రభుత్వం మోపడం జరిగింది. తరువాత ఈ బిల్లు అత్యంత వివాదాస్పదంగా మారింది. ప్రభుత్వం ఎన్ని చట్టాలు చేసినా అత్యంత లోపభూయిష్టంగా ఈ చట్టాలు ఉండడం వలన పరిస్థితులు దిగజారాయే తప్ప మెరుగుపడలేదు.

ప్రస్తుతం ఈ మండలాల్లో నీటి సమస్య చాలా తీవ్ర స్థాయిలో ఉంది. నారాయణ్‌ఖేడ్‌లో వారానికి ఒక్కరోజు కూడా మంచినీరు సప్లై అవ్వడం లేదు. పుల్‌కల్ మండలం భస్వాపూర్ గ్రామం దగ్గర చెరుకు కొట్టడానికి వచ్చిన లంబాడా తండా మహిళలు నీళ్ల లేకపోవటాన చెరుకు ఫ్యాక్టరీలు మూసివేశారని, ఐదు రోజులుగా చెరుకు లోడ్‌తో ఫ్యాక్టరీ ముందు ఉన్నామని, ఫ్యాక్టరీ బంద్ ఉండటాన కూలీ లేదు, పనీ లేదని రోజుకు పిల్లలకు ఒక్కపూట అన్నమయినా పెట్టలేకపోతున్నామని విలపించారు. మాకు ఎవ్వరూ దిక్కులేరని కన్నీరు పెట్టుకున్నారు. ఈ సమస్య ఇలాగే కొనసాగితే రాబోయే రోజుల్లో అత్యంత విపత్కర పరిస్థితులను ప్రజలు ఎదుర్కోవలసి వస్తుంది. ప్రభుత్వాలు ముందస్తు చర్యలు తీసుకోవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. ప్రణాళికాబద్ధంగా సర్వే జరిపించి అత్యంత నీటి ఎద్దడి ప్రాంతాలను గుర్తించి, పటిష్టమైన తగు సహాయక చర్యలు చేపట్టకపోతే భవిష్యత్తు పరిణామాలకు పాలకులే బాధ్యత వహించవలసి వస్తుంది.

*(రచయిత లెక్చరర్)* వీ

# ప్రభుత్వ రైతాంగ వ్యతిరేక విధానాలు

*దేశంలోనూ, రాష్ట్రంలోనూ నెలకొన్న వర్షాభావ స్థితినీ, అటువంటి స్థితిలో కూడా రైతాంగానికి ఊరటనివ్వని ప్రభుత్వ విధానాలనూ వివరిస్తున్నారు* **వి. కోటేశ్వరరావు**

**ఖ**రీఫ్‌లో వాన లేదు. రబీలో జల్లే పడలేదు. బోరుబావుల్లో నీటి చుక్క లేదు. భూమిలో పడ్డ విత్తనాలు మొలవలేదు. కళకళలాడాల్సిన కల్లాలు ధాన్యం లేక వెలవెలపోయాయి. కళ్లాపికి నోచుకోని లోగిళ్లు దుమ్ము రేగుతున్నాయి.

బీళ్లను సాళ్లుగా దున్నాల్సిన కాడెడ్లు కబేళా కాటికి చేరువవుతున్నాయి. చెట్లు మోడు బారుతున్నాయి. అప్పు మాఫీకాక ఆస్తులు జప్తు అవుతున్నాయి. రైతన్న ఆత్మహత్యలతో తెలంగాణ అల్లాడుతోంది. వలసలతో పల్లెలు వల్లకాడుగా మారుతున్నాయి. ఫీజు కట్టలేక పిల్లలు బడి మానేస్తున్నారు. అంతేకాదు. వెనకట ఎర్ర జొన్న కరువును గురించి తాతలు చెపుతుండేవారు. నేడు దాన్ని మించిన కరువు మన కళ్ల ముందు కదలాడుతోంది. తెలంగాణ సర్కారు మాత్రం యాగాలకూ, దేవుళ్ల మొక్కులకూ, మతాల భవంతులకూ వేల కోట్ల రూపాయలు తగలేస్తోంది. కానీ, కళ్ల ముందే ఆత్మహత్యలకు పాల్పడుతున్న రైతన్నలను కాపాడలేక తిన్నదరక్క చస్తున్నారని, ప్రేమ వైఫల్యంతో చస్తున్నారని అవహేళన చేస్తున్న రాధామోహన్ గురించి ఏమనుకుందాం!

వానా, చలి, ఎండా కాలం రుతువులు గతులు తప్పాయి. మేకిన్ ఇండియా పిలుపు లేనప్పుడే సామ్రాజ్యవాద రాబందులు మన ఆకాశంపై విహరిస్తూ మన నీళ్లు, భూములపై వాలాయి. మన పంటలనూ, భూములనూ, మనుషులనూ మార్కెట్ సరుకుగా మార్చాయి. 1995 డంకెల్, ప్రపంచ వాణిజ్య సంస్థగా రూపాంతరం చెంది దోహా నుండి నేటి నైరోబీ వరకు మన పంటలను, విత్తనాలను శాశిస్తూనే ఉంది. 1964లో వచ్చిన హరిత విప్లవం, 1995 జన్యుమార్పిడి (బి.టి.) పంటలతోపాటు, రైతన్న ఆత్మహత్యలను సైతం దిగుమతి చేశారు. సామాన్య జనాలకు కావల్సిన నీడ, నీళ్లు, తిండి, విద్య, వైద్యం సమకూర్చలేని సర్కారు ఎంపి, ఎంఎల్ఎలకు మాత్రం కనీసం నెలకు 2 వందల బస్తాల (2 లకల్ల రూపాయలు) ధాన్యం జీతమేకాక, విలాసవంతమైన భవంతి, సెంట్రల్ కూలింగ్, స్నానాలకు సైతం ప్యూరిఫై వాటర్, వీరి కుటుంబ సభ్యులందరికీ స్పెషల్ వార్డు వైద్యం, ఎక్కడకు వెళ్లాలన్నా విమానం, రైళ్లు, బస్సుల్లో సౌకర్యం ఉంటుంది. కానీ, ప్రజలకు కనీసం కరువు కాలంలోనైనా గంజినీళ్లు అందించాలనే ధ్యాసే మన పాలకులకు ఉండదు.

గతంలో బెంగాల్, బీహార్, రాయలసీమ కరువుల్లో లక్షల మంది తిండిలేక చనిపోయారు. చివరకు కుక్కలను, మనుషులు పీక్కుతిన్నట్లుగా చెప్పుకుంటారు. ఆనాటి ప్రథమ ప్రధాని నెహ్రూ కరువుల్లో ఎవరూ చని పోకూడదు. అందుబాటులో ఉన్న దుకాణాలను, గోడౌన్స్‌లను లూటీ చేసైనా మీ ప్రాణాలు దక్కించుకోండని పిలుపునిచ్చాడు. కానీ, నేడు ఎవరైనా ఆ పని చేస్తే ప్రభుత్వం లాఠీ, తూటాలకు పని పెడుతుంది. కరువులో ఎవరు చనిపోకుండా వారికి ఉచితంగా ఆహారం అందించాలని సర్కారుకు సుప్రీం కోర్టు హుకుం జారీ చేసినా అమలుకు నోచుకోవడం లేదు.

కరువు, కాటకం, దుర్భిక్షం, క్షామం లాంటి పదాలను అరుదుగా వినేవాళ్లం. కానీ వీటికి పర్యాయపదాలుగా ప్రపంచ బ్యాంకు, ప్రపంచ వాణిజ్య సంస్థ, ఇంటర్ నేషనల్ మానిటర్ ఫండ్, సరళీకరణ మొదలగునవి ముందుకు వచ్చాయి. నేటి కరువుకి ఇవి మూల కారణాలయ్యాయి. కాలుష్య వాతావరణం ఫలితంగా పర్యావరణం ధ్వంసమయింది. వర్షపాతం దెబ్బతిని పోయింది. సాధారణ వర్షపాతం కంటే తక్కువ పడితే దానిని కరువుగా పేర్కొంటారు. 50 శాతం తక్కువ వర్షం పడితే కాటకం, 75 శాతానికి మించి వర్షం పడక పోతే దుర్భిక్షం, ఆకలి మంటలతో అలమటించే పరిస్థితులను క్షామంగానూ, శాస్త్రజ్ఞులు పేర్కొన్నారు. ఆయా కాలాలలో వాతావరణాన్ని బట్టి 7 రకాలుగా కరువును వర్గీకరించారు. 1) వాతావరణం 2) నీరు 3) వ్యవసాయం 4) నేల తేమ 5) సామాజిక, ఆర్థిక పరిస్థితి 6) క్షామం 7) పర్యావరణ కరువుగా చెపుతున్నారు. వీటిని బట్టి బాధితులకు నిధుల కేటాయింపులు ఉండాలి. ఇవి అక్రమాలకు గురవుతున్నాయి.

కరువు గుర్తింపుకై 1951లో కేంద్రం కొన్ని మార్గదర్శకాలను ప్రామాణికాలను రూపొందించింది. 1981లో ఒకసారి, మరోసారి 1997 రాష్ట్ర ప్రభుత్వం కరువు మాన్యువల్ నెలకొన్నప్పటికీ 231 మండలాలనే కరువు మండలాలుగా ప్రకటించింది. హైదరాబాద్ మినహా మిగతా 9 జిల్లాల్లోని 443 గ్రామీణ మండలాల్లో 278 మండలాలు తీవ్ర కరువుకి గురయ్యాయని ఆగస్టులోనే నివేదిక సిద్ధం చేస్తే తీరా 231 మండలాలనే కరువు ప్రాంతాలుగా ప్రకటించారు. మహబూబ్‌నగర్, నిజామాబాద్, మెదక్ జిల్లాలు పూర్తిగా కరువుగా ప్రకటించారు. నల్లగొండ జిల్లాలో 22 మండలాలు, రంగారెడ్డి జిల్లాలో 33, కరీంనగర్‌లో 14, వరంగల్‌లో 11 మండలాలను కరువు మండలాలుగా ప్రకటించి, ఖమ్మం, ఆదిలాబాదు జిల్లాలను కరువు నుంచి మినహాయించారు. ఖమ్మంలో సాధారణ సాగు 134781 హెక్టార్లు కాగా 73913 హెక్టార్లు మాత్రమే సాగు చేశారు. ఆదిలాబాద్‌లో సాధారణ సాగు 56296 హెక్టార్లలో కేవలం 15562 హెక్టార్లు మాత్రమే సాగైంది. కనీసం ఈ జిల్లాలలో సగం కూడా సాగు కానప్పటికీ కరువుగా ప్రకటించక పోవడంతో స్థానిక ప్రజలు ఆందోళన బాట పట్టారు.

దేశంలో వలసలకు మారుపేరు తెలంగాణ. తెలంగాణ రాష్ట్ర ఉద్యమంలో తెలంగాణ జనం బ్రతకలేక బొంబాయికి వలసలు పోతున్నారని కెసిఆర్ ఉద్ఘాటించేవారు. ఉపాధి హామీ పథకం అమలు వైఫల్యం వలన గ్రామాలకు గ్రామాలే జీవనోపాధి కోసం అంతర దేశం, రాష్ట్రం, స్వరాష్ట్రంలోని పట్నాలకు వలస పోతున్నారు. ఇప్పటికే అన్ని జిల్లాల నుంచి 30 లక్షలకి పైగా వలస బాట పట్టారని అంచనా. ఒకటి రెండు శ్రేణిలో మహబూబ్‌నగర్ – నల్లగొండ ఉన్నాయి.

2000లో శాటిలైట్ చాయా చిత్రాల ద్వారా అనంతపురం, మహబూబ్‌నగర్, నల్లగొండ జిల్లాల్లో తేమ క్రమంగా తగ్గుతూ భూమి హర్‌తావి కోల్పోతున్నట్లుగా వాతావరణ శాఖ తెలిపింది. భూగర్భ శాఖ నివేదిక ప్రకారం 2014 నవంబర్‌లోనే 9.7 మీటర్ల లోతున ఉంటే ఈ సంవత్సరం నవంబర్ నాటికి 12.39 మీటర్లకు పడిపోయాయి. హైదరాబాద్‌లో గరిష్టంగా భూగర్భ జలాలు 21.01 మీటర్లకు పడిపోయాయి. దేశంలో డైనమిక్ సిస్టం అంటే వాన నీరు ఇంకిన పరిమాణం 9 శాతానికి మించడం లేదు. స్టేటిక్ సిస్టం అంటే భూమి లోపల నిలువ నీరు మరింత తక్కువగా ఉంటుందని భూగర్భ శాఖ నివేదిక తెలుపుతోంది. తెలంగాణలో ఇప్పటికే 30 లక్షలకు పైగా బోరు బావులు స్థాయికి మించి నీటిని గుంజేస్తున్నాయి. 65 మంది 85 శాతానికి మించి నీటిని తోడే ప్రాంతం గ్రే ఏరియా. 45 శాతమున్న 85 నుండి 10 శాతం తోడడం డార్క్ ఏరియా 100 శాతం పైగా నీటి తోడే ఓవర్ డెవలప్డ్‌గా 30 శాతంగా ఉంది. దీనికి తోడు ఇసుక తరలింపుతో భూగర్భ జలాలు 400 మీటర్ల నుండి 1000 మీటర్లకు బోర్లు వేసినా చుక్క నీరు పడడం లేదు. దేశంలో ప్రతి సంవత్సరం 400 మీ. హె.మీ. వర్షం పడుతోంది. దీనిలో 70 మీ. హె.మీ.లు ఆవిరిగాను, 110 మీ.హె.మీ.లు తేమగాను, 40 మి.హె.మీ.లు భూగర్భ జలంగాను, 180 మి.హె.మీ.లు నదులు, సముద్రాలలో కలుస్తోంది. మొత్తం వర్షపు నీటిలో కేవలం 17 నుండి 20 మి.హె.మీ. నీటిని మాత్రమే వినియోగించుకుంటున్నట్లుగా భూగర్భ శాఖ ప్రకటించింది. దేశంలో గ్రీన్‌వాటర్ (వాన నీరు) వినియోగించుకోవడమే రెండవ హరిత విప్లవంగా అంతర్జాతీయ నీటి వనరుల యాజమాన్య సంస్థ ప్రకటించింది. భారతదేశం గ్రీన్ వాటర్‌కు బదులు బ్లూ వాటర్ (నదుల నీరు) పై దృష్టి పెట్టడం వల్లనే తరచు కరువులు వస్తున్నాయి.

దేశంలో ఎక్కువ భాగం నైరుతి రుతుపవనాల వల్లనే వాన పడుతుంది. జూన్ నుండి సెప్టెంబర్ వరకు 75 శాతం, రుతుపవనాలకు ముందే 10 శాతం, రుతుపవనాల తరువాత 13 శాతం, చలి కాలంలో 2 శాతం వానలు పడతాయి. రాష్ట్ర సాధారణ వర్షపాతం 906 మి.మీ. దేశ సగటు వర్షపాతం 1180 మి.మీ. కానీ, ఈ వర్షం 75 గంటల్లోనే కురుస్తుంది. ఎక్కువ కాలంలో పడాల్సిన వాన తక్కువ సమయంలోనే కురవడం వలన, ఈ నీటిని నిలువ చేయక పోవడం వలన దేశంలో నీటి కొరతతో కరువు వస్తున్నట్లుగా సామాజిక పరిశీలకుడు హెచ్.ఎస్. దేశార్థ అల్వారు వ్యక్తపరిచారు. రాష్ట్రంలో వాన నీటిని నిలువ చేయక పోవడం వలన బావుల కింద 2009–10లో 83.33 శాతం, 2012–13లో 74.85 శాతం, 2013–14లో 65 శాతానికి సాగు తగ్గి పోయింది. చెరువుల కింద 2013–14లో 10.5 శాతం, 2014–15లో 6.5 శాతానికి సాగు పడిపోయింది. కరువుల వలన 2013–14లో ఎరువుల వాడకం 13.39 మెట్రిక్ టన్నుల నుండి 2014–15 సం?లో 12.48 లక్షల మె. టన్నులకు తగ్గి పోయింది. సకాలంలో నీరు అందక పంట ఉత్పాదకత 2013–14లో హెక్టారుకు 3227 కిలోలుండగా 2014–15లో 3054 కిలోలకు పడిపోయింది. ప్రస్తుత రబీలో సాధారణ సాగు 37.59 లక్షల ఎకరాలు కాగా, కేవలం 10.35 లక్షల ఎకరాలు మాత్రమే సాగయ్యే అవకాశం ఉంది. కరువు నివారణకై అంతర్జాతీయ సంస్థలు అనేక సూచనలు, తీర్మానాలు చేయగా దీనిలో మన దేశం సంతకాలు పెట్టింది. 2015 నాటికి దేశంలోని అందరికీ ఆహారం అందించాలని 1996 రోమ్ డిక్లరేషన్ ప్రకటించింది. కానీ, ప్రపంచంలో అతి ఎక్కువ మంది ఆకలితో అలమటించే వారిలో 19.40 కోట్ల మంది భారతదేశంలోనే ఉన్నారని ఐక్య రాజ్యసమితి ప్రకటించింది. 1980–1990ని అంతర్జాతీయ మంచినీటి దశాబ్దంగా యు.ఎన్.ఓ. ప్రకటించగా, ఇప్పటికీ 30 శాతం మందికి మంచినీరు అందుబాటులో లేదు. 2005–2015 వరకు అంతర్జాతీయ సాగు నీటి దశాబ్దంగా అమలు చేయాలనే పిలుపు ఎక్కడ అమలు జరగలేదు. రాష్ట్రంలో చెరువుల, బోర్ల, ప్రాజెక్టుల కింద సాగు క్రమేణ క్షీణిస్తోంది. ఉదా– నాగార్జున సాగర్ ప్రాజెక్ట్‌లో 408 టిఎంసి నీటి పరిమాణంలో 103 టిఎంసి పూడిక ఏర్పడింది. శ్రీరాంసాగర్ (ఎస్ఆర్ఎస్‌పి) కెపాసిటి 112 టిఎంసి నుండి 87 టిఎంసికు పడిపోయింది.

కరువు మార్గదర్శకాలను సక్రమంగా ఆచరించక పోవడం వలన కరువు పీడిత ప్రాంతాల కుదింపు జరిగింది. ఒక రోజులో 2.5 మి.మీ. కంటే తక్కువ వర్షం పడితే అది పంటకు ఉపయోగపడదు. 2.3 మి.మీ.కు పైగా వాన పడితేనే దానిని ఒక వర్షపు రోజుగా పరిగణించాలి. వాతావరణ శాఖ వారి ప్రకారం దేశంలో 70 వర్షపు రోజులుంటాయి. విత్తన దశలో ఎర్ర నేలలో రెండు రోజులలో కనీసం 20 మి.మీ. వర్షం పడితే కనీసం 10 రోజులు తేమ ఉంటుంది. నల్లరేగడిలో పది రోజులలో 40 మి.మీ. వాన పడితే 20 రోజులు తేమ ఉంటుంది. మొలకెత్తె దశలో 25 మి.మీ.తో 20 రోజులు, మొక్క పెరిగే దశలో 120 మి.మీ. వర్షం 3 రోజులు పడితే మొక్కలకు 20 రోజులు తేమ ఉంటుంది. పంట ప్రత్యుత్పత్తి దశలో 150 మి.మీ.లు, కోత దశలో 120 మి.మీ. వర్షం అవసరమవుతుంది. ఈ వ్యత్యాసంలో డ్రెస్సెల్ కాలాన్ని బట్టి కరువును 3 భాగాలుగా వర్గీకరించారు. 760 మి.మీ. కంటే తక్కువ వర్షపాతం కలిగితే 'ఎ' కేటగిరిగాను, 760 మి.మీ. నుండి 1000 మి.మీ. వర్షపాతంను 'బి'గాను, 1000 మి.మీ. కంటే ఎక్కువ వర్షపాతం గల ప్రాంతాలను 'సి' కేటగిరిగాను విభజించారు. ఈ లెక్కల ప్రకారం రాష్ట్ర వ్యాప్తంగా కరువు ఉన్నట్లుగా భావించాలి.

దేశంలో 24.39 కోట్ల కుటుంబాలలో 11.91 కోట్ల కుటుంబాలు గ్రామీణ ప్రాంతంలో జీవిస్తున్నారు. వీరిలో నేటి కరువులకు బలై పోతున్న వారు 10.69 కోట్ల కుటుంబాలున్నాయి. రాష్ట్రంలో వ్యవసాయంపై ఆధారపడేవారు 55.49 శాతమున్నారు. 2014–15లో తెలంగాణలో వ్యవసాయం అభివృద్ధి మైనస్ 10.3 శాతముంది. అంటే గ్రామీణ ప్రజలు సుమారు కోటికిపైగాను, పట్టణాలలో పంటలు లేక మూతపడిన రైస్ మిల్లులు ఇతర అనుబంధ రంగాలలో పనిచేస్తున్న 50 లక్షల మందికి

పైగా కరువు కోరల్లో నలిగి పోతున్నారు. మనుషులతోపాటు అత్యంత తీవ్ర కరువుకు బలి అవుతున్న వాటిలో ముఖ్యమయినది పశుసంపద. వీటిని మేపటానికి అడవిలో పచ్చదనం లేదు. ఒక్క గడ్డి మోపు ధర వంద రూపాయలు, ట్రాక్టర్ గడ్డి పది వేలకి పైగా ఉంటుంది. ఇంత ధర పెట్టి మేపలేక పాడి పశువులను సైతం కటిక దుకాణాలకు అమ్ముకుంటున్నారు. రాష్ట్రంలో 2012 గణాంకాల ప్రకారం 92.28 లక్షల పశువులు, 128.79 లక్షల గొర్రెలు, 4675 లక్షల మేకలున్నాయి. రాష్ట్రంలో 400 పైగా గల పశువుల సంతలలో రోజు రోజుకు వీటి అమ్మకాలు పెరుగుతున్నాయి. కోదాడ సంతలో ఎగుమతికి సకాలంలో వాహనాలు దొరకడం లేదట. నల్లగొండ జిల్లాలో గల 39 సంతలలో గత సంవత్సరం కంటే ఆదాయం పెరిగింది. ఉదా– కొండమల్లెపల్లి సంతలో ఆదాయం గత సంవత్సరం 50 లక్షల రూపాయలుంటే ఈ సంవత్సరం 83.10 లక్షల రూపాయలకు పెరిగింది. 2014లో సగం కాలానికే 10 శాతం పశుగణాభివృద్ధి తగ్గింది. పాలమూరు ప్రజల బతుకు మరింత దుర్భరంగా ఉంది. పాడి పరిశ్రమ సంక్షోభంలో కొట్టుమిట్టాడుతుంది. 2013–14లో రాష్ట్రంలో పాలు 3924 మె.ట.లు. ఉత్పత్తి కాగా 2014–15లో 2354.32 మె.ట.కు పడిపోయింది. పౌల్ట్రీ మరింత దివాళా తీసింది. 2013–14లో గుడ్ల ఉత్పత్తి 1006 కోట్లు కాగా 2014–15లో 624.80 కోట్లకు పడిపోయింది. వీటి కొరతతో గుడ్లు, మాంసం ధరలు పెరుగుతున్నాయి. అన్ని రకాల మాంసం 2013–14లో 446 మె.ట.లు కాగా 2014–15లో 296 మె.ట.కు పడిపోయింది. చేపల పెంపకం మరింత దివాళా తీసింది. వర్షం లేక చెరువున్నీ వట్టి పోయాయి. రాష్ట్రంలో పెద్ద రిజర్వాయర్లు 148 ఉంటే వీటిలో ఇప్పటికే నీరు 50 శాతం ఇంకి పోయింది. మిషన్ కాకతీయ పేరుతో కొన్ని చెరువుల నీరు కిందికి వదిలారు. ఒక్క హెక్టార్ నీటిలో సగటున 150 కిలీల చేప ఉత్పాదక ఉండాలనుకుంటే నీటి కొరత వలన 13 కిలోలే ఉంటుందని ఫిషరీస్ శాఖ ప్రకటించింది. రాష్ట్రంలో 19.04 లక్షల మంది చేపల ఆధారంగా బతికే వారున్నారు. కరువు మూలంగా 2014–15లో చేపలు 2.92 లక్షల టన్నులు అంచనా వేయగా 1.69 లక్షల టన్నులకే పరిమితమయ్యాయి.

హార్టికల్చర్, సెర్రికల్చర్ లాంటి పంటలు ఎండిపోయాయి. రాష్ట్ర వ్యాప్తంగా 6 వేల ఎకరాలలో పండ్ల తోటలు ఎండి పోయినట్లుగా మొన్నటి కరువు బృందానికి రాష్ట్రం నివేదించింది. ఒక్క నల్లగొండ జిల్లాలోనే మామిడి, నిమ్మ, బత్తాయి తోటలకు నీరు లేక 25 వేల ఎకరాలు పనికి రాకుండా పోయాయి.

కేంద్ర కరువు పరిశీలన బృందాలు రాష్ట్రంలో 2 రోజులు క్షేత్ర స్థాయిలో పర్యటించాయి. రాష్ట్ర ప్రభుత్వం కరువు అంచనా కంటే ఎక్కువ నష్టం జరిగినట్లుగా కేంద్ర బృందాలు ప్రకటించడం గమనార్హం. రాష్ట్ర ప్రకృతి విపత్తు నిర్వహణ విభాగం నివేదికలో లేని అనేక అంశాలను కేంద్ర బృందం తెల్పింది. చేపల చెరువులు ఎండి పోవుట వలన సర్కారు 280 కోట్ల రూపాయలు అంచనా వేయగా అది 350 కోట్ల రూపాయలకు పైగా ఉంటుంది. వ్యవసాయ శాఖకు జరిగిన నష్టం 863 కోట్ల రూపాయల అంచనా వేయగా అది సుమారు 15 వేల కోట్ల రూపాయలుగా ఉంటుందని రైతు సంఘాల వారు ప్రకటించారు. పశు సంవర్ధక శాఖకు కేవలం 42 కోట్ల రూపాయల నష్టమేనని రాష్ట్ర ప్రభుత్వం తెల్పగా కేంద్ర బృందమే ఆశ్చర్య పోయింది. రాష్ట్ర సర్కారు స్థిరమైన అంచనాలు లేక మొదటిసారి 1000 కోట్ల రూపాయలని మరోసారి 2,200 కోట్ల రూపాయలని చివరగా 3 వేల కోట్ల రూపాయలకు అంచనా వేసి నివేదిక పంపింది. కరువు పరిశీనలో సర్కారుతోపాటు ఇతర ప్రజా సంఘాలను కూడా భాగస్వామ్యం చేస్తే వాస్తవాలు రాబట్టే అవకాశం ఉండేది.

తెలంగాణలో వ్యవసాయ అభివృద్ధి కోసమే ఏర్పాటు చేయబడిన అనేక పరిశోధక సంస్థలు ఎందుకు పనికి రాకుండా మూలన పడివుంటున్నాయి. ఐసిఎఆర్, డిఆర్ఆర్, డిఒఆర్, ఎన్ఐపిఎఫ్ఎం, ఎన్ఐఆర్‌డి, ఎన్ఎఫ్, డిబి, ఎన్ఆర్‌సిఎస్, మేనేజ్, నార్మ్, క్రీడ లాంటి సంస్థలేకాక ఇక్రిశాట్ లాంటి అంతర్జాతీయ మెట్ట పంటల పరిశోధనా సంస్థలన్ని మన పంటల, మన విత్తనం కంటే మోన్‌శాంటో లాంటి వాటి చెప్పుచేతుల్లోనే ఉన్నాయి. అలాగే కరువు నివారణకై ఏర్పాటు చేసిన డ్రాట్ మేనేజ్‌మెంట్, డ్రాట్ ప్రోన్ ఏరియా ప్రోగ్రామ్ ఎస్టాబ్లిష్‌మెంట్ ఆఫ్ క్రాప్ వెదర్ వాచ్ గ్రూప్, ఇంటిగ్రేటెడ్ వాటర్ షెడ్ మేనేజ్‌మెంట్ రూఫ్‌టాప్, రెయిన్ వాటర్ హార్వెనింగ్ లాంటి పథకాలను వినియోగించుకోవడంలో ప్రభుత్వం నిర్లక్ష్యం వహిస్తోంది.

తెలంగాణలో 1.10 కోటి మె.టన్నుల ఆహార ధాన్యం పండించాలనే గత సంవత్సరపు 21 నాటి అంచనా నెరవేరాలంటే ప్రాజెక్ట్‌ను ప్రాధాన్యతా క్రమంలో పూర్తి చేయాలి. వలసల నిరోధానికి ఉపాధి హామీ పథకం పకడ్బందీగా నిర్వహించి రోజు కూలి కనీసం 300 రూపాయలు చెల్లించాలి. గ్రామ జ్యోతి, పల్లె ప్రగతి, రూరల్‌ని అర్బన్‌గా మార్చే అర్బన్ పథకాలలో ప్రజలను భాగస్వాములను చేయాలి. కరువుగా ప్రకటించని వాటిని తిరిగి పరిశీలన చేయాలి. కేంద్రం నుంచి కనీసం 10 వేల కోట్ల రూపాయలు సహాయం అందించేలా డిమాండ్ చేయాలి. రైతు ఆత్మహత్యలను నివారించి, ఆకలి చావులు లేకుండా ఇప్పటి నుంచే గ్రామ స్థాయిలో చర్యలు చేపట్టాలి. వీటి అమలుపై ప్రజలను సంఘటిత పర్చాలి. ప్రభుత్వంపై వత్తిడి చేయాలి.

*(రచయిత అఖిల భారత రైతు–కూలీ సంఘం రాష్ట్ర అధ్యక్షులు)* వీ

***రచయితలకు సూచన :*** *తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 20వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు.*

*మరొక పత్రికకు పంపిన, మరొక పత్రిక పరిశీలనలో ఉన్న, మరొక పత్రిక ప్రచురణకు ఆమోదించిన రచనను వీక్షణంకు పంపగూడదు. – సం.*

# సాంఘిక వెలి - ప్రజారోగ్యం

***కుల పరమైన అణచివేత, వెలివల్ల ప్రజారోగ్యం మీద ప్రభావాలను, పరిష్కార మార్గాలను చర్చిస్తున్నారు డా. పట్టా వెంకటేశ్వర్లు***

**సాం**ఘిక వెలి గురించి ఇటీవల కాలంలో ప్రపంచ వ్యాప్తంగా విస్తృత చర్చ జరుగుతోంది. అందులో భాగంగా రాజకీయ, సామాజిక, ఆర్థిక రంగాలలో ఈ సాంఘిక వెలి ప్రభావం గురించి పరిశోధనలు జరుగుతున్నాయి. అయితే యుఎన్ఓ విభాగమైన ప్రపంచ ఆరోగ్య సంస్థ (డబ్ల్యుఎచ్ఓ) కూడా ప్రజారోగ్య రంగంలో ఈ సాంఘిక వెలి ప్రభావాన్ని అంచనా వేసే ప్రయత్నాన్ని చేసింది.

కాబట్టి ముందుగా మనం సాంఘిక వెలి అంటే ఏమిటనే దాన్ని అర్థం చేసుకున్న తర్వాత, దాని ప్రభావం ప్రజారోగ్యంపై ఎలా పనిచేస్తుందనే విషయాన్ని పరిశీలిద్దాం. గౌరవ ప్రదమైన ఉపాధి, గృహవసతి, ఆరోగ్య రక్షణ, విద్య, శిక్షణ వంటి అవకాశాలు పొందలేని స్థితినే సాంఘిక వెలి అని అంటారు. ఈ పదం 1970 కాలంలో మొదటగా ఫ్రాన్స్‌లో ఉపయోగించారు. అటు తర్వాత ఇంగ్లాండ్, యూరప్ అంతట వాడుకలోకి వచ్చింది.

అయితే ప్రపంచ ఆరోగ్య సంస్థ 2008లో 'ఆరోగ్యం సాంఘిక నిర్ణయకాలు' (సోషల్ డిటర్మినెంట్స్ ఆఫ్ హెల్త్) అనే నివేదికలో ఈ అంశానికి విస్తృత అర్థాన్ని ఇచ్చింది. 'అసమాన అధికార సంబంధాల వల్ల నాలుగు రకాల వెలివేతలు అమలు జరుగుతాయి. అవి ఆర్థిక, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక రూపాలుగా ఉంటాయి. ఈ వెలి వ్యక్తి, కుటుంబాలు, జాతుల (భారతదేశంలో అయితే కులాలు) స్థాయిల్లోనే కాక దేశాల స్థాయిలో కూడా ఉంటాయి. ఇవి నిరంతరాయంగా కొనసాగబడడం వల్ల ప్రజలు వనరుల్ని (అవకాశాల్ని) పొందలేక పోవడమే కాక వారి సామర్థ్యం, హక్కుల్ని కూడా కోల్పోతారు. ఇలాంటి స్థితి ఆరోగ్య అసమతుల్యానికి దారి తీస్తుందని' ఆ నివేదిక పేర్కొంది.

ఈ విధంగా ఆరోగ్యానికి, సాంఘిక అంశాలకు మధ్యనున్న విడదీయని సంబంధాల్ని మరింత విపులీకరించే ప్రయత్నం చేసింది. అంటే వ్యక్తులు లేదా సమూహాలు గౌరవప్రదమైన ఉపాధిని పొందలేని కారణంగా అధమస్థాయి ఆదాయం పొంది పౌష్టికాహార సమస్యకు గురవుతారు. అంతేకాక గృహ వసతి, రక్షిత మంచినీరు పొందలేని స్థితితో పాటు, అపరిశుభ్రమైన వాతావరణంలో జీవించాల్సి వస్తుంది. ఇందువల్ల మంచి ఆరోగ్య రక్షణ సదుపాయాల్ని పొందలేక పోతారు. ఇవన్ని ఆరోగ్యంపై చెడు ప్రభావాల్ని కలిగిస్తాయి.

ఈ విధంగా డబ్లుఎచ్ఓ ప్రజారోగ్యానికి విస్తృత అర్థాన్ని ఇచ్చింది. కాబట్టి ఈ రకమైన అవగాహన ఆధారంగా భారతదేశంలో కులపరమైన వెలి లేదా అణచివేత ఆరోగ్యంపై దాని ప్రభావాన్ని విశ్లేషించడం ఈ వ్యాసం ముఖ్య ఉద్దేశం.

**సాంఘిక వెలి – కులం**

సాంఘిక వెలి మొదట పుట్టి, పెరిగింది భారతదేశంలోనే. ఎందుకంటే ప్రపంచంలోని ఇతర దేశాలలో వర్గ దోపిడీ ఆధారంగా సమాజం నిర్మితమైతే, మన దేశంలో మాత్రం మొదటగా వర్ణ సమాజ ఆధారంగా కుల దోపిడీ సమాజం నిర్మించబడింది. వర్గసమాజంలో వర్గాలు తమకున్న శక్తి సామర్థ్యాలు అవకాశాలను బట్టి వారి వర్గస్థాయి మారుతుంది. కాని భారతదేశంలో కులాల స్థాయి మారదు. ఇక్కడ కులాల హోదాలు, అవకాశాలు స్థిరీకరింపబడ్డాయి. పైగా ఈ కులపరమైన లేదా వర్ణపరమైన విభజనకు 3వేల సంవత్సరాల చరిత్ర ఉంది. కాబట్టి సాంఘిక వెలి అనేది పుట్టి పెరిగింది భారతదేశంలోనే అనడానికి ఇదే కారణం. ఇది మన సమాజ ప్రత్యేక లక్షణం. ఈ కులం విశృంకులమైన సాంఘిక అంతరాల నిలయంగా చెప్పవచ్చు. ఇది ఒక ఆర్థిక వ్యవస్థగా బాధ్యతలేని దోపిడీని అంగీకరిస్తుంది. కొద్ది కులాలకు అంతేలేని రాజకీయ అధికారాన్ని, సంపదల్ని, గౌరవాన్ని కల్పించి మెజారిటీ కులాలను వీటికి దూరంగా నెడుతుందనీ డా. అంబేద్కర్ తన 'కుల నిర్మూలన' గ్రంథంలో పేర్కొంటాడు. ఈ విధంగా మనిషికి ఉండాల్సిన కనీస మానవ హక్కుల్ని నిరాకరిస్తుంది. ఇంకా అస్పృశ్యుల విషయంలో 'కుల వివక్షలకు అంతే ఉండదు'. కుల కట్టుబాట్లకు (ధర్మానికి) వ్యతిరేకంగా ప్రవర్తిస్తే కఠినమైన శిక్షలు నేటికి కూడా అమలు చేయబడుతున్నాయి. కాబట్టి ఇటువంటి సాంఘిక అంతరాల సమాజంలో డబ్ల్యుఎచ్ఓ ఇచ్చిన 'అందరికి ఆరోగ్యం – అందరికి సమానత్వం' అనే నినాదాల ఆచరణ ఎంత క్లిష్టమైన అంశంగా మారిందో పరిశీలిద్దాం.

**ఉపాధి అవకాశాలు – సామాజిక గౌరవం**

భారతీయ సమాజంలో వ్యక్తుల జీవన ప్రమాణాలు ఉపాధి అవకాశాల బట్టి ఉంటాయి. వారు చేస్తున్న పనిని బట్టి వారి ఆదాయం నిర్ణయమవుతుంది. అలాగే సాంఘిక హోదా కూడా నిర్ణయమవుతుంది. ఇక్కడి గ్రామీణ ఉత్పాదక శ్రమలకు తక్కువ ఆదాయంతో పాటు, వాటికి హీన గౌరవ స్థితి ఆపాదించబడింది. కష్టేఫలి సూత్రం ఇక్కడ వర్తించదు. ఎంత కష్టపడినా ఈ వృత్తులలో పనిచేస్తున్న వారు పైకి రావడం అనేది దుర్లభమైన విషయమే. ఈ విధంగా హీనవృత్తులుగా చెప్పబడుతున్న కులాలన్నీ గ్రామీణ వ్యవసాయ రంగంలోనే ఉన్నాయి. ఇక వ్యవసాయ రంగ విషయానికి వస్తే అది వెనుకబడిన ఆర్థిక వ్యవస్థ ప్రతిరూపం. ఈ రంగంలో పనిచేసే వారి ఆదాయాలు చాలా తక్కువగా ఉంటాయి. పని దినాలు కూడా పూర్తి కాలం లభ్యం కావు. ప్రచ్ఛన్న నిరుద్యోగం ఈ రంగంలో ఎక్కువగా ఉండడం వల్ల సగటు ఆదాయాలు మరింతగా దిగజారి ఉంటాయి. అందువల్ల ఈ రంగంలో ఉపాధి ఎక్కువగా

**ఉపాధిపరంగా వివిధ సామాజిక తరగతుల కుటుంబాల శాతం (2009-10)**

| | గ్రామీణ ప్రాంతాలలో | | | పట్టణ ప్రాంతాలలో | | | |
|---|---|---|---|---|---|---|---|
| సామాజిక తరగతులు | స్వయం ఉపాధి | వ్యవసాయ శ్రమలు | ఇతర పనులు | స్వయం ఉపాధి | వేతన/జీతం | దినసరి శ్రామికులు | ఇతర పనులు |
| ఇండియా | 47.4 | 40.4 | 12.2 | 34.7 | 39.7 | 13.4 | 12.1 |
| ఎస్.సిలు | 30.8 | 59.0 | 10.3 | 26.2 | 39.4 | 25.1 | 9.2 |
| ఎస్.టిలు | 44.0 | 46.5 | 9.5 | 23.3 | 38.4 | 21.1 | 16.9 |
| ఒబిసిలు | 15.3 | 37.3 | 11.4 | 36.8 | 35.0 | 17.1 | 11.1 |
| ఇతరులు | 57.5 | 26.2 | 16.3 | 36.2 | 44.1 | 6.0 | 13.6 |
| ముస్లింలు | 46.3 | 40.7 | 13.0 | 45.5 | 30.4 | 15.5 | 8.0 |

పొందడం అనేది అభివృద్ధికి సూచిక కానప్పటికీ ఎక్కువమంది వ్యవసాయ రంగం మీదనే ఆధారపడి జీవిస్తున్నారు. ఇందులో ఎక్కువగా ఆధారపడుతుంది కింది కులాల ప్రజలే. అలాగే పట్టణ ప్రాంతాల్లో కూడా అసంఘటిత రంగంలో కింది కులాలవారే పనిచేస్తున్న విషయాన్ని పట్టిక 1లో గమనించవచ్చు.

ఈ పట్టిక వివిధ సామాజిక తరగతుల వారిగా గ్రామీణ, పట్టణ ప్రాంతంలో ఉపాధి అవకాశాల పరిస్థితి తెలియజేస్తున్నది. ముందుగా గ్రామాలలో పరిశీలించినట్లయితే, వ్యవసాయ పనుల్లో ఎక్కువగా పనిచేస్తున్న కుటుంబాల్లో ఎస్.సి లల్లో ఎక్కువ శాతంగా ఉన్నారు. అంటే ఎస్.సిలలో 59 శాతం వ్యవసాయ పనులు చేస్తుంటే, ఎస్.టిలు 46.5 శాతంగా పనిచేస్తున్నారు. ఇతర కులాల వారు 26.2 శాతం మాత్రమే. ఇక గ్రామీణ ప్రాంతాల్లో స్వయం ఉపాధి ఉండాలంటే సొంత భూమి లేదా ఇతర ఉత్పత్తి సాధనాలు ఉన్నప్పుడే సాధ్యమవుతుంది. ఈ పట్టికలో స్వయం ఉపాధి పొందుతున్న వారిలో అగ్రకులాల కుటుంబాలు 57.5 శాతం ఉంటే, బిసిలు 51.3 శాతం కాగా, తక్కువ స్వయం ఉపాధి పొందుతుంది (30.8) ఎస్.సిలే.

ఇక పట్టణ ప్రాంతానికి వస్తే, ఏ రకమైన సాంఘిక రక్షణలు లేని తక్కువ దినసరి వేతన శ్రామికులలో ఎస్.సి కుటుంబాలు ఎక్కువ శాతం (25.1) ఆధారపడి జీవిస్తున్నాయి. ఎస్.టిలు 21.1 శాతంగా ఆధారపడి పనిచేస్తున్నారు. ఇలాంటి ఉపాధి అవకాశాల్లో అగ్రకులాల కుటుంబాలు తక్కువ శాతం ఆధారపడ్డాయి. ఈ శ్రమ చేసే వారి ఆదాయాలు తక్కువగా ఉంటాయి. ఇక వేతన జీవులు అంటే నెలసరి ఆదాయాలు పొందే ఉపాధి విషయంలో ముస్లింల కుటుంబాలు తక్కువ శాతం (30.4)గా ఆధారపడి ఉన్నాయి. కానీ స్వయం ఉపాధిలో మాత్రం వీరే అత్యధికం (45.5)గా ఉన్నారు. దీన్ని గమనంలోకి తీసుకోవాల్సి ఉంటుంది. స్వయం ఉపాధి విషయంలో ఎస్.టిలు తక్కువ శాతం (23.3) ఆధారపడి ఉంటే, ఆ తర్వాత ఎస్.సిలు (26.2) శాతంగా ఉపాధి పొందుతున్నారు. ఈ పట్టిక వల్ల తెలుస్తుందేమంటే ఎక్కువ ఆదాయాలు లభ్యమయ్యే పనుల్లో అగ్రకులాలు అగ్రభాగాన ఉన్నాయి. కాబట్టి కుల వ్యవస్థ నమూనానే నేటికి శ్రమ సంబంధాల్లో అమలవుతుంది. ఈ స్థితి ఆదాయలేమితనానికి దారితీస్తుంది. అందువల్ల శ్రామిక కులాల వారు మంచి ఆరోగ్యాన్ని పొందలేక పోవడానికి కారణభూతమవుతుంది.

**భూకమతాలు - సామాజిక తరగతులు**

భారతీయ గ్రామీణ సమాజంలో భూమి కలిగి ఉండడం అనేది వారి ఆదాయస్థాయినే కాక, సాంఘిక గౌరవానికి కూడా సూచికగా పనిచేస్తుంది. గతంలో అగ్రకులాలు మాత్రమే పెద్ద కమతాలను కలిగి ఉండేవి. కాని ఇప్పుడు ఏదోమేరకు భూ పంపిణీ జరగడం, అదే సమయంలో కుటుంబాల సంఖ్య పెరుగుదల వల్ల కమతాల విభజన జరిగి చిన్నకమతాల ఆధారపడే కుటుంబాల సంఖ్య పెరుగుతున్నది. దీన్ని పట్టికలో గమనించవచ్చు. అతి చిన్న కమతాలు కలిగి ఉన్న వారిలో ఎస్.సి కుటుంబాల్లో (అంటే 1 హెక్టారులోపు) 92 శాతంగా భూ వసతి కలిగి ఉన్నారు. ఈ విషయంలో ఒబిసిలు 79.4 శాతం కాగా, తర్వాత ఎస్.టిలు 76.5 శాతంగా కలిగి ఉన్నారు. 1 నుంచి 2 హెక్టార్ల కమతస్థాయి కలిగి ఉండే విషయం ఎస్.సి, బిసిల కంటే ఎస్.టిల శాతం (13.0) ఎక్కువగా ఉంది. అలాగే 2 నుంచి 4 హెక్టార్ల విషయం ఎస్.టిలు ఇతర అగ్రకులాలకు దగ్గరగా ఉన్నారు. ఈ విషయం ఎస్.సిలది క్రింద బాగాన ఉన్నారు. 4, ఆ పైన కమతాల విషయంలో 5 శాతంగా అగ్రకులాలు ఉంటే, ఓబిసిలు 3.1 శాతం కాగా ఎస్.టిలు 2.2 శాతం కుటుంబాలు కమతాలను కలిగివున్నాయి. మొత్తంగా భూకమతాల విషయంలో అతి తక్కువస్థాయి భూమి కలిగి ఉంది ఎస్.సిలలో మాత్రమే. కాబట్టి భూమి లేకున్న లేదా తక్కువ ఉన్నా దాని ప్రభావం ఆదాయంపై పడుతుంది. ఈ ఆదాయ లేమితనం పరాధీనతకు అవకాశం కల్పిస్తుంది.

**సామాజిక వసతులు - ఆరోగ్యం**

ఆరోగ్యాన్ని ప్రభావితం చేసే అంశాలల్లో సామాజిక వసతులు కూడా ముఖ్య భూమికను పోషిస్తాయి. అంటే రోగాలు కలగజేసే విషయంలో వీటి ప్రభావం చాలా ఎక్కువ ఉంటుంది. 2011 జన గణన ప్రకారం దేశంలో 53.1 శాతం కుటుంబాలకు మరుగుదొడ్ల సదుపాయం లేదు. కేవలం 36.4 శాతం కుటుంబాలకే గృహాల్లో ఆధునిక వసతులున్నాయి. దాదాపు 9.4 శాతం మందికి గొయ్యి మరుగుదొడ్లు, 1.1 శాతం మందికి ఇతర నాసిరకం ఏర్పాట్లు ఉన్నాయి. కేంద్ర తాగునీరు పారిశుద్ధ్య శాఖ 2012-13 మధ్యకాలంలో నిర్వహించిన ప్రాథమిక సర్వే ప్రకారం గ్రామాల్లో 40.35 శాతం కుటుంబాలకే మరుగుదొడ్ల ఏర్పాట్లు ఉన్నాయి. ఈ సౌకర్యాల కొరత వల్ల పరిశుభ్రత కొరవడడంతో పర్యావరణ కాలుష్యం పెరిగి, వ్యాధులు ప్రబలి, చివరకు ప్రాణనష్టం సంభవిస్తుందనీ డబ్ల్యుఎచ్ఓ హెచ్చరించింది. కాబట్టి నీరు, పారిశుధ్యానికి, పరిశుభ్రతకు ముఖ్యమైన పాత్ర ఉంది. మనదేశంలో సంభవిస్తున్న ప్రతి 10 మరణాల్లో ఒకటి పారిశుద్యం, శుభ్రతకు సంబంధించినదై ఉంటుంది. ఈ మరణాల్లో 5 శాతం విరోచనాలకు సంబంధించినవిగా ఉన్నాయి. ఈ మరణాల్లో 88

శాతం చిన్న పిల్లలకు సంబంధించి అంటే 5 సంవత్సరాలలోపు పిల్లల మరణాలున్నాయి.

ఈ పట్టికలో పక్కా గృహాలు ఎస్.టిలలో కేవలం 34 శాతం కుటుంబాలే కలిగి ఉన్నాయి. అంటే పక్కా గృహాలు లేనివారు వీరిలో 66 శాతంగా ఉన్నారన్న మాట. అలాగే గృహ పరిధిలో మంచినీటి సౌకర్యం 19 శాతంగా ఉంటే ఈ సౌకర్యం లేని ఎస్.టిలు 81 శాతం. మరుగుదొడ్ల విషయంలో 77 శాతం ఎస్.టిలకు ఇంటి పరిధిలో ఈ

**భారతదేశంలో వివిధ సామాజిక తరగతుల భూ కమతాల స్థాయి 2009-10 (శాతంలో)**

| కమతాల స్థాయి హెక్టారుల్లో | ఎస్.టి | ఎస్.సి | ఒబిసి | ఇతరులు | ఇండియా |
|---|---|---|---|---|---|
| 0.40 వరకు | 56.7 | 80.0 | 62.7 | 58.1 | 64.8 |
| 1.00 వరకు | 76.5 | 92.1 | 79.4 | 75.1 | 80.8 |
| 1 నుంచి 2 | 13.0 | 4.7 | 10.5 | 11.2 | 9.7 |
| 2 నుంచి 4 | 8.3 | 2.4 | 7.0 | 8.7 | 6.5 |
| 4 వరకు ఆ పైన | 2.2 | 0.8 | 3.1 | 5.0 | 3.0 |

సౌకర్యం లేదు. ఎస్.సిలు ఈ విషయాల్లో ఎస్.టిల కంటే కొంత మెరుగ్గా ఉన్నారు. గృహవసతిలో 51 శాతంగా ఉంటే, మంచినీటి సౌకర్యం 31 శాతం. మరుగుదొడ్లు 33.9 శాతం, విద్యుత్ వినియోగం 60 శాతంగా ఎస్.సి కుటుంబాలు కలిగి ఉన్నాయి. ఈ విషయంలో ఒబిసిల్లో ఎస్.సి, ఎస్.టిల కంటే మెరుగైన స్థితి కనిపిస్తుంది.

**ఆరోగ్య సేవల అందుబాటు**

ఆరోగ్యంలో ఆఖరి అంకం ఆరోగ్య సేవల అందుబాటు. రోగాలను నయం చేయడానికి గాని, మరణాల సంఖ్యను తగ్గించడానికి ఇవి ఉపయోగ పడతాయి. ముఖ్యంగా ఆరోగ్య సేవలను పెంచడం ద్వారా ముఖ్యంగా ప్రసూతి మరణాలు గానీ, శిశు మరణాలు తగ్గించవచ్చు. అయితే భారతీయ సమాజంలో ఆరోగ్య సేవలు పట్టణాల్లోనే ఎక్కువగా కేంద్రీకృతమై ఉంటున్నాయి. గ్రామాలలో ఈ సేవల అందుబాటు నామమాత్రమేనని చెప్పవచ్చు. ఆరోగ్య సేవల విషయంలో పట్టణాలకు, గ్రామాలకు అంతరాలు చాలా తీవ్రంగానే ఉంటున్నాయి. కులాల మధ్య కూడా అదే స్థాయిలో ఉంటున్న విషయాన్ని పట్టిక 4లో గమనించవచ్చు.

ఈ పట్టికలో మహిళల అక్షరాస్యత కానీ, పేదరికం విషయం గానీ, ఆరోగ్య సేవల అందుబాటు కానీ కుల అసమాన దొంతరల స్థాయిని తెలియజేస్తున్నాయి. మహిళల అక్షరాస్యతకు, ఆరోగ్య సేవల వినియోగానికి దగ్గర సంబంధం ఈ పట్టికలో కనిపిస్తుంది. అగ్రకులాల మహిళల్లో అక్షరాస్యత 71 శాతంగా ఉంది. అలాగే పేదరికం కూడా తక్కువగా ఉంది. ఇది ఆరోగ్య సేవలు పొందే విషయంలో సానుకూల ప్రభావాన్ని సూచిస్తున్నది. అలాగే ఎస్.టి విషయంలో 67శాతం మహిళలు నిరాక్షరాస్యులున్నారు. మిగతా సామాజిక తరగతులతో పోల్చి చూసినప్పుడు వీరు అన్ని విషయాల్లో అట్టడుగు స్థితి కనిపిస్తుంది. పౌష్టికాహార లోపం వల్ల 3 సంవత్సరాలలోపున్న పిల్లలలో తక్కువ బరువు ఉన్న వారు 55 శాతం కాగా, గిరిజనేతరుల్లో 42 శాతంగా ఉన్నారు. 5 సంవత్సరాలలోపు శిశు మరణాల విషయంలో ఎక్కువ మరణాలు గిరిజన పిల్లలలో ప్రతి వెయ్యి జననాలకు 96 దాకా ఉంటున్నాయి. అదే ఇతర కులాలలో అయితే 59 మాత్రమే శిశుమరణాలున్నాయి. ప్రభుత్వాలు గతం కంటే ఆరోగ్య సేవల అందుబాటును పెంచుతున్నప్పటికి గిరిజన మహిళల్లో వ్యవస్థీకృత రంగంలో ప్రసూతి అవకాశం కేవలం 18 శాతంగానే ఉంది. భారతీయ కుటుంబ ఆరోగ్య సర్వే 1998-99 (ఎన్ఎఫ్ఎచ్ఎస్-2), 2005-06 (ఎన్ఎఫ్ఎచ్ఎస్-3) మధ్యకాలంలో ఈ అవకాశాలు ఇతర కులాలలో 40 నుంచి 53 శాతానికి పెరిగితే, గిరిజన మహిళల్లో పెరుగుదల లేదు. రోగనిరోధక టీకాల విషయానికి వస్తే గిరిజన - గిరజనేతరుల మధ్య వ్యత్యాసం తీవ్రంగా ఉంది. గిరిజన పిల్లల్లో 2007-08 నాటికి టీకాలు వేయించుకున్న వారు కేవలం 45 శాతంగా ఉంటే, అది ఎస్.సిలలో 53 శాతం కాగా, ఇతరుల్లో 63 శాతంగా ఉంది. ఈ అంశాలకు తోడు పేదరిక సమస్య ఉండనే ఉంది. అత్యధికంగా పేదరికంలో మగ్గుతున్నది ఎస్.టి కుటుంబాలే. కాబట్టి అనారోగ్యానికి మూలధాతువు పేదరికమే.

**సాంఘిక అవకాశాల అందుబాటు (శాతంలో)**

| సామాజిక తరగతి | పక్కా గృహాలు 2009 | మంచినీటి సౌకర్యం | మరుగుదొడ్ల సౌకర్యం | విద్యుత్ సౌకర్యం 2009 |
|---|---|---|---|---|
| ఎస్.టి | 34 | 19 | 22.6 | 57 |
| ఎస్.సి | 51 | 31 | 33.9 | 60 |
| ఒబిసి | 58 | 44 | 39.9 | 68 |
| ఇతరులు | 65 | 54 | 46.9 | 74 |

**ఆహారం ఔషధమే కానీ...**

మనిషి ఆరోగ్యంగా ఉండడానికి ఆహారమే పరమ ఔషధంగా పనిచేస్తుందనే దాంట్లో సందేహం అక్కరలేదు. అయితే మనిషికి ఎంత ఆహారం కావాలి? అది పౌష్టికాహారమేనా? అనే విషయాలను పరిగణలోకి తీసుకోవాలి. ఎంత ఆహారం తీసుకోవాలనే దానికి టెండుల్కర్ కమిటీ గ్రామీణ ప్రాంతాల్లో 2,400 క్యాలరీలు, పట్టణ ప్రాంతాలయితే 2,100 క్యాలరీలు ఆహారం తీసుకోవాలని చెప్పింది. అయితే ఏదో ఒకదానితో కడుపు నింపుకున్న కూడా ఈ క్యాలరీల ఆహారం లభ్యమవుతుంది. ఉదాహరణకు చిలకడ దుంప తీసుకున్న కూడా పైన చెప్పిన క్యాలరీల ఆహారం లభ్యమవుతుంది. అయితే అది మనిషికి కావాల్సిన పోషకాలన్నింటినీ అందించదు. కాబట్టి క్యాలరీల పద్ధతి శాస్త్రీయమైనది కాదు. ఇక భారతీయుల్లో (హిందు కులాల్లో) ఆహారం పట్ల సరైనా అవగాహన ఉండడం లేదు. ఎందుకంటే ఎన్ఎఫ్ఎచ్ఎస్-3 ప్రకారం మనదేశంలో 46 శాతం మంది పోషకాహార లోపంతో పాటు రక్తహీనత వంటి సమస్యతో బాధపడుతున్నారు. ప్రతి ఐదుగురిలో ఒకరు పోషకాహార లోపం, రక్తహీనతతో సతమతమవుతున్నారు. అయితే రక్తహీనతతో బాధపడే వారిలో పురుషులు కూడా ఉన్నారు. ధనిక వర్గంలోని మహిళల్లో దాదాపు 51.17 శాతం పోషకాహార లోపం, రక్తహీనతతో జీవిస్తున్నారు. 23 శాతం ధనికుల్లో రక్తహీనతతో జీవిస్తుంటే, 39.6 శాతం దళితులు, ఆదివాసులు ఆహార కొరత వల్ల పౌష్టికాహారం, రక్తహీనతతో ఇబ్బంది పడుతున్నారు.

అక్షరాస్యత, పేదరిక, ఆరోగ్య సేవలు అందుబాటు (శాతంలో)

| సామాజిక తరగతి | మహిళా అక్షరాస్యత 2011 | సంస్థాగత ప్రసూతి సౌకర్యాలు | టీకాలు వేయించుకున్న వారు | ప్రసూతి చెకప్‌లు | | బరువు తక్కువ పిల్లలు (3 సం లోపు) | శిశుమరణాలు (5 సం లోపు) ప్రతి వెయ్యికి | పేదరికం 2011-12 |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | | ముందు | తరువాత | | | |
| ఎస్.టి | 33 | 18 | 45 | 41 | 38 | 55 | 96 | 45.0 |
| ఎస్.సి | 44 | 34 | 53 | 45 | 48 | 48 | 88 | 31.5 |
| ఒబిసి | 52 | 38 | 52 | 48 | 52 | 43 | 72 | 22.6 |
| ఇతరులు | 71 | 54 | 63 | 63 | 61 | 34 | 59 | 15.5 |

ధనికుల్లో రక్తహీనత సమస్య ఎందుకు ఉత్పన్నమవుతున్నది? అనేదాన్ని ప్రశ్నించినప్పుడు భారతీయుల్లో ఆహారంపై సరైన అవగాహన లేనట్లు తెలుస్తుంది. ఆహారం విషయంలో అవగాహన కల్పించాల్సిన అవసరం ఉంది. నేడు హరిత విప్లవం వల్ల కొన్ని రకాల ధాన్యాల ఆహార వినియోగం పెరిగినా, వాణిజ్య పంటలు పెరగడం మూలంగా పప్పులు ఇతర తృణధాన్యాల వినియోగం తగ్గిపోతోంది. ఇది సమతుల ఆహార సమస్యకు దారితీస్తోంది. మరోక వైపు ఆహార పంటలలో క్రిమి సంహారక మందులు, రసాయనిక వాడకం పెరుగుతోంది. ఇది కొత్త జబ్బులకు దారితీస్తోంది. అలాగే వాతావరణంలో కాలుష్యం కూడా అనారోగ్య సమస్యలను పెంచుతోంది. ఈ విశ్లేషణ తెలియజేస్తుందేమంటే డబ్ల్యుఎచ్ఒ చెప్పినట్లు ఆరోగ్యాన్ని ప్రభావితం చేయడంలో సాంఘిక అవకాశాలు ఎలా నిర్ణయాంకాలుగా మారతాయో ఈ విశ్లేషణ మరింత రూఢి చేస్తోంది. కాబట్టి ఇక్కడ సాంఘిక వెలి కులం రూపంలో కొనసాగుతోందని అది మంచి ఆరోగ్యాన్ని పొందడానికి అడ్డుగా నిలుస్తుందని అర్థమవుతోంది.

**అందరికి ఆరోగ్యం – అందరికి సమానత్వం**

ప్రపంచ ఆరోగ్య సంస్థ చెప్పినటువంటి అందరికి ఆరోగ్యం కల్పించ బడాలంటే ముందుగా మనదేశంలో కుల వ్యవస్థ వల్ల వారసత్వంగా కొనసాగుతున్న సాంఘిక వెలిని తొలగించబడాలి. ఇందు కోసం ఏం చేయాలి? దానికి కూడా డబ్ల్యుఎచ్ఒ తనదైన పద్ధతిలో పరిష్కార మార్గాలను సూచించింది. అందుకు బ్రెజిల్‌లోని రియో డిజనిరోలో 2011లో 'ఆరోగ్యం సాంఘిక నిర్ణయకాలు' అనే అంశంపై అంతర్జాతీయ మహాసభ తీర్మాణాలను మన పరిస్థితులకు అన్వయించుకొని అమలు చేస్తే సరిపోతుంది. ఈ మహాసభలో ఆరోగ్యాన్ని ప్రాథమిక హక్కుగా పునరుద్ఘాటిస్తూనే వివిధ దేశాలలోని ప్రజల రాజకీయ అభిప్రాయాలతో సంబంధం లేకుండా వారి జాతి(కుల), మత, ప్రాంత అంశాలు ఏమైనప్పటికి అందరూ మంచి ఆరోగ్యాన్ని పొందాలని మహాసభ తీర్మానించింది. అందుకొరకు వారి ఆర్థిక, సాంఘిక పరిస్థితులు మెరుగుపరచడానికి ప్రభుత్వాలు చర్యలు తీసుకోవాలని తెలిపింది. ఇందువల్ల సమాజంలో సుస్థిర అభివృద్ధి పొందడానికి శాంతి సామరస్యాలు ఏర్పడడానికి అవకాశం కలుగుతోందనీ, అంతిమంగా ఆరోగ్య సమానత్వం ఏర్పడుతుందనీ అది పేర్కొంది.

ఈ విధంగా అది అందరికి ఆరోగ్యం, అందరికి సమానత్వం అనే నినాదాల్ని ఇస్తూ, అందుకు సంబంధించిన మూడు ముఖ్యమైన సూచనలు అన్ని దేశాలకు చేసింది. 1. దైనందిన జీవన పరిస్థితుల్ని మెరుగు పరచడం, 2. అధికారం, డబ్బు, వనరుల అసమాన పంపిణీ సమస్యలను సరిచేయడం, 3. ఆరోగ్యంపై సాంఘిక అంశాల ప్రభావాన్ని గుర్తించడం, అంచనావేయడం, చర్యలు చేబట్టడం వంటివి చేయాలని తెలిపింది. కాబట్టి అందరికి సమాన అవకాశాలు అంటే నాణ్యమైన విద్య గౌరవ ప్రదమైన ఉపాధితో పాటు ప్రజలు రాజకీయ విధాన నిర్ణయాలలో వారి భాగస్వామ్యం పెరగాలి. అందుకు రాజకీయ కార్యాచరణతో కూడిన ప్రజా ఉద్యమాలు జరిగితే తప్ప ఇది సాధ్యం కాదు.

*(రచయిత అర్థశాస్త్ర ఉపన్యాసకులు, భవన్స్ న్యూసైన్స్ కళాశాల)* వీ

# 24వ రాష్ట్ర నాస్తికమేళా

## 2016 ఫిబ్రవరి 13, 14 తేదీలు శని, ఆదివారాల్లో

## గుంటూరు జిల్లా, మంగళగిరి సమీపంలోని చార్వాకాశ్రమంలో

చార్వాక రామకృష్ణగారు అర్ధ శతాబ్దాకాలం పైగా నాస్తికోద్యమాన్ని నడిపి, నాస్తిక జీవన విధానం ద్వారా ఈ సమాజానికి ప్రత్యామ్నాయ సంస్కృతి నిర్మాణం కొరకు అలుపెరగని పోరాటం చేశారు. ఆ తాత్వికుని ఆలోచనల నుండి రూపుదిద్దుకున్నదే గత 23 సంవత్సరాల నుండి ఏటా జరుపుకుంటున్న ఈ నాస్తికమేళా.

భావా ప్రకటనా స్వేచ్ఛకి ఎంతో విలువనివ్వవలసిన నేటి కాలంలో మతవాదులు, లౌకిక హేతువాదులపై హంతక దాడులకు పాల్పడుతున్నారు. మత సంస్కృతి, మార్కెట్ సంస్కృతి, ప్రజల సంస్కృతిపై దాడి చేస్తున్న నేటి పరిస్థితుల్లో జరుగుతున్న 24వ నాస్తిక మేళాను విజయవంతం చేయడానికి లౌకిక, హేతువాద సంస్కృతుల పట్ల అభిరుచిగల వారందరూ తప్పక హాజరు కావల్సిందిగా, చేయూతనందివ్వవల్సిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం.

# ప్రజారోగ్యం ప్రైవేట్ పరం

***ఆదివాసి ప్రజలు మలేరియాతో మరణిస్తుంటే ప్రభుత్వం వైద్య సహాయం అందించకపోగా వైద్య రంగాన్ని ప్రైవేట్‌పరం చేస్తోందనీ, పాలకులకు బాక్సైట్ తవ్వకాల మీద ఉన్న ప్రేమ ప్రజలపై లేదనీ అంటున్నారు* మండి నాగమణి**

ఆదివాసుల వెనుకబాటుతనం... సర్కారు అలసత్వం వెరసి ఇప్పుడు విశాఖ మన్యంలో చావు బాజాలు మోగుతున్నాయి. ఇంకా పలు రకాల వ్యాధులతో ఆదివాసుల ప్రాణాలు ఊగిసలాడుతున్నాయి. ముందస్తు ప్రణాళికతో చర్యలు తీసుకోవాల్సిన ప్రభుత్వం నిర్లక్ష్యం వహించడం వల్ల ఏ గూడెంలో చూసినా మలేరియాతో పాటు విష జ్వరాలు, ఇతర వ్యాధులతో మూలుగుతున్నారు. రాష్ట్రం మొత్తం మీద మలేరియా జ్వరాల కేసుల్లో సగానికి పైగా ఒక్క విశాఖ మన్యంలోనే నమోదయ్యాయంటే తీవ్రతను అర్థం చేసుకోవచ్చు. జిల్లాలోని ఒక్క ముంచంగిపుట్ట మండలంలోనే గడచిన మూడు నెలల్లో 20 మందికి పైగా జ్వరాలతో మరణించారు.

ఏటా ఏప్రిల్ నుంచి సెప్టెంబర్ దాక మన్య ప్రాంతంలో ఎపెండమిక్ (వ్యాధులు విజృంభించే) సీజన్‌గా పరిగణిస్తారు. వాటి నియంత్రణకు అధికారులు దోమలను నివారించించే యాంటీ లార్వా ఆపరేషన్ మార్చ్‌లోనే చేపట్టాలి. కానీ అందుకు అవసరమైన మందుల పంపిణీలో ప్రభుత్వం తీవ్ర జాప్యం చేసింది. దీంతో జూలై వరకూ ఈ ప్రక్రియ మన్యంలో ఎక్కడా సాగలేదు. జ్వరాలు విజృంభించడానికి ఇది కూడా ఒక కారణమే. జూన్, జూలై మొదటి వారంలో కురిసిన భారీ వానలకు మన్యంలో దోమలు విజృంభించడంతో ఆ సమయంలో మలేరియా కేసులు అధికమయ్యాయి.

జిల్లాలో ఈ ఏడాది 2,505 గ్రామాల్లో వ్యాధుల ప్రభావం ఉంది. ఇందులో జనవరి నుంచి ఆగస్టు 15 వరకు జిల్లాలో 4,93,123 మందికి రక్త పరీక్షలు చేసి 7,128 మందికి మలేరియా సోకినట్లు గుర్తించారు. రాష్ట్ర వ్యాప్తంగా జూలై 31 వరకూ 12,630 మలేరియా కేసులున్నట్లు ప్రభుత్వం నిర్ధారించగా, అందులో 6,624 కేసులు విశాఖ జిల్లాలో నమోదైనవే. అంటే సగానికి పైగా మలేరియా రోగులు మన్యం మూలవాసులు కావడం విశేషం.

ఆరోగ్యం మన్యం వాసులకు అందని ద్రాక్షలా మారింది. డాక్టర్ల కొరత, అద్దె భవనాలు, సౌకర్యాల లేమితో ఆరోగ్య శాఖకు అనారోగ్యం పట్టుకుంది. 108, 104 ఆరోగ్యశ్రీ సేవలు అటకెక్కాయి. జిల్లాలో 85 పిహెచ్‌సిలు, 584 సబ్ సెంటర్‌లు, 15 కమ్యూనిటి హెల్త్ సెంటర్‌లు (సిహెచ్‌సిలు) న్యూట్రిషియన్ క్లస్టర్స్, 35 రౌండ్ ది క్లాక్ ప్రైమరీ హెల్త్ సెంటర్‌లు, 17 అర్బన్ హెల్త్ సెంటర్‌లు, 7 టీచింగ్ హాస్టల్స్ ఉన్నాయి.

అన్ని ఉన్నా అల్లుని నోట్లో శని ఉన్నదన్నట్లుగా, పలు రోగాలకు వైద్యం అందించేందుకు స్పెషలిస్ట్ డాక్టర్లు లేరు. కాంట్రాక్ట్ పద్ధతిలో ప్రైవేట్ వైద్యుల సేవలను వినియోగించుకుని, వారికి ప్రభుత్వ నిబంధన ప్రకారం డబ్బులు చెల్లించేలా ఏర్పాట్లు చేస్తున్నామని ప్రభుత్వం చెప్పుకొచ్చినా అది కార్యరూపం దాల్చలేదు. ప్రభుత్వ ఆస్పత్రుల్లో 72 డయాగ్నాస్టిక్స్ జరిగేలా ఏర్పాట్లు చేస్తామని ఆరోగ్య శాఖ మంత్రి కామినేని చెప్పిన మాటలు నీటి మూటలుగానే మిగిలాయి. హుద్‌హుద్ తుఫాన్ సమయంలో ముఖ్యమంత్రి చంద్రబాబు రు. 25 కోట్లు ఆస్పత్రుల అభివృద్ధికి ప్రకటించారు. అవి నేటికి విడుదల కాకపోవడం గమనార్హం.

ఆదివాసుల వెనుకబాటుతనం వారికి శాపంగా మారింది. వారు నాటు వైద్యానికే ఎక్కువ ప్రాధాన్యతనిస్తున్నారు. ఆదివాసుల్లో వైద్యం పట్ల సరైన అవగాహన కార్యక్రమాలు చేపట్టకపోవడం, పలుచోట్ల అందుబాటులో ఆస్పత్రులు లేకపోవడం, కొన్నిచోట్ల ఉన్నా అక్కడికి వెళ్లడానికి ఆసక్తి చూపకపోవడం, సరైన పారిశుధ్య కార్యక్రమం ప్రభుత్వం అమలు జరపకపోవడం, వంటి వాటికి తోడు ఇంటి పరిసరాల్లోనే దోమలు ఆవాసం ఉండేందుకు వీలైన మురుగు, పశువుల శాలలు, వాటి వ్యర్థాలను నిల్వ ఉంచడం వంటివి చేస్తున్నారు.

వీటి విషయంలో మెరుగుదల తీసుకురావడానికై స్థానిక సంస్థల అధికార యంత్రాంగం దృష్టి సారించాల్సి ఉంది. కోట్లాది రూపాయలు మంజూరవుతున్నా ఆదివాసి ప్రాంతాల్లో వైద్య సేవలు అందక మరణాలు సంభవిస్తున్నాయి. తిండికిలేనివారు వైద్యం కోసం ఎలా ఖర్చు చేయగలరు? అనే యోచన పాలకులకు లేదు.

నిర్వహణ, సదుపాయాలు బాగా లేవంటూ ప్రభుత్వం వైద్య సంస్థలను మూసేసి, ప్రజారోగ్యాన్ని ప్రైవేట్ కార్పొరేట్ రంగ జలగలకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ధారదత్తం చేసి, చేతులు దులిపేసుకుంటున్నాయి. పాలక వర్గాల స్వభావం అర్థమైతే వారి నిర్వహణలోని ప్రభుత్వ రంగం మీద భ్రమలేమి పెట్టుకోనక్కరలేదు.

మన దేశంలో, ముఖ్యంగా తెలుగు రాష్ట్రాల్లోని అన్ని జిల్లాల్లో, ప్రధానంగా ఆదివాసి ప్రాంతాల్లో వర్షాకాలం అంటే ప్రజలకు ప్రాణగండమే. ఏటా మలేరియా మహమ్మారి వల్ల మరణిస్తున్న వారి సంఖ్య అధికంగా ఉంటుంది. ఇటీవలే ఢిల్లీకి చెందిన 'తెహల్కా' ఫోటో జర్నలిస్టు తరుణ్ శరావత్ సైతం ఆదివాసి జీవితాలపై పరిశోధన కోసం వెళ్లి మలేరియా బారినపడి చనిపోయారు. మావోయిస్టు ఉద్యమ కారులు సైతం మలేరియాకు బలైపోయారు. సాయుధ బలగాలు కూడా దీనికి మినహాయింపేమి కాదు. అయితే అతి తక్కువ ఖర్చుతో లభించే మందు సాధారణ మలేరియాను నయం చేయగలుగుతుంది. అదిసైతం అందుబాటులో లేక, కొనలేక ఏటా వందలాది విలువైన ప్రాణాలు గాలిలో కలిసిపోతున్నాయి.

118 ఏళ్ల క్రితమంటే ఈ జ్వరాలకు కారణం తెలియదు. ఇటాలియన్‌లో 'మలే అంటే చెడు అని, 'ఏరియా' అంటే గాలి అని అర్థం. ఈ జ్వరాలకు చెడు గాలులే కారణమని అంతవరకు పరిశోధకులు భావించారు. 1895లో హైదరాబాద్ రావడానికి ముందే మలేరియాకు, దోమలకు సంబంధం ఉందని విశ్వసిస్తున్న రోనాల్డ్ రాస్ బేగంపేటలోని పరిశోధన సంస్థలో 1897 జూన్‌లో 20 దోమలను కల్చర్ చేసి పెంచాడు.

ఆగస్టులో హుస్సేన్ ఖాన్ అనే మలేరియా రోగగ్రస్తుని ద్వారా ఎనిమిది దోమల రక్తంలోకి పరాన్నజీవి ప్రవేశించినట్లు కనిపెట్టారు. దోమలే మలేరియా వ్యాధికి మూలమని ఆగస్టు 20న ప్రపంచానికి చాటాడు.

దోమ కడుపులో మలేరియా పరాన్నజీవి జీవితం తొలిదశ గడుస్తుందని కనుగొన్న రోనాల్డ్ రాస్ దోమకు మనిషి ద్వారా, మనిషికి దోమ ద్వారా మలేరియా పరాన్నజీవి వ్యాపిస్తోందని రుజువు చేశాడు. మరీ ఆ పరిశోధనల కొనసాగింపు మాటేమిటి?

మల్లెపల్లి లక్ష్మయ్య గారన్నట్లుగా పాలకులు, విశ్వ విద్యాలయాలు ఆయనను, ఆయన పరిశోధన ఫలితాలను ఎప్పుడో గాలికి వదిలేశారు. ఫలితంగానే మలేరియా నిర్మూలన పట్ల గానీ, ఆ వ్యాధికి బలైపోతున్న ఆదివాసుల పట్ల గానీ ప్రభుత్వాలకు చిత్తశుద్ధి లేదు. కేవలం కంటితుడుపు చర్యలుగా దోమ తెరలను పంపిణీ చేయడం, యాంటీలార్వా ఆపరేషన్లతో చేతులు దులిపేసుకుంటున్నారు.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు విశాఖ మన్యంలో బాక్సైట్ తవ్వకాల కోసం పడుతున్న ఆరాటంలో ఒకవంతు కూడా మలేరియా నిర్మూలన కోసం దృష్టి పెట్టడం లేదంటే, ఈ పాలకులకు ఆదివాసుల ప్రయోజనాల పట్ల ఆసక్తి లేదని స్పష్టమవుతుంది. అందుకు కారణం వారు పేదలు కావడమే. అందులోనూ వీరికే వచ్చే రోగం మలేరియా. దోమలు దూరని ఉక్కు కోటల్లాంటి ఏసి భవనాల్లో, ఫాం హౌస్‌ల్లో, గ్రీన్ హౌస్‌ల్లో ఉండే పాలకులకు పట్టదు.

ఒకవేళ పొరపాటున ఎక్కడైనా దోమ (ఆదివాసి గ్రామీణ ప్రాంతాలలో పర్యటనల సందర్భంగా) కుట్టి మలేరియా సోకినా, ఆఘ మేఘాల మీద తరలించి నిపుణులైన డాక్టర్ల చేత చికిత్స చేయించగల యంత్రాంగం ఉంది మరీ! వైద్య సౌకర్యాలు లేని, ఉన్నా అందుబాటులోకి రాని, పరిసరాల శుభ్రత కొరవడిన మురికివాడ ప్రజలు, ఆదివాసులుకు ఈ వ్యాధి సోకితే మరణమే తప్పా! మరో మార్గం లేదు. ఉన్నా ఈ అట్టడుగు వర్గాల తాహతుకు మించినది.

ఇదీ ఆదివాసి ప్రాంతాల్లోనే పరిమితమైన ధోరణి మాత్రమే కాదు. కొంత హెచ్చు తగ్గులతో దేశమంతా ఇలాంటి పరిస్థితే నెలకొని ఉన్నదని తరచు బయటపడుతున్న దారుణ ఉదంతాలు తెలియ చెపుతున్నాయి. ఈ మధ్యే గుంటూరు ప్రభుత్వాసుపత్రిలో మూషికాలు కొరకేసిన కారణంగా నెలలు నిండని బాలుడు మృత్యువాత పడ్డాడు. అత్యున్నత స్థాయి అధికార గణమంతా కొలువు దీరిన ఢిల్లీలో ప్రభుత్వ, ప్రైవేట్ ఆసుపత్రులు అవినాష్, అమనేశర్మ అనే ఇద్దరు పిల్లలను పొట్టన పెట్టుకున్నాయి. ప్రపంచీకరణ ద్వారా భారతదేశం ఓ ప్రత్యేక పరిస్థితిని ఎదుర్కొంటోంది. భారత రాజ్యం ఉదారీకరణ, ప్రైవేటీకరణ ఎజెండా అమలులో భాగంగా విద్య, వైద్యం, పారిశ్రామిక, నిర్మాణ రంగాల్ని, సామాజిక బాధ్యతలేని ప్రైవేట్ కార్పొరేట్ శక్తుల చేతుల్లో పెట్టి సంక్షేమం నుంచి రాజ్యం తప్పుకోవడం, తిరిగి ప్రైవేట్ రంగాన్ని రక్షించే బాధ్యతను రాజ్యం తీసుకోవడం జరుగుతోంది. లాభార్జనపై దృష్టి పెరగడం, ఆ క్రమంలో నైతిక విలువలకు తిలోదకాలొదలడం దాదాపు అన్ని రంగాల్లోనూ పెరిగినా వైద్య రంగంలో ఇది శ్రుతిమించిన దాఖలాలు కనపడుతున్నాయి. మనుషులు సహజాతాలను కోల్పోయి, రోబోలుగా మారుతున్న వైనం వెల్లడవుతోంది. వైద్య, విద్య అంగట్లో సరుకయ్యాకే వైద్యులు వ్యాపారులయ్యారు. కార్పొరేట్ వైద్యం లాభాలార్జించిపెట్టే పెద్ద బిజినెస్‌గా మారింది.

లాభం తప్ప ప్రాణం గురించి పట్టని కార్పొరేట్ ఆసుపత్రుల బారి నుంచి ఇక జనానికి విముక్తి లభించే అవకాశం లేదని ఇటీవలే రాష్ట్ర వైద్య ఆరోగ్య శాఖ మంత్రి కామినేని శ్రీనివాస్ ప్రభుత్వాసుపత్రులను ప్రైవేట్‌కు ఇస్తున్నట్లు ప్రకటించారు. ఇప్పటికే కొన్ని జిల్లాలలోని ప్రభుత్వ ఆసుపత్రులను అపోలో యాజమాన్యానికి అప్పగించారు. రాష్ట్రంలోని మిగిలిన ఆసుపత్రులను కూడా ప్రైవేట్ సంస్థలకు అప్పగించడానికి ఎంఒయూలను కుదుర్చుకోనుంది. ఈ మధ్యే నీతి ఆయోగ్ కేంద్ర ఆరోగ్య శాఖకు రాసిన లేఖ చదివితే అర్థమవుతుంది. ప్రస్తుతం ప్రజారోగ్య రంగానికి జిడిపిలో ఖర్చు చేస్తున్న ఒక శాతం మించి నిధులు వెచ్చించడం సాధ్యం కాదని ఆ లేఖ చెపుతున్నది.

2020 నాటికి జిడిపిలో 2.5 శాతాన్ని ప్రజారోగ్యానికి కేటాయించాలన్న తాజా జాతీయ ఆరోగ్య విధానం ముసాయిదా లక్ష్యాలను సవరించుకొమ్మని ఆ లేఖ సూచిస్తున్నది. రోగులకు మందులు, చికిత్స, ఇతర పరీక్షలు అన్నీ బీమా రంగం ద్వారానే సాగాలంటున్నది. అంటే ఇప్పుడు దేశమంతటా వైద్య రంగంలో కనిపిస్తున్న జాఢ్యం రానున్న కాలంలో మరింత ముదురుతుందనడంలో సందేహం లేదు.

వాస్తవానికి ఇతర దేశాలతో పోల్చితే, మనదేశంలో ప్రజారోగ్యంపై పెట్టే పెట్టుబడులు చాలా తక్కువని జాతీయ ఆరోగ్య విధానం ముసాయిదా గణాంకాలతో సహా వివరించింది. దీన్ని పెంచాల్సిన అవసరం ఉన్నదని చెప్పింది. నీతి ఆయోగ్‌లోని పెద్దలు మాత్రం అందుకు విరుద్ధంగా, కార్పొరేట్ శక్తుల ప్రయోజనాలకు అనుగుణంగా ఆలోచిస్తున్నారు. ప్రజారోగ్యాన్ని ప్రైవేట్ పరం చేసేందుకు ప్రణాళికలు రచిస్తున్నారు. ఈ విషయంలో జనం మేల్కొని ప్రభుత్వాలను గట్టిగా నిలదీయకపోతే, ఈ పాటి వైద్య సదుపాయాలు కూడా భవిష్యత్తులో దుర్లభమవుతాయి.

*(రచయిత ఆదివాసి ఉద్యమ కార్యకర్త)* వీ

పాఠకులు ఫిర్యాదులు, సమాచారం కోసం కార్యాలయానికి పనిదినాల్లో ఉదయం 10:30 నుండి సాయంత్రం 6.00 గంటలలోగా స్వయంగా లేదా ఫోన్ ద్వారా సంప్రదించవచ్చు. మిగతా సమయాల్లో ఫోన్ చేస్తే అది ఫ్యాక్స్‌లోకి వెళ్లి మీకు జవాబు రాదు. అప్పుడు మీరు ఫోన్ ఎత్తికూడా మాట్లడడంలేదని అనుకునే అవకాశం ఉంది. ఇది గమనించగలరు.

# అలుపెరుగని విప్లవ యోధుడు యాకోవ్ స్వెర్డ్‌లోవ్ - 2

*బోల్షివిక్ పార్టీ నాయకుడు, విప్లవానంతర రాజ్యాంగ నిర్మాత స్వెర్డ్‌లోవ్ జీవితాన్నీ, కార్యాచరణనూ వివరిస్తున్నారు*

**ఎన్.వి.ఎస్. నాగభూషణ్**

**జార్ రెండో నికొలస్, అతని కుటుంబం హత్యలో స్వెర్డ్‌లోవ్ పాత్ర ఉందా?**

చాలా మంది జార్ రెండో నికొలస్, అతని కుటుంబం హత్యలో స్వెర్డ్‌లోవ్ ప్రముఖ పాత్ర వహించాడని చెప్పారు గానీ, అవన్నీ నకిలీ చారిత్రక కథనాలు తప్ప వేరు కాదు. 1990లో మాస్కో నాటక రచయిత ఎడ్వర్డ్ రడ్జిన్‌స్కీ రాసిన పుస్తకంలో 1918 జూలై 16న స్వెర్డ్‌లోవ్ ఈ హత్యలకు ఆజ్ఞలు జారీ చేసినట్లుగా రాశాడు. ఒక్క ఈ పుస్తకం మాత్రమే కాదు, అతడు రాసిన ఇంకొన్ని పుస్తకాలు కూడా నకిలీ చరిత్ర కథనాలే తప్ప, వాస్తవ చరిత్రలు కావని చరిత్ర పరిశోధకులు చెప్పారు. యూరీస్లెజ్‌కిన్ రాసిన ది జెవిష్ సెంచరిలో కూడా ఇదే విషయం చెప్పబడింది. అంతర్యుద్ధం ప్రారంభంలో 1918 జూన్‌లో లెనిన్ పై హత్యలకు ఆజ్ఞలు జారీ చేశాడనీ, ఈ ఆజ్ఞలను ఫిలిప్ గొలోష్చెకిన్, యారొవ్‌స్కీలకు ఇచ్చినవాడు స్వెర్డ్‌లోవ్ అనీ యూరీస్లెజ్‌కిన్ తన గ్రంథంలో చెప్పాడు.

1922లో రష్యన్ తెల్ల జనరల్ మిహాయిల్ ది తెరిఖ్స్ అనేవాడు రాసిన గ్రంథం "The murder of the Tsar's family and members of the House of the Roman of in usals" అనేదాంట్లో ఈ హత్యలని రష్యా వ్యతిరేక యూదుల కుట్ర అని చెప్పాడు. ఇందులో స్వెర్డ్‌లోవ్ నిక్‌నేమ్ 'యంకెల్'గా పేర్కొనడం జరిగింది. గొలోష్చెకిన్ ఏమో ఈ నిక్‌నేమ్‌ను 'Issac'గా చెప్పాడు. ఈ పుస్తకం ఆధారంగా 'ఓమ్స్' కోర్టులో జరిగిన విచారణలో నికోలాయ్ సొకోలోవ్ అనే ప్రత్యేక దర్యాప్తు అధికారి తన వాదనలో – రష్యన్ అంతర్యుద్ధ సమయంలో ఆ ప్రాంతం తెల్ల ప్రభుత్వం అధీనంలో ఉన్నప్పుడు ఈ హత్యలు జరిగాయని వాదించాడు. చూస్తే ఇవన్నీ పరస్పర విరుద్ధంగా ఉన్నట్లు ఎవరికైనా అర్థమవుతుంది కదా!

అయితే పై కథనాలన్నింటికీ లియోట్రాట్స్కీ రాసిన వృత్తాంతం ఆధారం. అతను తన డైరీల్లో రష్యన్ అంతర్యుద్ధం తర్వాత, ఆ ప్రాంతం నుంచి తిరిగి వచ్చాక ట్రాట్స్కీ తాను స్వెర్డ్‌లోవ్‌తో జరిపిన సంభాషణ ఆధారంగా రాశానని చెపుతున్న కథనమే. దాంట్లో ట్రాట్స్కీ ఇలా రాశాడు.

'ఇంతకీ జార్ ఎక్కడ?' – ట్రాట్స్కీ

'ఏముంది చంపేశారు.' – స్వెర్డ్‌లోవ్

'అతని కుటుంబం ఎక్కడ?' – ట్రాట్స్కీ

'కుటుంబం కూడా అతనితోనే.' – స్వెర్డ్‌లోవ్

'మొత్తం అందరూనా?' – ట్రాట్స్కీ

'మొత్తం. ఇంతకీ నీ మనసులో ఉన్నది ఏమిటి?' – స్వెర్డ్‌లోవ్

'ఈ నిర్ణయం ఎవరిది?' – ట్రాట్స్కీ

'మాదే. ఇల్యీచ్ అంచనా ప్రకారం వారిలో ఉరితీయకుండా ఎవరిని ఉంచరాదని' – స్వెర్డ్‌లోవ్

అయితే ఈ వాదానికి ఎలాంటి ఆధారం లేదని కోర్టులో తేలింది. అందువల్ల ట్రాట్స్కీ చెప్పిన అబద్ధాల పరంపరలో దీన్ని కూడా ఒకటిగా పరిగణించాలి.

లెనిన్ ప్రాణాలపై జరిగిన దాడి సందర్భంగా, విప్లవ ద్రోహులపై పెల్లుబికిన ఆగ్రహ జ్వాలలకు పదుల, వందల మందిపై జనం దాడులు చేశారు. ఆ దాడుల్లో కొన్ని డజన్ల మంది (బహుశా కొన్ని వందల మంది) మరణించారు కూడా. ఈ ఆగ్రహ జ్వాలలు ఎంత తీవ్రంగా ఉన్నాయంటే, చివరికి మృత్యుశయ్యపై ఉన్న లెనినే స్వయంగా కలగజేసుకుని, జనాన్ని శాంతింపజేయాల్సి వచ్చింది. పైన పేర్కొన్న విప్లవ ద్రోహుల్లో రాజరిక వాదులు కూడా ఉన్నారు. వారికి కేంద్ర బిందువు జార్ కుటుంబమే. అందువల్ల జనం ఆగ్రహానికి జార్ కుటుంబం కూడా లక్ష్యం కావడంలో ఆశ్చర్యం లేదు. ఇందుకోసం ప్రత్యేకంగా లెనిన్ ఆజ్ఞలు జారీ చేయాల్సిన అవసరం లేదు. నిజానికి లెనిన్‌కు ఏ ఒక్కరి మీద వ్యక్తిగత ద్వేషం లేదన్నది జగమెరిగిన సత్యం. విప్లవ వ్యతిరేకుల పట్ల ఆయనకు గల ద్వేషం కేవలం సిద్ధాంతపరమైందే తప్ప, వ్యక్తిగతమైంది కాదు. లెనిన్‌ని తీవ్రంగా ద్వేషించిన ఎందరో బడా పెట్టుబడిదారులూ, వారి తాబేదారులూ, ఆయన్ని కలిసి సంభాషించిన తర్వాత, తమ అభిప్రాయాల్ని మార్చుకున్న సందర్భాలెన్నో ఉన్నాయి. (ఆల్బర్ట్ రీస్ విలియమ్స్ రాసిన 'రష్యాలో విప్లవ దినాలు' పుస్తకం పేజీ 48 చూడండి – రచన) అంచేత జార్ కుటుంబాన్ని చంపమని లెనిన్ ఆజ్ఞాపించడం గాని, దాన్ని స్వెర్డ్‌లోవ్ అక్షరాల అమలు జరపడం గాని కేవలం కట్టు కథ, ఊహా జనితం. ఇలాంటి కట్టు కథలెన్నో విప్లవ యోధుల పట్ల ప్రచారంలో ఉండడం అందరికీ తెలిసిందే. ఏమైనా పేన పేర్కొన్న ట్రాట్స్కీ వ్యాసంలో ట్రాట్స్కీయే చెప్పినట్లు స్వెర్డ్‌లోవ్ తన స్థానంలో ఉండి మరీ, విప్లవానికి ఎక్కడైనా హాని జరుగుతుందేమోనని వేయి కళ్లతో పరిశీలిస్తూ ఉంటాడు. అలాంటి సంఘటన దేనినీ అతడు క్షమించడు. తప్పక ప్రతిచర్య తీసుకుంటాడు. విప్లవం పట్ల అతనికి గల అంకితభావం అలాంటిది. ఈ సందర్భంలో లునచార్స్కీ చెప్పిన ఈ కింది మాటలు తప్పక మనం గుర్తుంచుకోవాలి. అతడిలా అన్నాడు.

'మానవ పరిమితుల్ని మించిన రీతిగా అలసట లేని కార్యకర్తల్ని పెద్ద సంఖ్యలో విప్లవం బయట పెట్టిందని చెప్పినట్లయితే, అలాంటి యోధులందరికన్నా ముందు వరసలోనే స్వెర్డ్‌లోవ్ తప్పనిసరిగా నిలుస్తాడని చెప్పగలను. ఎప్పుడూ మానవుడు భోజనం చేస్తాడో, నిద్రిస్తాడో నాకైతే తెలీదు. అతడు రాత్రీ, పగలూ కూడా పనిమీదే ఉంటాడు.'

లూనచార్స్కీ చెప్పినట్లు, నిరంతరం పనిమీద ధ్యాసతోనే అతడు ఉంటాడు. అతడి పని విధానం ఈ కింది విధంగా ఉంటుంది.

విప్లవానికి సంబంధించిన అన్ని సమస్యల్నీ అతడు, పై నుంచి కాక,

లేదా సాధారణ సైద్ధాంతిక పరిశీలనతోటీ కాక, వీటన్నింటికీ దూరంగా, కింది స్థాయి నుంచి, పార్టీ అవసరాల ఒత్తిడిని బట్టి, పరిష్కరిస్తాడు! పార్టీలో కొత్తవైన రాజకీయ సమస్యలు చర్చించే సందర్భంలో అప్పుడప్పుడూ అతడు మౌనంగా ఉన్నట్లు, అక్కడ జరిగే విషయాల్ని స్వీకరించడానికి సిద్ధంగా లేనట్లు కనిపించేవాడు. నిజానికతడప్పుడు చర్చల క్రమంలో మానసికంగా సమాంతర మార్గంలో పనిచేస్తూ ఉండేవాడు. తన పనికి స్పష్టంగా అతడు ఇలా రూపొందించుకునేవాడు. ఈ పనిని నిర్వహించడానికి అందుబాటులో ఎవరున్నారు? ఫలానా అతడు ఇప్పుడెక్కడ నియమించబడి పని చేస్తున్నాడు? ఈ సమస్యని ఎలా చర్చలో లేవనెత్తాలి? ఇంకా దీన్ని ఇతర లక్ష్యాలతో ఎలా జతకలపాలి? పార్టీ మరో రాజకీయ నిర్ణయం తీసుకోక మునుపే, అలాగే నిర్వహణ పరమైన సమస్యగా మారక మునుపే, ఇంకా మనుషులు సమస్యగా మారక మునుపే, అతడు సుదూర ఆలోచనలతో కూడుకున్న సూచనలతో సిద్ధంగా ఉండేవాడు. దానితో సమస్య స్వభావం మారిపోయేది. తన విజ్ఞాన సర్వస్వం అనదగిన ఆయా వ్యక్తుల వ్యక్తిగత వివరాలకు సంబంధించిన పరిజ్ఞానంతో అతడు, ఆ సూచనలు చేసేవాడు.

ప్రతి సమస్యనూ సైద్ధాంతిక, రాజకీయ అవసరాల కోణం నుంచి చేరడం కన్నా, నిర్వహణా పరమైన కోణం నుంచి అయితే చాలా స్పష్టంగా, తేలిగ్గా చేరవచ్చు. ఆ మొదటి రోజుల్లో, సోషలిజంలోకి మారుతున్న ఆ కాలపు ప్రత్యేక స్థితిలో, ఈ పరిస్థితుల్ని మేమంతా చూస్తూండిపోయాం. అవి అలా వేగంగా నడిచిపోయాయి, వాటిని నడిపించినట్లుగా. కానీ ఆ రోజుల్లో కావాల్సినవి ఊహల్లో ఉంటే, ఉన్నవి అతి తక్కువ సామగ్రి, మానవ వనరుల కొరత అవడం వల్ల, ఈ రెంటి మధ్యగల తేడాని గమనిస్తే ఇప్పటికన్నా, ఆ రోజుల్లో సాధించిందే ఎక్కువని దానంతటదే తెలుస్తుంది. ఇది చాలా స్పష్టంగా వివరంగా అర్థమయ్యాక, విషయాలన్నీ ఆచరణాత్మక పరిష్కార దృక్కోణంలోకి వచ్చాక, మాలో చాలా మంది తలలు ప్రశ్నార్థకంగా తిరిగేవి. అప్పుడు మాలో ఒకడు అడిగేవాడు కూడా. 'బాగుంది మరి నువ్వేమనుకుంటావ్, జాగచ్ మిహాయ్‌లోవిచ్?'

ఇకప్పుడు స్వెర్డ్‌లోవ్ తన పరిష్కారాన్ని అందించేవాడు. అతని దృష్టిలో 'మనం ఇచ్చిన హామీ చాలా తేలిగ్గా నెరవేరుతుంది' చాలా జాగ్రత్తగా ఎంచుకున్న బోల్షివిక్కుల బృందం అక్కడికి పంపబడేది. వారికి అవసరమైన సూచనలు ఇవ్వబడేవి. అంతేగాక, వారికి తగిన సంబంధాలు కల్పించబడేవి. అలాగే వారిపై తగినంత శ్రద్ధ ఉంచబడేది, దాంతో పాటు వారికి అవసరమైన వస్తు సహాయం అందించబడేది – అంతే, ఆపని పూర్తయిపోయేది. ఈ పంథాలో పని పూర్తి కావాలంటే ఒకటి మాత్రం పూర్తిగా ఉండాలి. అదే ఆత్మవిశ్వాసం. అదిగనుక ఉంటే, ఏ లక్ష్యాన్ని అయినా అందుకోవడానికి అవకాశం ఉంది. అలాగే ఎలాంటి కష్టాన్ని అయినా అధిగమించవచ్చు. ఎప్పటికీ తరిగిపోని శక్తి అయిన భవిష్యత్తుపై ఆశ, నమ్మకం, ఈ క్రమంలో శక్తివంతంగా పనిచేసి, స్వెర్డ్‌లోవ్‌కి సదరు పనిలో ఉపయోగించేందుకు అంతర్గత శక్తినందించేవని ట్రాట్స్కీ తన వ్యాసంలో, 1925లో చెప్పాడు.

అయితే ఏ క్లిష్ట సమస్య వచ్చినా పార్టీలోని ముఖ్య నాయకులంతా స్వెర్డ్‌లోవ్ వంకే ఎందుకు చూసేవారు? మరి స్వెర్డ్‌లోవ్ అలాంటి క్లిష్ట సమస్యలన్నింటినీ విజయవంతంగా ఎలా అధిగమించగలిగేవాడు? ఈ ప్రశ్నలకు సూటి సమాధానం ఏమంటే, స్వెర్డ్‌లోవ్‌కి గల నిర్వహణా సామర్థ్యం, దానికితోడు పార్టీపై అతడికి గల నిర్నిబంధమైన పట్టు. పార్టీలో స్వెర్డ్‌లోవ్‌కు అంతటి పట్టు ఎలా వచ్చింది? అందుకు దారి తీసిన కారణాలేమిటి? ఈ విషయాలు గ్రహించడానికి ఈ కింది ఉదంతాన్ని పాఠకులు పరిశీలిస్తే, పార్టీలో, చరిత్రలో స్వెర్డ్‌లోవ్ ప్రాముఖ్యత ఏమిటో బోధపడుతుంది.

అక్టోబర్ విజయం తర్వాత రైతాంగంలో పలుకుబడి కలిగిన వామపక్ష సోషలిస్టు రివల్యూషనరీలు (వామపక్ష ఎస్ఆర్‌లు) బోల్షివిక్కులతో మిత్రత్వం నెరపుతూ, ప్రభుత్వంలో కూడా చేరి, మిశ్రమ ప్రభుత్వాన్ని ఏర్పర్చడంలో తోడ్పడ్డారు. అయితే ప్రజలకు తామిచ్చిన వాగ్దానాల మేరకు బోల్షివిక్కులు ఏ విప్లవాత్మక చట్టాలు తీసుకురావడానికి ప్రయత్నించినా, వామపక్ష ఎస్ఆర్‌లు ప్రతిఘటిస్తూ, అడుగడుగున అడ్డు తగలసాగారు. చివరికి ఆ చర్యలు ఎక్కడికి దారితీశాయంటే, సాయుధ సంఘర్షణల దాక. దాన్ని ఎదుర్కోవడానికి పార్టీ కార్యకర్తల్ని సిద్ధం చేయాలంటే పార్టీలో బలమైన కేంద్రకం ఉండాలి. కానీ అప్పటికి పార్టీ కేంద్రం కొంత అస్పష్టంగా నిర్వచింపబడింది. దాంతో బలమైన కేంద్రం అవసరాన్ని గుర్తించిన స్వెర్డ్‌లోవ్, వెంటనే అందుకు అవసరమైన చర్యలు తీసుకోవడంతో, కార్యకర్తలు తగు విధంగా స్పందించడానికి మార్గం ఏర్పడింది. దీన్ని మరొక విధంగా వివరించాలంటే, ఉదాహరణకు, ఒక ప్రాంతంలో ఒక పెద్ద గ్రూపుగా ఉన్న బోల్షివిక్ పార్టీ కార్యకర్తలు, స్పష్టంగా చెప్పాలంటే దూర ప్రాచ్యంలో వరసగా కొన్ని సంఘటనలు జరిగాయి. ఆ ప్రాంతానికి సైనిక దళాల చీఫ్ కమాండర్‌గా మురావియేవ్ నియమించబడిన తర్వాత, అక్కడి సోవియట్‌లో వామపక్ష ఎస్ఆర్‌ల సభ్యుడొకరు కొంత ఆధిక్యతతో కార్యదర్శిగా ఎన్నుకోబడ్డాడు. నిజానికి అక్కడ బోల్షివిక్కులే మెజారిటీలో ఉన్నారు. అయితే వారిలో ఎక్కువ మంది కొత్తగా చేరినవారు. అయినప్పటికీ వామపక్ష ఎస్ఆర్‌ల సభ్యుడు ఎన్నిక కావడానికి కారణం ఆ ప్రాంతంలో బోల్షివిక్కులకూ, వామపక్ష ఎస్ఆర్‌లకూ మధ్యగల సంబంధాలు అస్పష్టంగా ఉండడం వల్లే కొందరు బోల్షివిక్కులు, వామపక్ష ఎస్ఆర్‌ల అభ్యర్థికి ఓటు వేశారన్నమాట! బోల్షివిక్ పార్టీ – తన సభ్యుల్ని కలిపి ఉంచడం, వారిలో క్రమశిక్షణను గట్టిగా నెలకొల్పి ఉండకపోవడం, ఇతర పార్టీల విషయంలో, అది మిత్రపార్టీ అయినప్పటికీ ఎలా వ్యవహరించాలో తెలియజెప్పకపోవడం, సంస్థల్లోని సభ్యుల్ని కలిపి ఉంచే యంత్రాంగం లేకపోవడం – వగైరాల వల్లనే ఈ నష్టం సంభవించింది.

పై విధంగా పార్టీ దెబ్బతిన్న అనుభవంతో చేపట్టిన చర్యల వల్ల, ప్రాథమికమైన, అత్యంత ప్రాముఖ్యత కలిగిన మార్పు ఏమంటే – బలమైన కేంద్రం ఏర్పడడం! ఇదంతా జరిగింది కేవలం రెండు, మూడు రోజుల్లోనే కావడం గమనార్హం! ఒక అధికార పార్టీకి వ్యతిరేకంగా మరొక అధికార పార్టీ సాయుధ సంఘర్షణలకు దిగిన ఆ రోజుల నుంచే, ఎప్పుడైతే వ్యక్తిగత సంబంధాలు హఠాత్తుగా ప్రశ్నార్థకమయ్యాయో, ఇంకా ఇప్పుడూ ఆయా శాఖలకు చెందిన అధికారుల్లోనే తీవ్రమైన కలవరం మొదలైందో అప్పుడు కమ్యూనిస్టు శక్తులన్నీ, అన్ని రకాల సంస్థల్లోనూ, ఫ్యాక్టరీల్లోనూ, శాఖల్లోనూ, ఒకరి దగ్గరికి ఒకరు వేగంగా జరిగి, వామపక్ష ఎస్ఆర్‌లతో అన్ని సంబంధాల్ని తెగతెంచుకుని, సాయుధ పోరాటానికి దిగారు. శక్తివంతమైన, అణుసదృశ్యమైన కమ్యూనిస్టు కేంద్రానికి (బాంబుకు) ఫ్యూజ్ తగిలించబడింది. ఇది చివరికి అన్ని సైనిక సెక్షన్లలోనూ, పార్టీ,

రాజ్యంలోని పరిణామాలు కూడా ఇలాగే జరిగి, ఇదో అసాధారణ ఉద్యమరూపం తీసుకుంది. పార్టీ శక్తులన్నీ చిన్న చిన్న బృందాలుగా విభజింపబడి, అప్పటికింకా సంస్థారూపం తీసుకొని రాజ్య యంత్రం అంతటా పంపిణీ కావడం జరిగింది. ఈ విధంగా వామపక్ష ఎస్ఆర్‌ల దెబ్బకు పార్టీ బంధం విస్తృత రూపం తీసుకుని, ప్రభుత్వ శాఖల సంబంధాలతో విశాల భూభాగానికి విస్తరించడమే కాక, బోల్షివిక్ పార్టీ శక్తులన్నీ ఒకరితో మరొకరు వెల్డింగ్ చేసినట్లుగా అతుక్కుపోయారు. ఆ విధంగా ప్రతిచోటా కమ్యూనిస్టు కేంద్రకం శక్తివంతమైన రూపాన్ని సంతరించుకుని, అన్ని రకాల సంస్థలోని పార్టీ శక్తుల అంతర్గత జీవితంపై పార్టీ నాయకత్వం పట్టు సాధించింది.

పై విధంగా బోల్షివిక్ పార్టీలోని మెజారిటీ కార్యకర్తల్లో మార్పు వచ్చి, మొదటి సారిగా వారికి తమ పార్టీ పాలక సంస్థగానూ, అలాగే కార్మికవర్గ రాజ్య నాయకునిగానూ, రాజకీయంగానే కాక, నిర్వహణా పరమైన కోణంలో కూడా తమ పార్టీ కార్మికవర్గ నియంతృత్వాన్ని అమలు పరిచే పార్టీగా తన పాత్రను నిర్వహించాలన్న పట్టుదల ఆరోజుల్లోనే ఏర్పడిందని పలువురు చెప్పడం జరిగింది. ఈ క్రమంలో, సోవియట్ రాజ్య యంత్రంలో తాను ఎలాంటి అధికారిక హోదా పొందాలని పార్టీ భావించిందో, ఆ హోదాకోసం, సంస్థాగతమైన స్వీయ నిబద్ధత కలిగి ఉండేలా, అది అఖిల యూనియన్ల సోవియట్ కార్య నిర్వాహక కమిటీనా, లేదా యుద్ధ మంత్రిత్వ శాఖకు చెందిన గారేజ్ కమిటీనా అన్నదానితో సంబంధం లేకుండా ప్రతిచోటా, పార్టీ తనంతతాను స్వెర్డ్‌లోవ్ సూటి నాయకత్వం కిందికి వచ్చింది.

రాజ్యం, పార్టీ – ఈ రెంటికీ ముడిపడ్డ సంబంధాలపై బలంగా ముద్ర వేసిన ఆ సమయం, అక్టోబర్ విప్లవ విజయానంతరపు మొదటి రోజుల్లోనే వచ్చింది. ఆ సమయంలో పార్టీ నిర్వాహకుడైన స్వెర్డ్‌లోవ్, ప్రాథమికమైన గొప్ప పాత్రను, పార్టీ చరిత్రనంతటినీ మలుపు తిప్పిన పాత్రను పోషించాడు. ఆ సమయంలో ఆచరణకు సంబంధించిన పగ్గాలన్నింటినీ తన చేతుల్లోనే పట్టి ఉంచాడతడు.

అంతకంటే అధికమైన సంక్లిష్టత కలిగిన రోజులు – లెనిన్ ఎస్ఆర్‌ల బుల్లెట్లతో కుప్పకూలిన సమయంలో వచ్చాయి. అప్పుడు స్వెర్డ్‌లోవ్ బాధ్యతలు ఆ రోజుల్లో మరింత విస్తరించి, అధికమైన అప్రమత్తతతో వ్యవహరించాడు. ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్నో, ఇంకెన్నో స్వెర్డ్‌లోవ్ సాధించిన విజయాలు. చరిత్ర ఆ విజయాల్లో అత్యల్పమైన సంఖ్యనే నమోదు చేసింది. అయినా అవి సంఖ్యా మాత్రంతోటే పరిగణనకెక్కేవి కావు. వాటిని మించిన ప్రాముఖ్యత, విప్లవ పరిరక్షణ ప్రాముఖ్యతను అవి కలిగి ఉన్నాయి.

స్వెర్డ్‌లోవ్ చర్యలే కాదు, అతడి వ్యక్తిత్వమూ అలాంటిదే. ఆ వ్యక్తిత్వానికి తగినట్టివే అతడి దుస్తులూ కూడా. లునచార్స్కీ ఆ దుస్తుల గురించి ఒకచోట ఇలా రాశాడు.

'...అతడు ఒకానొక సందర్భంలో తన అంతర వ్యక్తిత్వానికి తగిన దుస్తుల్ని – తల నుంచి పాదాల దాకా ఉన్న తోలు దుస్తుల్ని ఎంపిక చేసుకుని వేసుకోవడం మొదలు పెట్టాడు. మొదట వాటినతడు ఎన్నిక చేసుకోవడానికి కారణం తనకు అవి సౌకర్యవంతంగా ఉన్నాయనే. వాటినతడు ధరించడం ద్వారా వాటికొక గుర్తింపు రావడమేగాక, ఆపై కమిస్సార్‌లో పని ప్రదేశంలో వేసుకునే దుస్తులుగా గుర్తింపు పొందాయి కూడా. చిన్నదైన, ప్రత్యేక ప్రాధాన్యత లేని అతని విగ్రహం ఆ నల్లని తోలు దుస్తుల్లో ఎలా కనిపించేదంటే, నల్లగా నిగనిగ మెరిసేలా జుట్టు బ్రష్ చేయబడ్డ లాబ్రడార్ కుక్కలా అతడు ఇతరుల సేవకోసమే ఉంటూ, ఎల్లప్పుడూ పూర్తి సన్నద్ధత కలిగి, గట్టి పట్టుదలతో పనిచేసే ఔన్నత్యం కలిగిన వ్యక్తిలా అతడు కనబడేవాడు...'

వ్యక్తిగతం అతడెలాంటివాడో కూడా లునచార్స్కీ సరైన అంచనాతో చక్కగా వర్ణించాడు.

'...ఈ మనిషి వజ్రంలాంటి వాడు. అందులోని కౌఠిన్యం పని విషయంలో ఎక్కడా తేడా లేకుండా, ఎవరి యెడలా మెత్తగా ఉండకుండా, మొదటి నుంచీ చివరి వరకూ ఒకే విధంగా కొనసాగేందుకే. ఇతడు వజ్రమే కాకుండా, మంచులాంటివాడు కూడా. ఇతడి నైతిక ప్రవృత్తి కూడా వాటిలాగే పూర్తి స్వచ్ఛతతో కూడిందీ, చల్లనిదీ, అలాగే సూక్ష్మమైనదీ కూడా. ఇతడి పారదర్శకత ఎలాంటిదంటే, అందులో స్వంత కోర్కెలు గానీ, స్వంత అంచనాలు గానీ ఉండవు. అలాగే స్వంత ఆలోచనలూ ఉండవు. అందువల్ల ఇతడు స్వంత మొఖం లేని కార్యకర్త అని చెప్పాలి. ఇతడు ప్రతి విషయం గురించీ అధికారిక అభిప్రాయాలు కలిగి ఉన్నప్పటికీ, సాధారణ ప్రజల అభీష్టాన్నీ, పార్టీ వైఖరినీ ప్రతిబింబిస్తాడు. అతడెప్పుడూ, ఏ ప్రత్యేక విషయాన్నీ ప్రారంభించడు గానీ, సెంట్రల్ కమిటీ నుంచీ, అప్పుడప్పుడూ లెనిన్ నుంచీ వ్యక్తిగతంగా గ్రహించిన విషయాల్ని మాత్రమే ప్రచారం చేస్తాడు. ప్రజల వద్ద ఉపన్యాసించేటప్పుడు అతని ఉపన్యాసాలెప్పుడూ ప్రభుత్వ ముద్ర కలిగి, ప్రభుత్వ పత్రికలలో ముఖ్య వ్యాసాల్లో ఉంటాయి. ప్రతిదాన్నీ జాగ్రత్తగా ఆలోచించాకే చెబుతాడు. ఎంత వరకూ అవసరమో అంతవరకే. అంతకు మించి ఉండదు. ఇందులో నమ్మకాలకు తావులేదు. మేథోపరమైన వాదనలుండవు.'

ఇక ఆరోజుల్లో ప్రతి ప్రభుత్వ చట్టం ఎలా రూపుదాల్చేదో, అందులో స్వెర్డ్‌లోవ్ ఎలాంటి ప్రాముఖ్యతగల పాత్ర నిర్వహించేవాడో కూడా లునచార్స్కీ స్పష్టంగా వర్ణించాడు.

'... ఏదైనా ఒక ప్రభుత్వాజ్ఞ వెలువడే ముందు, మొదట సూచించబడ్డ ఒకచోట ప్రకటన రూపంలో అది నమోదు చేయబడి, ఆపై అక్కడి వారితో చదవబడి, వారి ఆమోదం పొందాక, అప్పుడు స్వెర్డ్‌లోవ్ సామాన్య జనాభిప్రాయాన్ని ప్రతిబింబించే సూచనలు చేస్తాడు. ఆపై అది చర్చించబడి, చరిత్ర సృష్టించేందుకు ప్రభుత్వ చట్టంగా మారుతుంది...'

ఆకారం – స్వెర్డ్‌లోవ్ ఆకారం గురించి చెప్పాలంటే, మధ్యస్థమైన ఎత్తులో, నలుపు కలిసిన రంగులో, పల్చగా సన్నగా ఉంటాడు. అతడి మొహం నీరసంగా, అందులో మాంసమే లేనట్లు పల్చగా ఉండి, ఎముకలు స్పష్టంగా కనిపిస్తాయి. అయితే అతడి శక్తివంతమైన పెద్ద గొంతు, అతడి శరీరం ఎదుగుదలతో పోలికే లేనట్లు ఉంటుంది. ఇతడి ఆకారంతో పోల్చుకుంటే వ్యక్తిత్వం కూడా సంబంధం లేకుండా, అత్యధిక స్థాయిలో సఫలమైన వ్యక్తిగా ఉన్నాడు కదా! ఇతణ్ని చూడగానే ఇతడిపట్ల ఏర్పడే మన వైఖరి కొద్ది క్షణాల్లోనే మారిపోతుంది. ఇక అప్పుడు, అతడి శారీరక ఆకారంలో ఆత్మకశక్తి కలిసి, మొత్తంగా అతడి వ్యక్తిత్వ స్థాయి ఏమిటో మనం గ్రహిస్తాం. అతడి సన్నటి ఆకారం, ప్రశాంతమైన, అధిగమించలేని, లొంగని మానసిక శక్తితో, శక్తివంతమైన, ఎలాంటి పరిస్థితుల్లోనూ తొణకని గొంతుతో అతడి పూర్తి స్థాయి ఆకారం మనముందు ప్రత్యక్షమవుతుంది.

రహస్య జీవితం అనుభవించే రోజుల్లో స్వెర్డ్‌లోవ్ వేరైన వ్యక్తిగా ఉండేవాడు. అప్పుడూ తోలు దుస్తుల్లోనే ఇంకా వాటికింద ఉక్కు కవచంతో, పెద్ద శరీరంతో, నల్లగా, దాడుల నుంచి రక్షణ కోసం, అంతర్యుద్ధం మొదటి సంవత్సరాల్లో అతడు కనిపించేవాడు. ఆ రోజుల్లో లెనిన్ స్వెర్డ్‌లోవ్‌పై ఎంతగా ఆధారపడేవాడంటే, క్లిష్టమైన సందర్భాల్లో ఆయన అప్పుడప్పుడు (మంచిది, ఒక రష్యన్ ఊతపదం) అంటూ ఆయన, 'స్వెర్డ్‌లోవ్ దీన్ని గురించి వారికి చెపుతాడు స్వెర్డ్‌లోవ్ తరహా అధికారంతో. దాంతో సమస్య పరిష్కరించబడుతుంది' అని. స్వెర్డ్‌లోవ్ అంటే తనకెంత ఇష్టమో ఆయన పై మాటల్లో వ్యక్తం చేసేవాడు.

విషాద మరణం – ఇంతటి ప్రాముఖ్యమున్న స్వెర్డ్‌లోవ్ అనూహ్యంగా, ఎంతో ఉజ్వల భవిష్యత్తు ముందుండగా, అతిచిన్న వయసులోనే, కేవలం 34 సంవత్సరాల వయస్సుకే విషాద మరణం పాలు కావడం విప్లవాభిమానులకు, శ్రామిక వర్గానికి, నిజం చెప్పాలంటే ఏ ఒక్కరికన్నా ఎక్కువగా లెనిన్‌కు ఒక శరాఘాతమేనని చెప్పాలి. అయితే ఇంత హఠాత్తుగా స్వెర్డ్‌లోవ్ ఎందుకు మరణించాడు? అతడి మరణానికి దారితీసిన పరిస్థితులేమిటి? ఈ ప్రశ్నలకు జవాబుగా పలువు పలు కారణాల్ని చెబుతున్నారు.

అధికారిక వాదం ప్రకారం ఇన్‌ఫ్లుయెంజ వల్ల అతడు 'ఒరియోల్'లో చనిపోయాడని. 1918లో దేశమంతా ఫ్లూ వ్యాపించియున్న కాలంలో అతడు తన రాజకీయ పరమైన ప్రయాణాలు ఒకదానిలో, ఖార్కివ్ నుంచి మాస్కోకు తిరిగి వచ్చే సమయంలో, బయటి ఉపన్యాసాల సందర్భంగా ఫ్లూ బారిన పడిన అతడు ఒరియోలో చనిపోయాడు. నెక్రోపోలిస్ వద్దనున్న క్రెమ్లిన్ గోడవద్ద అతణ్ని ఖననం చేయడం జరిగింది.

మరికొందరి కథనం ప్రకారం అతడు క్షయ వ్యాధితో మరణించాడని. ఇది స్టాలిన్ కథనం. దాని ప్రకారం స్వెర్డ్‌లోవ్ ప్రవాసంలో ఉండగానే ప్రమాదభరితమైన ఈ వ్యాధి బారిన పడ్డాడని, ఇదే చివరికి స్వెర్డ్‌లోవ్ మరణానికి దారితీసిందనీ. మరికొన్ని కథనాలు కమ్యూనిస్టు వ్యతిరేకపుకార్లు పుట్టించేవారు అల్లిన కథనాలు. ఇలాంటి అబద్ధాల కథకుల్లో అగ్రగణ్యుడు అర్కాదివాక్స్ బర్గ్. ఇతడి వాదం ప్రకారం, ఒరియోత్‌లో కొందరు కార్మికులు తమకుగల యూదు వ్యతిరేకత కారణంగా, యూదు జాతికి చెందిన స్వెర్డ్‌లోవ్‌పై దాడి చేయడంతో స్వెర్డ్‌లోవ్ మరణించాడని. మరో కథకుడు ఇంతకన్నా ఘనుడు. అతడి పేరు తెలీదుగాని, అతడి కథనం ప్రకారం, లెనిన్ పథకాలు నచ్చని స్వెర్డ్‌లోవ్, లెనిన్‌ని చంపబోయి, తనే మరణించాడని. ఇలాంటి కథనాలు ఎంతటి నవ్వు పుట్టిస్తాయో అన్నది ఆ కథకులకు అనవసరం. కలం ఉంది కాబట్టి వారు దాంతో ఎంతటి నీచానికైనా ఒడిగట్టడానికి సిద్ధం. ఇలాంటి వారికి సిగ్గనేది ఏ కోశానా ఉండదు. విప్లవానికి ఏదో రూపేణా హాని కలుగజేయడమే ఇలాంటి వారి జీవిత ధ్యేయం. ఆ ధ్యేయాన్ని సాధించడం కోసం వీరు ఎల్ల వేళలా తమ కలాలకు పదును పెడుతూనే ఉంటారు. ఆ కలాలు కక్కిన ఛండాలాల్ని పాఠకులు భరించలేక ముక్కులు మూసుకున్నా, వీరు పట్టించుకోరు. మరికొన్ని కొత్త ఛండాలాల సృష్టికి వీరు సమాధికోత్సాహంతో నడుంకడతారు! ధన మదాంధులు విసిరిపడేసే ఎంగిలి మెతుకులకు కక్కుర్తిపడే వీరి సంగతి పక్కన పెడితే, విచారకరమైన విప్లవ వీరుడు స్వెర్డ్‌లోవ్ మరణం పట్ల, విద్యావేత్త, బహుముఖ ప్రజ్ఞశాలి అయిన లునచార్స్కీ ఎలా స్పందించాడో చూడండి.

'ఫలానా అధిక శ్రమవల్ల స్వెర్డ్‌లోవ్ అనబడే వజ్రం పగిలి ముక్కలైందని నేను చెప్పజాలను. అదే ప్రధాన కారణం అని చెప్పడం కష్టం. ఏ విప్లవకారుడైనా అలాగే పని చేస్తాడు కాబట్టి, అతడి డాక్టర్లు అతని శ్రమ గురించి తక్కువ అంచనా వేశారని నేను భావిస్తున్నాను. వారి నుంచి ఈ కింది వాదనను నేను తరచుగా విన్నాను. 'మొత్తం మీద అధిక శ్రమ అనేది అతని విషయంలో పెద్ద పాత్రనే వహించింది. కానీ అతని జబ్బుకు దారితీసిన కారణం మాత్రం స్పష్టంగా తెలియడం లేదు. తర్వాత తెలియవచ్చు' అని. నా అభిప్రాయం ప్రకారం వారు చెప్పింది సరికాదని నమ్ముతున్నాను. వారు చెప్పిన వ్యాధి అతడి కణజాలంలో ప్రవేశించింది గానీ, అది ముదరలేదు. అయితే ఇతర ప్రమాదాలు కూడా అతణ్ని చుట్టిముట్టి ఉన్నాయి. వాటన్నింటితోపాటు, అధిక శ్రమ ఇవన్నీ కలిసినందునే అతనికి మరణం సంభవించింది. అతని మరణానికి ప్రధాన కారణం అదే. ప్రాంతీయ పాలన సాగే చోటుల్లో స్వెర్డ్‌లోవ్ వరసగా ఉపన్యాసాలిస్తూ, ఒకచోట ఉపన్యసించిదిచన తర్వాత, తీవ్ర జలుబుకు గురయ్యాడు. అయినప్పటికీ అతడు తన ఉపన్యాసాల పరంపరను ఆపడానికి నిరాకరించి, తన పనిని కొనసాగించాడు. అతడు నిజానికి మానవాతీత లక్ష్యాలను సాధించాలన్న పట్టుదలతో ఇటువంటి వాటిని లెక్క చేయడం ఎన్నడో మానుకున్నాడు. విప్లవకారులు పలువురు, యుద్ధ భూమిలో కాక, ఇతర ప్రదేశాల్లో మరిణించినట్లే, అతడూ పై కారణం వల్ల జబ్బుపడి మరణించాడు. ఈ విధంగా ఇతరులకు సేవ చేయడంలోనే అతడు తన జీవితాన్ని అర్పించాడని చెప్పవచ్చు.

స్వెర్డ్‌లోవ్ మరణించిన ఆ విచారకర క్షణాల్నే ట్రాట్స్కీ 1925లో రాసిన తన వ్యాసంలో ఈ కింది విధంగా సింహావలోకనం చేసుకున్నాడు:

'మేమంతా పొలిట్ బ్యూరో ఒకానొక సమావేశం సందర్భంగా సమకూడినప్పుడు, స్వెర్డ్‌లోవ్ ఇంటివద్ద జ్వరంతో ఒళ్లు కాలిపోతూ ఉన్నాడు. సమావేశం జరుగుతున్నప్పుడూ, నాటి సి.సి. కార్యదర్శి ఇ.డి. స్తాస్సోవ లోపలికొచ్చింది. ఆమె అప్పుడు స్వెర్డ్‌లోవ్ అపార్ట్‌మెంట్ నుండి వచ్చింది. ఆమె మొహం గుర్తించలేనంతగా మారిపోయి ఉంది.

'జాకోబ్ మిహాయ్‌లోవిచ్ బాధపడుతున్నాడు, తీవ్రంగా బాధపడుతున్నాడు' ఆమె అంది. ఇక ఆశ ఏమాత్రం లేదని అర్థం చేసుకోవడానికి పరిపడా కంగారు ఆమె మొహంలో కనబడింది. వెంటనే మేం సమావేశాన్ని కొద్దిలో ముగించాం. అక్కణ్నుంచి వ్లదీమిర్ ఇల్యీచ్ స్వెర్డ్‌లోవ్ ఉంటున్న అపార్ట్‌మెంట్‌కు వెళ్లాడు. నేనేమో మంత్రిత్వ శాఖకు వెళ్లాను, యుద్ధ రంగానికి తక్షణం తరలి వెళ్లడానికి కావలసిన ఏర్పాట్లు చేసుకునేందుకు దాదాపు 15 నిమిషాలలో లెనిన్ దగ్గర్నుంచి ఫోన్‌కాల్ వచ్చింది, గొప్ప బాధతో కూడిన మూగ గొంతుతో ఆయనన్నాడు 'అతడు వెళ్లిపోయాడు'... 'అతడు వెళ్లిపోయాడు'... 'అతడు వెళ్లిపోయాడు' మేమంతా ఎవరికి వారు ఆవలివైపున చేతుల్లోని రిసీవర్ పుచ్చుకుని అలాగే కొంతసేపు నిశ్శబ్దంగా ఉండిపోయాం. వెంటనే మేం లేచి నిలబడ్డాం. ఇంకా చెప్పడానికి ఏమీలేదు. జాకబ్ మిహాయ్‌లోవిచ్ వెళ్లిపోయాడు, స్వెర్డ్‌లోవ్ ఇహ మాతో ఉండడు...'

ఇంతటి ప్రాముఖ్యమున్న స్వెర్డ్‌లోవ్ అకాల విషాద మరణం, ముందే చెప్పుకున్నట్లు లెనిన్‌ని ఎంతగానో బాధించింది. అతడు మరణించిన తర్వాత రెండు రోజులకు జరిగిన అఖిల రష్యా సోవియట్ల కేంద్ర కార్యనిర్వాహక వర్గం నిర్వహించిన సంతాప సమావేశంలో రెండు

గంటలకు పైగా ప్రసంగించిన లెనిన్ స్వెర్డ్‌లోవ్ సాధించిన విజయాల్నీ, పార్టీకి అతడు చేసిన నిరుపమాన సేవను ఈ కింది విధంగా ప్రస్తుతించాడు.

'ఈ కార్మికవర్గ విప్లవ నాయకుని జీవితాన్ని మనం గనుక పరిశీలించినట్టయితే, అతడి ఆశ్చర్యకరమైన నిర్వహణా సామర్థ్యాన్ని దీర్ఘకాలం పోరాట క్రమంలో అభివృద్ధి చేసుకున్నట్లు మనం గమనించగలం. ఇంకా ఈ కార్మికవర్గ నాయకుడు తనకివ్వబడ్డ ఆశ్చర్యకరమైన వరాల్లో ప్రతి ఒక్కదాన్ని స్వయం కృషి ద్వారా – విప్లవ కార్యక్రమాలకు సంబంధించిన వేర్వేరు క్లిష్ట సమయాల్లో పొందిన అనుభవాల ద్వారానే సంపాదించాడని మనం గమనించగలం. ఆ కాలంలోనే, అంటే 20వ శతాబ్దపు అత్యంత ప్రారంభంలోనే, కామ్రేడ్ స్వెర్డ్‌లోవ్ అత్యంత నిక్కచ్చిరకపు వృత్తి విప్లవకారునిగా మనవెనుకే నిలబడ్డాడు. ఎన్నో సంవత్సరాల పాటు, దశాబ్దాల పాటు జైలు నుంచి ప్రవాసానికీ, ప్రవాసం నుంచి జైలుకీ మారుతూ కూడా, ఏ లక్షణాలైతే విప్లవకారుని ఉక్కులా దృఢత్వం చేస్తాయో, ఆ లక్షణాల్ని స్వయం కృషి ద్వారా, ఎన్నో ఎన్నో సంవత్సరాల పాటు పెంపొందించుకుంటూ కృషి చేశాడు.'

'చట్ట వ్యతిరేక కార్యక్రమాల్లో నిమగ్నమైన వృత్తి విప్లవకారులు, అలాంటి నిర్దిష్టమైన చర్యలవల్ల ప్రజల నుండి పూర్తిగా వేరుపడిపోతారని కొంత మంది జనం – వీరిలో ఎక్కువ మంది మన వ్యతిరేకులు, లేదా భయస్థులు – భావిస్తారు. అయితే అలా భావించడం మిక్కిలి తీవ్రమైన తప్పిదమని కామ్రేడ్ స్వెర్డ్‌లోవ్ విప్లవ చర్యలు మనకు నిరూపించి చూపించాయి. చట్ట వ్యతిరేక సర్కిళ్లు, రహస్యంగా సాగిన విప్లవ కృషి, చట్టవ్యతిరేక పార్టీ – ఇవన్నీ కలిసి మానవాకారం ధరిస్తే – అతడే యాకోవ్ స్వెర్డ్‌లోవ్ అవుతాడు.'

'అతడు ఒంటరిగా, కార్మికవర్గ ఉద్యమానికి సంబంధించిన మనుషుల్ని నడపడంలో అసాధారణమైన జ్ఞానాన్ని సంపాదించ గలిగాడు. ఆచరణలో ఉన్న కార్యకర్తగా అతడు ఆశ్చర్యకరమైన సామర్థ్యాన్ని సాధించగలిగాడు. ఒక నిర్వాహకుని ఆశ్చర్యకరమైన సామర్థ్యం, పోలికేలేని, పోటీపడలేని ప్రతిష్ఠ – కొన్ని అతిపెద్ద శాఖలు గల పని – అఖిల రష్యా కేంద్ర కార్యనిర్వాహక వర్గానికి సంబంధించిన పని కొందరు సామాన్య కార్యకర్తలు ఒక బృందంగా కలిసికట్టుగా నిర్వహించగల పనిని అతడొక్కడే పూర్తి బాధ్యతతో తీసుకోవడానికి తగిన శక్తిని కలిగి ఉన్నందుకు అతడికెన్నయినా కృతజ్ఞతలు చెప్పాలి! పైన పేర్కొన్న అంతపెద్ద సంస్థను నడపడంలో ఆచరణలో ఎదురయ్యే సమస్యలు సంఖ్యలో అధికమేగాక, అతిపెద్దవీ, అత్యంత ప్రాధాన్యతగలవీ. అయినప్పటికీ, అతడు వాటిని ఒంటరిగానే ఎదుర్కొని, విజయం సాధించాడు.

అతడు చెప్పే ఒకే ఒకమాట, ఎలాంటి వ్యతిరేకతలులేని, చర్చకోసం ఎలాంటి సభలూ జరపని, ఓటింగ్ నిబంధనలు పాటించని, అంతిమ పరిష్కారంగా ఆమోదించబడేది. ప్రతి ఒక్కరూ సంతృప్తి చెందినట్లుగా భావిస్తుండగా, గొప్ప ఆచరణాత్మకమైన జ్ఞానం, నిర్వహణా సామర్థ్యం ప్రాతిపదికన వారి సందేహాలన్నీ తీర్చబడేవి. కేవలం వందల వేల అభివృద్ధి చెందిన కార్మికులు మాత్రమే కాదు, అసంఖ్యాకమైన ప్రజానీకం కూడా దాన్ని అంతిమ పరిష్కారంగా ఆమోదించేవారు.'

'ఇతడెలాంటి నిర్వాహకుడంటే, ఎవరితోనూ పోలికేలేని, సందేహాలకు అతీతుడైనవానిగా ప్రతిష్ఠను గెలుచుకున్నవాడు. ఇంకా ఎలాంటి వాడంటే, యావత్తు రష్యా అంతటా సోవియట్ల అధికారానికి నిర్వాహకుడు! అంతమాత్రమేనా? ఇతడికిగల జ్ఞానంలో ఇంతటివాడు మరొకడు లేడంటే అతిశయోక్తిలేదు.'

లెనిన్ ఇంకా స్వెర్డ్‌లోవ్ గురించి ఇలా పేర్కొన్నాడు:

'ప్రపంచంలోని అన్ని ప్రాంతాలకన్నా, అన్ని దేశాలకన్నా ముందుగా క్లిష్టతతోపాటు అలసట కలిగించిన, బాధకరమైన రక్తాన్ని చిందించిన, కానీ విజయానంతరం అత్యంత ఆనందాయకమైన సోవియట్లను తయారు చేయడానికీ, ఆపై సోవియట్ ప్రభుత్వ ఏర్పాటుకూ కారణమైన పార్టీని నిర్వహించడంలో కూడా అతడికి ఆ జ్ఞానం ఎంతగానో తోడ్పడింది.'

'మనం ఎన్నటికీ ఈ మనిషి స్థానాన్ని భర్తీ చేయలేం. ఎందుకంటే, ఇతడు ఒక మినహాయింపు కలిగిన నిర్వహణ నైపుణ్యాన్ని సానబట్టి, ఆ విద్యలో ఆరితేరినవాడు. అతడి స్థానాన్ని భర్తీ చేయడమంటే, మన అర్థంలో, అతడికిగల అన్ని నైపుణ్యాలు ఉన్న మనిషిని, ఓ కామ్రేడ్‌ని వెతికి పట్టుకోవడం! అయితే ఏ ఒక్కడూ యాకోవ్ స్వెర్డ్‌లోవ్ దరిదాపుల్లోకి కూడా రాలేడు.'

'యాకోవ్ స్వెర్డ్‌లోవ్ స్మృతి – ఒక విప్లవకారుడకి తన ఆశయం ఎడలగల విధేయతకు ఒక శాశ్వత గుర్తుగా ఉపయోగపడుతుంది. అంతేకాదు, ఆచరణలో స్వీయ నియంత్రణను ఎలా సమన్వయం చేయాలన్నదానికి కూడా ఒక ఉదాహరణ ప్రాయంగా పనికొస్తుంది. అంతేనా, ఆచరణాత్మక నైపుణ్యానికీ, ప్రజలతో సన్నిహిత సంబంధాలకీ, అలాగే వారికి ఎలా మార్గనిర్దేశం చేయాలన్నదానికి కూడా ఆ స్మృతి ఉపయోగపడుతుంది.'

లెనిన్‌కి ఆయా విప్లవకారులైన సహచరుల స్మృతి ఉపన్యాసాలలో, ఉన్నదానికన్నా అధికంగా పొగిడే అలవాటు లేదు. మరి ఆయన స్వెర్డ్‌లోవ్ స్మృతి ఉపన్యాసంలో ఇంతగా ఇతడి గురించి సంస్తుతిస్తూ చెప్పాడంటే, అదంతా స్వెర్డ్‌లోవ్ వాస్తవికమైన ఔన్నత్యమే అని చెప్పాలి. అంతేకాదు, స్వెర్డ్‌లోవ్ లెనిన్‌పై ఎలాంటి గాఢముద్ర వేసిందీ, స్వెర్డ్‌లోవ్ లేనిలోటు అటు పార్టీనీ, ఇటు ప్రభుత్వాన్నీ, మొత్తంగా తననీ ఎంతగా బాధించేదీ దీని ద్వారా మనం గ్రహించవచ్చు.

**నివాళి**

స్వెర్డ్‌లోవ్ మరణానంతరం 1924లో ఎకతెరీన్‌బర్గ్ నగరానికి 'స్వెర్డ్‌లోవ్'గా పేరు పెట్టడం జరిగింది. అయితే 1991లో అప్పటి రష్యా అధ్యక్షుడు బోరిస్ ఎల్ట్సిన్, ఆ ప్రాంతంలోనే జన్మించినవాడు, తిరిగి పూర్వపు పేరునే ఉంచాడు. అయినప్పటికీ, ఆ చుట్టు పక్కల ప్రదేశాలన్నింటినీ కలిపి ఆ ప్రాంతాన్ని 'స్వెర్డ్‌లోవ్‌స్క్ ప్రాంతం'గా పిలుస్తున్నారు. డిస్ట్రాయర్ 'నొవిక్'కు 1923లో 'యాకోవ్ స్వెర్డ్‌లోవ్ ' అనే పేరు పెట్టారు. స్వెర్డ్‌లోవ్ తరగతి క్రూయిజర్ నౌకకు కూడా అతడి మరణానంతరం ఆ పేరు పెట్టారు. రష్యన్ ఫెడరేషన్‌లోనూ, ఉక్రెయిన్‌లోనూ, కిర్గిస్థాన్‌లోనూ పలు ప్రదేశాలకు స్వెర్డ్‌లోవ్ పేరు పెట్టబడింది.

*(అయిపోయింది)*

*(రచయిత సాహిత్యకారుడు, లెనిన్ జీవిత చరిత్ర పరిశోధకుడు)* వీ

# నిర్దిష్టత, లోతైన విశ్లేషణ లోపించిన విమర్శ

- ఎం. కృష్ణ ఆదిత్య

'**చం**డీయాగం ఎవరి కోసం' శీర్షికతో వీక్షణం జనవరి 2016 సంచికలోని వ్యాసంలోని కొన్ని విషయాల గురించి–

ప్రజలు తమ మౌలిక సమస్యల గురించి పాలకులను ప్రశ్నించకుండా, ప్రజల్లో ఉన్న విశ్వాసాలను, నమ్మకాలను పెంచి, నిత్యం మత్తులో ఉంచే ప్రయత్నంలో భాగమే కెసిఆర్ చేసిన ఈ యాగం– అని రాశారు టి. రమేష్ (జన విజ్ఞాన వేదిక, తెంగాణ ప్రధాన కార్యదర్శి). మద్యం మత్తుకి మూఢ నమ్మకాల మత్తుని జోడిస్తున్నారని సరిగ్గానే చెప్పారు. ఈ క్రమంలో పేర్కొన్న కొన్ని అంశాలను గమనిద్దాం. (నిజానికి ఇవి పై వ్యాసానికి, రచయితకే పరిమితం కాదు, ఒక సాధారణ ధోరణి గురించి కూడా).

1) "రాజుకు నమ్మకాలు, కట్టుబాట్లు ఉండరాదు, అయితే ప్రజల మతనమ్మకాలను తనకు ప్రయోజనకరంగా మార్చుకోవాలి. వాటిని పెంచి పోషించి వారిని తన నియంత్రణలో ఉంచుకోవాలని" – కౌట్యిలుడు పేర్కొన్న విషయాన్ని ఉటంకించారు. ఇదే అసలు కీలకం.

2) భారతీయ సంస్కృతి.. అంటే పండుగలు, పబ్బాలేనా? యజ్ఞాలు, యాగాలేనా? ఒక బ్రాహ్మణీయ ఆచారాలేనా? బహుజనుల ఆహారపు అలవాట్లు, జీవన విధానాలు, ఆటపాటలు... ఇవన్నీ భారతీయ సంస్కృతిలో భాగం కాదా? శూద్రుల సంస్కృతి భారతీయ సంస్కృతి కాదా? అని ప్రశ్నించారు.

దేశంలోని దాదాపు అన్ని అధికార పార్టీలు వారి ప్రభుత్వాలు ప్రజల్ని పై రెండు మత్తుల్లో (మద్యం, మూఢత్వం) ముంచెత్తుతున్నాయి. పై కౌట్యిలుడి సూత్రాన్ని చక్కగా అమలు చేస్తున్నారు. అందులో ఆరితేరినవారు కెసిఆర్. ఆయన బ్రాహ్మణీయ ఆచారాలనే ప్రోత్సహిస్తున్నారనే రీతిలో చేస్తే, అది వాస్తవాలతో పొసగదు. బతుకమ్మ, సమ్మక్క – సారలమ్మ జాతర, బోనాల పండుగ, ఆయా జిల్లాల్లోని వివిధ కులాల జాతుల వారి ముఖ్యమైన జాతరలు... అన్నిటా మంత్రులు, అధికారులు పాల్గొంటున్నారు. ప్రభుత్వ నిధులు, వనరులు, సిబ్బంది అన్నింటినీ వినియోగిస్తున్నారు. వీటిలో బ్రాహ్మణేతరులే అధికంగా పాల్గొంటున్నారనేది ఎవరికైనా కన్పిస్తుంది, అంతేకాదు, ముస్లిం పండుగలు, ఇటీవల క్రిస్మస్‌ని కూడా – రాజధానిలోనే కాక, ఆయా జిల్లాల్లోనూ భారీ ఖర్చుతో, అట్టహాసంతో, లక్షలాది మంది భాగస్వామ్యంతో నిర్వహించారు. తెలంగాణ సంస్కృతిలో భాగంగా వారి ఆహారపు అలవాట్లు ప్రదర్శనలను నిర్వహిస్తున్నారు. ఇందులో ముస్లిం కులీనులు ఆరగించే రకరకాల బిర్యానీలను, బహుజనులు తినే పదార్థాలను వివిధ మాంసాహారాలతో పాటు – అట్టహాసంతో వండించి వడ్డిస్తున్నారు. ఈ అన్నింటికీ మీడియాలో విశేష ప్రచారం కల్పిస్తున్నారు. ఈ విధంగా దోపిడీ వర్గ, ఫ్యూడల్ ఆచారాలను, బ్రాహ్మణీయ సంస్కృతిని సరిగ్గానే విమర్శించే క్రమంలో, విమర్శకులు ఈ ప్రబల ప్రభావాలను, ఇతర రూపాలను విస్మరిస్తున్నారు.

3) ఈ యాగం తంతులో 'ఒక్కరైనా బ్రాహ్మణేతరులు, ఉన్నారా? ఒక్క మహిళైనా ఉందా' అని ప్రశ్నించారు. ఈ మూర్ఖత్వంలో, దగాలో వారు కూడా పాల్గొంటే బాగుంటుందా? ఇలాంటి తంతులు వేర్వేరుగా ఉంటాయన్నది తెల్సిందే. బ్రాహ్మణేతరులు కూడా ఇలాంటి వాటిని కేవలం బ్రాహ్మణల చేతనే నిర్వహిస్తుంటారు. అదే వారి కోరిక. ఇవన్నీ ఫ్యూడల్ సంస్కృతిలో ఆయా సెక్షన్లకు ఆమోదయోగ్యమైన పద్ధతులే. ఇందులో ఎంచుకోవటానికి ఏమీ లేదు. 'జనవిజ్ఞాన వేదిక' నాయకులు ఇలాంటి విమర్శ చేయటమేమిటి?

పైన పేర్కొన్నట్టు ఒక దాని తర్వాత ఒకటిగా నిర్వహిస్తున్న పండుగలు, జాతరలు, అట్టహాసాలలో బ్రాహ్మణేతరులు, మహిళలు భారీ స్థాయిల్లో పాల్గొంటున్నారు. సంఖ్యరీత్యా బ్రాహ్మణేతరులే ఎక్కువ కాబట్టి, సహజంగానే భారీ స్థాయిలో పాల్గొంటున్నారు. విశేష మీడియా ప్రచారం కూడా కల్పించారు. కెసిఆర్ బిడ్డ కవితగారు జిల్లాలన్నీ కలియతిరుగుతూ, భారీగానే వివిధ కులాల మహిళల్ని సమీకరిస్తూనే ఉన్నారు.

4) పై పద్ధతిలో విమర్శించడం ద్వారా చాలా విస్తృత స్థాయిలో అట్టడుగు వర్గాలని, కులాలని కూడా భ్రమల్లో మూర్ఖత్వంలో ముంచెత్తే కార్యక్రమాలను విస్మరించటం జరుగుతున్నది. ఓటు బ్యాంకు రాజకీయాల వేయి పడగలను చూడలేకపోతున్నాం. నిజానికి బిజెపి నాయకులు కూడా ఇలాంటి అన్నిటా పాల్గొంటున్నారు, నిర్వహిస్తున్నారు. సంఘ్‌పరివార్‌ని కూడా కెసిఆర్ ఆహ్వానించారు, వారూ పాల్గొన్నారు. కార్తీకమాసం, అయ్యప్ప, వినాయకుడు, దేవీ పూజ, దసరా – ఇలా ఏ అవకాశం వస్తే దాన్ని అధికార పార్టీలు, మీడియా పూర్తి వేలం వెర్రితో ఏడాది పొడవునా ప్రోత్సహిస్తున్నారు. వీటి సందర్భంగా తీరుబాటు గల స్త్రీలు వేలాదిగా పాల్గొంటున్నారు. మీడియా ప్రచారం పొందుతున్నారు. బిజెపి నాయకుడు కూడా ఇఫ్తార్ విందు ఇస్తున్నారు. వాటిల్లో పాల్గొంటున్నారు. హిందూ మతానికి పెద్దపీట, క్రైస్తవ, ముస్లిం కార్యక్రమాలకు చిన్నపీట – ఇది సెక్యులర్ భారత్ రివాజు, బాగానే సాగుతున్నది. బిజెపి ప్రభుత్వం కూడా హజ్ యాత్రలకు ప్రభుత్వ సబ్సిడీని, ఏర్పాట్లని కొనసాగిస్తున్నది.

5) కాబట్టి ఈ వ్యాసంలోనే కాదు. సాధారణంగా కూడా – పడికట్టు పద్ధతిలో, బ్రాహ్మణీయ, మనువాద, అగ్రవర్ణ తంతులను విమర్శించే పేరిట, అంతకన్నా విస్తృత, భారీ స్థాయిలో సాగుతున్న ఫ్యూడల్ సంస్కృతిని, దళారీ వేషాలను, కన్జ్యూమరిస్టు పోకడలను విస్మరించడం జరుగుతున్నది. పాలకుల సాంస్కృతిక దాడి చాలా విస్తృతంగా ఉంది. దానిపై విమర్శ చాలీచాలని రీతిలో, వాస్తవాలను విస్మరించే రీతిలో ఉంటున్నది. అందువల్ల దీని ప్రయోజనం స్వల్పమే. పడికట్టు విమర్శల్లో నిర్దిష్టత నిశిత పరిశీలన తగ్గి మొద్దు బారుతున్నది. ఇలాంటి విమర్శలు "మన చుట్టూ మనం" తిరిగే అభ్యుదయవాదులకే పరిమితమై పోతుంటాయి.

6) 'నారాయణ, శ్రీచైతన్యలో 60 శాతం మంది ఇంటర్ చదువుతున్నారు. 'సైన్స్ బట్టీ పట్టి నేర్చుకుంటున్న వీరంతా రేపటి నుంచి యాగాల చుట్టూ, మంత్ర యంత్రాల చుట్టూ తిరుగుతారేమో అన్నారు. నిజమే కానీ ఈ విమర్శ పాక్షికమే. వాస్తవ పరిస్థితిని సరైన అంచనా కాక, తక్కువ అంచనా వేసే విమర్శ ఇది. సైన్సు ప్రాక్టికల్స్ చేసేవారు, ఇంజనీరింగ్, మెడిసిన్, పాలిటెక్నిక్ వంటివి చదివేవారు కూడా మూఢనమ్మకాల చుట్టూ తిరుగుతున్నారు. రాకెట్ కేంద్రంలోనూ, కార్పొరేట్ ఆసుపత్రిలోనూ పూజలు చేసే దేశం మనది. హైదరాబాద్‌లో బిర్లామందిర్, పక్కనే బిర్లా సైన్స్ మ్యూజియం రెండూ ఉన్న సంస్కృతి మనది. వీసా వెంకటేశ్వరుడిగా పేరొందిన చిల్కూరు దేవాలయంలో టెక్నికల్ విద్యార్థుల ప్రదక్షిణలు, పొర్లు దండాలకు స్థలం చాలక, అక్కడ మైకుల్లో విజ్ఞప్తులు చేస్తుంటారు. శాస్త్రవేత్త నాయుడమ్మ ఇలా అన్నారట : "మనదేశంలో సైంటిస్టు తన 'పరిశోధనాలయం'లోకి వెళ్లే ముందు సైన్స్ ఏప్రన్ ధరిస్తారు, బైటికి రాగానే ఆ ఏప్రన్‌నే ఆఫీసులోనే తగిలిస్తారు, తర్వాత వేరే ఆలయానికి వెళ్తారు'. సైన్స్ మ్యూజియంలున్నాయి, సైన్స్ సిటీలు రానున్నాయి, రాజ్యాంగంలో శాస్త్రీయ దృష్టి గురించి చెప్పారు కూడా. అయినా ఆ రాజ్యాంగం సాక్షిగానే, దాని ఆధారంగా నడిచే ప్రభుత్వాల ప్రోత్సాహంతోనే పాశ్చాత్య వేషభాష మధ్యనే మూఢనమ్మకాల్ని పెంచిపోషిస్తున్నారు. కంప్యూటర్ జాతకాలతో, ఆధునిక జ్యోతిష్యంతో, వాస్తులతో, ప్రభుత్వాలు, పాలకులు, విద్యార్థులు ఈ దేశాన్ని, ప్రజల్ని ముంచెత్తుతున్నారు.

7) 'యజ్ఞ, యాగాల క్రతువులను అత్యంత బలీయంగా బౌద్ధం

# మార్క్స్ అదనపు విలువ సిద్ధాంతం పై ఒక వివరణ

**- వై.వి. రమణారావు**

వీక్షణం జనవరి, 2016 సంచికలో అచ్చయిన నా వ్యాసాన్ని ఈ పత్రికకు పంపే క్రమంలో, కొన్ని వాక్యాలు పత్రికకు చేరలేదు (నేను ప్రూఫ్ చూసి, ఎడిట్ చేసే క్రమంలో, మిస్ అయ్యాయి). అప్పటి ఆ వాక్యాలూ, స్పష్టత కోసం మరికొన్ని వాక్యాలు ఇప్పుడూ కలిపి పోస్ట్ చేస్తున్నాను. అసౌకర్యానికి మన్నన కోరుతున్నాను. ఈ క్రింది వ్యాఖ్యలు అదనపువిలువను గతితార్కిక దృష్టితో విశ్లేషణ చేయాల్సిన ఆవశ్యకతను మనముందుంచుతాయి.

"బూర్జువా సమాజంలో అప్పటికే అమల్లోగల సరుకులు-డబ్బు మధ్యగల సంబంధాల ప్రాతిపదికపై పెట్టుబడిదారుడు చేసే దోపిడీ విధానాన్ని వివరించడమే అదనపువిలువ సిద్ధాంతపు కేంద్ర సమస్య అయింది." (సోవియట్ ఎన్సైక్లోపీడియా నుండి,అనువాదం -వై.వి.ఆర్.). ఆ ప్రాతిపదికపై ఆధారపడే మార్క్స్ తన సిద్ధాంతాన్ని నిరూపించాడు. "(సంప్రదాయ, గతితార్కిక దృష్టి లేని) విశ్లేషణ అనేది, 'విలువ' పై మార్క్స్ చేసిన విశ్లేషణలోని నిర్దిష్టమైన వాటిలోని అంతర్గత సంబంధాలను అర్థం చేసుకోలేనటువంటిది " అంటారు మార్క్సిస్టు మేధావులు. మార్క్స్, 1868 జులై 11న కుగుల్మన్‌కి రాసిన ఉత్తరంలో ఇలా అంటాడు : "నా పుస్తకంలో (పెట్టుబడి), 'విలువ' పై ఎటువంటి అధ్యాయం లేకపోయినా, నేను ఆ పుస్తకంలో ఇచ్చిన వాస్తవ సంబంధాల గురించిన విశ్లేషణ అనేది : 'విలువ' గురించిన వాస్తవమైన సంబంధాన్ని బహిరంగ పరచటంలోనూ, ఆ సంబంధానికి ఒక ఋజువుగానూ ఉంటుంది.'విలువ' భావనను నిరూపించే ఆవశ్యకతపై మోసపూరితమైన మాటలన్నీ, ఆ విషయాన్ని గురించిన పూర్తి నిర్లక్ష్యం నుండి ఉద్భవిస్తాయి." (పేజీ-561,565-'ఏ డిక్షనరీ ఆఫ్ మార్క్సిస్ట్ థాట్' నుండి, అనువాదం-వై.వి.ఆర్.). : పెట్టుబడిదారుడు, శ్రామికుని మధ్యన సమాజం, చట్టం దృష్టిలో ఉండే మారకపు విలువల సమానత్వ స్థితి : "బూర్జువా భావజాలమే ఈ కింది వాటిని నొక్కి వక్కాణిస్తుంది :1. మారకం చేసుకునే స్వేచ్ఛ, 2. ఆస్తి యొక్క పవిత్రత, 3. స్వంత లాభానికై అర్రులు చాచటం. మారకంలోని ఈ మూడు లక్షణాలనేవి (వీటిని సామాజికంగా,చట్టబద్ధంగా న్యాయమైనవనే భావనను అమలు, ప్రచారం చేయడం ద్వారా-వై.వి.ఆర్.), వాటి మాటున దాగిన వర్గ సంబంధాలను కప్పి ఉంచుతాయి. : (పేజీ-160-161లలో).

1.స్వేచ్ఛ : ఒక సరుకు ఉదాహరణకి, శ్రమశక్తి క్రయ విక్రయదారులిరువురికీ అడ్డేమీ లేదు : వారి స్వతంత్ర యిచ్ఛ తప్ప. అందుకే స్వేచ్ఛ. వారు స్వతంత్ర వ్యక్తులుగా ఒప్పందం కుదుర్చుకుంటారు. వారు చేసుకునే ఒప్పందం వారి ఉమ్మడి యిచ్ఛను చట్టబద్ధంగా వ్యక్తీకరించే రూపం మాత్రమే.

2. సమానత : ఇందులో ప్రతి వ్యక్తి రెండో వ్యక్తితో సరుకులకు సాదా ప్రతినిధిగా సంబంధం ఏర్పరచుకుంటాడు. వారు ఒక సమ విలువని మరో సమ విలువతో మార్పిడి చేసుకుంటారు. అందుకే సమానత.

3. ఆస్తి : ప్రతి ఒక్కరూ తన సొంతమైన దాన్నే అమ్ముతారు. అందుకే ఆస్తి.

4. బెంథమ్ రాజ్యం : ప్రతి ఒక్కరికీ తన సంగతి మాత్రమే పట్టుతుంది. మిగిలిన వారి గురించి ఏ ఒక్కరూ ఆందోళన పడరు. వారలా చెయ్యడం వల్లనే అంతకుముందే అమరివున్న విషయాల సామరస్యానికి అనుగుణంగా, లేదా సర్వజ్ఞుడైన సర్వాంతర్యామి ఆధ్వర్యంలో వారి కృషి పరస్పర ప్రయోజనకరంగా, సర్వజన కళ్యాణ ప్రదంగా పరిణమిస్తుంది. అందుకే బెంథామ్ రాజ్యం అనటం." అంటూ సమాజంలోని మారకపు నియమాల చట్టబద్ధతను, సమాజ తీరును వ్యంగ్యంగా చెబుతాడు. ఇలా, సమాజంలోని రివాజు, చట్టం దృష్ట్యా పెట్టుబడిదారీ విధానం ఆచరిస్తూ, ప్రచారం చేసే ప్రకారం ("పెట్టుబడిదారీ దోపిడీ విధానం ఒక వైరుధ్యపూరితంగా తన కార్యకలాపాన్ని సాగిస్తుంది. ఎలాగంటే : "విలువ న్యాయం' అనే ప్రాతిపదిక పైననే సరుకులు సమాన విలువలు కల్గి ఉంటాయనీ లేదా సమాన విలువలు గల సరుకుల మధ్యనే మారకాలు వాస్తవంలో జరుగుతాయనీ పెట్టుబడిదారీ విధానం చెబుతుంది; కానీ, ఆచరణలో మాత్రం : శ్రామికునికీ, పెట్టుబడిదారునికీ మధ్యన; శ్రమశక్తికీ, పెట్టుబడికీ మధ్యన 'అసమాన విలువల మారకం' జరుగుతుంది కాబట్టి." : సోవియట్ ఎన్సైక్లోపీడియా నుండి, అనువాదం: వై.వి.ఆర్.) , ఎ). సమ విలువల మార్పిడి ద్వారా అదనపు విలువ పుట్టదంటాడు.

(బి-1). 'చలామణి రంగం' నుండి, 'మార్పిడి' నుండి : అసమ విలువల మార్పిడి ద్వారా కూడా : అదనపు విలువ పుట్టదు అనడానికి VII లో మార్క్స్ వివరించిన 6 విధాలే సాక్ష్యాలు. పేజీ-72 లో IX పేరాలో, "శ్రామికుడు ఉత్పత్తి చేసిన సరుకు విలువ"- స 'అనీ, "పెట్టుబడిదారుడి చేతికి ఉత్పత్తి చివరలో వచ్చే విలువ"-డ' అనీ, "స-స క్రియ"కు బదులు, "స-స' క్రియ" అనీ, "డ-డ క్రియ"కు బదులు, "డ-డ' క్రియ" అనీ ఉండాలి.

(బి-2). చలామణి రంగానికి ఆవల (ఉత్పత్తిరంగంలోని) ముడి పదార్థంలో కూడా అదనపు విలువ పుట్టదు అని 'తౌలు' ముడి పదార్థంగా గల ఉదాహరణ ద్వారా తెలుస్తోంది. : మిగిలిన విషయమైన ఆ ముడిపదార్థాన్ని ఉత్పాదితంగా మార్చే 'శ్రమశక్తి'ని ఇప్పుడు పరిశీలించాలి. అన్ని సరుకులకు లాగే, శ్రమశక్తి అనే సరుకుకు కూడా మారకపు విలువ (జీతం), ఉపయోగపు విలువ (శ్రమశక్తిని ఒక పనిదినం వాడుకలో/పనిలో పెట్టడం) అనేవి ఉంటాయి. ఇక, పెట్టుబడిదారుడు శ్రమశక్తి విలువకి సమానమైన మారకపు విలువ (జీతం) చెల్లించాడు కాబట్టి, (సి-1). శ్రమశక్తికి గల మారకపు విలువ ద్వారా కూడా అదనపు విలువ పుట్టదు. ఇలా, (సి-2). "శ్రమశక్తికి గల ఉపయోగపు విలువ ద్వారానే ఇక విలువలో మార్పు సాధ్యం" అనే దశకు మనం ఇప్పుడు తేబడతాం.

సారాంశం: ఈ రకంగా మనం, (ఎ),(బి-1,2), సి-1: ప్రకారం, అదనపు విలువ పుట్టదు అని చూశాం కనుక, మిగిలిన మార్గమైన మార్క్స్ పైన నిరూపించిన (సి-2)లో చూసిన విధమైన - 'ఉత్పత్తి ప్రక్రియలో శ్రమశక్తి ఉపయోగపు విలువ ద్వారానే', సరుకుల మార్పిడి సూత్రాలకు అనుగుణంగానే, పెట్టుబడిదారునికి అదనపు విలువ వస్తుందనే నిర్ధారణకు ఇప్పుడు రాగలిగాం. ■

---

ఖండించింది..' రాశారు. చరిత్ర వేరు, వర్తమానం వేరు. బౌద్ధం కూడా అనేక ధోరణులకు, మార్పులకు, దేశ కాలానుగత పరిణామాలకు లోనై ఉంది. హిందూ, బ్రాహ్మణీయ రూపాలు కూడా సంతరించుకుంది. ఆయా శతాబ్దాల్లో ఫ్యూడల్ పాలకులకు, వారి రాజ్యాల విస్తరణకు, యుద్ధాలకు కూడా దోహదపడింది. కొద్ది సంవత్సరాల క్రితం ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో 'కాలచక్ర' పేరిట దలైలామా ఆధ్వర్యంలో సామ్రాజ్యవాదుల ప్రోత్సాహంతో, రాష్ట్ర ప్రభుత్వ సహాయ సహకారాలతో, వంద కోట్ల ఖర్చుతో బౌద్ధుల తంతు (యాగంలాగే !) సాగింది. అది కూడా పైన పేర్కొన్న చాణక్యంలో భాగమే, కౌటిల్య వ్యక్తీకరణే.

పై రచన సందర్భంగా రాసిన, పై విషయాలు దానికే, ఆ రచయితకే పరిమితం కావు. ఓటుబ్యాంకు రాజకీయాల్లో పాలకవర్గాలు చాలా ముందుకి వెళ్లిపోయారు. విమర్శకులు వెనుకబడిపోయారు. పడికట్టు పద్ధతిలో చేసే విమర్శల్లో నిర్దిష్టత, పదును తగ్గిపోయాయి. ఆధునిక రాజ్యం నీడలో ఫ్యూడల్, దళారీ సంస్కృతి అనేక రూపాలు దాల్చింది. జన విజ్ఞానానికి ఇంతకన్నా శాస్త్రీయ విమర్శ, లోతైన విశ్లేషణ అవసరం.

*(రచయిత జర్నలిస్టు)* ■

### విరసం 25వ మహాసభలు

విప్లవ రచయితల సంఘం(విరసం) 25వ మహాసభలు విజయవాడ సిద్ధార్థ కళాశాలలో చలసాని ప్రసాద్ నగర్, అనసూయమ్మ వేదికపై జనవరి 9,10 తేదీలలో జరిగాయి. ఈ సభలకు విప్లవాభిమానులు భారీ సంఖ్యలో హాజరైనారు. ఈ సభల్లో ప్రారంభోపన్యాసం ఖాదర్ మొహియొద్దీన్ చేశారు. రైతుల ఆత్మహత్యలు, హిందూత్వ హత్యలు, మంద్రస్థాయి యుద్ధం అనే అంశాలపై విరసం కార్యదర్శి వరలక్ష్మి, కార్యవర్గ సభ్యులు కాశీం, ఎక్బాల్, రివేరా, బాసిత్, పాణి, ప్రొ. లక్ష్మీనారాయణ ప్రసంగించారు. జనవరి 10న జరిగిన బహిరంగ సభలో కళ్యాణ్‌రావు, వరవరరావు, దుడ్డు ప్రభాకర్, అరసవెల్లి కృష్ణ మాట్లాడారు.

### విశాఖలో భాగస్వామ్య సదస్సు

సిఐఐతో కలిసి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం విశాఖపట్నంలో జనవరి 10 నుండి 12 వరకు భాగస్వామ్య సదస్సు నిర్వహించింది. ఇందులో 41 దేశాలకు చెందిన పారిశ్రామికవేత్తలు, ప్రతినిధుల, భాగస్వామ్య సంస్థలతో రాష్ట్ర ప్రభుత్వం 331 ఒప్పందాలు కుదుర్చుకుంది. ఈ ఒప్పందాలలో భాగంగా రు. 4,80,878 కోట్ల పెట్టుబడులు రాగా 10.15 లక్షల మందికి ఉపాధి కలుగనుంది. ఒక టూరిజం రంగంలోనే 26 ఎంఒయులు కుదరగా, రు. 4,622 కోట్ల పెట్టుబడులు రాగా 82 వేల మందికి ఉపాధి కలుగనుంది. కుదిరిన ఒప్పందాలలో అత్యధికంగా ఇండస్ట్రీ 115 ఒప్పందాలతో రు. 2,01,277 కోట్ల పెట్టుబడులతో, 4,30,886 మందికి ఉపాధి కల్పించనుందన్నారు.

### ఎచ్‌సియు విద్యార్థి రోహిత్ ఆత్మహత్య

హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీలో సైన్స్ అండ్ టెక్నాలజీలో పిఎచ్‌డి రెండో సంవత్సరం చదువుతున్న రోహిత్ వేముల జనవరి 17న ఎన్ఆర్ఎస్ హాస్టల్ ఐ వింగ్‌లోని 207 గదిలో ఫ్యాన్‌కు ఉరివేసుకున్నాడు. ఈ ఆత్మహత్యకు మూలం అఫ్జల్ గురు ఉరితీతను ఖండిస్తూ అంబేద్కర్ స్టూడెంట్స్ అసోసియేషన్ (ఎఎస్ఎ) నేతలు ఎచ్‌సియులో నిరసన తెలిపారు. దేశ ద్రోహానికి పాల్పడిన వారికి మద్దతు తెలపడం ఏమిటని ఎబివిపి అధ్యక్షుడు సోషల్ మీడియాలో కామెంట్ చేశారు. 2015 ఆగస్టు 3న ఎఎస్ఎ సభ్యులు తనపై దాడి చేశారని, ఫేస్‌బుక్ కామెంట్స్‌పై క్షమాపణ చెప్పించుకున్నారని పోలీసులకు ఎబివిపి అధ్యక్షుడు ఫిర్యాదు చేశారు. దీనిపై వర్సిటీ యాజమాన్యం విచారణ చేపట్టి ఐదుగురు విద్యార్థులపై సాంఘిక బహిష్కరణ విధించాల్సిందిగా సూచించింది. దీంతో యాజమాన్యం వారిని 6 నెలలు బహిష్కరణకు గురిచేసింది. విద్యార్థులపై విధించిన బహిష్కరణ ఎత్తివేయాలని జనవరి 2 నుంచి విద్యార్థులు వెలివాడలో నిరసన ప్రారంభించారు. రోహిత్ ఆత్మహత్యకు బాధ్యులను శిక్షించాలని విద్యార్థులు దేశ వ్యాప్తంగా ఆందోళనలు చేస్తున్నారు.

### కరణం బాలసుబ్రహ్మణ్యం మృతి

ప్రముఖ సాహితీవేత్త, మదనపల్లి రచయితల సంఘం (మరసం) కార్యదర్శి కరణం బాలసుబ్రహ్మణ్యం పిళ్లై (80) జనవరి 12న మదనపల్లెలో గుండెపోటుతో మృతిచెందారు. ఆయన 1936 ఫిబ్రవరి 1న చిత్తూరులోని తలపులపల్లె గ్రామంలో జన్మించారు. ఆయన తెలుగు పండితునిగా పనిచేశారు. 1994లో రిటైరైన తరువాత మదనపల్లెలో స్థిరపడ్డారు. ఆయన మొదటి రచన 'శ్రీ కలిచెర్ల పట్టాభిరావ సుప్రభాతం' సంస్కృతంలో రాశారు. తెలుగులో మొదటి రచన 'విశాద మాదవి' ఇది పద్యకావ్యం. తరువాత 'నక్సలైట్ – పోలీసుల' పోరాటాన్ని ఇతివృత్తంగా తీసుకొని 'ఒక రాఘవరెడ్డి' కథ అనే పద్యం కావ్యం రాశారు. తెలుగు భాష పునరుజ్జీవనం కోసం రాసిన వ్యాసాలన్నిటిని కలిపి 'వెలుగు తగ్గిన తెలుగు' పుస్తకంగా ముద్రించారు.

### అద్దేపల్లి రామమోహన్‌రావు కన్నుమూత

ప్రజాకవి అద్దేపల్లి రామమోహన్‌రావు (80) కిడ్నీ సంబంధిత సమస్యలతో కాకినాడలో ఓ ప్రైవేట్ ఆస్పత్రిలో చికిత్స పొందుతూ జనవరి 13న మృతి చెందారు. అద్దేపల్లి కృష్ణా జిల్లా బందరులో 1936లో జన్మించారు. ఆయన బందరు హిందూ కాలేజీలో ఇంటర్, ఆంధ్ర జాతీయ కళాశాలలో బిఎ(తెలుగు) చేశారు. తిరుపతి ఎస్‌వి విశ్వవిద్యాలయంలో ఎంఎ చేశారు. 1957లో అధ్యాపక వృత్తిని చేపట్టారు. 1971లో కాకినాడ ఎంఎస్ఎన్ చారిటీస్‌లో లెక్చరర్‌గా చేరారు. ఆయన రచన హేతువాద దృక్పథం, ప్రగతిశీల భావాలతో సాగింది. రోడ్డుపై సూరీడు (1969), అంతర్జ్వాల (1970), రక్తసంధ్య (1978), గోదావరి నా ప్రతిబింబం (1992), మెరుపు పువ్వు (1999) వంటి పలు రచనలు చేశారు. శ్రీశ్రీ మహాప్రస్థానం పై అద్దేపల్లి వెలువరించిన పరిశోధనాత్మక రచన ప్రామాణిక విమర్శగా నిలిచింది.

### వైద్య మిత్రల ఆందోళన

ఆంధ్రప్రదేశ్‌లోని ఎన్‌టిఆర్ వైద్య సేవల విభాగంలో రాష్ట్ర వ్యాప్తంగా విధులు నిర్వహిస్తున్న వైద్య మిత్రలను విధుల నుంచి తొలగించాలని ప్రభుత్వం నిర్ణయించింది. వైద్య మిత్రలకు కొత్తగా ఉద్యోగ అర్హతలను నిర్ణయించి జిఓ నెంబర్ 28ని జనవరి 20న జారీ చేసింది. (ఈ జిఓకు ముందు వైద్య మిత్రలను ఆరోగ్య మిత్రలుగా వ్యవహరించేవారు) ఈ జిఓ ప్రకారం వైద్య మిత్రలుగా పనిచేసే వారికి బిఎస్‌సి నర్సింగ్, బి ఫార్మసి, బిఎస్‌సి మెడికల్ ల్యాబ్ టెక్నీషియన్ వంటి విద్యార్హతలున్న వారే వైద్య మిత్రలుగా పనిచేయడానికి అర్హులుగా ప్రభుత్వం ప్రకటించింది. ఆకస్మాత్తుగా కొత్త విద్యార్హతలు పెట్టి విధుల నుంచి తొలగించడం పై వైద్యమిత్రలు రోడ్డెక్కి ఎపి సచివాలయాన్ని ముట్టడించారు. అన్ని జిల్లా కేంద్రాల్లో నిరసన ర్యాలీలు, ధర్నాలు చేపట్టారు.

### ప్రొ. కాశీం పై ఉపా కేసు నమోదు

మెదక్ జిల్లా ములుగు పోలీస్‌స్టేషన్‌లో మావోయిస్టు పార్టీ సానుభూతి పరుడు శ్యాంసుందర్‌రెడ్డి జనవరి 21న లొంగిపోయాడని సిద్దిపేట డిఎస్‌పి శ్రీధర్ తెలిపారు. శ్యాంసుందర్‌రెడ్డి మావోయిస్టు నేతలకు సమాచారాన్ని చేరవేస్తుంటాడని, అతడికి ఒయు ప్రొ. చింతకింది కాశీం అలియాస్ కార్తిక్ సహకరిస్తుంటాడని చెప్పారు. శ్యాంసుందర్ రెడ్డి ఈ నెల 3న విప్లవ సాహిత్యం, లేఖలు, పెన్‌డ్రైవ్, నడుస్తున్న తెలంగాణ పత్రిక విరాళ రశీదు పుస్తకాలు, సంచికలను తీసుకుని హైదరాబాద్ నుంచి ఆదిలాబాద్ కారులో బయలు దేరాడు. మార్గమధ్యంలో ములుగు వద్ద రోడ్డు దాటుతున్న బైక్‌ను ఢీకొట్టాడు. కారు ఆగిపోవడంతో అక్కడే వదిలేసి పారిపోయి జనవరి 21న పోలీసులకు లొంగిపోయాడు. అతడిని రిమాండ్‌కు తరలించామని డిఎస్‌పి శ్రీధర్ వెల్లడించారు. ఈ ఇద్దరిపై యుఎపిఎ కేసు నమోదు చేసినట్లు తెలిపారు.

### భారత జాతీయ మహిళా సమాఖ్య సభలు

భారత జాతీయ మహిళా సమాఖ్య (ఎన్ఎఫ్ఐడబ్ల్యు) 20వ మహాసభలు విశాఖపట్నంలోని స్టీల్‌ప్లాంట్ టౌన్‌షిఫ్‌లో జనవరి 20 నుండి 23 వరకు జరిగాయి. ఈ మహాసభల్లో మహిళల సమస్యలు, సవాళ్లపై చర్చ జరిగింది. 27 రాష్ట్రాల నుంచి 700 మంది ప్రతినిధులు హాజరయ్యారు. ఎన్ఎఫ్ఐడబ్ల్యు జాతీయ అధ్యక్షురాలు అరుణారాయ్ మహిళలు సమానత్వం కోసం నిరంతరం పోరాడాలని అన్నారు. అత్యాచారాలు, గృహహింస వంటి సమస్యలే కాకుండా ఉపాధి కల్పన, దారిద్ర్య నిర్మూలనతో మహిళాభివృద్ధి సాధ్యమన్నారు. వీ

## సాయిబాబా విడుదల కోరుతూ నిరసనలు

ఢిల్లీ విశ్వవిద్యాలయ ప్రొ. సాయిబాబాను విడుదల చేయాలని డిమాండ్ చేస్తూ, వివిధ విశ్వవిద్యాలయాల ప్రొఫెసర్లు, మేధావులతో ఏర్పడిన రక్షణ–విడుదల కమిటీ ఢిల్లీలోని జంతర్‌మంతర్ వద్ద జనవరి 2న ధర్నా నిర్వహించింది. మావోయిస్టులతో సంబంధాలున్నాయంటూ 2014 మే 9న సాయిబాబాను అరెస్టుచేసి నాగపూర్ జైల్లో నిర్బంధించారు. అనారోగ్య కారణాలతో ముంబై హైకోర్టు 2015 జూన్‌లో బెయిల్ మంజూరు చేసింది. నాగపూర్ బెంచ్ ఆయన బెయిల్‌ను రద్దు చేస్తున్నట్లు ప్రకటించి 48 గంటల్లోగా జైల్లో లొంగిపోవాలని గత నెలలో ఆదేశించింది. ఇది అప్రజాస్వామికమని ధర్నాలో పాల్గొన్న ప్రొఫెసర్లు ఆరోపించారు. అదే విధంగా ఢిల్లీ యూనివర్సిటీలో జనవరి 16న యునైటెడ్ ప్రొటెస్ట్ మీటింగ్ నిర్వహించింది. ఢిల్లీ యూనివర్సిటీతో పాటు వివిధ విశ్వవిద్యాలయాలకు చెందిన 300కు పైగా విద్యార్థులు, ఉపాధ్యాయులు, పౌరహక్కుల ఉద్యమకారులు ఈ సమావేశానికి హాజరయ్యారు. ఉపాధ్యాయుల సంఘం అధ్యక్షుడు మనీషా సేఠి, ఢిల్లీ యూనివర్సిటీ ప్రొ. మనోరంజన్ మొహంతీ తదితరులు ఈ సమావేశానికి హాజరయ్యారు.

## సిపిఐ జాతీయ నేత బర్ధన్ మృతి

సిపిఐ నేత ఎబి బర్ధన్ (92) సుదీర్ఘకాలంగా అనారోగ్యంతో ఢిల్లీలోని జిబి పంత్ ఆసుపత్రిలో చికిత్స పొందుతూ జనవరి 2న మృతి చెందారు. బర్ధన్ సిల్హెట్ (బంగ్లాదేశ్)లో 1925, సెప్టెంబర్ 25న జన్మించారు. ఆయన సిపిఐ అనుబంధ విద్యార్థి సంఘమైన ఎఐఎస్ఎఫ్‌లో చేరిన బర్ధన్ నాగపూర్ విశ్వవిద్యాలయంలో విద్యార్థి సభ్యుడిగా ఉంటూ 1941లో విద్యార్థి సంఘానికి ప్రధాన కార్యదర్శిగా ఎంపికయ్యారు. చదువు పూర్తయిన తర్వాత కార్మిక రంగంలో పనిచేస్తూ రైల్వే, టెక్స్‌టైల్స్, డిఫెన్స్, ప్రెస్ ఇంజనీరింగ్ పరిశ్రమల్లో పనిచేసే కార్మికుల హక్కుల కోసం పనిచేశారు. 1995 అక్టోబర్ 16వ కాంగ్రెస్‌లో పార్టీ జాతీయ ప్రధాన కార్యదర్శిగా ఎన్నికై 2012 వరకు కొనసాగారు.

## పఠాన్‌కోట్ పై మిలిటెంట్ల దాడి

పంజాబ్‌లోని పఠాన్‌కోట్ వైమానికదళ స్థావరంపై జనవరి 2న మిలిటెంట్లు దాడికి పాల్పడ్డారు. ఈ ఘటనలో ఏడుగురు భారత కమాండోలు ప్రాణాలు కోల్పోయారు. ఈ ఘటనలో దాడికి పాల్పడ్డ ఆరుగురు మిలిటెంట్లను భద్రతాదళాలు కాల్చిచంపాయి. మిలిటెంట్లు సైనికుల క్వార్టర్లలోకి వెళ్లాలనే కుట్రతో వచ్చారని భద్రతా అధికారులు తెలిపారు. వారిని నిలువరించేందుకు కమాండోలు తమ ప్రాణాలొడ్డారని అన్నారు. ఈ క్రమంలో మిలిటెంట్లకూ, సైనికులకు తీవ్ర స్థాయిలో కాల్పులు జరిగాయి. దాదాపు నాలుగు రోజుల పాటు పఠాన్‌కోట్, పరిసర ప్రాంతాల్లో మిలిటెంట్ల కోసం గాలింపు చర్యలు సాగాయి. ఈ ఆపరేషన్‌లో ఎస్‌పి సల్విందర్ సింగ్ పాత్రపై అధికారులు దర్యాప్తు చేస్తున్నారు.

## జమ్ముకశ్మీర్ ముఖ్యమంత్రి మృతి

జమ్ము, కశ్మీర్ ముఖ్యమంత్రి ముఫ్తి మహ్మద్ సయీద్ (79) ఢిల్లీలోని ఎయిమ్స్ ఆస్పత్రిలో చికిత్స పొందుతూ జనవరి 7న మృతి చెందారు. ఆయన 1936 జనవరి 12న కశ్మీర్‌లోని బిజ్‌బెహార్‌లో జన్మించారు. ఆయన తన ప్రాథమిక విద్యను గ్రామంలోనే పూర్తి చేసి, గ్రాడ్యుయేషన్ శ్రీనగర్‌లోని ఎస్‌పి కళాశాలలో పూర్తి చేశారు. అలీగఢ్ ముస్లిం యూనివర్సిటీలో అరబ్ చరిత్రపై మాస్టర్ డిగ్రీ పూర్తి చేయడమే కాకుండా అక్కడే న్యాయ శాస్త్రంలో పట్టా పొందారు. 1950లో రాజకీయ ప్రస్థానాన్ని డెమొక్రటిక్ నేషనల్ కాన్ఫరెన్స్ పార్టీ ద్వారా ప్రారంభించారు. ఆయన 2002లో కాంగ్రెస్ మద్దతుతో ముఖ్యమంత్రి ఆయ్యారు. తరువాత బిజెపి మద్దతుతో ముఖ్యమంత్రి అయ్యారు.

## పోలీసు కాల్పుల్లో మావోయిస్టుల మృతి

ఛత్తీస్‌గడ్ రాష్ట్రం బీజాపూర్ జిల్లా ఆవుపల్లి పోలీస్‌స్టేషన్ పరిధిలో జనవరి 15న పోలీసులకు, మావోయిస్టులకు మధ్య కాల్పులు జరిగాయి. ఈ కాల్పుల్లో నలుగురు మావోస్టులు మృతిచెందినట్లు బస్తర్ ఐజి ఎస్ఆర్‌పి కల్లూరి తెలిపారు. కామనార్, పెద్దజోజర్ గ్రామాల మధ్య ఉన్న గుంగులూరు అటవీ ప్రాంతంలో మావోయిస్టులు ఉన్నట్లు పోలీసులకు సమాచారం అంది 50 మంది పోలీసుల బృందం అక్కడికి వెళ్లిందన్నారు. ఈ సందర్భంగా జరిగిన కాల్పుల్లో ఒక మహిళా మావోయిస్టుతో సహా నలుగురు మావోయిస్టులు మృతి చెందారని తెలిపారు. ఘటనా స్థలంలో నాలుగు తుపాకులు, నాలుగు హ్యాండ్ గ్రెనేడ్లు పోలీసులు స్వాదీనం చేసుకున్నారన్నారు.

## ఆపరేషన్ గ్రీన్‌హంట్‌ను నిలిపివేయాలి

కేంద్ర ప్రభుత్వం, ఛత్తీస్‌గడ్ ప్రభుత్వం కలిసి ఆపరేషన్ గ్రీన్‌హంట్ పేరుతో ఛత్తీస్‌గడ్‌లోని సుక్మా, బస్తర్, దంతెవాడ, బీజాపూర్ జిల్లాలలో జరుపుతున్న దాడులను తెలుసుకోవడానికి హక్కుల సంఘాలు అక్కడికి వెళ్లాయి. దేశ వ్యాప్తంగా సిడిఆర్‌ఓలో భాగమైన తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘాలతో పాటు పియుడిఆర్ (ఢిల్లీ), సిపిడిఆర్ (తమిళనాడు), పిడిఎఫ్ (కర్ణాటక), పివిడిఆర్ (మహారాష్ట్ర), ఎపిడిఆర్ (పశ్చిమబెంగాల్), రిటైర్డ్ ఒయు ప్రొఫెసర్ పద్మజా, డబ్ల్యుఎస్ఎస్‌లు జనవరి 15 నుంచి 18 వరకు ఛత్తీస్‌గడ్‌లో నిజనిర్దారణ జరిపిన వివరాలు కరీంనగర్‌లో మీడియాకు జనవరి 24న పౌరహక్కుల సంఘం సభ్యులు వెల్లడించారు. ప్రభుత్వ సాయుధ బలగాలు సుక్మా జిల్లా కుకనూర్, కున్నాగ్రామం పై కాల్పులు జరిపి గ్రామ యువకులను కొట్టి, అడవుల్లోకి తలదాచుకునేందుకు పారిపోయారని ఏడుగురు మహిళలపై అత్యాచారానికి పాల్పడ్డారని, 79 మందిని క్యాంపుకు తరలించి చిత్రహింసలకు గురిచేశారని పేర్కొన్నారు.

## అరుణాచల్ ప్రదేశ్‌లో రాష్ట్రపతి పాలన

రాజకీయ సంక్షోభాన్ని ఎదుర్కొంటున్న అరుణాచల్ ప్రదేశ్‌లో రాష్ట్రపతి పాలన విధించాలని కేంద్ర మంత్రి వర్గం సిఫారసు చేసింది. ప్రధన మంత్రి నరేంద్రమోడీ అధ్యక్షతన కేంద్ర కేబినెట్ జనవరి 24న అరుణాచల్‌లో రాష్ట్రపతి పాలన విధించాలని రాష్ట్రపతికి సిఫారసు చేయాలని తీర్మానించిందని అధికార వర్గాలు తెలిపాయి. 60 మంది సభ్యులు అసెంబ్లీలో తిరుగుబాటు దారులది మెజారిటీ కావడంతో స్పీకర్‌పై అవిశ్వాస తీర్మాణం ఇచ్చారు. దానిని తిరుగుబాటు ఎంఎల్ఎ కూడా అయిన డిప్యూటి స్పీకర్ చర్యకు అనుమతించారు. సభలోనే 33 మంది ఎంఎల్ఎలు కలిసి కాంగ్రెస్ ఎంఎల్ఎ కలిఖోపుల్‌ను తమ ముఖ్యమంత్రిగా ఎన్నుకున్నారు. వీ

### సిరియాపై కొనసాగుతున్న దాడులు

సిరియాలోని ఐఎస్ స్థావరాలపై రష్యా భీకరదాడులకు పాల్పడుతోంది. ఐఎస్ కమాండర్ స్థాయి సమావేశం జరుగుతుందన్న నిఘా వర్గాల సమాచారంతో రక్కా నగరంలో సమావేశమైన భవనంతిపై డిసెంబర్ 30న వైమానిక దాడులు జరిపింది. అలాగే సుఖోయ్ విమానాలతో సిరియాలో దాదాపు నాలుగు వందలకు పైగా ప్రాంతాలపై వైమానిక దాడులు జరిపింది. ఐఎస్ స్థావరాలపై, ఆయుధాగారాలపై బాంబుల వర్షం కురిపించింది. సిరియాపై ఫ్రాన్స్, అమెరికా సంకీర్ణ దళాలు వైమానిక దళాలు కూడా భారీ ఎత్తున బాంబు దాడులు జరుపుతున్నాయి.

### సౌదీ, ఇరాన్ మధ్య విభేదాలు

సౌదీ అరేబియా ప్రభుత్వం 47 మందికి జనవరి 2న ఉరిశిక్షలు అమలు చేసింది. ఉరిశిక్షలు పడిన వారిలో షియా మత గురువు షేక్ నిమిర్ అల్ నిమిర్ కూడా ఉన్నారు. తీవ్రవాద కార్యకలాపాలకు పాల్పడున్నారనే అభియోగంతో వారికి ఉరిశిక్షలు వేశారు. సౌదీ అరేబియా ప్రభుత్వం 2015లో 158 మందికి మరణదండన లు విధించింది. షియా మతగురు ఉరిశిక్ష నేపథ్యంలో ఇరాన్‌లోని సౌదీ దౌత్య కార్యాలయాలపై దాడులు జరిగాయి. దీంతో సౌదీ అరేబియా ప్రభుత్వం ఇరాన్‌లోని తమ దౌత్య కార్యాలయాలను మూసివేసింది. మిత్రదేశాలైన బహ్రెయిన్, సూడాన్ కూడ తమ దౌత్య కార్యాలయాలు మూసివేసాయి. కువైట్ తమ రాయబారిని వెనక్కి తీసుకుంది. ఇరు దేశాల విభేదాల నేపథ్యంలో సౌదీ అరేబియా తన వైమానిక సర్వీసులను నిలిపివేసింది. సౌదీ జాతీయులు ఇరాన్ వెళ్లడాన్ని కూడా నిషేధించింది. ఇరాన్‌తో ఉన్న వాణిజ్య సంబంధాలన్నిటినీ తెగదెంపులు చేసుకుంది. ఇరాన్ కూడా సౌదీ అరేబియా దిగుమతులన్నింటిపైనా నిషేధం విధించింది.

### ఉత్తర కొరియా హైడ్రోజన్ బాంబు ప్రయోగం

ఉత్తర కొరియా జనవరి 6న హైడ్రోజన్ బాంబును విజయవంతంగా ప్రయోగించింది. తాము తయారు చేసిన బాంబు శాస్త్రీయ బాంబు కంటే అత్యంత శక్తిమంతమైందని ఉత్తర కొరియా అధినేత కిమ్ జాంగ్ ఉన్ తెలిపారు. తమ దేశ సార్వభౌమత్వానికి, సమగ్రతకు ఎటువంటి భంగం వాటిల్లనంత వరకు తాము వాటిని ఉపయోగించబోమని తెలిపారు. ఉత్తర కొరియా హైడ్రోజన్ బాంబు తయారు చేసి విజయవంతంగా ప్రయోగించడం పట్ల అనేక దేశాలు ఆందోళన చెందుతున్నాయి. ముఖ్యంగా అమెరికా ఈ చర్యలను తీవ్రంగా ఖండించింది.

### లిబియాలో ఉగ్రవాదుల దాడి

పశ్చిమ లిబియాలోని జిటెన్ నగరంలోని అల్ – జహఫాల్ పోలీసు శిక్షణా కేంద్రంపై జనవరి 7న ఆత్మాహుతి దాడి జరిగింది. ఈ దాడిలో అరవై ఐదు మంది మరణించారు. ముప్పై మందికి పైగా గాయపడ్డారు. శిక్షణా శిబిరంలోకి బాంబులతో నిండిన ఓ ట్రక్కు దూసుకు రావడం, భారీ పేలుడు జరగడంతో సమీపంలో ఉన్నవారు కూడా మరణించారు. దాడి జరిగిన సమయంలో నాలుగు వందల మంది పోలీసులు శిక్షణ పొందుతున్నారు. బాంబు దాడి నేపథ్యంలో లిబియా ప్రభుత్వం అత్యయిక పరిస్థితి విధించింది.

### శ్రీలంకలో కొత్త రాజ్యాంగం

శ్రీలంకలో కొత్త రాజ్యాంగ ప్రకియను జనవరి 9న శ్రీలంక పార్లమెంట్ ప్రారంభించింది. అధ్యక్షుడిని కార్యనిర్వాహక దేశాధినేతగా కొనసాగిస్తున్న 1978 నాటి ప్రస్తుత రాజ్యాంగం స్థానంలో కొత్త రాజ్యాంగం అమలులోకి వస్తుంది. ఇందుకు సంబంధించి పార్లమెంట్ సభ్యులందరితో కొత్త రాజ్యాంగ అసెంబ్లీ ఏర్పాటు ప్రతిపాదనతో ప్రధాని రణిల్ విక్రమసింఘె ఒక తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. దీనితో పాటు కొత్త రాజ్యాంగ రచనకు 17 మంది సభ్యులతో స్టీరింగ్ కమిటీ ఏర్పాటును కూడ ప్రతిపాదించారు. పార్లమెంట్‌ను ఇకపై రాజ్యాంగ అసెంబ్లీగా పిలవాలని తీర్మానంలో ప్రతిపాదించారు.

### ఇరాక్‌లో ఆత్మాహుతి దాడి

ఇరాక్‌లో వేరు వేరు ప్రాంతాలలో జరిగిన దాడిలో నలభై ఎనిమిది మంది మరణించారు. వంద మంది వరకు తీవ్రంగా గాయపడ్డారు. రాజధాని బాగ్దాద్ లోని అల్ జవహరా మాల్ బయట కారు బాంబు పేల్చారు. ఈ దాడిలో 18 మంది మరణించారు. నలభై మందికి పైగా గాయపడ్డారు. మరొక దాడి ఇరాక్ తూర్పు పట్టణం ముక్ దదియాలో రెండు బాంబు పేలుళ్లు జరిగాయి. ఈ పేలుళ్లలో ఇరవై మంది చనిపోయారు. యాభై మంది గాయపడ్డారు. ప్రముఖ కాసినోలో ఒక ఆత్మాహుతి బాంబరు తనను పేల్చుకున్నాడు. ఇంకోవైపు బాగ్దాద్‌కు దగ్గరలో ఒక బాంబరు కారు నడుపుకొంటూ వెళ్లి తనను తాను పేల్చేసుకున్నాడు. ఈ ఘటనలో ఏడుగురు మరణించారు. మరో పదిహేను మంది గాయపడ్డారు.

### చిలీలో ఆదివాసీలకు ప్రత్యేక మంత్రిత్వ శాఖ

చిలీలో దేశీయ తెగలకు చెందిన ఆదివాసీలకు ఒక మంత్రిత్వ శాఖను ఏర్పాటు చేస్తూ చిలీ అధ్యక్షురాలు మిచెలి బాచ్ లెట్ జనవరి 11న నిర్ణయం తీసుకున్నారు. వీరికి జాతీయ కౌన్సిల్ ను, పీపుల్స్ కౌన్సిల్ ను కూడా ఏర్పాటు చేశారు. ఈ ఆదివాసుల్లో చిలీ ప్రభుత్వం గుర్తించిన కొత్త జాతులు ఉన్నాయి. ఆదివాసుల హక్కుల పరిరక్షణకు, వారిని ప్రోత్సహించేందుకు ఉద్దేశించిన కార్యక్రమాలు, ప్రణాళికలు, విధానాలను రూపొందించి, మదింపు చేసి, సమన్వయం పరిచేందుకు అధ్యక్షునితో కలిసి కొత్త మంత్రిత్వ శాఖ పనిచేస్తుందని తెలిపారు.

### టర్కీలో ఆత్మాహుతి దాడి

టర్కీ రాజధాని ఇస్తాంబుల్‌లో జనవరి 12న జరిగిన ఆత్మాహుతి దాడిలో 10 మంది మృతి చెందారు. పదిహేను మంది తీవ్రంగా గాయపడ్డారు. ఇస్తాంబుల్ చారిత్రక సుల్తానామెట్‌లోని ఓ కూడలి వద్ద ఒక వ్యక్తి తనను తాను పేల్చుకున్నాడు. ఘటనా స్థలానికి సమీపంలో అనేక చారిత్రక ప్రదేశాలు, కట్టడాలు ఉన్నాయి. ప్రతి రోజూ వేలాది మంది విదేశీ పర్యాటకులు సందర్శిస్తుంటారు. జనం రద్దీగా ఉన్న ప్రాంతంలో ఈ పేలుడు జరగడంతో ప్రాణ నష్టం ఎక్కువగా జరిగింది. చనిపోయిన వారిలో, గాయపడిన వారిలో విదేశీ పర్యాటకులే ఎక్కువగా ఉన్నారు.

### ఇండోనేషియాలో ఉగ్రదాడి

ఇండోనేషియా రాజధాని జకార్తాలో జనవరి 14న జరిగిన బాంబు దాడి, తుపాకి కాల్పుల్లో ఏడుగురు మరణించారు. ఇరవై మందికి పైగా తీవ్రంగా గాయపడ్డారు. దాదాపు పదిహేను మంది ఉగ్రవాదులు ఈ దాడుల్లో పాల్గొన్నారని అధికారులు తెలిపారు. ముందుగా ఒక ఉగ్రవాది కేఫ్‌లోకి ప్రవేశించి ఆత్మాహుతికి పాల్పడగా ప్రజలు ప్రాణభయంతో బయటకు పరుగు తీశారు. కేఫ్ బయట ఉన్న ఇద్దరు సాయుధులు ప్రజలపై విచక్షణ రహితంగా కాల్పులు జరిపి గ్రెనెడ్ లు విసరడంతో రోడ్లపైనే ప్రజలు మరణించారు. అనంతరం పోలీసులకు, దుండగులకు మధ్య ఎదురు కాల్పులు జరగడంతో ఐదుగురు తీవ్రవాదులు హతమయ్యారు.

### తైవాన్ తొలి మహిళా అధ్యక్షురాలు

తైవాన్ తొలి మహిళా అధ్యక్షురాలిగా ప్రతిపక్ష డెమోక్రాటిక్ ప్రోగ్రెసివ్ పార్టీ (డిపిపి) నే సాయ్ ఇంగ్ వెన్ ఎన్నికయ్యారు. జనవరి 16న జరిగిన అధ్యక్ష ఎన్నికల్లో అధికార నేషనలిస్ట్ పార్టీ అధ్యక్షుడు ఎరిక్ చు ఓటమి పాలయ్యారు. దీంతో ఇంగ్ వెన్ అధ్యక్షురాలిగా ఎన్నికయ్యారు. ఓటమికి బాధ్యత వహిస్తూ ఎరిక్ చు పార్టీ చైర్మన్ గా రాజీనామా చేశారు.

### సిరియాలో నరమేధం

సిరియాలో పట్టు కోసం ఐఎస్ ఉగ్రవాదులు భారీ నర మేధం సృష్టించారు. తూర్పు మధ్య నగరం దేరెల్ ఇజార్ లో జనవరి 16 ఒక్కరోజే మూడు వందల మందికి పైగా పౌరులను హతమార్చారు. పిల్లలు, మహిళలు, వృద్ధులతో సహా ఎవరినీ వదిలి పెట్టకుండా ఊచకోత కోశారు. బందీల తలలు నరికి నదిలోకి విసిరేశారు. కాపాడేందుకు ప్రయత్నించిన సైనికులను దారుణంగా చంపేశారు. వారిపై తుపాకులతో విచక్షణారహితంగా కాల్పులు జరిపారు. నాలుగు వందల మందికి పైగా పౌరులను బందీలుగా పట్టుకొన్నారు. ఉగ్రవాదులకూ, సైనికులకూ భీకర పోరు జరిగింది. ఈ నరమేధంతో ప్రతి వీధిలో పదుల సంఖ్యలో మృతదేహాలు గుట్టలు గుట్టలుగా పడ్డాయి.

### పాకిస్తాన్‌లో ఉగ్రవాదుల దాడి

పాకిస్తాన్‌లో చార్ సద్దా నగరంలోని బాచాఖాన్ యూనివర్సిటీలో జనవరి 20న జరిగిన దాడిలో ఇరవై ఐదు మంది చనిపోయారు. యాభై మందికి పైగా గాయపడ్డారు. నలుగురు సాయుధ తాలిబన్ ఉగ్రవాదులు యూనివర్సిటీలోకి చొరబడి కాల్పులు, పేలుళ్లతో బీభత్సం సృష్టించారు. తరగతి గదులు, హాస్టళ్లలో ఉన్న అధ్యాపకులు, విద్యార్థులపై ఉగ్రవాదులు విచక్షణా రహితంగా కాల్పులు జరిపారు. అనంతరం పోలీసులతో జరిగిన ఎదురు కాల్పుల్లో నలుగురు ఉగ్రవాదులు మరణించారు. మరో సంఘటనలో పెషావర్ నుంచి అఫ్ఘనిస్తాన్ వెళ్లే రహదారిపై గల చెక్ పోస్ట వద్ద మోటార్ సైకిల్ పై వచ్చిన ఉగ్రవాది తనను తాను పేల్చుకున్నాడు. ఈ పేలుడులో నలుగురు పోలీసులు, ఏడుగురు పౌరులు మరణించారు. ఇరవై మందికి పైగా గాయపడ్డారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం: ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషుల కోసం ఇంకాస్త బాధ్యతగానూ, జాగ్రత్తగానూ వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(డిసెంబర్ 1 నుండి డిసెంబర్ 31, 2015 వరకు తెలంగాణలోని 10 జిల్లాలు (1019), ఆంధ్రప్రదేశ్‌లోని 9 జిల్లాలలో (551) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య1570)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | | | | | | | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | – | 3 | – | 12 | 18 | 2 | 3 | 1 | 4 | 3 | 1 | 2 | – | 2 | 26 | 29 | – | – | – | 4 | – |
| హైదరాబాద్ | – | – | – | 6 | 8 | 1 | – | – | – | 1 | 5 | 7 | 4 | – | 14 | 11 | – | – | – | – | – |
| కరీంనగర్ | – | 10 | – | 5 | 13 | 2 | – | – | – | – | 4 | 2 | 4 | 5 | 24 | 8 | – | – | – | – | 3 |
| ఖమ్మం | – | 3 | – | 4 | 11 | 4 | 7 | 5 | 1 | 1 | – | 2 | – | 1 | 15 | 23 | – | – | – | – | – |
| మహబూబ్‌నగర్ | – | 22 | – | 20 | 18 | 5 | 2 | 2 | 1 | 3 | 10 | 9 | 12 | 14 | 48 | 8 | – | – | – | – | – |
| మెదక్ | 2 | 11 | 12 | 16 | 11 | 15 | 19 | 14 | 3 | 14 | 13 | 4 | 2 | 19 | 29 | 49 | – | – | – | 4 | 3 |
| నల్గొండ | – | 17 | – | 5 | 6 | 1 | 2 | – | – | 1 | 4 | 5 | – | 9 | 25 | 11 | – | – | – | – | – |
| నిజామాబాద్ | – | – | – | 4 | 3 | 2 | – | – | – | 2 | 3 | 2 | 5 | 2 | 14 | 7 | – | – | – | – | – |
| వరంగల్ | – | 16 | – | 10 | 12 | – | 5 | – | – | – | 2 | 4 | – | 5 | 33 | 18 | – | – | – | – | 2 |
| రంగారెడ్డి | – | 4 | – | 3 | 2 | – | – | – | – | 1 | 2 | 5 | 4 | 2 | 15 | 6 | – | – | – | – | – |
| **తెలంగాణ** | **2** | **86** | **12** | **85** | **102** | **32** | **38** | **22** | **9** | **26** | **44** | **42** | **31** | **59** | **243** | **170** | **-** | **-** | **-** | **8** | **8** |
| అనంతపురం | – | 8 | 1 | 8 | 12 | 1 | 6 | – | – | 8 | 3 | 5 | 10 | 5 | 44 | 4 | – | – | – | – | – |
| చిత్తూరు | – | – | – | 9 | 7 | 4 | 4 | – | – | – | 2 | 5 | 11 | 2 | 47 | – | – | – | – | – | 4 |
| కడప | – | – | – | 4 | 2 | – | – | 1 | – | 1 | 3 | 3 | – | 3 | 17 | 4 | – | – | – | – | 1 |
| గుంటూరు | – | – | – | 1 | 2 | – | 6 | – | – | 1 | – | 3 | 1 | 2 | 12 | 5 | – | – | – | – | – |
| కృష్ణా | – | – | – | 3 | 2 | – | 4 | – | – | 1 | – | – | 2 | 2 | 11 | 9 | – | – | – | – | – |
| కర్నూలు | – | 4 | 1 | 4 | 3 | 6 | 5 | 10 | 2 | 3 | 2 | 3 | 5 | 2 | 23 | 12 | – | – | – | – | – |
| తూర్పు గోదావరి | – | 2 | – | 3 | 2 | 1 | 3 | 2 | – | – | 2 | 3 | – | – | 25 | 13 | 1 | – | – | – | – |
| ప్రకాశం | – | – | – | 1 | 4 | 2 | 5 | – | – | – | 2 | 1 | – | 3 | 13 | 9 | – | – | – | – | – |
| శ్రీకాకుళం | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | |
| పశ్చిమ గోదావరి | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | |
| నెల్లూరు | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | |
| విజయనగరం | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | |
| విశాఖపట్నం | – | – | – | 1 | 8 | – | 3 | – | – | 4 | 1 | – | 3 | 2 | 18 | 14 | – | – | – | 6 | 1 |
| **ఆంధ్రప్రదేశ్** | **-** | **14** | **2** | **34** | **34** | **14** | **36** | **13** | **2** | **18** | **15** | **23** | **32** | **21** | **210** | **70** | **1** | **-** | **-** | **6** | **6** |

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 175 - February 2016 ● ISSN 2231-6892
● RNI Regn.No.APTEL/2003/11482 ● Published on 27/01/2016 ● Postal Regn. No. L II/RNP/HD/1100/2014-16

Date of Posting : 29th, 30th

## ‘వీక్షణం’ను ఆదుకుందాం
## ‘వీక్షణం’ నాలుగు కాలాల పాటు నిలిచేందుకు చేయూతనిద్దాం

తెలుగులో ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ వంటి పత్రిక ఉండాలనే ఆలోచనతో, సీనియర్ పాత్రికేయులు వి. హనుమంతరావు సంపాదకులుగా 2003లో ప్రారంభమై, 2005 నుంచి ఎన్. వేణుగోపాల్ సంపాదకత్వంలో నడుస్తున్న రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక ‘వీక్షణం’ తెలుగు సమాజానికి అవసరమైన చర్చావేదికగా పనిచేస్తున్నదని, మనందరితో పాటు ఎందరో పాఠకుల ఆదరాభిమానాలు చూరగొన్నదని మనకు తెలుసు. పదమూడు సంవత్సరాలుగా నిరంతరాయంగా నడుస్తున్న ఈ పత్రిక ఆర్థిక పరిస్థితి ఇప్పటికీ దినదిన గండంగానే ఉంటున్నది. ఎప్పుడు ఆగిపోతుందో తెలియదని దాదాపు ప్రతినెలా పత్రికలో అచ్చవుతున్న ఆందోళనాకరమైన ప్రకటన, ఈ పత్రికను నిలబెట్టడానికి తోడ్పడమనే అభ్యర్థనలు మా ఈ బహిరంగ ప్రకటనకు కారణం. ఇంతకాలంగా నిర్వాహకులు కష్టనష్టాలు భరిస్తూ సాగించిన కృషికి ఇప్పుడు మన సహకారం అవసరమని చెప్పడానికే ఈ ప్రకటన.

‘వీక్షణం’ ఈ పదమూడు సంవత్సరాలలో మూడువేలకు పైగా వ్యాసాలను ప్రచురించి ప్రాంతీయ, దేశీయ, అంతర్జాతీయ అంశాలెన్నిటి పైననో తెలుగు సమాజానికి అత్యవసరమైన సమాచారాన్నీ, వివరణలనూ, విశ్లేషణలనూ అందించింది. సంపాదకుడి అభిప్రాయాలే వైనప్పటికీ, తెలుగు సమాజంలో ఉన్న ప్రగతిశీల భావాలకూ, ధోరణులకూ అన్నిటికీ ప్రజాస్వామిక స్ఫూర్తితో వేదిక కల్పించింది. ప్రతిష్ఠాత్మకమైన ఐఎస్ఎస్ఎన్ గుర్తింపు సంపాదించి పరిశోధక విద్యార్థులకు, విశ్వవిద్యాలయ అధ్యాపకులకు అవకాశాలు కల్పించింది. ప్రతి సంవత్సరం రచయితల సమావేశాలు, సంభాషణలు ఏర్పాటు చేసి తెలుగు సమాజంలో సామాజిక శాస్త్ర రచనను ప్రోత్సహించింది. వ్యాసరచనా అధ్యయన తరగతులు నిర్వహించి వ్యాసప్రక్రియ ప్రమాణాలు పెంచడానికి తన వంతు కృషి చేసింది. పత్రికలో లబ్ధప్రతిష్ఠుల రచనలు ప్రచురించడంతో పాటు, విషయమే ప్రధానంగా ఐదారు వందలమంది కొత్త వ్యాసకర్తలకు అవకాశం కల్పించింది. ‘ఒక దళారీ పశ్చాత్తాపం’ వంటి విస్తృత ప్రచారం పొందిన పుస్తకంతో సహా దాదాపు డజను పుస్తకాలు ప్రచురించింది.

తెలుగు సమాజానికీ, మేధో ప్రపంచానికీ, రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణకూ ఇంత దోహదం చేసిన ‘వీక్షణం’ ఆర్థిక ఇబ్బందుల్లో ఉన్నప్పుడు, ఆ దీపం కొడిగట్టిపోకుండా కాపాడడం సమాజం బాధ్యత. ఇతోధిక పాఠకులను తయారు చేయడం, విరివిగా చందాలు చేర్పించడం, వ్యాపార ప్రకటనలు సేకరించిపెట్టడం, విరాళాలు అందించడం మన కనీస కర్తవ్యం. ‘వీక్షణం’ శ్రేయోభిలాషి, చరిత్రకారులు వకుళాభరణం రామకృష్ణ ‘వీక్షణం’ రచయితల సమావేశాల్లో సూచించినట్టుగా ఆర్థిక ఇబ్బందుల నుంచి సుస్థిరమైన పద్ధతిలో గట్టెక్కాలంటే ‘వీక్షణం’కు ఒక మూలనిధి కూడ ఏర్పాటు చేయవలసి ఉంది. మనంతట మనం మన శక్తి మేరకు గాని, విరాళాలు ఇవ్వగలిగిన మిత్రుల ద్వారా గాని ఈ మూలనిధి విరాళాలు సేకరించి మనందరికీ, మొత్తంగా సమాజానికీ అవసరమైన ‘వీక్షణం’ రాజకీయార్థిక, సామాజిక మాసపత్రికను కాపాడుకుందాం. ఈ చైతన్యజ్వాల ఆరిపోకుండా మన రెండు చేతులూ అడ్డుపెట్టి వెలుగు నిరంతరం ప్రసరించనిద్దాం.

సరిగ్గా ఒక సంవత్సరం కింద వెలువడిన ఈ విజ్ఞప్తికి విస్తృతమైన ప్రతిస్పందన వచ్చింది. ఆర్థిక, హార్దిక సహాయం అందించిన మిత్రులందరికీ కృతజ్ఞతలు. అయినా వీక్షణం ఆర్థిక పరిస్థితి ఇంకా సుస్థిరంగా మారలేదు. అందువల్ల ఈ విజ్ఞప్తికి ఇంకా అవసరం ఉంది. ఈ విజ్ఞప్తిపై సంతకం చేసి, జులై 2015లో మరణించిన చలసాని ప్రసాద్ గారిని సగౌరవంగా స్మరించుకుంటున్నాం.

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao